శ్రీః

# శ్రీ హయగ్రీవ స్తోత్రాణి



ప్రకాశకులు

## సాధన గ్రంథమండలి

తెనాలి





శ్రీః

# శ్రీ హయగ్రీవ స్తోత్రాణి

( సంకలనం, వివరణం - డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు)


ముద్రణ : ప్రథమ ముద్రణ

ప్రతులు : *500*

పేజీలు : *232*

వెల రూ. : *130/-*





***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

**"శతథా చరంతమ్"** అని, **"బహుధా విజాయతే"** (కర్మమూలకాలైన జన్మలు లేనివాడైనా, కృపామూలంగా అనేక విధాలుగా భగవానుడు అవతరిస్తున్నాడు) అని చెప్పబడిన భగవానుని అవతారాలలో కొన్ని అవతారాల సూచన వేదంలో స్ఫుటంగా కన్పిస్తుంది. వాటిలో హయగ్రీవావతారం ఒకటి. **"శుచిం హంసమ్"** అని, **"ధ్రువమ్ హంసమ్"** అని మాంత్రికోపనిషత్తులోను, **"ఏకో హంసః భువనస్య మధ్యే"** అని ఆరంభించి, **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఎవడు బ్రహ్మను ఆరంభంలో సృష్టిస్తున్నాడో, ఎవడు ఆ బ్రహ్మకు వేదాలను ఉపదేశిస్తున్నాడో) అని శ్వేతాశ్వతరోపనిషత్తు లోను హంసరూపంలో భగవానుడు వేదాలను అనుగ్రహించడం తెలుపబడింది. హయగ్రీవుడు పరమహంస స్వరూపుడే కనుక, ఇక్కడ హంసమనే పదం హయగ్రీవావతారాన్ని తెల్పుతున్నదని పరకాల మఠాధీశులు శ్రీరంగనాథయతీంద్రులు తమ హయశిర ఉపాఖ్యాన వ్యాఖ్యలో ఉపపాదించారు. **"బ్రహ్మ వా శ్వేతాశ్వతరోఽథ విద్వాన్"** (శ్వేతాశ్వతరుడనే ఋషి పరబ్రహ్మనుగూర్చి తెలిసికొన్నాడు) అని శ్వేతాశ్వరతరోపనిషత్తు చివరలో ఈ ఉపనిషత్తును దర్శించిన ఋషి పేరు శ్వేతాశ్వతరుడని తెలుపబడింది. **"శ్వేతాశ్వేన తరతీతి శ్వేతాశ్వతరః"** (తెల్లని అశ్వరూపునిచే సంసారాన్ని దాటుతున్నాడు, కనుక శ్వేతాశ్వతరుడనబడుతున్నాడు) అని శ్వేతాశ్వతరశబ్దానికి వ్యుత్పత్తి కనుక, ఈ ఉపనిషత్‌ను సాక్షాత్కరించిన ఋషి హయగ్రీవోపాసకుడని, అందువల్లనే హయగ్రీవ వాచకమైన హంసశబ్దాన్ని, బ్రహ్మకు వేదాన్ని ఉపదేశించిన గుర్తును ఈ ఋషి ప్రస్తావించాడని పరకాలమఠాధీశులు హయశిర ఉపాఖ్యాన వ్యాఖ్యానంలో (136వ పేజీ) నిరూపించారు. భగవానుడు హయగ్రీవుడై అవతరించినపుడు లక్ష్మీదేవి వాగ్దేవి అవతారాన్ని ఎత్తింది. సర్వవిద్యలకు అధిదేవత ఈ వాగ్దేవితో కూడిన హయగ్రీవస్వామియే వేదంలో పలుచోట్ల **"వాక్"** అని **"సరస్వతీ"** అని పఠింపబడే దేవత ఈ వాగ్దేవియే. చతుర్ముఖ బ్రహ్మపత్ని అయిన సరస్వతికూడా ఈ వాగ్దేవి యొక్క అంశభూతురాలే. **"నామ్ పెట్ర నన్మైయుమ్ నామంగై నన్నెఙ్జత్తు ఓమ్బి యిరున్దు ఎమ్మై ఓదునిత్తు, వేమ్బిన్ పొరుళ్ నీర్మై ఆయినుమ్ పొన్నాళి పాడెన్ఱ అరుళ్ నీర్మై తన్ద అరుళ్"** (నీ నాలుకకు వేపవలె చేదుగా అనిపించినా, నీవు చక్రధారి అయిన భగవానుని నామాలను అనుసంధించు – అని అంటూ వాగ్దేవి రూపిణియైన లక్ష్మీదేవి మన హృదయంలో ఆదరంతో నిలచి ఉండి, మనలను భగవన్నామాలను గానం చేసేటట్లు చేసింది) అని అంటూ భూతయోగి ప్రస్తావించిన వాగ్దేవి ఈ లక్ష్మీస్వరూపిణియే. **"వాచస్పతిం విశ్వర్మాణ మూతయే మనోజవం**



**వాజే అద్యాహువేమ"** *(ఋగ్వేదం-10-827)* ఇత్యాది వేదమంత్రాలలో వాగ్దేవికి పతిగా నిర్దేశింపబడినవాడు పరమపురుషుడైన హయగ్రీవుడే. **''వాజింతమాయ''** *(ఋగ్వేదం-10-115-6)* అని అంటూ ఋగ్వేదంలో గొప్ప అశ్వంగా ఉండేవాడని కీర్తింపబడినవాడు కూడా ఈ హయగ్రీవుడే. హయగ్రీవరూపంతో యాజ్ఞవల్క్య మహర్షికి శతపథ బ్రాహ్మణాన్ని ఉపదేశించిన ఆదిత్యుడు ఆదిత్యమండలాంతర్వర్తి అయిన ఈ హయగ్రీవుడే. **"నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి"** (వాగ్దేవికి నమస్కారం. ఆ వాగ్దేవికి పతి అయిన హయగ్రీవునకు నమస్కారం. హయగ్రీవావతారానికి మూలరూపమైనవాడు, గొప్పవాడైన విష్ణువుకు నమస్కారం చేస్తున్నాను) అని తైత్తిరీయారణ్యకం స్వాధ్యాయ బ్రాహ్మణం శాంతిపాఠంలో అధ్యయనం చేయబడే వాచస్పతి కూడా ఈ హయగ్రీవుడే.

**"అజస్య నాభా వధ్యేక మర్పితమ్ యస్మిన్నిదం భువన మధిశ్రితమ్, విశ్వకర్మా హ్యజనిష్ట దేవః ఆది ద్గంధర్వోఽ భవత్ ద్వితీయః"** *(తైత్తిరీయసంహిత – 4-6-2)* (అనిరుద్ధ రూపియైన నారాయణుని నాభిలో ఒక తామరపూవు వికసించింది. అందులో ఈ లోకం అంతా అంతర్భవించి ఉన్నది. లోకాన్ని సృష్టించే బ్రహ్మ అందులో పుట్టాడు. హయరూపాన్ని కల హయగ్రీవుడే రెండవ రూపంగా ఆవిర్భవించాడు.) అని గుహ్యాన్ని తెలిపే గంధర్వ శబ్దంతో చెప్పబడేవాడు హయగ్రీవుడే. వేదాలను కోల్పోగానే బ్రహ్మ ఈ హయగ్రీవునే శరణు పొందాడనే విషయాన్ని **"అంతరాదిత్యే మనసా చరంతమ్ దేవానాం హృదయం బ్రహ్మాఽన్వవిందత్"** (ఆదిత్యుని నడుమ మనస్సుతో సంచరించేవాడు, దేవతలకు హృదయం వంటివాడైన ఇతనిని బ్రహ్మ పొందాడు.) అని, **"హరిః పతంగః పటలీ సుపర్ణః"** (అశ్వరూపుడు, దుముకుతూ పోయేవాడు, జ్వాలాసమూహాలను కలవాడు, అందమైన గతిని కలవాడు) అని, **"ఏకో అశ్వః"** (సాటిలేని అశ్వం) అని ఘర్మసూక్తం చివరలో చెప్పబడటం ఈ విషయాన్ని బలపఱుస్తుంది.

**"పతంగ మక్త మసురస్య మాయయా హృదా పశ్యంతి మనసా విపశ్చితః, సముద్రే అంతః కవయో విచక్షతే మరీచీనాం పద మిచ్ఛంతి వేధసః, పతంగో వాచం మనసా బిభర్తి తాం గంధర్వోఽవదత్ గర్భే అంతః"** *(ఋగ్వేదం – 10-177-1, 2)* (వేదాన్ని అపహరించిన అసురుని మాయకారణంగా వ్యక్తమైనవాడు, వేగంగా పరుగుదీస్తూ పోయేవాడు అయిన హయగ్రీవుని జ్ఞానులు ఆంతరనేత్రంతో దర్శిస్తున్నారు. నిత్యసూరుల లోకమైన విష్ణువుయొక్క పరమపదాన్ని వారు పొందగోరుతున్నారు. హయగ్రీవుడు వేద వాక్కులను మనస్సుతో ధరిస్తున్నాడు. దానిని హయముఖుడై తామరపూవు లోపల ఉండే బ్రహ్మకు ఉపదేశించాడు.) అని ఘర్మసూక్తం చివరలో వేదాపహారం, వేదోపదేశం విశదంగా

ప్రస్తావింపబడ్డాయి. **"హరిః పతంగః పటలీ సుపర్ణః"** అని అంటూ **"సుపర్ణః"** (శోభనమైన పతనాన్ని అందమైన గమనాన్ని కలవాడు) అనే పేరు హయగ్రీవునకు యజుర్వేదం, ఘర్మసూక్తంలో పఠింపబడింది. ఋగ్వేదీయ ఘర్మసూక్తంలో కూడా ఇదే పేరుతో అతనిని స్తుతించి, అతడు వాగ్దేవికి పతి అని ఈ క్రింది మంత్రంలో తెలుపబడుతున్నది. ఆ మంత్రం ఏది? అంటే **"ఏకః సుపర్ణః స సముద్ర మావివేశ స ఇదం విశ్వం భువనం విచష్టే, తం పాకేన మనసాऽ పశ్య మంతితః తం మాతారేళ్హి స ఉరేళ్హి మాతరమ్"** *(10-114-4)* (అద్వితీయుడైన సుపర్ణుడు - అంటే - హయగ్రీవుడు సముద్రంలో ప్రవేశించాడు. అతడు ఈ లోకాన్ని అంతటిని కటాక్షించాడు. అతనిని పరిణతి చెందిన మనస్సుతో సమీపంలో దర్శించాను. అతనిని లోకమాత అయిన వాగ్దేవి అనుభవిస్తున్నది. అతడు వాగ్దేవిని అనుభవిస్తున్నాడు) అని, **"సుపర్ణం విప్రాః కవయో వచోభిః, ఏకం సంతం బహుధా కల్పయంతి"** (10-114-5) (అద్వితీయుడైన - ఒక్కడైన - సుపర్ణుని దూరదర్శులైన జ్ఞానులు తమ వాక్కులతో పలు విధాలుగా స్తుతిస్తున్నారు) అని తదనంతరం సూక్తంలోను అధ్యయనం చేయబడుతున్నది. వాగ్దేవి - అని, సరస్వతి - అని అధ్యయనం చేయబడే దేవత హయగ్రీవ రూపియైన విష్ణువుయొక్క పత్నియే అనే విషయాన్ని తెలిసే పలు ప్రమాణాలున్నాయి.

విష్ణుస్మృతి ఆరంభంలో **"ధ్రువమ్ వాచస్పతిం పతిమ్"** అని **"వాసుదేవం మహాంతమ్"** అని వాసుదేవుడే వాగ్దేవి పతి అని తెలిపింది. ఆ స్మృతిలోనే గల లక్ష్మీదేవిని గూర్చిన భూమి వచనంలో **"త్వ మేవ నిద్రా జగతః ప్రధానా లక్ష్మీర్ధృతిః శ్రీర్విరతి ర్జయా చ, కాంతిః ప్రభా కీర్తిరథో విభూతిః స్సరస్వతీ వాగథ పావనీ చ"** (నీవే నిద్రాదేవివి. లోకాలకు అన్నిటికి ప్రధానురాలవైన లక్ష్మీదేవివి. ధైర్యగుణానికి అధిదేవతవు. సంపదకు అధిదేవతవు. వైరాగ్యం, జయం, కాంతి, కీర్తి, ఐశ్వర్యం మొదలైనవానికి అధిదేవతవై ఉన్నావు) అని. సరస్వతీ దేవి కంటే భిన్నురాలైన వాగ్దేవి ఒకతె ఉన్నదని తెలుపబడింది. **"కీర్తి శ్రీ ర్వాక్చ నారీణామ్"** (భగవద్గీత -10-34) (స్త్రీలలో సంపదకు అధిదేవత అయిన లక్ష్మి, కీర్తికి అధిదేవత అయిన నీళాదేవి, విద్యకు అధిదేవత అయిన వాగ్దేవియు నేనే) అని గీతలో కూడా భగవానుని పత్నులను నిర్దేశించేటపుడు వాగ్దేవి పేరు కూడా నిర్దేశింపబడింది.

**"ఆవిర్బభూవ తత్పశ్చాన్ముఖతః పరమాత్మనః, ఏకా దేవీ శుక్లవర్ణా వీణాపుస్తక ధారిణీ, కోటిపూర్ణేందుశోభాఢ్యా శరత్పంకజలోచనా, శ్రేష్ఠా శ్రుతీనాం శాస్త్రాణాం విదుషాం జననీ పరా, వాగధిష్ఠాతృ దేవీ సా కవీనా మిష్టదేవతా, శుద్ధసత్త్వస్వరూపా సా శాంతరూపా సరస్వతీ"** (పరమాత్మముఖంనుండి తెల్లని వర్ణాన్ని కల్గినది, వీణను, పుస్తకాన్ని ధరించినది, కోటి పూర్ణచంద్రుల కాంతితో వెలుగుతున్నది, శరత్కాలంలోని తామరపూలవంటి నేత్రాలను



కల్గినది, వేదాలకు, శాస్త్రాలకు అధినేత్రి, విద్వాంసులకు గొప్ప జనని, వాక్కుకు అధిదేవత, కవులకు ఇష్టదేవత, శుద్ధసత్త్వ స్వరూపిణి, శాంతరూపిణి అయిన సరస్వతి అనే ఆ దేవి ఆవిర్భవించింది) అనే బ్రహ్మవైవర్తపురాణ (1-2-54, 56) వచనంలోను, **"సంకీర్ణేషు సరస్వత్యాః"** అని సత్త్వరజస్తమోగుణ సంకీర్ణగా మాత్స్యపురాణంలోను తెలుపబడిన రజోగుణ ప్రధానుడైన బ్రహ్మయొక్క పత్నికంటే భిన్నురాలైన, శుద్ధసత్త్వస్వరూపిణియైన సరస్వతీదేవియొక్క అవతారం ప్రస్తావింపబడింది.

**"నారాయణప్రియా లక్ష్మీః సర్వసంపత్స్వరూపిణీ, వాగధిష్ఠాతృదేవీ యా సా చ పూజ్యా సరస్వతీ, శక్తి ర్ద్వితీయా కథితా వేదోక్తా సర్వసమ్మతా"** (1-30-20) (సమస్త సంపత్ స్వరూపిణి అయిన లక్ష్మీనారాయణునకు ప్రియురాలు (పత్ని), వాక్కుకు అధిష్ఠానదేవత, పూజింపదగినది, వేదంలో వాక్కు అని, సరస్వతి అని చెప్పబడేది, అందఱిచే కీర్తింపబడేది అయిన వాగ్దేవి శ్రీనారాయణుని రెండవ దేవేరి) అని, **"వ్యాఖ్యాముద్రాకరా శాంతా వీణాపుస్తకధారిణీ, శుద్ధసత్త్వస్వరూపా సా సుశీలా శ్రీహరిప్రియా"** (2-1-35) (వ్యాఖ్యాన ముద్రను చూపే హస్తాన్ని కల్గినది, శాంతరూపిణియై, వీణను, పుస్తకాన్ని ధరించినది, శుద్ధ సత్త్వ స్వరూప, చక్కని శీలాన్ని కల్గినది, శ్రీహరికి మిక్కిలి ఇష్టురాలై ఉన్నది) అనే ఈ (మాత్స్య) పురాణంలో పలుచోట్ల విష్ణుపత్ని అయిన వాగ్దేవి స్వరూపస్వభావాలు తెలుపబడ్డాయి.

**"మహావిద్యా మహావాణీ భారతీ వాక్ సరస్వతీ"** (4-67) అనే వాగ్దేవియొక్క నామాలు, **"అక్షమాలాంకుశధరా వీణాపుస్తకధారిణీ"** (4-65) (అక్షమాలను, అంకుశమనే ఆయుధాన్ని ధరించినది, వీణను, పుస్తకాన్ని ధరించినది) అని ఆమె రూపం లక్ష్మీతంత్రంలో చూపబడ్డాయి. మాఘశుక్లపంచమీతిథిలో ఈ వాగ్దేవియొక్క ఆరాధనను చేయాలని బ్రహ్మవైవర్త పురాణంలో తెలుపబడింది. **"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్, దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్"** (నారాయణుని, నరశ్రేష్ఠుడైన నరుని, సరస్వతీ దేవిని, వ్యాసుని నమస్కరించిన తరువాత భారతాన్ని పఠించాలి) అని మహాభారత ప్రారంభంలోని మంగళశ్లోకంలో నారాయణునితో పాటు పఠింపబడే సరస్వతి నారాయణుని పత్నియే - అనే విషయాన్ని ఈ క్రింది ప్రమాణ శ్లోకాలు విశదం చేస్తున్నాయి.

**"అతః ప్రాతః సముత్థాయ చింతయేదాత్మనో హితమ్, నిర్గుణం నిరహంకారం నారాయణ మనామయమ్, సగుణం చ శ్రియా యుక్తం దేవం దేవీం సరస్వతీమ్"** (అందువల్ల, ప్రాతఃకాలంలో నిద్రలేచి, తన హితాన్నిగూర్చి చింతించాలి. ప్రాకృతాలైన హేయగుణాలను లేనివాడు, కల్యాణ గుణాలను కలవాడు, అహంకారరహితుడు, నాశం లేనివాడు, శ్రీదేవితో కూడినవాడైన నారాయణుని, సరస్వతీదేవిని ధ్యానించాలి) అని

అశ్వలాయనస్మృతిలోను (7) ఈ అర్థం తెలుపబడింది. బోధాయన సూత్రాలు ఈనాటి వరకు విష్ణుపత్నులను ఉద్దేశించి తర్పణం చేసేటపుడు **"సరస్వతీం దేవీం తర్పయామి"** అని సరస్వతికి తర్పణం చేస్తున్నారు. ఆనందతీర్థులుకూడా వాక్‌శబ్దాన్ని విష్ణుపత్నీ పరంగా పలుచోట్ల వ్యాఖ్యానించారు.

**"పద్మాంగసద్మాన మవేక్ష్య లక్ష్మీమ్ ఏకస్య విష్ణోం శ్రయణాత్ సపత్నీమ్, ఆస్యేందు యస్యా భజతే జితాబ్జం సరస్వతీ తద్విజిగీషయా కిమ్"** (నైషధమ్–7–49) (అద్వితీయుడైన విష్ణువును (తనవలె ఆమె కూడా) ఆశ్రయించినందున తన సవతి, తామరపూవును నివాసంగా కల్గినది అయిన లక్ష్మిని చూచి, ఆమెకంటే మిక్కిలి ఉన్నతమైన స్థానాన్ని పొంది ఆమెను జయించాలనే కోరికతోనే ఈ దమయంతియొక్క, తామరను జయించే ముఖచంద్రుని సరస్వతి నివాసంగా గ్రహించిందా ఏమి?) అని శ్రీహర్షుడు నైషధకావ్యంలో లక్ష్మీ–సరస్వతులిరువురు విష్ణుపత్నులుగా తెలిపాడు. **"సరస్వత్యాః విష్ణుపత్నీత్వం పురాణ ప్రసిద్ధమ్, తథా అర్చాస్వపి దృశ్యతే, యథా పురుషోత్తమస్య జగన్నాథస్య పార్శ్వే లక్ష్మీసరస్వత్యౌ"** (సరస్వతి విష్ణుపత్ని – అనే విషయం పురాణ ప్రసిద్ధం. అర్చారూపాలలో ఆవిధంగా గోచరిస్తున్నది కూడా. పూరీజగన్నాథక్షేత్రంలోని పురుషోత్తమస్వామి పార్శ్వంలో లక్ష్మీసరస్వతులిద్దరు గోచరిస్తున్నారు) అని ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ వ్యాఖ్యాత మల్లినాథసూరి పలికారు. **"వాచం నిజాంకరసికామ్ ప్రసమీక్షమాణః"** (గోపాల వింశతి–2) అని వేదాంత దేశికులుకూడా అన్నారు. అందువల్ల **"అంబితమే నదీతమే దేవితమే సరస్వతి"** (ఋగ్వేదం–2–41–17) (సరస్వతీ! నీవద్ద అన్ని వస్తువులు, ఆనందాలు ఆశ్రయించి ఉన్నాయి.) అని, **"ఇమా బ్రహ్మ సరస్వతి"** (ఋగ్వేదం–2–41–18) అని, **"పావకా నః సరస్వతి"** (ఋగ్వేదం–1–6–10) అని, **"చోదయత్రీ సూనృతానామ్ చేతంతీ సుమతీనామ్, యజ్ఞం దధే సరస్వతీ"** (ఋగ్వేదం–1–6–11) (సత్యాన్ని ప్రేరేపించేది, జ్ఞానులను జ్ఞానాన్ని కల్గించేది అయిన సరస్వతి యజ్ఞపురుషుని ధరిస్తున్నది) అని, **"మహో అర్ణః సరస్వతీ"** (ఋగ్వేదం–1–6–12) అని, **"నమో వాచే"** (తైత్తిరీయ ఆరణ్యకం–2–16, 4–1) అని, **"యావత్ బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్"** (ఋగ్వేదం–10–114–8) (పరబ్రహ్మ ఉండే చోటు అంతా వాగ్దేవి ఉన్నది) అని వేదంలో పలుచోట్ల తెలుపబడిన అతిశయాన్ని కల్గినది – హయగ్రీవ పత్ని అయిన వాగ్దేవియే అనే విషయం సునిశ్చితం.

ప్రతిదినం ఆచరించే సంధ్యావందనంలో ఉపయోగించే **"దధిక్రావణ్ణో"** ఇత్యాది మంత్రంలోని **"దధిక్రావణ్"** అనే పదానికి విశిష్టమైన అశ్వమని, తేజస్సంపన్నమైన అశ్వమని, రెక్కలతో కూడిన అశ్వమని అర్థం చెప్పబడింది. అశ్వానికి పర్యాయపదంగా నిఘంటువులలో ఈ పదం చూపబడింది. తేజస్సును కల్గిన హంసగాకూడా (4–40) ఇది నిరూపింపబడింది.



హయగ్రీవుని పర్యాయనామాల్లో హంసనామం ఒకటికదా. ఈ నామం హయగ్రీవ గాయత్రిలో కూడా చోటుచేసికోవడం గమనార్హం. హయగ్రీవ మంత్రానికి హంస మనువు అని కూడా పేరు.

రాజసూయసంబంధమైన అశ్వమేథం ప్రముఖమైన వైదికయాగం. దీనిని సర్వపాపపరిహారార్థం చేస్తారు. త్రిభువులు తమ సార్వభౌమత్వాన్ని సూచించే పత్రాన్ని ఒక ఉత్తమాశ్వానికి మెడలో కట్టి, దానిని అన్ని దిక్కులలో సంచరించేటట్లుగా వదలి పెడతారు. ఆ అశ్వం విశ్వానికి ప్రతీకగా భావన చేయబడుతుంది. కృష్ణయజుర్వేద సంహితలో **"అశ్వస్య యోనిః సముద్రో బంధుః విష్ణుః"** ఇత్యాదిగా అశ్వమేథయాగాశ్వం యొక్క విరాడ్రూపభావన తెలుపబడింది. సాయణభాష్యంలో కూడా – **"ఏవం విధస్య విరాడ్రూపసముద్ర ఏవ యోనిః కారణమ్. సమ్యక్ ద్రవతి ఉత్పద్యతే జగత్ అస్మాదితి సముద్రః పరమాత్మా వహి అన్యస్మా దయం విరాట్ ఉత్పత్తు మర్హతి, స ఏవాస్య విష్ణుః విశ్వం వ్యాప్య తిష్ఠతీతి విష్ణురిత్యర్థ. స ఏవాస్య బంధుః స్తంభః, స్థితిహేతు రిత్యర్థః. ఏవం ఉపాసిత; పాపక్షయద్వారా విరాడ్రూపం ప్రాప్నోతి. విరాటేప్రాప్తిశ్చ క్రమముక్తిహేతుః"**– అని వివరింపబడింది. మహాభారతంలోని హయశిర ఉపాఖ్యానంలో అశ్వరూపుడైన హయగ్రీవుని విశ్వాత్మకత్వం తెలుపబడడం గమనించాలి. బృహదారణ్యకంలోకూడా ఇటువంటి భావనను గమనించవచ్చు.

ఇంకొక ఋగ్వేద మంత్రాన్ని ఉదాహరించి ఈ విషయం సమాప్తి చేయబడుతున్నది. ఉదకశాంతి మంత్రాలలో **"రక్షోహణం వాజినమ్"** (ఋగ్వేదం –10–87–1) అనే మంత్రం ఒకటి. ఈ మంత్రం హయగ్రీవ పరంగా వ్యాఖ్యానింపవచ్చునని శ్రీకరుణాకరాచార్యస్వామి ఈ ఉదకశాంతి మంత్ర వివరణంలో తెలిపారు. ఈ మంత్రం పూర్తిపాఠం ఈవిధంగా ఉన్నది.

**రక్షోహణం వాజిన మాజి ఘర్మి మిత్రం ప్రదిష్ట ముపయామి శర్మ ।**

**శిశానో అగ్నిః క్రతుభి స్సమిద్ధః స నోది వా సరిషః పాతు నక్తమ్ ॥**

రక్షోహణం = మధుకైటభులనే అసురులను సంహరించినవాడు, ప్రదిష్టం మిత్రం= అభీష్టాలను అనుగ్రహించేవాడుగా క్లేశాలను తీర్చేవాడుగా ప్రసిద్ధమైనవాడైన, వాజినం = హయగ్రీవుని, శర్మ ఉపయామి = శరణు పొందుతున్నాను. క్రతుభిః సమిద్ధః = క్రతుశబ్దవాచ్యాలైన విహితకర్మాచరణరూప కైంకర్యాలతో మిక్కిలిగా ప్రకాశించేవాడు, శిశానః=ఎల్లప్పుడు జాగరూకుడై ఉండేవాడు, అగ్నిః=అగ్నిరూపుడు–ఉన్నత గతిని పొందించే వాడు (**"అగ్రం నయతి ఇతి అగ్నిః"** – అనే వ్యుత్పత్తి ఇక్కడ అగ్నిశబ్దానికి వివక్షితం)

అయిన, సః = ఆ హయగ్రీవస్వామి, నః = మనలను, రిషః = క్లేశాలనుండి, దివా పాతు= పగలు కాపాడుగాక, సః నక్తం పాతు = అతడు రాత్రిలో కాపాడు గాక

ఈ విధంగా వేదవాఙ్మయంలో పలు సందర్భాలలో హయగ్రీవ ప్రసక్తి కన్పిస్తుంది. సైంధవ, గంధర్వ, హంస, ఆదిత్య, వాచస్పతి, వాక్పతి మొదలైన శబ్దాలు పలు సందర్భాలలో హయగ్రీవపరంగానే వివరింపబడడం గమనార్హం. **"వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"** ఇత్యాదిగా వేదానికి ప్రతిరూపంగా భావింపబడే శ్రీరామాయణంలో కూడా మధుసూదననామ ప్రస్తావనద్వారా హయగ్రీవ ప్రసక్తి చేయబడింది. శ్రీరామాయణం బాలకాండలోని 76వ సర్గలోని 17వ శ్లోకంలో **"అక్షయ్యం మధుహంతారం జానామి త్వాం సురోత్తమమ్"** అని, **"మధుహంతారమ్"** అని అనడం ద్వారా హయగ్రీవప్రస్తావన చేయబడింది. పట్టాభిషేకానికి ముందు దినంలో శ్రీరాముడు ఉపవసించి, మఱునాడు ప్రాతఃకాలికమైన సంధ్యావందనంలో ముందుగా గాయత్రిని ఉపాసించి తర్వాత – **"తుష్టావ ప్రణత శ్చైవ శిరసా మధుసూదనమ్"** అని మధుసూదనుని స్తుతించినట్లు అయోధ్యాకాండ ఆఱవ సర్గలోని ఏడవ శ్లోకంలో తెలుపబడింది. సాధారణంగా ఏ దేవతకు సంబంధించిన జపంలో అయినా, ముందుగా ఆ దేవతకు చెందిన బీజాక్షర జపాన్ని కాని, ఆ దేవతకు చెందిన గాయత్రీ మంత్ర జపాన్ని కాని చేసిన తర్వాత ఉపస్థానం చేయడం, ఆ ఉపస్థానంలో ఆ దేవతను స్తుతించే అర్థవాద రూపాలైన స్తోత్రాలను పఠించడం పరిపాటి. ఇక్కడ కూడా శ్రీరాముడు ముందుగా గాయత్రిని ఉపాసించి తర్వాత మధుసూదనుని స్తుతించాడని తెలుపడం ద్వారా వాల్మీకి మహర్షి గాయత్రీమంత్ర ప్రతిపాద్యదేవత హయగ్రీవుడనే విషయాన్ని హయగ్రీవ వాచకమైన మధుసూదన శబ్దాన్ని ప్రయోగించడం ద్వారా సూచించారని అభిజ్ఞులైన పెద్దల వివరణం. కిష్కింధాకాండలోని 17వ సర్గంలో వాలి శ్రీరామునిగూర్చి దోషారోపణను చేసే సందర్భంలో 49వ శ్లోకంలో పల్కిన **"ఆనయేయం తవాదేశాత్ శ్వేతా మశ్వతరీ మివ"** అనే సూక్తి గోవిందరాజీయ వ్యాఖ్యలో **"శ్వేతా మశ్వతరీమివ – మధుకైటభాభ్యాం పాతాళే నిరుద్ధాం శ్వేతాశ్వతరీరూపాం శ్రుతిం హయగ్రీవ ఇవేత్యర్థః"** అని వివరింపబడింది. యుద్ధకాండ 74వ సర్గలోని 59వ శ్లోకంలో **"హయాననం బ్రహ్మశిరశ్చ దీప్తమ్"** అనే ప్రయోగం – **"హయాననం – హయగ్రీవారాధనస్థానమ్"** అని గోవిందరాజీయంలో మహేశ్వరతీర్థ వ్యాఖ్యలో వివరింపబడింది. ఈ విధంగా శ్రీరామాయణంలో అసకృత్ హయగ్రీవ ప్రస్తావన కన్పిస్తుంది.

పంచమవేదమైన మహాభారతంలో కూడా హయగ్రీవస్వామి ప్రస్తుతి ప్రచురంగా గోచరిస్తుంది. శాంతిపర్వంలోని మోక్షధర్మంలోని 357వ అధ్యాయం హయశిర



ఉపాఖ్యానంగా ప్రసిద్ధం. ఇందులో హయగ్రీవావతార వృత్తాంతం తెలుపబడింది. ఈ ఉపాఖ్యానానికి పరకాల మఠాధిపతులైన అభినవరంగనాథయతీంద్రులు రచించిన హయశిరోభూషణమనే విస్తృతమైన, అతిగంభీరమైన సంస్కృతవ్యాఖ్య ఉన్నది. అనుశాసనిక పర్వంలోని విష్ణుసహస్రనామాధ్యాయంలోని పలు నామాలు హయగ్రీవాతార పరాలని శ్రీపరాశరభట్టర్ తమ భగవద్గుణ దర్పణమనే వ్యాఖ్యానంలో సప్రమాణంగా నిరూపించారు. **"గురుః"** అనే 495వ నామంనుండి వరుసగా ఎనిమిది నామాలలో హయగ్రీవ ప్రస్తావన చేయబడినదని భట్టర్ వివరించారు. ఆ ఎనిమిది నామాలు **"గురుః, ఉత్తరః, గోపతిః, గోప్తా, జ్ఞానగమ్యః, పురాతనః, శరీరభూతభృత్, భోక్తాలు"** – అనేవి. ఈ నామాలను వారు వివరించిన తీరును వారి భాష్యంలో గమనించవచ్చు. **"గురుః"** అనే నామం హయగ్రీవుని ప్రథమాచార్యత్వాన్ని, **"పురాతనః"** అనే నామం ఈ అవతారం ప్రతికల్పంలోను సంభవిస్తుందనే విషయాన్ని, **"జ్ఞానగమ్యః"** – అనే నామం పరవిద్య ద్వారా పొంబడేవాడని, **"శరీరభూతభృత్"** అనే నామం హయగ్రీవమూర్తి విశ్వరూపుడని, తద్ద్వారా భగవానునకు చిత్తు, అచిత్తులు రెండూ శరీరభూతాలని, **"భోక్తా"** అనే నామం హవ్య కవ్య భోక్తృత్వాన్ని, **"వాక్పతిః"** అనే నామం సర్వవాఙ్నిర్వాహకత్వాన్ని – ఈ విధంగా ఈ నామాలన్నీ హయగ్రీవ తత్త్వరహస్య ప్రతిపాదకాలు.

సృష్ట్యాదిలో సంభవించిన హయగ్రీవావతారమే కాక, బ్రహ్మ చేసిన యజ్ఞంలో అవతరించిన హయగ్రీవావతారం కూడా భాగవత పురాణాదులలో గోచరిస్తుంది. మొదటి అవతారం ప్రథమాచార్యత్వాన్ని, రెండవది హవ్యకవ్య భోక్తృత్వాన్ని సూచిస్తుంది. ఈ అంశాలన్నీ భారతం శాంతిపర్వాంతర్గతమైన హయశిర ఉపాఖ్యానంలో తెలుపబడ్డాయి. దేశికుల హయగ్రీవ స్తోత్రం మొదలైన స్తుతులలో ప్రస్తావింపబడ్డాయి.

శ్రీశంకరాచార్యుల వారు కూడా **"తీర్థకరః, గురుతమః"** అనే నామాలను హయగ్రీవ పరంగా వివరించారు. అదే రీతిలో **"అర్యో వాజసనిః"** అనే విష్ణుసహస్రనామసూక్తి లోని **"వాజసనిః"** అనే నామం హయగ్రీవావతారపరమని కూడా భావింపబడింది. **"సర్వవాగీశ్వరేశ్వరః"** అనే నామం విషయంలోను ఇటువంటి భావన కన్పిస్తుంది.

మహాభారతంలో – నారదుడు నాగలోకమధ్య భాగంలోని పాతాళ లోకాన్ని వర్ణిస్తూ **"అత్రాదిత్యో హయశీర్షః కాలే పర్వణి పర్వణి, ఉత్తిష్ఠతి సువర్ణాభం వాగ్భి రాపూరయన్ జగత్"** (ఈ పాతాళలోకంలో ప్రతి పర్వదినాన బంగారువన్నెను కల హయగ్రీవుడు ఉదయిస్తాడు. వేదసూక్తాలనే నీటితో సువర్ణనాభమనే లోకాన్ని నిండిస్తాడు) అని అంటూ హయగ్రీవప్రస్తావనను చేశాడు. హయగ్రీవుని హవ్యకవ్యభోక్తృత్వం **"యత్తు తత్ కథితం పూర్వం త్వయా హయశిరో మహత్, హవ్యకవ్యభుజో విష్ణోః ఉదక్పూర్వే మహోదధౌ"** అని శాంతి పర్వంలో ప్రస్తావింపబడింది. మోక్షధర్మంలోని 352వ అధ్యాయంలోని 36వ శ్లోకం

**"యత్తత్ హయశిరః పార్థ సముదేతి వరప్రదమ్, సోఽహ మేవోత్తరే తీరే క్రమాక్షరవిభాగవిత్"** అని అంటూ హయగ్రీవుని సర్వవేదప్రవర్తకత్వం తెలుపబడింది. విష్ణుపురాణంలో కూడా **"వాజిరూపధరో హరిః"** (3-12-6), **"సూర్యోఽశ్వస్యోఽభవద్యతః"** (3-5-29) **"మత్స్య కూర్మవరాహాశ్వసింహరూపాదిభిః స్థితమ్"** (5-7-11) ఇత్యాదిగా హయగ్రీవ ప్రస్తావన పలుచోట్ల కన్పిస్తుంది.

భాగవతం ద్వితీయ స్కంధంలోని ఏడవ అధ్యాయం లోని **"సత్రే మమాస భగవాన్ హయశీర్ష ఏష సాక్షాత్ స యజ్ఞపురుష స్తపనీయ వర్ణః, ఛందోమయోఽఖిలమయోఽఖిలదేవతాత్మా వాచో బభూవు రుశతీః శ్వసతోఽస్య న స్త"** అనే శ్లోకం బ్రహ్మచేసిన యజ్ఞంలో హయగ్రీవుడు ఆవిర్భవించినట్లు తెల్పుతున్నది. సప్తమస్కంధంలోని **"తస్మై భవాన్"** (7-9-37) అనే శ్లోకంలో, **"విష్ణుః శివాయ జగతామ్"** (11-4-7) అనే ఏకాదశ స్కంధంలోని శ్లోకంలో మధుకైటభుల వధ ప్రస్తుతింపబడింది. స్కాందపురాణంలో, హరివంశంలో కూడా హయగ్రీవ ప్రసక్తి కన్పిస్తున్నది. మార్కండేయ పురాణంలో, వామన పురాణంలోను **"మహోదయ"**మనే చోట గల అశ్వతీర్థమనే పుణ్యతీర్థంలో హయగ్రీవుని ప్రహ్లాదుడు అర్చించినట్లు తెలుపబడింది. ఈ విధంగా పలు పురాణాలలో హయగ్రీవావతార ప్రస్తావన గోచరిస్తున్నది. ఆరాధనావిధానాన్ని పలికే ఆగమాలలో కూడా హయగ్రీవుని ప్రసక్తి ప్రచురంగా కన్పిస్తుంది. పౌష్కర సంహితలో హయగ్రీవుని ద్విభుజ, చతుర్భుజ, అష్టభుజ, ద్వాదశభుజ రూపాలు తెలుపబడినవి. భుజాల సంఖ్యనుబట్టి ఆ భుజాలలో అతడు ధరించే ఆయుధాలలోకూడా మార్పు తెలుపబడినది. పాద్మసంహిత హయగ్రీవుని చతుర్భుజునిగా తెల్పింది. పరాశర సంహిత, హయశీర్ష సంహిత, విశ్వామిత్రసంహిత, విష్ణుతిలక సంహిత, సనత్కుమారసంహిత, శేషసంహిత – ఇత్యాది పలు సంహితలలో కూడా హయగ్రీవురూపానికి చెందిన విశేషాలు ప్రస్తుతాలు. సనత్కుమార సంహితలో శ్రీప్రశ్న సంహితలలో హయగ్రీవుడు రక్తాంగుడుగా వర్ణింపబడటం విశేషం. శిల్పరత్నం, చతుర్వర్గ చింతామణి మొదలైన శిల్పశాస్త్ర గ్రంథాలలో కూడా హయగ్రీవమూర్తి వివరాలు గోచరిస్తాయి. అగ్ని, మాత్స్య, బ్రహ్మాండ, విష్ణుధర్మోత్తరాది పలు పురాణాలలో కూడా హయగ్రీవ రూపవర్ణనలు ఉన్నాయి.

కొన్ని అవైదిక మతాలలో కూడా హయగ్రీవారాధన కన్పిస్తున్నది. మహాయాన బౌద్ధమతంలో హయగ్రీవుడు ఒక ఆరాధ్యదేవతగా కన్పిస్తాడు. ఇందువల్ల హయగ్రీవారాధన సంప్రదాయం ఈ మతం వ్యాపించిన జపాన్, టిబెట్, చైనా దేశాలలో కూడా వ్యాపించింది. క్రీ.శ., 6వ శతాబ్దం పూర్వకాలానికి చెంది ఒక హయగ్రీవమూర్తి ఆగ్నేయ ఆసియా ప్రాంతంలో ఉన్నదని **"పి. ద్యూపాంట్"** అనే పరిశోధకుడు తెలిపాడు, **"వెరోనికా అయాన్"**



అనే పరిశోధకుడు హయశిరస్సును కల క్రీ.శ.10వ శతాబ్దానికి చెందిన విగ్రహాన్ని సూచించాడని, ఇది **'ఖెమ్యూ'** ప్రాంతంలో లభించిన విగ్రహమని శ్రీవేదాంతం అనంత పద్మనాభాచార్యులవారు తమ శ్రీలక్ష్మీహయగ్రీవతత్త్వమనే గ్రంథంలో పేర్కొన్నారు. ఈ విధంగా చూచినపుడు హయగ్రీవమూర్తి ఆరాధన పలు పమతాలలో పలుదేశాలలో వ్యాపించినట్లుగా కన్పిస్తుంది.

చతుర్ముఖ బ్రహ్మకు వేదాలను, యాజ్ఞవల్క్య మహర్షికి శుక్ల యజుర్వేదాన్ని ఉపదేశించినవాడు హయగ్రీవుడే. అదేవిధంగా పాంచరాత్రాన్ని ఉపదేశించవాడు కూడా హయగ్రీవస్వామియే. ఈ విషయాన్ని కమలాకరభట్టు అనే ప్రసిద్ధ ధర్మశాస్త్ర పండితుడు (నిర్ణయసింధు మొదలైన ధర్మశాస్త్ర గ్రంథాలను ఇతడు రచించాడు) హయశీర్ష పాంచరాత్రంలోని ఈ క్రింది శ్లోకాలను ప్రమాణీకరిస్తూ పలికాడు.

**తేనాశ్వశిరసా గత్వా వేదా నాదాయ శాశ్వతాన్ ।**
**ప్రయయౌ భవనం దివ్యం మహర్షిగణపూజితమ్ ॥**

**సోఽప్యసౌ ప్రదదౌ వేదాన్ భూయ ఏవ జగద్గురుః ।**
**తస్మిన్ కాలే మయా పృష్టో దేవో యత్ తచ్ఛృణుష్వ మే ॥**

**కియంతి పాంచరాత్రాణి త్వయా ప్రోక్తాని వై పురా ॥**

**శ్రీభగవాన్ ఉవాచ**

**యత్త్వయా పృష్ట మఖిలం తత్ సర్వం కథయామి తే ।**
**ప్రోక్తాని పంచరాత్రాణి కల్పే కల్పే మయా పురా ॥**

**వ్యస్తాని మునిభి ర్లోకే పంచవింశతి సంఖ్యయా ।**
**ఆద్యం సమస్తతంత్రాణాం హయశీర్షం ప్రకీర్తితమ్ ॥**

ఈ అంశం మహాభారతంలోని హయశిర ఉపాఖ్యానంలో గల **"సాత్త్వతం విధి మాస్థాయ ప్రాక్సూర్యముఖనిఃసృతమ్"** (20వ శ్లోకం) అనే శ్లోకంవల్ల కూడా సూచింపబడింది. ఈ శ్లోకంలోని సూర్యశబ్దానికి శుక్లయజుర్వేదాన్ని యాజ్ఞవల్క్యునకు ఉపదేశించిన హయశిరోరూపుడైన సూర్యుడని అర్థమని శ్రీ అభినవరంగనాథయతీంద్రులు హయశిర ఉపాఖ్యాన వ్యాఖ్యలో నిరూపించారు. భారతం మోక్షపర్వంలోని (323వ అధ్యాయంలో గల) జనక యాజ్ఞవల్క్య సంవాదంలో శుక్లయజుర్వేద తత్త్వజ్ఞుడైన యాజ్ఞవల్క్య మహర్షి పల్కిన **"తత్స్థత్వా దనుపశ్యంతి ఏక ఏవేతి సాధవః"** అనే సూక్తి భారతంలోని హయశిర ఉపాఖ్యానంలోని **"తత్త్వ మేకో మహాయోగీ హరి ర్నారాయణః ప్రభుః"** అనే సూక్తి

నారాయణోపనిషత్తు లోని **"సర్వభూతస్థ మేకం నారాయణమ్"** ఇత్యాది శ్రుతి వివరణాత్మకం. అంతేకాక ఈ ఉపనిషత్తు చివర గల **"బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనోమ్"** అనే సూక్తి, మధుసూదనుడైన హయగ్రీవుని ఉపాఖ్యానంలో చివర చేయబడిన నారాయణ నామస్మృతి – ఈ రెండిటి సమానార్థకత్వాన్ని సూచిస్తాయి.

**"వాజింతమాయ"** (ఋగ్వేదం-10-115-6), **"తాం గంధర్వోఽ వదత్"** (తైత్తిరీయ ఆరణ్యకం-3-11-30) **"సూర్యోఽ శ్వం సోఽ భవత్"** (విష్ణుపురాణం-3-5-28) ఇత్యాదులలో హయగ్రీవుడు, హయగ్రీవుడు అశ్వవాచి శబ్దంతో నిర్దేశింపబడ్డాడు. **"ఆది ర్గంధర్వోఽ భవద్వితీయః"** (తైత్తిరీయ సంహిత-4-6-2, విశ్వకర్మ సూక్తం) అనే శ్రుతిని అనుసరించి కూడా వేదోపదేష్ట అయిన పరమాత్మ. అశ్వసామాన్యవాచకమైన గంధర్వ శబ్దంతో నిర్దేశింపబడినట్లు తెలుస్తున్నది. పాద్మపురాణంలో (సృష్టి ఖండం-5-1) **"పురాణం బ్రహ్మశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్, త్రివర్గసాధనం పుణ్యం శతకోటిప్రవిస్తరమ్, నిశ్శేషేషు లోకేషు వాజిరూపేణ కేశవః"** ఇత్యాది సూతవచనాలలో కూడా ఇది కన్పిస్తుంది. ఈ విధంగా ఉపబృంహణవాక్యాలలో హయగ్రీవుని అశ్వశబ్దనిర్దేశానికి పైన ప్రస్తావించిన **"ఆదిర్గంధర్వోఽ భవద్వితీయః"** ఇత్యాది శ్రుతులే మూలం.

ఈవిధంగా హయగ్రీవుని ప్రస్తావన అశ్వసామాన్య వాచకంద్వారా శ్రుతి తదుప బృంహణాదులలో చేయబడిన ప్రక్రియను అనుసరిస్తూ శ్రీశఠకోపముని (నమ్మాళ్వార్లు) కూడా **"మూవా త్తనిముదలా మూవులకుమ్ కావలోన్ మావాకి ఆమైయాయ్"** (త్రివిధ జగత్కారణభూతుడై, ముల్లోకాలకు రక్షకుడైనవాడు అశ్వరూపుడై, కూర్మరూపుడై) (తిరువాయ్ మొళి ప్రబంధం-2-8-5) అని అంటూ **"మావ్"** (అశ్వం) అని అంటూ అశ్వసామాన్య వాచకంతో సర్వజగత్స్రష్ట, రక్షకుడైన దేవాధిదేవుని నిర్దేశాన్ని చేశారు. ఏతద్గాథానంతర గాథలో శ్రీకృష్ణమహిమ వర్ణింపబడింది. నారాయణోపనిషత్తులోని అవశిష్ట భాగార్థాన్ని తమ తిరువాయ్‌మొళి ప్రబంధంలో అక్కడ కూడా నిరూపిస్తూ ఆ ఆళ్వార్లు **"బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మదుసూదనోమ్"** అనే నారాయణోపనిషత్ వాక్యార్థాన్ని ప్రకాశింపజేశారు. అంతే కాక, పూర్వోదాహృత పాద్మపురాణ వాక్యాలలో హయగ్రీవావతార అనంతరం, మత్స్యావతార ప్రస్తావన చేయబడిన క్రమాన్ని అనుసరిస్తూ శఠకోపముని కూడా హయగ్రీవావతారం తరువాత **"మీనాకి"** (మత్స్యరూపుడై) అని పలికారు. పద్మపురాణోక్త ప్రక్రియలో సూతమహర్షి వచనాలవల్ల శౌనకుడు అర్థాన్ని గ్రహించి, **"బ్రహ్మణ్యో దేవకీపుత్రః"** ఇత్యాది శ్రుతిలో దేవకీశబ్ద తాత్పర్యవివరణ పూర్వకంగా హయగ్రీవుడే మధుసూదన శబ్దార్థమని నిర్ణయింపబడినదికదా. ఈ కారణంగా నమ్మాళ్వార్లు కూడా తమ ప్రబంధంలో హయగ్రీవుడే మధుసూదనుడనే అర్థాన్ని వివరించారు.



ఇదే రీతిలో పరకాల సూరి అనబడే తిరుమంగై ఆళ్వార్లు కూడా పెరియతిరుమొళి అనే ప్రబంధంలో ఈ తత్త్వాన్ని వ్యక్తం చేశారు. సాక్షాత్తు భగవానునివల్ల అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశంగా పొందిన ఈ దివ్యసూరి పెరియతిరుమొళి అనే తమ ప్రథమ ప్రబంధంలో మొదటి శతకం – మొదటి దశకంలో నారాయణ నామాన్ని అసకృత్ ప్రయోగించడం ద్వారా, పంచమ శతకంలో (5-3-2), సప్తమ శతకంలో (7-8-2) హయగ్రీవావతార ప్రస్తావనను చేయడంద్వారా, ఆ ప్రబంధం చిట్టచివరి పాశురానికి ముందు గల రెండవ పాశురంలో మధుసూదనశబ్దాన్ని ప్రయోగించి, చివరి పాశురంలో శ్రీకృష్ణుని ప్రతిపాదించడం ద్వారా ఆ ప్రబంధంలో అష్టాక్షరీమంత్రార్థప్రకాశనంతో పాటు, నారాయణోపనిషత్తుయొక్క అర్థాన్ని కూడా చక్కగా విశదీకరించారు. సప్తమ శతకంలోని మొదటి పాశురంలో ప్రళయసముద్రశాయియైన భగవానుని నాభీకమలంనుండి చతుర్ముఖోత్పత్తి, రెండవ గాథలో హయగ్రీవావతారవృత్తాంతం, తదనంతరగాథలలో శ్రీకృష్ణావతారంతో పాటు మిగిలిన అవతారాల ప్రస్తావన, చివర గాథలో మత్స్యావతార ప్రస్తావన చేయబడింది. ఈ విధంగా పరకాలమునికి కూడా నారాయణోపనిషత్తులోని మధుసూదనశబ్దానికి హయగ్రీవుడనే అర్థమే అభిప్రేతమని చెప్పవలసి ఉన్నది. నారాయణోపనిషద్వాక్యంలో దేవకీపుత్ర – మధుసూదన శబ్దాలతో కృష్ణ – హయగ్రీవావతార ద్వయం బోధింపబడటం, మిగిలిన నృసింహాద్యవతారాల కంటే దీనికి గల వైలక్షణ్యం హయగ్రీవావతారం అన్ని అవతారాలకు మూలమని కూడా సూచిస్తున్నది. హయగ్రీవుడు తన శిరోభాగంలో హయరూపాన్ని ధరించడంవల్ల **"యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సహ, తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః"** (కఠోపనిషత్-1-3-6) అనే శ్రుతి ద్వారా ప్రతిపాదింపబడిన పరిశుద్ధమైన మనస్సును కలవారు, విజ్ఞానాన్ని కల మానవులకే మనస్సు మొదలైన ఇంద్రియాల వశీకరణం సాధ్యమనే అర్థం సూచింపబడింది. అంతేకాక, వేదాలను అనుగ్రహించి, జ్ఞానోపదేశం చేయడం ద్వారా, తదనంతరం వేదాలను పోగొట్టుకొన్నపుడు బ్రహ్మ సృష్టిచేయడంలో సామర్థ్యాన్ని కోల్పోయినవాడై ఏ దుఃఖాన్ని అనుభవించాడో, ఆ దుఃఖాన్ని హయగ్రీవుడు తీర్చినందువల్లకూడా శ్రుత్యర్థం ప్రకాశింపజేయబడింది. హయశిరోరూపునిద్వారా బ్రహ్మచే సత్త్వాభివృద్ధిని కల్గించే కార్యాలను గూర్చిన జ్ఞానం సంపాదింపబడినందున, రజస్తమస్సులవల్ల కల్గిన బాధ నివర్తింప బడినందున – ఇంద్రియాలను సదశ్వాలనువలె ఉపయోగించి సత్త్వాభివృద్ధిని కల్గించే కార్యాలకు సంబంధించిన జ్ఞానం కలిగించే రీతిలో ఎపుడు ప్రవర్తిస్తామో, అపుడే రజస్తమస్సుల వల్ల కలిగే బాధ తీరుతుంది – అని సిద్ధిస్తున్నది. చతుర్ముఖుడు జీవసమష్టి రూపుడు కనుక, అటువంటి చతుర్ముఖునకు హయగ్రీవుని మూలంగా జ్ఞానం లభించిందని చెప్పబడడంవల్ల,

హయగ్రీవుని అనుగ్రహంవల్ల లభించిన విజ్ఞానాన్ని కల్గిన పరిశుద్ధమనస్సులకే ఇంద్రియా లనే అశ్వాల వశీకరణం సాధ్యమని సూచింపబడింది. చతుర్ముఖుడు చేసిన ప్రపత్తితో వశీకృతుడైన అనిరుద్ధుడే హయగ్రీవుని రూపంలో అవతరించి, ఆ చతుర్ముఖుని దుఃఖాన్ని తీర్చాడని పూర్వం చెప్పబడటంవల్ల, సర్వేంద్రియ నియామకుడైన హయగ్రీవుని ప్రపత్తితో వశీకరించుకొంటే (హయగ్రీవుని శరణాగతి చేస్తే) ఇంద్రియాశ్వాలను వశీకరించుకోగలరు – అనే విషయం కైముతికన్యాయసిద్ధం. శ్రీకృష్ణావతారంలోకూడా ఈ అర్థం చక్కగా వ్యక్తీకరింపబడింది. ఏవిధంగా అంటే – అర్జున రథంలోని రథియైన అర్జునుని అశ్వాలను సరియైన మార్గంలో నడపించడం ద్వారా, చివరకు అర్జుననకు విజయాన్ని సుఖాన్ని కల్గించడం ద్వారా రథస్థానీయమైన దేహంలో ఉండే రథిస్థానీయులైన జీవులందతి ఇంద్రియాశ్వాలు నియామకుడైన భగవానునిచే చక్కగా నడిపింపబడినపుడే రజస్తమస్సుల నియమనం సాధ్యమని, సత్త్వవృద్ధి చక్కగా జరగడం వల్ల సమ్యక్ జ్ఞానం లభిస్తుందని, అందువల్ల విజయం సుఖం లభిస్తుందని సూచింపబడింది. భగవానుడు హయగ్రీవావతారం ద్వారానే వేదప్రదానాన్ని, పాంచరాత్రోపదేశాన్ని చేసినట్లే, అర్జునునకు శ్రీకృష్ణుడు శ్రుత్యుపబృంహణరూపమైన, పాంచరాత్రాగమ సంగ్రహరూపమైన భగవద్గీతను ఉపదేశించడంద్వారా జ్ఞానాన్ని కల్గించాడు. ఇది ఈ రెండు అవతారాల మధ్య గల సామ్యం. వేదాదులద్వారా జ్ఞానాన్ని ప్రసాదించే అవతారాలలో హయగ్రీవావతారం మొదటిది కాగా, శ్రీకృష్ణావతారం చివరిది. ఈ రీతిలో పరస్పర సామ్యాన్ని కల ప్రథమ – చరమావతారాలు నారాయణోపనిషత్తులో ప్రతిపాదింపబడ్డాయని భావించిన శ్రీశఠకోపసూరి, శ్రీపరకాలసూరికూడా మొదటగా హయగ్రీవావతారాన్ని, చివరలో శ్రీకృష్ణావతారాన్ని ప్రస్తావించారు. భగవద్గీతలో **"మాధవః"** (1–14), **"హృషీకేశః"** (2–10) అనే నామ నిర్దేశాల పర్యాలోచనవల్ల పూర్వోక్తమైన అర్థం స్ఫురిస్తుంది. **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** (భారత – అరణ్యపర్వం –86–24), **"పుణ్యా ద్వారవతీ తత్ర యత్రాసౌ మధుసూదనః"** (భారతం – అరణ్యపర్వం –86–25), **"కృష్ణం ధర్మం సనాతనమ్"** (అరణ్యపర్వం –86–26), **"ఆస్తే హరి రచింత్యాత్మా తత్రైవ మధుసూదనః"** (అరణ్యపర్వం –86–28) ఇత్యాది నిర్దేశాలు కూడా ఈ అవతారద్వయ సామ్యాన్ని నిరూపిస్తాయి.

నారాయణోపనిషత్తులోని మధుసూదనశబ్దానికి హయగ్రీవుడనే అర్థమే వివక్షితమని తలచిన వ్యాస మహర్షి, హయశిర ఉపాఖ్యానానంతరం గల అధ్యాయంలో **"జాయమానం హి పురుషం యం పశ్యే న్మధుసూదనః, సాత్త్విక స్సతు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"**



(భారతం – మోక్షపర్వం –358–73) అనే శ్లోకంలో పూర్వాధ్యాయంలో తామస – రాజసప్రకృతులను కల మధుకైటభులను సంహరించినవాడుగా తెలుపబడిన హయగ్రీవుని నిర్దేశాన్ని మధుసూదనశబ్దంతో చేశారు. ఈ శ్లోకంలో **"జాయమానం, పశ్యేత్"** అనే రెండు పదాల ద్వారా **"హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్"** (తైత్తిరీయోపనిషత్ – నారాయణమ్ –10–23, శ్వేతాశ్వతరోపనిషత్–4–12) అనే శ్రుతివాక్యం స్మరింపజేయ బడింది. నారాయణోపనిషత్తులోని **"స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు"** (10–23) అనే చరమపదాల ఆశయం **"సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"** అనే పదాల ద్వారా ఉపబృంహితమైనది. **"యో దేవానాం ప్రథమం పురస్తాత్ విశ్వాధికో రుద్రో మహర్షిః"** (నారాయణమ్–10–23) అని ఈ శ్రుతిలోని పూర్వార్ధం ద్వారా రుద్రశబ్దార్థం హయగ్రీవుడే అనే భావనతోనే ఇక్కడ చివరలో మధుసూదన శబ్దం ప్రయోగింపబడింది. ఆ మంత్రానికి ముందు మంత్రం **"త్రిధా బద్ధో వృషభో రోరవీతి"** (10–23) అనే ప్రయోగంలోని **"రోరవీతి"** అనే పదం సేశ్వరమీమాంసలో వేదాంతదేశికులచే **"రోరవీతి – శ్రుతిముఖరముఖత్వాత్"** అని వివరింపబడటంచేత, రుద్రశబ్దంలోని **"రుత్"** అనే పదానికి వేదమని అర్థం. **"అరున్ముఖాన్యతీన్"** (కౌషీతక్యుపనిషత్ –3–1) అనే శ్రుతి వాక్యంలోని **"రుత్"** శబ్దానికి వేదార్థకత్వం తెలుపబడింది కదా! అందువల్ల **"రుత్ – వేదః, తం ద్రవతి గచ్ఛతి ఇతి రుద్రః"** అనే వ్యుత్పత్తి ద్వారా రుద్రశబ్దం హయగ్రీవార్థకం. శ్రుతివాక్యంలో హయగ్రీవుడు వేదప్రాప్తగా ప్రతిపాదింపబడగా, ఇక్కడ, తరువాత యుద్ధం చేయడంకోసం వచ్చిన మధువును సంహరించినవాడని తెలుపబడటమే విశేషం. హిరణ్యగర్భుడైన బ్రహ్మకు అనిరుద్ధుని నాభీకమలంలో దేహసంబంధరూపమైన భౌతికజన్మను పొందిన దశలో అనిరుద్ధ దర్శనం లభించినా, దానివల్ల ఆ బ్రహ్మకు పూర్ణమైన సాత్త్వికత్వం లభించలేదు. ఎందువల్లనంటే, తదనంతరం అతడు వేదాపహారదశలో జ్ఞాననాశాన్ని పొందాడు కదా. అపహరింపబడిన వేదాలను తిరిగి తీసికొని వచ్చి చతుర్ముఖబ్రహ్మకు ఇచ్చి, మధుకైటభులను సంహరించిన తరువాత జ్ఞానప్రదానం చేసినపుడే బ్రహ్మకు సాత్త్వికతాపూర్తి కల్గింది. అపహరింపబడిన వేదాలను తిరిగి తీసికొని వచ్చినవాడు హయరూపధారియైన అనిరుద్ధుడే (అనిరుద్ధమూర్తినుండి హయగ్రీవావతారం జరిగింది). అందువల్ల **"హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్"** అనే శ్రుతిలోని జాయమానశబ్దానికి జ్ఞానజన్మయే వివక్షితమని స్ఫుటపడుతున్నది. **"బ్రహ్మణ్యో మధుసూదనోమ్"** అనే ఉపనిషద్వ్యాఖ్యానుసారంగా **"హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్"** అనే శ్రుతిలో ఇటువంటి అర్థమే వివక్షితమని వ్యాసమహర్షి ఆశయం. కనుకనే **"జాయమానమ్"** ఇత్యాది సూక్తిని పలికారు. శ్రుతిలో కైటభహంతృత్వం చెప్పబడకుండా, కేవలం మధుహంతృత్వంమాత్రం చెప్పబడటం రజోగుణం

కంటే తమోగుణం ఎక్కువ జ్ఞానవిరోధి - అనే అర్థాన్ని సూచించడం కోసమే. ప్రబలజ్ఞానవిరోధి తొలగితే, అంతకంటే దుర్బలమైన విరోధి తొలగడంలో ఆశ్చర్యం లేదు కదా! ఇందువల్లనే వ్యాసమహర్షికూడా తన సూక్తిలో ఈ అర్థాన్ని సూచిస్తూ, మధుసూదనశబ్దాన్ని ప్రయోగించి, తమకు కూడా జననకాలంలో మధుసూదనకటాక్ష ప్రసరణ ఫలంగానే సాత్త్వికత్వం కల్గిందని ప్రఖ్యాపన చేశారు. కనుకనే పద్మపురాణంలోని హయగ్రీవుని అనుగ్రహంతో వేదాది లాభాన్ని పొందిన చతుర్ముఖునివల్ల వ్యాసమహర్షికి వేదాదుల లాభం కల్గిందనే సూక్తి సమన్వయిస్తుంది.

పద్మపురాణంలో తెలుపబడిన రీతిలో చతుర్ముఖబ్రహ్మయే సర్వపురాణాలకు ప్రణీత అనే విషయాన్ని శ్రీరామానుజులు వేదార్థసంగ్రహంలో తెలుపడమే కాక, జనక యాజ్ఞవల్క్య సంవాదంలోను, హయశిర ఉపాఖ్యానాదులలోను నిర్ణయింపబడిన క్రమంలో తత్త్వైక్యాన్ని, పాంచరాత్రప్రామాణ్యాన్ని, శ్రుతిపాంచరాత్రాగమాల ఐకరస్యాన్ని శ్రీభాష్యగ్రంథంలో వ్యవస్థాపించారు. దీనిని గుర్తించిన సరస్వతీ దేవి శ్రీరామానుజుల విషయంలో హయగ్రీవుల అనుగ్రహం పూర్ణంగా ఉన్నదని నిశ్చయించుకొని, శ్రీభాష్యాన్ని ఆలకించిన తరువాత, **"అతః ప్రాత స్సముత్థాయ చింతయే దాత్మనో హితమ్, నిర్గుణం నిరహంకారం నారాయణ మనామయమ్, సగుణం చ శ్రియా యుక్తం దేవం దేవీం సరస్వతీమ్"** అని ఆశ్వలాయన స్మృతిలో, **"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్, దేవీం సరస్వతీం వాచం తతో జయ ముదీరయేత్"** అనే మహాభారతాది సూక్తిలో తెలుపబడిన రీతిలో తనకు మూలభూతురాలైన సరస్వతీ శబ్దవాచ్య అయిన వాగ్దేవితో కూడినవాడు, తన పతి అయిన చతుర్ముఖునకు వేదపాంచరాత్రాదులను ఉపదేశించినవాడు, నిత్యం తనచే ఆరాధింపబడేవాడైన హయగ్రీవుని అర్చామూర్తిని శ్రీరామానుజులకు ఇచ్చింది. ఈ వృత్తాంతం శ్రీరామానుజుల చరిత్రను తెలిపే గ్రంథాలన్నిటిలో ప్రసిద్ధం.

శ్రీవైష్ణవాచార్యపరంపరకు చెందిన ఆచార్యుల హయగ్రీవభక్తి వారి సూక్తుల ద్వారా స్పష్టపడుతున్నది. యామునాచార్యులవారు స్తోత్రరత్నంలో **"తస్మై నమో మధుజిదంఘ్రి సరోజతత్త్వజ్ఞానానురాగమహిమాతిశయాంతసీమ్నే, నాథాయ నాథమునయేఽత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** అని (2వ శ్లోకం) తమకు పితామహులు, శ్రీవైష్ణవాచార్యులలో ప్రథమగణ్యులైననాథమునుల మధుసూదనభక్తిని **"యం పశ్యేన్మధు సూదనః", "బ్రహ్మణ్యో.... మధుసూదనోమ్"** ఇత్యాది శ్రుతి తదుపబృంహణ ప్రసిద్ధార్థకమైన మధుసూదననామనిర్దేశపూర్వకంగా సూచించారు. అంతే కాకుండా, ఆ స్తుతిలోని **"వేదాపహార"** (13వ శ్లోకం) అనే శ్లోకంలో తమకు గల మధుసూదన భక్తిని సూచించారు. ఈ శ్లోకంలోని **"వేదాపహార"** అనే ప్రయోగం హయగ్రీవావతారపరమని ప్రాచీన



వ్యాఖ్యలన్నిటిలో స్పష్టం. **"అభంగురకలాదాన"** ఇత్యాది సుప్రసిద్ధ హయగ్రీవధ్యానశ్లోకం శ్రీవాత్స్యవరదనామధేయులైన నడాదూర్ అమ్మాళ్‌చే రచింపబడినదిగా భావింపబడుతున్నది. **"హృద్యా హృత్పద్మసింహాసన రసికహయగ్రీవ హేషోర్మిఘోష క్షిప్తప్రత్యర్థిదృప్తిః జయతి బహుగుణా పంక్తి రస్మద్గురూణామ్"** అనే వేదాంతదేశికుల తత్త్వముక్తా కలాపసూక్తి (5-137) కూడా శ్రీ వైష్ణవాచార్యుల హయగ్రీవభక్తిపరత్వాన్ని తెల్పుతున్నది. పరాశర భట్టర్‌కూడా శ్రీరంగరాజస్తవం - ఉత్తరశతకంలో భగవానుని సత్త్వప్రవర్తన కృపాపరిపాలనాదులను విశదీకరించడంకోసం భగవదవతారాలను పెక్కింటిని నిరూపించారు. ముందుగా **"మధుకైటభ శ్చేతి రోధం విధూయ త్రయీదివ్యచక్షుః విధాతు ర్విధాయ, స్మరస్యంగరంగిన్! తురంగావతారః సమస్తం జగజ్జీవయిష్యత్యకస్మాత్"** (52వ శ్లోకం) అని హయగ్రీవావతార ప్రస్తావనద్వారా పూర్వోక్త సత్త్వప్రవర్తన కృపా పరిపాలనాదులను ప్రతిపాదించారు. **"శరీరభూతభృత్"** అనే విష్ణు సహస్రనామస్తోత్రాంతర్గత నామాన్ని వివరిస్తూ **"తచ్ఛిరః"** అనే బృహదారణ్యకశ్రుతిని ఉదాహరించి, హయశిర ఉపాఖ్యానంలోని వచనాలను ఉదాహరించడంద్వారా ఈ అర్థాన్ని నిర్ధారించారు. ఇక వేదాంతదేశికుల హయగ్రీవభక్తి సుప్రసిద్ధం. స్వయంగా అద్భుతమైన హయగ్రీవ స్తోత్రాన్ని రచించడమే కాక శతదూషణి, సంకల్పసూర్యోదయం, తత్త్వముక్తాకలాపం, రహస్యత్రయసారాది పలు గ్రంథాలలో పలుచోట్ల హయగ్రీవుని స్మరించారు.

వాగ్దేవీపతియైన హయగ్రీవుని అనుగ్రహంతో యాజ్ఞవల్క్యమహర్షి **"తత్‌స్థత్వా దనుపశ్యంతి హేఽఽక ఏవేతి సాధనః"** (భారతం - మోక్షపర్వం -323-78) అని మహాభారతంలో సిద్ధాంతీకరించిన అర్థాన్ని వ్యాసమహర్షి **"తత్త్వం జిజ్ఞాసమానానామ్"** అని హయశిర ఉపాఖ్యానంలో ఉపబృంహణం చేశారు. ఈ పరమార్థాన్ని శ్రీ వేదాంతదేశికులు - **"అధ్యాసేన తురంగవక్త్ర విలసజ్జిహ్వాగ్రసింహాసనాదాచార్యాదిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే, యస్యాసౌ భజతే కదాచిదజహద్భూమా స్వయం భూమికాం మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ నారాయణః"** (రహస్యత్రయసారమ్ - 31వ అధికారమ్) అనే శ్లోకంలో చివర నారాయణశబ్ద ప్రయోగాన్ని చేయడం ద్వారా సూచించారు. శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన పరకాలమఠాధీశులకు అందటికి **"హయగ్రీవ దివ్యపాదుకాసేవక"** అనే బిరుదు వ్యవహరింపబడటం ఆ మఠసంప్రదాయంలో హయగ్రీవస్వామికి కల ప్రాధాన్యాన్ని స్పష్టం చేస్తున్నది.

మాధ్వసంప్రదాయంలో కూడా హయగ్రీవునకు చాలా ప్రాధాన్యం ఉన్నది. వ్యాసరాయల శిష్యుడైన వాదిరాజు హయగ్రీవ భక్తులు. హయగ్రీవస్వామి తనను అనుగ్రహించిన పలు సందర్భాలను ఆయన స్వప్నబృందావనాఖ్యమనే గ్రంథంలో

వర్ణించారు. అట్లే, మాధ్వమత ప్రవర్తకులైన మధ్వాచార్యులవారు, రాఘవేంద్రస్వామి, వారి శిష్యుడైన అప్పణాచార్యులవారు కూడా హయగ్రీవారాధకులే. మాధ్వ సంప్రదాయానికి చెందిన పలు హయగ్రీవ స్తుతులు కూడా ఉన్నవి.

ఈవిధంగా పలు వైదిక – అవైదిక మతాలలోను, భారతదేశంలో, పలు విదేశాలలో వ్యాప్తిని, ప్రాధాన్యాన్ని కల్గిన హయగ్రీవస్వామి వైభవాన్ని తెలిపే కొన్ని స్తోత్రాలు ప్రస్తుతం సంకలనం చేయబడి లఘువివరణతో ఆస్తికసహృదయ పాఠకుల సమక్షంలో సమర్పింపబడుతున్నవి. **రామక్షేత్రనివాసి, విద్వద్వతంసులు, ఉ.వే. శ్రీమాన్ తి.ప.రామానుజస్వామివారి "హయాననవింశతిః"** అనే స్తుతిని తమ వ్యాఖ్యానంతో పాటు ముద్రించ డానికి అనుమతించిన **నెల్లూరు వాస్తవ్యులు, సహృదయమిత్రమణి ఉ.వే.శ్రీమాన్ డా.కె.ఎల్. నారాయణ స్వామి**వారి సన్నిధిలో కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను. తిరువహీంద్రపురం మహామండప సంప్రోక్షణ సందర్భంలో ప్రచురించబడిన **"కదంబమాలా"** అనే సంకలన గ్రంథంనుండి కొన్ని హయగ్రీవ స్తుతులు కృతజ్ఞతా పూర్వకంగా స్వీకరింపబడ్డాయి. ఆ రీతిలోనే తమ తండ్రిగారైన **ఉ.వే.శ్రీమాన్ తె.కం.రంగరామానుజాచార్యస్వామి** వారి **"లక్ష్మీహయానన సుప్రభాత"** స్తుతిని తమ వివరణంలో ముద్రించడానికి అనుమతించిన **జగ్గయ్యపేట వాస్తవ్యులు శ్రీమాన్ అరుణ కుమారిగారికి** ధన్యవాద సమర్పణను చేసికొంటున్నాను. నన్నీ ప్రయత్నంలో బహుధా ప్రోత్సహించిన మిత్రవర్యులు, శతాధికాలైన, అపూర్వాలైన సద్గ్రంథాలను ప్రచురింపజేసినవారు, ఆర్షసంప్రదాయప్రచారబద్ధకంకణులైన **శ్రీమాన్ రావి మోహనరావుగారికి** కృతజ్ఞతలను హార్దంగా తెల్పుకొంటున్నాను. పలు సద్గ్రంథాలను తమ పవిత్రద్రవ్యంతో ముద్రింపజేస్తున్న దంపతులు, **సహృదయులు శ్రీమతి నడిపినేని కోటేశ్వరమ్మ, శ్రీసూర్యనారాయణ పుణ్యదంపతులకు** నా హార్దిక ధన్యవాదాలను తెల్పు కొంటున్నాను. హయగ్రీవునకు సంబంధించిన విమర్శనాత్మకమైన, సమగ్రమైన సాహిత్యాన్ని అందించే ప్రయత్నం జరుగవలసిన ఆవశ్యకత ఉన్నది. ఆ హయగ్రీవస్వామి కృపవల్ల అది అచిరకాలంలోనే సఫలం కాగలదని ఆశిస్తూ, సెలవు.

తిరుపతి,
10–7–14

ఇట్లు
నివేదించు బుధజనవిధేయుడు
**ఈ.ఏ.శింగరాచార్యులు**



# వాగాంభృణీసూక్తం
## (ఋగ్వేదం–10–125)
## ప్రవేశిక

హయగ్రీవ పత్ని అయిన వాగ్దేవి అంభృణుడనే ఋషికి పుత్రికగా **"వాగ్దేవి"** అనే పేరుతో అవతరించిందని పురాణాలు పేర్కొంటున్నాయి. ఈమె, ఋగ్వేదం దశమ మండలంలోని 125 సూక్తాన్ని దర్శించి పల్కింది. ఇది **"వాగాంభృణీసూక్త"** మనబడుతున్నది. ఈ సూక్త తాత్పర్యం వివరింపబడుతున్నది.

ఈ సూక్తానికి ముందు సూక్తంలో **"బీభత్సూనాం సయుజం హంస మాహు రపాం దివ్యానాం సఖ్యే చరంతమ్"** (10–124–9) (హంసశబ్దవాచ్యుడైన హయగ్రీవుని భయపడినవారికి సఖునిగా పల్కుతున్నారు.) అని అంటూ హయగ్రీవుని మహిమ తెలుపబడింది. విష్ణుతిలక సంహితలోని 250వ అధ్యాయంలో **"అథ హంసమనుం వక్ష్యే"** అని ఆరంభించి హంసమంత్రాన్ని వివరిస్తూ **"హయగ్రీవ మహం వందే"** అని అనడం ద్వారా హయగ్రీవుడే హంసశబ్దవాచ్యుడని తెలుపబడింది. **"తస్మిన్ అహని సంప్రాప్తే తం హంసమ్"** (3–33–19) అని ఆరంభించి, **"స వాక్పతిః"** (3–33–34) అనే పర్యంతం గల హరివంశశ్లోకాలతో హంసమనబడేవాడు వాగ్దేవీపతియైన హయగ్రీవుడే – అని విశదం చేయబడింది.

**"వాచం ప్రపద్యేత్ వాక్కామో హువేదాశు జపన్నిమాః, అహం రుద్రేభి రిత్యేతా వాగ్మీ భవతి మానవః"** (**"అహం రుద్రేభిః"** అని ప్రారంభమయే మంత్రాలను జపిస్తూ, హోమం చేసి వాగ్దేవిని శరణు పొందాలి. ఆవిధంగా చేస్తే మానవుడు వాగ్మిత్వాన్ని పొందుతాడు) అని ఋగ్విధానంలోను, **"అహం రుద్రేభి రిత్యేతత్ వాగ్మీ భవతి మానవః"** (**"అహం రుద్రేభిః"** అనే సూక్తాన్ని జపిస్తే ఆ మానవుడు వాగ్మిత్వాన్ని పొందగలడు) అని విష్ణుధర్మోత్తరంలో కూడా తెలుపబడింది. **"కీర్తిః శ్రీర్వాక్చ నారీణామ్"** (గీతా–10–34) అని గీతలో ఈ వాగ్దేవతయే లక్ష్మీదేవి కంటె భిన్నురాలుగా ప్రస్తావింపబడినందున, ఈ సందర్భంలో వేదాంతదేశికులు తమ తాత్పర్యచంద్రికలో వీరు భగవానుని పలువిధాలైన శక్తులు అని వివరించినందున, ఈ వాగ్దేవి భూనీళాదేవులవలె శ్రీదేవి కంటే వేఱయినది– అని గ్రహించడంలోనే ఔచిత్యం ఉన్నది. వసిష్ఠస్మృతిలో **"వాక్ సూక్త"**మనే పేరుతో నిర్దేశింపబడినది ఈ వాగాంభృణీ సూక్తమే – అని స్మృతిచంద్రిక, రత్నాకరం మొదలైన

గ్రంథాలను రచించినవారిచే తెలుపబడింది. ఇటువంటి గొప్పతనాన్ని కల, ఎనిమిది మంత్రాలను కల్గిన ఈ సూక్తంలో వాగ్దేవి తన పతియొక్క (హయగ్రీవుని యొక్క) వైభవాన్ని భావనా ప్రకర్షతో తనలో ఆరోపించుకొని పల్కిన క్రమాన్ని దర్శించవచ్చు. అందువల్ల ఈ సూక్తంలో స్తుతింపబడిన అతిశయం అంతా హయగ్రీవ వైభవంలోకే పర్యవసిస్తుందని తెలియాలి.

---

**1. అహం రుద్రేభిః వసుభి శ్చరామి అహ మాదిత్యై రుత విశ్వేదేవైః ।**
**అహం మిత్రా వరుణోభా బిభ్రమి అహ మింద్రాగ్నీ అహ మశ్వినోభా ॥**

అహం = నేను, రుద్రేభిః = ఏకాదశ రుద్రులను పురస్కరించుకొని, వసుభిః = అష్టవసువులను పురస్కరించుకొని, చరామి = చరిస్తాను (కార్యనిర్వహణను చేస్తాను), ఆదిత్యైః = ద్వాదశాదిత్యులతోను, విశ్వేదేవైః = విశ్వేదేవులతోను, అహం (చరామి) = నేను కార్యనిర్వహణను చేస్తాను, ఉభా మిత్రా వరుణా = మిత్రుడు, వరుణుడు – అనే ఇద్దఱు దేవతలతో, అహం = నేను, బిభ్రమి = ధరిస్తున్నాను, ఇంద్రాగ్నీ = ఇంద్రుని, అగ్నిని, అహం = నేను, (బిభ్రమి = ధరిస్తున్నాను), ఉభా అశ్వినా = ఇద్దఱు అశ్వినీ దేవతలను, అహం (బిభ్రమి) = నేను ధరిస్తున్నాను (ఇందులో నిర్దేశింపబడినద దేవతలు మిగిలిన దేవతావర్గానికి అంతటికి ఉపలక్షణం)

ఈ మంత్రంద్వారా సకలదేవతలను నేనే ధరిస్తున్నాను – అని, వారిని సాధనంగా చేసికొని సృష్టిస్థితి సంహార కార్యాలను నడుపుతున్నది నేనే – అని వాగ్దేవి పల్కుతున్నది.

**(అహం.... విశ్వేదేవైః)** – పదకొండుమంది రుద్రులతో, ఎనిమిదిమంది వసువులతో, పన్నెండుమంది ఆదిత్యులతో, విశ్వేదేవతలతో సృష్ట్యాదికార్యనిర్వహణను చేస్తున్నది నేనే. వారిని సాధనంగా చేసికొని నేనే కార్యనిర్వహణను చేస్తున్నానని భావం. వారు ఏవిధంగా సాధనభూతులు అవుతున్నారు? అని అంటే,

**(అహం మిత్రా వరుణా అశ్వినోభా)** – నేనే మిత్రుడు, వరుణుడు – అనే ఇద్దఱిని, ఇంద్రుని, అగ్నిని, అశ్వినీదేవతలను ఇద్దఱిని ధరిస్తున్నాను కదా! (ఇంతవరకు చెప్పబడిన దేవతలు మిగిలినవారిని ఉపలక్షిస్తారు). ఈవిధంగా అందఱు దేవతలను నేనే ధరిస్తున్నందువల్ల, నేనే వారిని సాధనంగా చేసికొని సృష్టి –స్థితి– సంహారాలను నిర్వహిస్తున్నాను – అని భావం. శ్రీవేదాంతదేశికులు చతుఃశ్లోకీ భాష్యంలో (రెండవ శ్లోకభాష్యంలో) **"యథా ముక్తస్య భగవతా పరమసామ్యే శ్రుతిస్మృత్యాదిసిద్ధేఽపి జగద్వ్యాపార వర్జమితి లక్షణభూతై రాకారైః వైషమ్యం స్థాప్యతే, తథా ఇహాపి భవతి భిన్నలక్షణమితి**



**తత్రైవోక్తమ్"** (ముక్తునకు భగవానునితో గొప్పదైన సామ్యం శ్రుతిస్మృత్యాదులలో సిద్ధించినా, **"జగద్వ్యాపారవర్జమ్"** – అంటే – జగత్తును సృష్టించడం, రక్షించడం, లయం చేయడం మొదలైన వ్యాపారాలలో తప్ప, మిగిలిన విషయాలలో సామ్యం – అని బ్రహ్మసూత్రాలు మొదలైనవానిద్వారా ఈశ్వరలక్షణ రూపాలైన ఆకారాలతో సామ్యం ఏవిధంగా స్థాపించబడుతున్నదో, అదేరీతిలో ఇక్కడ కూడా సామ్యం స్థాపించబడుతున్నదని గ్రహించాలి. పాంచరాత్రాగమానికి చెందిన సాత్వతసంహితలో భిన్నలక్షణాన్ని కల్గిన శక్తులు – ఇత్యాదిగా చెప్పబడినది కదా) అని అనడం ద్వారా జగద్వ్యాపారమనే పరబ్రహ్మ లక్షణం లక్ష్మీదేవికి లేదని తెలిపారు. లక్ష్మీదేవికే లేనపుడు, ఆమె అంశభూతురాలు అనదగినది, జీవకోటిలోనికి అంతర్భవించినదిగా అందఱిచే అంగీకరింపబడినది అయిన ఈ వాగ్దేవికి ఈ సూక్తంలో తెల్పిన జగద్వ్యాపారాదులు ఏవిధంగా పొసగుతాయి? అని అంటే, పొసగవు, నిజమే. అయినా, **"శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్"** (వామదేవ ఋషివలె శాస్త్రదృష్టితో ఉపదేశం) అని బ్రహ్మసూత్రాలలో నిర్ణయింపబడిన రీతిలో, **"అహం మనుభవం సూర్యశ్చ"** (నేనే మనువును, సూర్యుడను) అనే వామదేవునివలె, అథర్వశిరస్సులో రుద్రునివలె, ప్రతర్దన విద్యలో ఇంద్రుని వలె, ప్రహ్లాదునివలె శ్రీకృష్ణుని విశ్లేషించిన గోపికలవలె పరమాత్మ దృష్టితోగాని, భావనాప్రకర్షతో గాని పలుకబడినది కనుక విరోధం లేదు. శ్రీవేదాంత దేశికులు అభిప్రాయం ఈవిధమైనది కాగా, ఈ సూక్తంతో వాగ్దేవికి జగత్కారణత్వాదులను కొందఱు సాధించాలని చూడవచ్చు. కాని, అది బ్రహ్మసూత్రకారులు, శ్రీభాష్యకారులు, శ్రీవేదాంతదేశికులు మొదలైన అభిజ్ఞుల అభిప్రాయానికి విరుద్ధం – అనే విషయం సుస్పష్టం కదా!

**2. అహం సోమ మాహనసం బిభర్మి అహం త్వష్టారముత పూషణం భగమ్ ।**
**అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే ॥**

ఆహనసం = (శత్రువులను) సంహరించేవాడను, సోమమ్ = సోముడనే దేవతనైన, అహం = నేనే, బిభర్మి = ధరిస్తున్నాను, త్వష్టారం = త్వష్ట అనే దేవతను, పూషణం = పూషా – అనే దేవతను, భగం = భగుడనే దేవతను, అహం (బిభర్మి) = నేను ధరిస్తున్నాను, హవిష్మతే = హవిస్సును కలవాడు, సుప్రావ్యే = మంచి హవిస్సును దేవతలకు ఇచ్చేవాడు, సున్వతే = సోమరసాన్ని హోమం చేసేవాడైన, యజమానాయ = యాగాన్ని చేసేవానికి, అహం = నేనే, ద్రవిణమ్ = (యాగఫలమైన) సంపదను, దధామి = ఇస్తున్నాను.

సమస్త దేవతలకు ఆధారమై ఉండే స్వభావాన్ని నిరూపిస్తూ, నేనే ఆయా దేవతలకు అంతర్యామిగా ఉంటూ యజ్ఞాలకు ఫలాన్ని అనుగ్రహిస్తున్నాను – అని అంటున్నది.

పరమపురుషుని సర్వయజ్ఞఫలప్రదత్వాన్ని తన ఆరోపించుకొని వాగ్దేవి పల్కిన సూక్తి ఇది. ఆయా యాగాలద్వారా ఆరాధింపబడే దేవతలేకదా, యాగఫలాలను ఇస్తారని తెలుస్తున్నది. మఱి, **"నేనే యాగఫలాలను ఇస్తాను"** అని పలుకడం తగునా? అని అంటే, **(అహం...భగమ్)** – పలువురు దేవతలను ధరించేదానను నేనే. వారి సత్త నాధీనంలో ఉన్నపుడు, వారి ప్రవృత్తులు నా అధీనంలో ఉండటంలో లోటు ఏమి? **(అహం....సున్వతే)** – ఆయా దేవతలకు అంతర్యామిగా ఉండే నేనే అయా దేవతలను ఉద్దేశించి యాగం చేసే యజమానికి ఫలాన్ని ఇస్తున్నాను. **"లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్"** (నావల్లనే అనుగ్రహింపబడే మనోరథాలను ఆయా దేవతలవద్దనుండి పొందుతున్నారు) అని, **"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ"** (నేనే అన్ని యజ్ఞాలను అనుభవించేవాడను, వాటికి ఫలాన్ని ఇచ్చేవాడను నేనే) అన గీతలో శ్రీకృష్ణ భగవానుడు ఈ అర్థాన్ని పలికాడు. **"ఫల మత ఉపపత్తేః"** (ఫలం – పరమపురుషుని వల్లనే లభిస్తున్నది, అదే పొసగుతున్నందువల్ల) అని బ్రహ్మసూత్రకారులు కూడా పలికారు కదా!

**3. అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్ ।**
**తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయంతీమ్ ॥**

అహం = నేనే, రాష్ట్రీ = ఈశ్వరిని అవుతున్నాను, వసూనాం = సంపదలను, సంగమనీ = (ఉపాసకులకు) కలుగజేసేదానను, చికితుషీ = పరమాత్మజ్ఞానాన్ని కల్గినదాననైన నేనే, యజ్ఞియానాం = యజ్ఞపురుషునకు చెందినవారిలో, ప్రథమా = మొట్టమొదటిదానను, భూరిస్థాత్రాం = పలుచోట్ల ఉండేదానను, భూరి ఆవేశయంతీమ్ = పలుచోట్ల ప్రవేశించి ఉండేదానను అయిన, తామ్ = అటువంటి నన్ను, దేవాః = దేవతలు, పురుత్రా = పలుచోట్ల, వ్యదధుః = (ఆరాధించడం కోసం) కూడి ఉన్నారు.

ఈ సూక్తంద్వారా "లక్ష్మీదేవిని నేనే" – అని వాగ్దేవి అంటున్నది.

**(అహం రాష్ట్రీ)** – **"ఈశ్వరీం సర్వభూతానామ్"** (శ్రీసూక్తం) అనబడే సర్వభూతేశ్వరి అయిన లక్ష్మిని ఆమె నాకు అవయవభూతురాలై ఉన్నది – అని భావం.

**(సంగమనీ వసూనామ్)** – ఆశ్రయించేవారికి అన్ని సంపదలను ఇచ్చే లక్ష్మీదేవిని నేనే. ఇంకా ఎటువంటి దానను? అని అంటే, **(చికితుషీ)** – బ్రహ్మజ్ఞానాన్ని కల్గినదానను. నావలె పరమపురుషుని స్వయంగానే చూచి, లక్ష్మీతంత్రాదులలో చెప్పబడిన రీతిలో వ్యవహరించే గొప్పతనాన్ని కల్గిన దానను,



**(ప్రథమా యజ్ఞియానామ్)** – **"యజ్ఞో వై విష్ణుః"** – అని చెప్పబడినందున యజ్ఞపురుషుడైన విష్ణువును ఆశ్రయించినవారిలో మొదటి దానను. ఆ స్వామికి శేషమై ఉండేదాననని భావం. ఇందువల్ల లక్ష్మీదేవి కూడా పరబ్రహ్మకోటిలోని చేర్చి వాదించేవారి పక్షం నిరాకరింపబడినట్లయినది. **(తాం మా దేవా వ్యదుధుః పురుత్రా)** – అటువంటి నన్ను ఆరాధించడం కోసం దేవతలు పలుచోట్ల కూడి ఉన్నారు. ఆ రీతిలో పలుచోట్ల ఉండగల్గినదానవా నీవు? అని అంటే **(భూరిస్థాత్రాం భూర్యావేశయంతీమ్)** – పలుచోట్ల దివ్యమంగళ రూపంతో నిలిచే దానను, పలుచోట్ల నా స్వరూప గుణాలతో వ్యాపించి ఉండేదాననుకదా నేను. **''యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ!''** (విష్ణు.పు.–1–8–17) (ద్విజోత్తమా! ఏరీతిలో విష్ణువు సర్వవాపియై ఉన్నాడో, ఆ విధంగానే ఈమె కూడా సర్వవ్యాపినియై ఉన్నది) అని, **"లక్ష్మ్యా సమస్తచిదచిత్ప్రపంచో వ్యాప్తో తదీశస్యతు సాఽపి సర్వమ్"** (లక్ష్మీదేవి చేత చేతనాచేతనలు అన్నీ వ్యాపింపబడి ఉన్నాయి. ఆమెకు ఈశ్వరుడైన నారాయణునిచే అయితే అవి అన్నీ మాత్రమే కాక, ఆమె కూడా వ్యాపింపబడి ఉన్నది) అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. **"యావత్ బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్"** (ఋగ్వేదం–10–114–8) (పరబ్రహ్మ ఉన్న చోటు అంతా వాగ్దేవి ఉన్నది) అనే సూక్తికి కూడా ఇదే తాత్పర్యం. ఇక్కడ తెలుపబడిన స్వరూప వ్యాప్తి అఘటితఘటనాసామర్థ్యంవల్ల ఏర్పడింది – అనే విషయాన్ని శ్రీవిష్ణు పురాణ వ్యాఖ్యానంలో విష్ణుచిత్తులు తెలిపారు. సహజంగానే ఆమెకు కల్గిందని శ్రీవేదాంతదేశికులు భావించారు.

**4. మయా సో అన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శ్రుణోత్యుక్తమ్ ।**
**అమంతవో మాంత ఉపక్షియంతి శ్రుధి శ్రుత ! శ్రద్ధివం తే వదామి ॥**

యః = ఎవడు, అన్నమ్ అత్తి = అన్నాన్ని భుజిస్తూన్నాడో, సః = అతడు, మయా = నా కారణంగానే (భుజిస్తున్నాడు), యః విపశ్యతి = ఎవడు విశేషంగా చూస్తున్నాడో, (సః మయా విపశ్యతి= అతడు నావల్లనే చూస్తున్నాడు), యః ప్రాణితి = ఎవడు ఊపిరిని విడుస్తున్నాడో, (సః మయా ప్రాణితి= అతడు నావల్లనే ఊపిరిని విడుస్తున్నాడు), యః ఉక్తం శ్రుణోతి = ఎవడు చెప్పబడిన మాటను వింటున్నాడో, (సః మయా శ్రుణోతి = అతడు చెప్పబడిన మాటను వినగల్గుతున్నాడు), ఈమ్ మామ్ = అకారవాచ్యుడైన భగవానునకు పత్ని అయిన నన్ను, అమంతవః = ఎవరు అవమానం చేస్తున్నారో, తే = వారు, ఉపక్షియంతి = నశిస్తున్నారు, శ్రుత = ఓ జ్ఞానీ!, శ్రుధి = ఆలకించు, శ్రద్ధివం = శ్రీమన్నారాయణుని గూర్చి, తే = నీకు, వదామి = పల్కుతున్నాను (విను).

ఈ మంత్రంలో – లోకం లోని సకలచేతనుల సకలప్రవృత్తులు నాకు అంతర్యామి అయిన నారాయణుని వల్లనే ప్రవర్తిస్తున్నాయి – అని వాగ్దేవి అంటున్నది. **(మయా సో**

**అన్నమత్తి యః)** – ఎవడు అన్నాన్ని భుజిస్తున్నాడో, అతడు నా వల్లనే తినగల్గు తున్నాడు. నాకు అంతర్యామియైన పరమాత్మయే జఠరాగ్నిరూపుడై నిలచి ఉండి ఆ అన్నాన్ని జీర్ణం చేస్తున్నాడని భావం. భగవద్గీతలో – **"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాస్థితః, ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్"** (15-14) (నేను జీవుల శరీరంలో జఠరాగ్నినై, ప్రాణాపానాదులతోకూడి ఉండి, భక్ష్యభోజ్యచోష్యపానీయ రూపాలుగా నాల్గు విధాలైన అన్నాలను జీర్ణం చేస్తున్నాను) అని శ్రీకృష్ణ భగవానుడన్నాడు. **(విపశ్యతి యః)**– చూచేవాడుకూడా నా వల్లనే చూడగల్గుతున్నాడు.

**(ప్రాణితి యః)** – ఊపిరిని విడిచేవాడు నా వల్లనే ఊపిరిని విడుస్తున్నాడు. **"కో హ్యే వాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్"** (స్వయంప్రకాశాన్ని కలవాడు, ఆనంద స్వరూపి అయిన ఈ భగవానుడు లేకపోతే, ఎవడు ఈ లోకంలో జీవించగలడు?) అని ఆనందవల్లి పల్కింది.

**(ఈమ్ మామ్)** – అకారవాచ్యునకు పత్ని అయినందున **"ఈ"** అని చెప్పబడే నన్ను – అని అర్థం. **"గాయత్రి ఈమ్ జుషస్వ నః"** (ఓ గాయత్రీ! లక్ష్మీదేవిని మా పట్ల ప్రీతిని పొందేటట్లు చేయి) అని గాయత్రీదేవి ఆవాహన మంత్రంలో **"ఈమ్"** అని శ్రీదేవి నిర్దేశింపబడింది. **(ఈదృశీమ్ మామ్)** ఇటువంటి నన్ను – అని సాయణభాష్యం.

**(అమంతవః)** – నన్ను అవమానించేవారు ఎవరో, **(తే ఉపక్షియంతి)** – వారు ఆసుర జాతులలో పడి నశిస్తారు. **"అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్"**, (గీత -9-11) (మూఢులు, మానవదేహాన్ని ఆశ్రయించిన నన్ను అవమతిస్తున్నారు) అని, **"తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపామ్యజస్ర మశుభాన్ అసురీష్వేవ యోనిషు, అసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని, మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్"** (గీత -16-19....20) (నన్ను ద్వేషించేవారు, క్రూరులు, మానవులలో అధములు, అమంగళమైన వారిని నేను ఎల్లప్పుడూ సంసారంలోనే – అందులోనే – ఆసురజన్మలలోనే పడదోస్తాను. అసురజన్మను పొంది, ప్రతి జన్మలోను జ్ఞానహీనులై, నన్ను పొందలేక, ఇంకా ఇంకా అధమగతినే పొందుతారు) అని గీతలో శ్రీకృష్ణుడు పలికాడు. ఆ రీతిలో నశించకుండా కడతేఱేవారిని దేనినైనా చూపరాదా? – అని అంటే, **(శ్రుధి)** – విను. **(శ్రుత)** – బహుశ్రుతజ్ఞానాన్ని కలవాడా! నేను చెప్పబోయేదానిని వింటేనే నీ ప్రశ్నకు తగిన సమాధానం లభిస్తుంది – అని భావం. దేనిని వినాలి? అని అంటే,

**(శ్రద్ధివం తే వదామి)** – **"శ్రద్ధా"** అనబడే లక్ష్మితో కూడిన పరతత్త్వాన్నిగూర్చి నీకు తెల్పుతున్నాను. **"శ్రద్ధిః – శ్రద్ధయా – దయయా యుక్తమ్"** – శ్రద్ధతో – అంటే దయాస్వరూపిణి అయిన లక్ష్మితో కూడినవాడు **"శ్రద్ధివః"**; అటువంటివానినిగూర్చి తెల్పుతాను విను. **"శ్రద్ధయా దేవో"** ఇత్యాది శ్రద్ధాసూక్తంలోను, **"మేధా శ్రద్ధా సరస్వతీ"** (విష్ణు పు-1-9-11) అనే విష్ణు పురాణసూక్తిలోను శ్రద్ధాశబ్దంతో నిర్దేశింపబడే తత్త్వంతో కూడి ఉండే పరమపురుషునిగూర్చి తెల్పుతున్నాను. విను – అని భావం. **(శ్రుధి శ్రుత) –** చెవులున్నందుకు తగిన ఫలం లభించేటట్లుగా ఆలకించు – అని అంటున్నది, వాగ్దేవి.

**5. అహమేవ స్వయ మిదం వదామి జుష్టం దేవేభి రుత మానుషేభిః ।**
**యం కామయే తం తముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషితం సుమేధామ్॥**

దేవేభిః = దేవతల చేత, మానుషేభిః ఉత = మానవులచేత, జుష్టమ్ = ప్రీతితో సేవింపబడిన పరమాత్మనుగూర్చి, అహమ్ ఏవ = నేనే, స్వయం వదామి = నేరుగా పల్కుతాను, యం యం కామయే = ఎవనిని ఎవనిని నేను రక్షించగోరుతున్నానో, తం తం = ఆయా వ్యక్తిని, ఉగ్రం = రుద్రునిగా, కృణోమి = చేస్తున్నాను, తం = ఆయా వ్యక్తిని, బ్రహ్మాణం (కృణోమి) = బ్రహ్మగా చేస్తున్నాను, తమ్ ఋషిం (కృణోమి) = అతనిని ఋషిగా చేస్తున్నాను, తం = అతనిని, సుమేధామ్ (కృణోమి) = గొప్ప మేధస్సును కలవానినిగా చేస్తున్నాను.

బ్రహ్మ రుద్రాదులకు ఆయా పదవులను పరతత్త్వాన్ని అయిన నేనే చేస్తున్నాను – అని అంటున్నది, ఇందులో

**(అహమేవ స్వయమిదం వదామి) –** పరతత్త్వమైన నేనే దీనిని పల్కుతున్నాను. బ్రహ్మ దృష్టితో పల్కుతున్నానని తాత్పర్యం. లేక, అతనిని ప్రియమహిషి అయిన నేనే తెల్పుతున్నాను – అని కూడా భావం. దేనిని? అని అంటే,

**(జుష్టమ్ దేవేభిః ఉత మానుషేభిః)** – దేవతలచే, మానవులచే ప్రీతితో సేవింపబడే పరతత్త్వాన్ని గూర్చి పల్కుతున్నాను. **"జుషీ – ప్రీతి, సేవనయోః"** అనేది ధాతువు.

**(దేవేభిః)** – **"అహం రుద్రేభి ర్వసుభి శ్చరామి అహ మాదిత్యైః.... అశ్వినోభా"** అని ఈ సూక్తి ప్రారంభంలో చెప్పబడిన దేవతలందఱిచేత సేవింపబడే పరతత్త్వాన్ని – అని తాత్పర్యం.

**(దేవేభి రుత మానుషేభిః)** – నిత్యసూరులకు, సంసారులకు – అని కూడా భావం. **"కణ్ ఆవాన్ ఎన్రుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు"** (తిరువాయ్-1-8-3) (భూలోక వాసులకు, నిత్యసూరులకు నిత్యం నేత్రస్థానీయుడు) అని, **"వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు"** (నిత్యసూరులకు, మానవులకు గొప్ప నిధి) (నాన్ముకన్‌తిరు-45) అని దివ్యసూరులు, **"చక్షు ర్దేవానా ముత మర్త్యానామ్"** అని అంటూ సంస్కృతవేదం ఈ అర్థాన్ని సూచించింది.

ఈ విధంగా దేవతలచే, మానవులచే సేవింపబడడానికి ఏమి కారణం? అని అంటే – **(యం కామయే తం తమ్ ఉగ్రం కృణోమి తం బ్రహ్మాణమ్)** ఎవనిని రక్షించ గోరుతున్నానో, అతనిని రుద్రునిగా చేస్తున్నాను. అతనినే బ్రహ్మగా చేస్తున్నాను. **"ఉగ్ర స్థలేషు నృమ్ణః" (బహ్వృచమ్)**, **"ఉగ్రోఽసి"** (శతపథమ్) మొదలైన వేద వాక్యాలలో, **"భీమ ముగ్రం మహాదేవమ్"** (విష్ణు పురా–1–8–7) ఇత్యాది చోట్ల మహర్షులు రుద్రునకు **"ఉగ్ర"** శబ్దాన్ని రుద్రపరంగా ప్రయోగించినందున, అంతేకాక, ఈ పదం తరువాత **"తం బ్రహ్మాణమ్"** – అని బ్రహ్మను నిర్దేశించినందున ఇక్కడ ఉగ్రశబ్దాన్ని రుద్రవాచకంగా గ్రహించడమే యుక్తం.

**(తమ్ తమ్)** – అతనిని అతనిని – ఆయా వ్యక్తిని– అని అర్థం. **"తమ్ తమ్"** అని ప్రయోగించినందున **"యమ్"** అనే పదాన్ని కూడా **"యమ్ యమ్"** అని అనువృత్తి చేసికోవాలి. **"తమ్ తమ్"** అని అన్నందువల్ల అనాదికాలంగా భగవత్కృపవల్ల రుద్ర పదవిని, బ్రహ్మ పదవిని పొందినజీవులకు అంతులేదు – అని సూచింపబడింది. **"గంగాయా స్సికతా ధారా యథా వర్షతి వాసవే, శక్యా గణయితుం లోకే, న వ్యతీతాః పితామహాః"** (విష్ణుస్మృతి–20) (గంగానది లోని ఇసుక రేణువులను, ఇంద్రుడు వర్షం కురిపించేటపుడు కురిసే వర్షధారలను ఏవిధంగా లోకంలో లెక్కించడం సాధ్యం కాదో, అదేరీతిలో గడచిన బ్రహ్మల సంఖ్యనుకూడా లెక్కించడం సాధ్యం కాదు) అని విష్ణుస్మృతి దీనిని ఉపబృంహణం చేస్తుంది. **"నినైప్పాల్ పుకిల్ కడలెక్కలిన్ సుణ్ మణలిల్ పలర్ అనైత్తోర్ అకజ్ఞళుమ్ ఇవ్వులకాణ్డు కళిన్దవర్"** (తిరువాయ్‌మొళి–4–1–4) (భావించి చూస్తే – ఎంత మంది ప్రభువులు ఎన్ని యుగాలుగా ఈ లోకాలను పాలించి గతించిపోయారో, ఆ లెక్కను కట్టడం, సముద్ర రేణువుల లెక్కనువలె, సాధ్యం కాదు) అని శఠకోపసూరి అన్నారు, కూడా రుద్రునకు సైతం పరమపురుషుడే పదవులను అనుగ్రహిస్తున్నాడు – అనే విషయాన్ని ఇంకా మఱికొన్ని ఋగ్వేద మంత్రాలు తెల్పుతున్నాయి. వాటిలో రెండు గమనిద్దాం.

**అస్య దేవస్య మీఢుషో వయా విష్ణోరేషస్య ప్రభృథే హవిర్భిః ।**
**విదేహి రుద్రో రుద్రియం మహిత్వం యాసిష్ఠం వర్తి రశ్వినా విరావత్ ॥**

మీఢుషః = అభీష్టాలను వర్షించేవాడు, ఏషస్య = వేడదగినవాడు, దేవస్య = (సహజమైన) దేవుడైన, విష్ణోః = విష్ణువునకు, వయాః = శాఖవంటివాడైన (అవయవభూతుడైన), రుద్రః = రుద్రుడు, ప్రభృథే = (సర్వమేధమ్ – అనే) గొప్పయాగంలో, హవిర్భిః = (తనతో పాటుగా అన్ని) హవిస్సులను సమర్పించి, రుద్రియం = రుద్రపదవికి చెందినది అయిన, మహత్త్వం = గొప్పతనాన్ని, విదేహి = పొందాడు కదా!, అశ్వినౌ = ఓ అశ్వినీ దేవతలారా!,



ఇరావత్ = సంపదను నిండుగా కల్గిన, వర్తిః = స్థానాన్ని, యాసిష్టం = (మీరు కూడా విష్ణువుయొక్క అనుగ్రహంచేత) పొందారు.

ఈ మంత్రం ఋగ్వేదం ఏడవ మండం నలభై ఒకటవ సూక్తంలోని అయిదవ మంత్రం. ఇందులో రుద్రుడు, అశ్వినీ దేవతలు విష్ణువునుగూర్చి తపస్సు చేసి, తమతమ పదవులు పొందారని తెలుపబడుతున్నది.

**(అస్య)** – ఈ సర్వనామశబ్దానికి **"న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** అనే రీతిలో ప్రసిద్ధిని పొందినవాడు – అని భావం. ఈ విధమైన ఉన్నతుడు అధములను అనుగ్రహించడంలో ఆశ్చర్యం ఏమీ లేదని భావం.

**(దేవస్య)** – **"దివు – క్రీడా విజిగీషా వ్యవహారద్యుతి స్తుతి మోదమదస్వప్నకాంతి గతిషు"** అని తెలుపబడిన **"దివు"** ధాతువునకు కల అర్థాలన్నీ సహజంగానే పొసగే అతిశయాన్ని కల్గినవాని యొక్క – అని అర్థం. ఇందువల్లనే **"ఏకో దేవః"** అని పలు వేద వాక్యాలులోను, **"సాక్షాద్దేవః"** (నిరుపాధిక దేవుడు) అని ఇతిహాస పురాణాదులలోను కీర్తింపబడ్డాడు. ఈ రీతిలో నిరుపాధిక దేవుడైనందువల్ల సోపాధికదేవులకు వారి వారి పదవులను ఇవ్వడంలో ఆశ్చర్యం ఏమీ లేదు – అని భావం.

**(మీఢుషః)** – **"మిహ – సేచనే"** అనే ధాతువునుండి ఈ పదం పుట్టినందువల్ల, మేఘం వర్షించేటట్లే, అందఱికి అన్ని ఫలాలను వర్షించేవానియొక్క – అని అర్థం. ఈ విధంగా సకల ఫలప్రదాత అయినందువల్ల రుద్రాది దేవతలు ఇతనివద్ద ఫలాన్ని పొందడంలో ఏమీ ఆశ్చర్యం లేదు – అని భావం.

**(వయాః)** – ఇటువంటి దేవునకు శాఖవంటివాడు (రుద్రుడు) **"వయాః శాఖా"** అని యాస్కనిరుక్తం తెల్పుతున్నది. **"వృక్ష ఇవ"** అని అంటూ వృక్షంగా చెప్పబడే విష్ణువునకు రుద్రుడు శాఖవంటివాడు. తనకు అవయవభూతుడై ఉండేవాడు – అని భావం. **"స ఆత్మా, అంగాన్యన్యా దేవతాః"** (అతడు ఆత్మ, మిగిలిన దేవతలందఱు అంగభూతులు) అని తైత్తిరీయోపనిషత్తు పల్కింది. **"ఒరువన్ ఒరువనజ్గత్తు ఎన్డున్ఱుమ్ ఉళన్"** (సరోయోగి ప్రబంధం–98) (ఒకరు – అంటే – రుద్రుడు – ఒకని – అంటే – విష్ణువుయొక్క దేహంలో అంగభూతుడై ఉన్నాడు) అని సరోయోగికూడా ఈ అర్థాన్ని తెలిపారు. అవయవాన్ని పోషించని అవయవి ఉంటుందా? – అని భావం.

**(విష్ణోః వయాః)** – సర్వాత్మకుడైన విష్ణువునకు అవయవభూతుడై ఉండేవాడని భావం. **"విష్ణు స్సర్వా దేవతాః"** (ఐతరేయ బ్రాహ్మణమ్–1–1) (విష్ణువే సకలదేవాత్మకుడు)

అని వేదం పల్కుతున్నందున రుద్రుడు, అశ్వినీదేవతలు మొదలైనవారు పరబ్రహ్మ – అనే వృక్షానికి శాఖవంటివారు – అని అనటంలో లోటు లేదు. – అని సాయణులు వ్యాఖ్యానించారు.

**(ఏషస్య)** – **ఏషణీయస్య** – ప్రార్థింపదగినవానియొక్క – అని అర్థం. స్వామి, కోరినవానిని అన్నిటినీ ఇచ్చే ఉదారుడైనందున ఇతడే ప్రార్థింపదగినవాడని, ఇతనివల్ల దేవతలందఱు తమ తమ పదవులను పొందడంలో ఆశ్చర్యం లేదు – అని భావం.

ఇక, రుద్రుడు ఏవిధంగా తన పదవిని పొందాడు? అనే విషయం ఇక వివరింపబడుతున్నది.

**(ప్రభృథే)** – గొప్ప అవబృథంలో – సర్వమేథమనే యాగంలో – అని భావం.

**(హవిర్భిః) – "ఇటువంటి హవిస్సుతో"** అని విశేషించి పలుకనందువల్ల, లోకంలో హవిస్సు అని నిర్దేశింపబడే ద్రవ్యాలన్నిటితో హోమం చేసి, చివరకు తనను కూడా హోమం చేసికొన్నాడు, రుద్రుడు – అని సూచింపబడింది. ఇందువల్లనేకదా ఈ యాగం **"సర్వమేథమ్"** అని అనబడుతున్నది. **"మహాదేవ స్సర్వమేథే మహాత్మా హుత్వాఽఽత్మానం దేవదేవో బభూవ, సర్వాన్ లోకాన్ వ్యాప్య విష్టభ్య కీర్త్యా విరాజతే ద్యుతిమాన్ కృత్తివాసాః"** (భారతం – రాజధర్మం–22–12) (మహాత్ముడైన మహాదేవుడు యాగంలో తనను కూడా హోమం చేసికొని దేవదేవుడయ్యాడు. గజచర్మాన్ని ధరించి, గొప్పగా ప్రకాశించేవాడై, సకలలోకాలను తన కీర్తితో వ్యాపించేవాడే, అన్నిటిని ధరించి వెల్గుతున్నాడు) అని మహాభారతంలో ఈ వేదమంత్రం వివరింపబడింది.

**(రుద్రః రుద్రియం మహత్వం విదేహి)** ఈ కల్పంలో రుద్రుని పదవికి తగిన ఆ అతిశయాన్ని (గొప్పతనాన్ని) ఆ అరుదైన కృత్యాన్ని చేసి పొందాడు కదా! – అని భావం. లేక, **"యుగ కోటిసహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః, పున స్త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితి శుశ్రుమ"** (భారతమ్) (వేలాది కోట్ల యుగాలపాటు పద్మభవుడైన బ్రహ్మ, విష్ణువును ఆరాధించి, తిరిగి ముల్లోకాలకు ధాతగా ఉండే పదవిని పొందాడని వింటున్నాము) అనే శ్లోకంలో చెప్పబడినట్లు, బ్రహ్మవలె రుద్రుడు కూడా ఇంకొక కల్పంలో ఈ (రుద్ర) పదవిని పొందాడు కదా– అని కూడా భావం.

**(మహత్వమ్ విదేహి)** – దేవదేవుడయ్యాడు కదా – అని భావం. ఈవిధంగా రుద్రుడు పదవిని పొందడంతో మాత్రమేనా? అశ్వినీదేవతలైన మీరుకూడా విష్ణువువద్దనుండే కదా పదవిని పొందారు– అని వారిని ఉద్దేశించి ఇకపై తెలుపబడుతున్నది.



**(అశ్వినౌ)** – ఓ అశ్వినీ దేవతలారా!, **(ఇరావత్ వర్తిః విష్ణోః యాసిష్ఠం హి)** – అన్నం నిండిన స్థానాన్ని, దేవతలందఱికి వైద్యులుగా ఉండే ఐశ్వర్యం నిండిన స్థానాన్ని – అని భావం. **(యాసిష్ఠమ్)** – **"విష్ణోః యాసిష్ఠం హి"** అని అంటూ ఇక్కడ కూడా అన్వయించుకోవాలి. ఈ మంత్ర వివరణాన్ని శ్రీయామునుల గీతార్థ సంగ్రహంలోని 27వ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ పై రీతిలో వేదాంత దేశికులు తెలిపారు. ఈ రీతిలో ఈ మంత్రం ద్వారా రుద్రుడు, అశ్వినీ దేవతలు మొదలైన దేవతలు అందఱు విష్ణువు వల్లనే తమ తమ పదవులు పొందారు – అని తెలుపబడింది. ఇపుడు ఇంకొక మంత్రాన్ని గమనించండి.

**తవ శ్రియే మరుతో మర్జయంత రుద్ర యత్తే జనిమ చారు చిత్రమ్ ।**
**పదం యద్విష్ణో రుపమం నిధాయి తేన పాసి గుహ్యం నామ గోనామ్ ॥**

రుద్ర= ఓ రుద్రా!, యత్ = ఏ కారణంవల్ల, తే = నీయొక్క, జనిమ = జన్మ, చారు = అందమైనదిగా, చిత్రం = ఆశ్చర్యకరమైనదిగా, (అందువల్లనే), తవ = నీయొక్క, శ్రియే = సంపదను – ఐశ్వర్యాన్ని – పొందడంకోసం, యత్ విష్ణోః ఉపమం పదమ్ = విష్ణువుయొక్క, తనకు తానే సాటి వచ్చే ఏ శ్రీచరణం, నిధాయి = (త్రివిక్రమావతారకాలంలో) పెట్టబడినదో, (దానిని), మరుతః = దేవతలు, మర్జయంత = శోధిస్తున్నారు (అభిషేకిస్తున్నారు), తేన = ఈ విధంగా, విష్ణువును ఆరాధించి పొందిన ఐశ్వర్యాన్ని కల్గినవాడైనందున, గోనామ్ = (విష్ణువును నిర్దేశించే) శబ్దాలలో, గుహ్యం నామ = అతి రహస్యమైన నామాన్ని, పాసి = నీ మనస్సులో గుప్తంగా ఉంచుకొన్నావు.

ఇది ఋగ్వేదంలోని పంచమ మండలం మూడవ సూక్తంలోని మూడవ మంత్రం. ఇందులో విష్ణువుయొక్క శ్రీచరణాలను అభిషేకించి దేవతలు రుద్రపదవిని పొందగోరు తున్నారు – అని, ఈ విధంగా విష్ణుశ్రీచరణాన్ని సేవించి పదవిని పొందినందువల్లనే రుద్రుడు తారకమంత్రాన్ని ధరించి ఉన్నాడు – అని ఉద్ఘోషింపబడుతున్నది.

**(తవ శ్రియే)** – నీ ఐశ్వర్యాన్ని పొందటంకోసం – ఇంకొక కల్పంలో మళ్ళీ రుద్రపదవిని పొందటంకోసం – అని అర్థం. **(మరుతః మర్జయంత)** – **"మరుతః మార్జయంతి"** – దేవతలు అభిషేకిస్తున్నారు– అని అర్థం రుద్రపదవి అనేది అంతటి ఉ న్నతమైనదా? అని అంటే,

**(రుద్ర)** – ఓ రుద్రా!, **(యత్ తే జనిం చారు చిత్రమ్)** – శతపథబ్రహ్మణాదులలో వివరింపబడిన నీ జన్మ అందమైనది, ఆశ్చర్యకరమైనది అయినందున, దానిని పొందాలని దేవతలు అభిషేకిస్తున్నారు. దేనిని అభిషేకిస్తున్నారు? అని అంటే, **(పదమ్ యత్ విష్ణో రుపమం నిధాయి)** – తనకు తానే సాటి అయిన విష్ణువుయొక్క ఏ చరణం లోకాలను

కొలువడం కోసం ఉంచబడినదో, దానిని అభిషేకిస్తున్నారు. **(ఉపమమ్) – "మా విశ్వా పృథివీ"** (వైజయంతీ నిఘంటువు) అని వైజయంతీ నిఘంటువులో చెప్పబడినందున "భూమికి సమీపంలో ఉంచబడినదా!" అనే అర్థం స్ఫురించగా, ఉన్నతంగా చాచిన చరణాన్ని ఈ పదం సూచిస్తున్నదని కూడా చెప్పవచ్చు. దేవలోకాలను "భూమికి సమీపంలో" అని పల్కినందున, సులభంగా పెట్టబడిన రీతిని ఇది తెల్పుతున్నది. "దేవతలు రుద్రపదవి కోసం విష్ణు పదాన్ని అభిషేకిస్తున్నారు" అని అన్నందువల్ల, విష్ణువు చరణాన్ని అభిషేకించి నందువల్లనే రుద్రుడు తన పదవిని పొందాడని సూచింపబడింది.

**(తేన పాసి గుహ్యం నామ గోనామ్)** – ఈవిధంగా విష్ణువు పాదాన్ని, అభిషేకించి పదవిని పొందినందువల్లనే, విష్ణుభక్తులలో చాలా గొప్పవాడై, విష్ణువుయొక్క నామాలలో అతి రహస్యమైన తారకనామాన్ని అనధికారుల చెవికి సోకని రీతిలో మనస్సులో గుప్తంగా పెట్టుకొని కాపాడుతూ, తగిన అధికారులకు మాత్రం ఉపదేశిస్తున్నావు.

**(గుహ్యం నామ గోనామ్)** – భగవానుని నామాలలో అతి రహస్యమైన నామం – అని శ్రీరామ నామమనే తారక నామం చెప్పబడుతున్నది – అని వేదాంతవిజయాది గ్రంథాలలో తెలుపబడింది. రుద్రుడు తారకనామాన్ని మనస్సులో నిలుపుకొని, అధికారులకు ఉపదేశిస్తాడు – అనేది పురాణప్రసిద్ధం.

ఈ రీతిలో ఈ రెండు మంత్రాల ద్వారా రుద్రపదవి పరమపురుషుడైన విష్ణువు యొక్క అనుగ్రహంవల్ల సిద్ధిస్తున్నదని చూపబడింది. అందువల్ల **"యం కామయే త ముగ్రం కృణోమి"** అనే పూర్వోక్త సందర్భంలోకూడా ఈ అర్థం తెలుపబడినదని భావించడమే యుక్తం.

ఇక, **"అహమేవ"** ఇత్యాది అయిదవ మంత్రంలోని మిగిలిన అర్థాన్ని గమనిద్దాం.

**(యం కామయే తం బ్రహ్మాణం కృణోమి)** – రుద్రపదవి మాత్రమే కాదు, నాకు ఇష్టం ఉంటే, ఒకనిని బ్రహ్మగా కూడా చేయగలను. ఇక్కడ, త్రిమూర్తులలో, బ్రహ్మరుద్రులను మాత్రం ప్రస్తావించి విష్ణువును ప్రస్తావించనందువల్ల విష్ణువే బ్రహ్మరుద్రాదులకు పదవిని ఇచ్చే పరతత్త్వమని స్ఫుటపడుతున్నది.

**(తమ్ ఋషిమ్)** – నేను కోరితే, అతనిని వసిష్ఠాది ఋషులుగా కూడా చేయగలను.

**(తమ్ సుమేథామ్)** – నేను కోరితే, అతనిని బృహస్పతి మొదలైన గొప్ప మేథస్సును కలవారిలో ఒకనిగా చేయగలను.

ఈ రీతిలో ఈ మంత్రంలో వాగ్దేవిపతి అయిన హయగ్రీవుని అనుగ్రహంవల్ల బ్రహ్మరుద్రులు తమ తమ పదవులను పొందుతున్నారని నిర్ణయింపబడింది.



**6. అహం రుద్రాయ ధను రాతనోమి బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ ।**
**అహం జనాయ సమదం కృణోమి అహం ద్యావాపృథివీ ఆ వివేశ ॥**

అహం = నేను, రుద్రాయ = రుద్రునికోసం, బ్రహ్మద్విషే = బ్రాహ్మణులను ద్వేషించే వాడై, శరవే = హింసించేవాడై, త్రిపురవాసియైన అసురుని, హంతవా ఉ = సంహరించడం కోసం, ధనుః = వింటిని, ఆతనోమి = నారితో సంధిస్తున్నాను, అహం = నేను, జనాయ = నా దాసుల కోసం, సమదం = యుద్ధాన్ని, కృణోమి = చేస్తున్నాను, అహం = నేను, ద్యావాపృథివీ = దేవలోకాన్ని, భూమిని, ఆవివేశ = వ్యాపించాను.

రుద్రాదులు వారి వారి పదవులలో నియమించడంమాత్రమే కాదు, వారికి అంతర్యామినై నిలచి ఉండి, త్రిపురసంహారాది కార్యాలనుకూడా నడపేదానను నేనే – అని అంటున్నది, వాగ్దేవి.

**(అహం రుద్రాయ ధను రాతనోమి)** – నేనే రుద్రునకు వింటిని నారితో పూరిస్తున్నాను. సాయణభాష్యంలో కూడా ఈ అర్థమే తెలుపబడింది. **"విష్ణు రాత్మా భగవతో భవస్యామిత తేజసః, తస్మాత్ ధనుర్జ్యాసంస్పర్శం స విషేహే మహేశ్వరః"** (భారత – కర్ణపర్వం–35–50) (అంతులేని తేజస్సును కలవాడైన భగవానుడైన శివునకు విష్ణువు ఆత్మ. అందువల్లనే, వింటి నారిని సంధించడం మహేశ్వరునకు సాధ్యపడినది) అని మహాభారతంలో భగవానుడైన వ్యాసుడు ఈ మంత్రాన్ని వివరించాడు. ఎందుకోసం నారిని సంధించాడు? అని అంటే,

**(బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ)** – బ్రాహ్మణద్వేషి, హింసకుడు అయిన త్రిపురాసురుని వధించడంకోసం.

**(బ్రహ్మద్విషే)** – పరబ్రహ్మను ద్వేషించేవారిని – అని కూడా అర్థం. బ్రాహ్మణులను ద్వేషిస్తే, **"బ్రాహ్మణో మమ దేవతాః"** (బ్రాహ్మణులు నాకు దేవతలు) అనే ప్రమాణాన్నిబట్టి పరమాత్మను ద్వేషించేవారేకదా కాగలరు. బ్రహ్మశబ్దం వేదాన్నికూడా తెల్పుతుంది కనుక, వేదాన్ని ద్వేషించేవారిని – అని కూడా చెప్పవచ్చు. **(శరవే)** – హింసకుని – అని అర్థం. ద్వితీయావిభక్త్యర్థంలో చతుర్థీవిభక్తి ప్రయోగింపబడింది. **(హంత వా ఉ)** – సంహరించడంకోసం,

**(అహం జనాయ సమదం కృణోమి)** – రుద్రాదులను సాధనంగా చేసికొని, నన్ను ఆశ్రయించిన దేవతలకోసం నేనే అసురులతో యుద్ధం చేస్తాను. **"అరన్ ఎన ప్పురమ్ మూన్రు ఎరిత్తు"** (సహస్రగీతి–1–1–8) అని ఈ అర్థాన్ని శఠకోపసూరి పలికారు. **"సమానం మాద్యంతి ఇతి సమదమ్"** అనే వ్యుత్పత్తి ద్వారా యుద్ధమనే అర్థాన్ని సమిదశబ్దం ఇస్తుంది.

రుద్రాదులు ఏవిధంగా నీకు సాధనభూతులు? అని అంటే, **(అహం ద్యావా పృథివీ ఆవివేశ)** – నేనే కదా రుద్రాదులతో పాటు సమస్త లోకాన్ని వ్యాపించాను. అందువల్ల నేనే వీరిని సాధనంగా చేసికొని త్రిపుర సంహారాదులను చేశాను – అని భావం.

ఈ విధంగా ఈ మంత్రంలో, రుద్రుడు త్రిపురాలను దహించినపుడు ధనుస్సును నారితో సంధించగల్గడం పరమాత్మ అతనికి అంతర్యామియై ఉన్నందువల్లనే – అని తెలుపబడింది. ఈ అర్థం యజుర్వేదబ్రాహ్మణం ఆఱవ కాండ – రెండవ ప్రశ్నలో త్రిపురాసుర సంహారాన్ని వివరించే ప్రకరణంలో కూడా ద్రఢీకరింపబడింది.

**7. అహం సువే పితరమస్య మూర్ధన్ మమ యోని రప్స్వంతః సముద్రే ।**
**తతో వితిష్ఠే భువనాను విశ్వా తామూం ద్యాం వర్ష్మణోపస్పృశామి ॥**

అస్య = ఈ పరమాత్మయొక్క, మూర్ధన్ = శిరస్సులో, పితరం = దేవలోకాన్ని, అహం = నేను, సువే = సృష్టిస్తున్నాను, మమ యోనిః = నాకు నివాసభూతుడై ఉండే పరమాత్మ, అంతః సముద్రే = క్షీరాబ్ధిలోని, అప్సు = నీటిలో (శయనించి ఉన్నాడు), తతః= అతడు నాకు నివాసభూతుడై ఉన్నందున, విశ్వా భువనా = అన్ని లోకాలను, అనువితిష్ఠే = వ్యాపించి వెల్గుతున్నాను, ఉత= అంతేకాక, అమూంద్యాం = ఉన్నత స్థానంలో ఉండే ఈ పరమపదాన్ని, వర్ష్మణా = రూపంతో, ఉపస్పృశామి = వ్యాపిస్తున్నాను.

జగత్కారణత్వంలో తననుండే అన్వయాన్ని, తనకు గల విగ్రహవ్యాప్తినిగూర్చి వాగ్దేవి పల్కుతున్నది.

**(అహం సువే పితర మస్య మూర్ధన్) – "సమస్తశబ్దమూలత్వా దకారస్య స్వభావతః, సమస్త వాచ్యమూలత్వాత్ బ్రహ్మణోఽపి స్వభావతః, వాచ్యవాచకసంబంధః తయో రర్థాత్ ప్రతీయతే"** (సహజంగానే ఆకారం అన్ని శబ్దాలకు మూలకారణమై ఉన్నందున, సహజంగానే పరబ్రహ్మ అన్ని అర్థాలకు మూలకారణమై ఉన్నందున, ఆ ఆకారానికి, ఆ పరబ్రహ్మకు చెప్పబడే సంబంధం శబ్దార్థరూపమైన సంబంధంగా అర్థతః స్ఫురిస్తున్నది) అనే రీతిలో సర్వకారణుడై నందున అకారవాచ్యుడైన పరమాత్మయొక్క శిరస్సులో ద్యులోకాన్ని నేనే సృష్టిస్తున్నాను – అని అర్థం. **"మూర్ధన్"** – మూర్ధ్ని – తలలో అని అర్థం.

**(పితరమ్) – "ద్యౌః పితా"** అని జాతిలో చెప్పబడినందువల్ల ఈ పదం ద్యులోకాన్ని తెల్పుతున్నది.

**(అస్య మూర్ధన్ సువే) – "శిరో ద్యౌః"** అని ద్యులోకాన్ని పరబ్రహ్మయొక్క తలగా రూపించినందువల్ల ఈ విధంగా పల్కుతున్నది. లేక, ఈ భూలోకం తలలోని పైభాగంలో ద్యులోకాన్ని సృష్టిస్తున్నాను – అని కూడా అర్థం.



**(అహం సువే)** – పరమాత్మను సృష్టించేటట్లుగా ప్రేరేపిస్తున్నది కనుక, తానే సృష్టిస్తున్నట్లుగా పల్కుతున్నది. యథాశ్రుతంగా అర్థాన్ని గ్రహిస్తే ఇద్దఱు పరబ్రహ్మలను అంగీకరించవలసి వస్తుంది. ఇతరశ్రుతివిరోధం కల్గుతుంది. ప్రేరకత్వం, లీలారసంలో అన్వయించటమే ఈమెకు (వాగ్దేవికి) జగత్కారణత్వంలో ఉండే అన్వయం – అనే విషయాన్ని వేదాంత దేశికులతో పాటు శ్రీవైష్ణవపూర్వాచార్యులందఱు ఏకకంఠంగా అంగీకరించారు (ఈవిధంగానే లక్ష్మీదేవి విషయంలో కూడా జగత్కారణత్వంలోని అన్వయాన్ని అంగీకరించిన విషయం ఇక్కడ స్మరణీయం) ఏదో ఒక రీతిలో నీకు కూడా (వాగ్దేవికి కూడా) జగత్కారణత్వంలో అన్వయం ఉంటే, ఈశ్వరులు (పరబ్రహ్మలు) ఇద్దఱు కావలసి వస్తుంది కదా! అని అంటే,

**(మమ యోనిః అప్సు అంతః సముద్రే)** – నాకు నివాసస్థానంగాను, ఆధారంగాను, కారణంగాను ఉండేవాడు క్షీరాబ్ధిలోని నీటిలో శయనించి ఉండే పరమాత్మయే. నా సత్తా స్థితి ప్రవృత్తులు ఆ స్వామి అధీనాలు కనుక, ఈశ్వరద్విత్వం – అనే దోషం సంభవించదు – అని భావం.

**(అంతః సముద్రే) – "య మంతః సముద్రే కవయో వయంతి"** (ఎవనిని సముద్రంలోపల ఉండేవానినిగా జ్ఞానులు తెలిసికొంటున్నారో) అని, **"అంభస్య పారే"** అని, **"సముద్రేఽంతం నారాయణమ్"** అని నారాయణవల్లిలో చెప్పబడిన క్షీరాబ్ధినాథుడైన నారాయణుడే ఇతడు – అని చూపబడింది.

**(తతః విశ్వా భువనా వర్ష్మణో అను వితిష్ఠే)** ఆ స్వామి నాకు నివాస స్థానమైనందున నేను అన్ని లోకాలను నా దేహంతో వ్యాపించి వెల్గుతున్నాను.

**(విశ్వా భువనా) – "విశ్వాని భువనాని"** – లీలాబిభూతిలోని అన్ని లోకాలు – అని అర్థం.

**(వర్ష్మణా)** – దేహంతో – అని అర్థం. ఇది ముందు వెనుకలలో అన్వయిస్తుంది. విష్ణుపురాణాది ప్రసిద్ధమైన విగ్రహ వ్యాప్తిని ఇది తెల్పుతుంది. **"యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ, త్వయా చ విష్ణునా చాంబ ! జగద్వ్యాప్తం చరాచరమ్"** ఇత్యాదిగా లక్ష్మీదేవి యొక్క విగ్రహవ్యాప్తిని గూర్చి విష్ణుపురాణాదులలో తెలుపబడింది కదా) లీలా విభూతిలో మాత్రమేనా?

**(ఉత అమూమ్ ద్యాం వర్ష్మణా ఉపస్పృశామి)** – ఉన్నత స్థానంలో ఉండే నిత్యవిభూతిని నాతిరుమేనితో వ్యాపిస్తున్నాను. **"ఆత్మకాంత్యా విశ్వ మాప్యాయయంత్యా"** (తన తిరుమేని కాంతితో నిత్యవిభూతిని అంతటిని పోషించే లక్ష్మీదేవితో) అని భగవద్రామానుజులు శ్రీవైకుంఠ గద్యలో పలికారు.

ఈవిధంగా ఈ మంత్రంలో లక్ష్మీదేవికి జగత్కారణత్వంలో ఉండే అన్వయాన్ని గూర్చి, విగ్రహవ్యాప్తిని గూర్చి వివరింపబడింది.

**8. అహ మేవ వాత ఇవ ప్రవామి ఆరభమాణా భువనాని విశ్వా ।**
**పరో దివా పర ఏనా పృథివ్యా ఏతావతీ మహినా సంబభూవ ॥**

విశ్వా భువనాని = అన్ని లోకాలను, ఆరభమాణా అహమ్ ఏవ = సృషించడం ఆరంభించిన నేనే, వాతః ఇవ = వాయువువలె, ప్రవామి = వీస్తున్నాను, పరః దివా = ద్యులోకానికి పైన ఉన్నదానను, ఏనా పృథివ్యాః పరః = ఈ భూమిలో గొప్పదానను అయిన నేను, మహినా ఏతావతీ సంబభూవ = మహిమతో ఇటువంటి దాననై ఉన్నాను.

బ్రహ్మదృష్టితో తన స్వతంత్ర కారణత్వాన్ని, నిరతిశయ మహిమను పల్కుతూ వాగ్దేవి ఈ సూక్తాన్ని పరిసమాప్తి చేస్తున్నది. ఇందులో తెలుపబడిన మహిమ వాగ్దేవిపతి అయిన హయగ్రీవుని మహిమలో పర్యవసిస్తుందని పూర్వోక్తమే.

**(అహమేవ.... విశ్వా)** – సమస్తలోకాన్ని సృష్టించడం ఆరంభించే నేను ఇతరులచే ప్రేరేపింపబడకుండా వాయువువలె స్వేచ్ఛగా కార్యనిర్వహణను చేస్తాను. దీని వల్ల భగవానుని నిరపేక్ష కారణత్వం, అందులో వాగ్దేవి ప్రేరణం కాదనలేని ప్రార్థనా రూపమై ఉంటుందే తప్ప నియమరూపంగా ఉండదని తెలుపబడింది. **"అహమేవ"** అనే ప్రయోగం అపర్యవసానవృత్తిద్వారా "నాకు అంతర్యామి అయిన పరమాత్మయే" అనే అర్థాన్ని ఇస్తుంది. నీవు ఉండేది ఎక్కడ? – అని అంటే.

**(పరో దివా) – "దివః పరస్తాత్"** – దేవలోకానికి పైన ఉన్నదానను – అని భావం.

**(ఏనా పృథివ్యాః పరః) – "అస్యాః పృథివ్యాః పరస్తాత్"** – ఈ భూమికి పైన ఉండేదానను నేను – అని భావం.

**(ఏతావతీ మహినా సంబభూవ)** – మహిమతో నేను ఇంతవరకు పల్కిన ఈ అతిశయం అంతటిని కల్గినదాననై ఉన్నాను. అంతులేని గొప్పతనాన్ని కలదానను – అని భావం. **"ఏతావాన్ అస్య మహిమా"** అనే పురుషసూక్త ప్రయోగం స్మరణీయం.

ఈవిధంగా ఈ వాగాంభృణీసూక్తంద్వారా హయగ్రీవపత్ని అయిన వాగ్దేవి శాస్త్రదృష్టితో పరమాత్మ వైభవాన్ని తనపై ఆరోపించుకొని పల్కింది.



# ఆథర్వణీయహయగ్రీవోపనిషత్

**భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ంస స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః**

**స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।**
**స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥**

**ఓమ్ శాంతిః శాంతిః శాంతిః**

**హరిః ఓమ్. నారదో బ్రహ్మాణ ముపసమేత్యోవాచ– అధీహి భగవన్ ! బ్రహ్మవిద్యాం వరిష్ఠాం యయాఽ చిరాత్ సర్వపాపం వ్యపోహ్య బ్రహ్మవిద్యాం లబ్ధ్వైశ్వర్యవాన్ భవతి. బ్రహ్మోవాచ –**

**హయగ్రీవదైవత్యాన్ మంత్రాన్ యో వేద స శ్రుతిస్మృతీతిహాసపురాణాని వేద, స సర్వైశ్వర్యవాన్ భవతి. త ఏతే మంత్రాః.**

**విశ్వోత్తీర్ణస్వరూపాయ చిన్మయానందరూపిణే ।**
**తుభ్యం నమో హయగ్రీవ ! విద్యారాజాయ విష్ణవే ॥**
**స్వాహా, స్వాహా నమః.**

**ఋగ్యజుస్సామరూపాయ వేదాహరణకర్మణే ।**
**ప్రణవోద్గీథవపుషే మహాశ్వశిరసే నమః ॥**
**స్వాహా, స్వాహా నమః.**

**ఉద్గీథ ప్రణవోద్గీథ సర్వవాగీశ్వరేశ్వర ।**
**సర్వవేదమయాచింత్య సర్వం బోధయ బోధయ ॥**
**స్వాహా, స్వాహా నమః.**

**బ్రహ్మాఽత్రిరవిసవితృభార్గవా ఋషయః. గాయత్రీత్రిష్టుబనుష్టుప్ ఛందాగ్ంసి. శ్రీమాన్ హయగ్రీవపరమాత్మా దేవతేతి. హ్లౌ (హ్సౌ) మితి బీజమ్. సోఽహ మితి శక్తిః. హ్లూ (హ్సూ) మితి కీలకమ్. భోగమోక్షయో ర్వినియోగః. ఆకారోకారమకారై రంగన్యాసః.**

## ధ్యానమ్

శంఖచక్రమహాముద్రాపుస్తకాఢ్యం చతుర్భుజమ్ ।
సంపూర్ణచంద్రసంకాశం హయగ్రీవ ముపాస్మహే ॥

ఓమ్ శ్రీ మితి ద్వే అక్షరే. హ్లౌ (హ్సౌ) మిత్యే కాక్షరమ్. ఓం నమో భగవత ఇతి సప్తాక్షరాణి. హయగ్రీవాయేతి పంచాక్షరాణి. విష్ణవ ఇతి త్రీణ్యక్షరాణి. మహ్యం మేధాం ప్రజ్ఞా మితి షడక్షరాణి. ప్రయచ్ఛ స్వాహేతి పంచాక్షరాణి. హయగ్రీవస్య తురీయా భవతి.

ఓమ్ శ్రీ మితి ద్వే అక్షరే, హ్లౌ (హ్సౌ) మిత్యేకాక్షరమ్. ఐమ్ ఐమ్ ఐమ్ ఇతి త్రీణ్యక్షరాణి. క్లీం క్లీ మితి ద్వే అక్షరే, సౌః సౌ రితి ద్వే అక్షరే, హ్రీమితి ఏకాక్షరమ్. ఓమ్ నమో భగవత ఇతి సప్తాక్షరాణి. హయగ్రీవాయేతి పంచాక్షరాణి. మహ్యం మేధాం ప్రజ్ఞా మితి షడక్షరాణి. ప్రయచ్ఛ స్వాహేతి పంచాక్షరాణి. పంచమో మను ర్భవతి.

హయగ్రీవైకాక్షరేణ బ్రహ్మవిద్యాం ప్రవక్ష్యామి. బ్రహ్మా మహేశ్వరాయ, మహేశ్వరః సంకర్షణాయ, సంకర్షణో నారదాయ, నారదో వ్యాసాయ, వ్యాసో లోకేభ్యః. ప్రాయచ్ఛ దితి. హకారోమ్ ల (స) కారో ముకారోమ్ త్రయ మేకస్వరూపమ్ భవతి. త్రయ మేకస్వరూపం భవతి. హ్లౌమ్ బీజాక్షరం భవతి. బీజాక్షరేణ హ్లౌమ్ (హ్సౌమ్) రూపేణ తజ్జాపకానాం సంపత్సారస్వతౌ భవతః. తత్స్వరూపజ్ఞానాం వైదేహీ ముక్తి శ్చ భవతి. దిక్పాలానాం రాజ్ఞాం నాగానాం కిన్నరాణా మధిపతి ర్భవతి. హయగ్రీవైకాక్షరజపశీలాజ్ఞయా సూర్యాదయ స్వతః, స్వస్వకర్మణి ప్రవర్తంతే, సర్వేషాం బీజానాం హయగ్రీవైకాక్షరబీజ ముత్తమమ్. మంత్రరాజాత్మకం భవతి. హ్లౌమ్ (హ్సౌమ్) హయగ్రీవస్వరూపో భవతి.

అమృతం కురు కురు స్వాహా. తజ్జాపకానాం వాక్సిద్ధిః శ్రీసిద్ధి రష్టాంగయోగసిద్ధి శ్చ భవతి. హ్లౌమ్ (హ్సౌమ్) సకలసామ్రాజ్యే సిద్ధిం కురు స్వాహా. తానేతాన్ మంత్రాన్ యో వేద అపవిత్రః పవిత్రో భవతి. అబ్రహ్మచారీ సుబ్రహ్మచారీ భవతి. అగమ్యాగమనాత్ పూతో భవతి. పతితసంభాషణాత్ పూతో భవతి. బ్రహ్మహత్యాదిపాతకైః ముక్తో భవతి. గృహం గృహపతి రివ దేహీ దేహాంతే పరమాత్మానం ప్రవిశతి. ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయ మాత్మా బ్రహ్మేతి మహావాక్యైః ప్రతిపాదిత మర్థం త ఏతే మంత్రాః ప్రతిపాదయంతి. స్వరవ్యంజనభేదేన ద్విధా ఏతే



అథానుమంత్రాన్ జపతి.

యద్వాగ్వదంత్యవిచేతనాని, రాష్ట్రీ దేవానాం నిషసాద మంద్రా ।
చతస్ర ఊర్జం దుదుహే పయాంసి క్వస్వి దస్యాః పరమం జగామ ॥

గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥

ఓష్ఠా పిధానా నకులీ దంతైః పరివృతా పవిః ।
సర్వస్యై వాచ ఈశానా చారు మా మిహ వాదయే ॥

స శర్వరీ (సర్వరీ) రమృతం బాధమానా బృహన్మియాయ జమదగ్నిదత్తా ।
ఆసూర్యస్య దుహితా తతాన శ్రవోదేవేష్వమృత మజుర్యామ్ ॥

య ఇమాం బ్రహ్మవిద్యామ్ ఏకదశ్యాం పఠేత్ హయగ్రీవప్రభావేన మహాపురుషో భవతి. స జీవన్ముక్తో భవతి.

ఓం నమో బ్రహ్మణే ధారణాం మే అస్త్వనిరాకరణం ధారయితా భూయాసమ్. కర్ణయోః శ్రుతం మాచ్యోఢ్వమ్. మమాముష్య ఓమిత్యుపనిషత్.

హరిః ఓమ్

# ఆథర్వణీయహయగ్రీవోపనిషత్
## (ఆంధ్రవివరణం)

1) **భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ంస స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః ॥**

**స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।**
**స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥**

**ఓమ్ శాంతిః శాంతిః శాంతిః**

ఈ రెండు మంత్రాలు కృష్ణయజుర్వేదీయతైత్తిరీయారణ్యకవ్యాఖ్యలో సాయణాచార్యులవారిచే ఈ క్రిందివిధంగా వివరింపబడ్డాయి.

ఇంద్రాదిదేవతలారా! శ్రుతిస్మృతివాక్యరూపమైన కల్పాశాన్ని ఆచార్యాంతేవాసి రూపంలో, లేక, ఋత్విక్ యజమానిరూపంలో ఉండే మా చెవులతో మీ అనుగ్రహం వల్ల ఎల్లప్పుడు వినేవారం కాగలము. విని, యాగనిర్వహణలో సమర్థులమై, యజ్ఞాది కల్యాణ క్రియలను చక్షురింద్రియాలతో సాక్షాత్తు దర్శిస్తాము. అవికలమైన చక్షురాది హస్తాది అంగాలతో, అటువంటి శరీరాలతో కూడినవారమై మేము మీ స్తుతులను చేస్తూ, ఈకారణంవల్ల ప్రజాపతిచేత అనుగ్రహింపబడిన ఆయుశ్శేషాన్ని పొందుతాము.

మహాత్ములవల్ల సదా పురాణాలలో వినబడేవాడైన (స్తుతింపబడేవాడైన) ఇంద్రుడు మాకు అధ్యయన శ్రవణానుష్ఠానార్థకమైన క్షేమాన్ని కల్గించాలి. సమస్తాన్ని తెలిసిన (గమనిహారే) సూర్యుడు మాకు మంచిని కల్గించాలి.సర్పాలవల్ల కలిగే బాధను వారించి, రక్షించే గరుడుడు మనకు మేలును చేయాలి. బృహస్పతి మనబ్రహ్మ వర్చసును రక్షించి మనకు స్వస్తిని కల్గించాలి.

ఈ శాంతిపాఠం పలు అథర్వణవేదీయాలైన ఉపనిషత్తుల ఆరంభంలో అనుసంధింపబడుతున్నది. ప్రస్తుతం అథర్వణవేదసంహితాపాఠంలో కన్పించక పోయినా ఋగ్యజుస్సామ వేదాలలో కన్పిస్తున్నందున, పూర్వం అథర్వణవేదంలో కూడా ఇది అంతర్గతమై ఇపుడు లుప్తమై ఉండవచ్చు. ఆయా ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడే దేవతాతత్త్వానికి అనుగుణంగా ఈరెండు మంత్రాలకు అర్థాలను అనుసంధించు కోవడంలో అడ్డులేదు.



ప్రస్తుతం హయగ్రీవోపనిషత్ ఆరంభంలో ఇవి అనుసంధింప బడుతున్నవి కనుక, హయగ్రీవదేవతాపరంగా కూడా ఈక్రిందివిధంగా అర్థాన్ని సమన్వయించుకోవచ్చు.

హయగ్రీవోపాసకులైన ఓ దేవతలారా! మనం చెవులతో హయగ్రీవ ప్రతిపాదకమైన వేదాంతజాతాన్ని విందాము. ఆ శ్రవణం **"శ్రోతవ్యో మంతవ్యో నిధిధాసితవ్యో ద్రష్టవ్యః"** అనే రీతిలో మనస్సులో స్థిరంగా హయగ్రీవతత్త్వం నుంచి ఉండేటట్లుగా విందాము. ఈవిధంగా హయగ్రీవవిద్యను వినడంవల్ల యథాశాస్త్రం ధ్యాన, యజ్ఞయజన శీలురమై హయగ్రీవునకు సంబంధించిన తత్త్వాన్ని, ఆస్వామి దివ్యమంగళ రూపాన్ని నేత్రాలతో దర్శిస్తాము. అల్పాయుష్కులమైన మనకు ఆ దర్శనం లభిస్తుందా? అనే సందేహం అక్కర లేదు. భావనావైశిష్ట్యంచేత, ప్రణవగాయత్ర్యాదు లతో కూడిన హయగ్రీవ స్వామికి సంబంధించిన అంగమంత్రాలతో కూడిన అంగి మంత్రాలతో ఆ హయగ్రీవుని స్తుతించేవారమై, హయగ్రీవధ్యానానికి హితమైన, హయగ్రీవుని స్తుతించేవారమై, హయగ్రీవధ్యానానికి హితమైన, నీరోగాది (రోగాదులు లేని) గుణ విశిష్టమైన దీర్ఘమైన ఆయుస్సును పొందుదాం.

పరమైశ్వర్యాన్ని (ఉభయవిభూతులను) కలవాడు, వర్ధిల్లే కీర్తిని కలవాడు, అందఱికి జ్ఞానప్రదాయకుడు, సర్వజ్ఞుడు, హయం రూపుడు, అరిష్టాలను నశింప జేసేవాడు, వేదమంత్రప్రతిపాద్యుడైన హయగ్రీవస్వామి మనకు తన విషయంలో విశుద్ధమైన యథార్థజ్ఞానాన్ని పరభక్తి–పరజ్ఞాన – పరమ భక్తులను కల్గించాలి.

మనకు తాపత్రయ శాంతి కలగాలి.

(తార్క్ష్యశబ్దం **"తురంగగరుడౌ తార్క్ష్యః"** అనే నిఘంటువు ప్రకారం అశ్వవాచి. అందువల్ల ప్రకృతంలో హయగ్రీవవాచకంగా అన్వయించవచ్చు.)

నారదుడు బ్రహ్మను సమీపించి – "భగవాన్! ఏ విద్యవల్ల మానవుడు అన్ని పాపాలను పోగొట్టుకొని, బ్రహ్మవిద్యను పొంది, ఐశ్వర్యాన్ని కల్గినవాడవుతాడో, ఆ విద్యను నాకు బోధించు" అని ప్రార్థించాడు.

అపుడు బ్రహ్మ – "హయగ్రీవదేవతాకమంత్రాలను ఎవడు తెలిసికొంటున్నాడో, అతడు శ్రుతులను, స్మృతులను, ఇతిహాసాలను, పురాణాలను తెలిసికొన్నవాడు కాగలడు. సర్వైశ్వర్యాన్ని కలవాడు కాగలడు" అని అన్నాడు.

ఇవి ఆ మంత్రాలు–

1. **విశ్వోత్తీర్ణస్వరూపాయ చిన్మయానందరూపిణే ।**
**తుభ్యం నమో హయగ్రీవ విద్యారాజాయ విష్ణవే ॥**
**స్వాహా, స్వాహా నమః.**

(విశ్వవిలక్షణమైన స్వరూపాన్ని కలవాడవు, జ్ఞానానందరూపుడవు, సమస్త విద్యలకు ప్రభువువు అయిన ఓ హయగ్రీవా! నీకు నమస్కారం) (ఇది మొదటి మంత్రం)

2. **ఋగ్యజుస్సామరూపాయ వేదాహరణకర్మణే ।**
**ప్రణవోద్గీథవపుషే మహాశ్వశిరసే నమః ॥**
**స్వాహా, స్వాహా నమః.**

(ఋక్, యజుస్, సామలనే మూడు వేదాలను స్వరూపంగా కలవాడు, వేదాలను అన్వేషించి తెచ్చినవాడు, ప్రణవోద్గీథస్వరూపుడు, గొప్ప అశ్వశిరస్సును కలవాడైన హయగ్రీవునకు నమస్కారం) (ఇది రెండవ మంత్రం)

3. **ఉద్గీథ ప్రణవోద్గీథ సర్వవాగీశ్వరేశ్వర ।**
**సర్వవేదమయాచింత్య సర్వం బోధయ బోధయ ॥**
**స్వాహా, స్వాహా నమః.**

(ఉద్గీథ స్వరూపుడవు, ప్రణవోద్గీథరూపుడవు, సమస్త విద్యలకు అధిపతివి, అన్ని వేదాల యొక్క రూపుడవు, భావించడానికి సాధ్యం కానివాడవైన హయగ్రీవా! నాకు అన్ని విద్యలను బోధించు) (ఇది మూడవ మంత్రం)

(ఇపుడు ఈ మూడు మంత్రాలయొక్క ఋషి, ఛందస్సు మొదలైనవి తెలువబడుతున్నాయి)

బ్రహ్మ, అత్రి, రవి, సవిత, భార్గవులు – ఈ మంత్రాలకు ఋషులు. గాయత్రి, త్రిష్టుభ్, అనుష్టుభ్ – అనేవి ఛందస్సులు. లక్ష్మీసహితుడైన హయగ్రీవ పరమాత్మ – దేవత. **"హ్లౌమ్" (హ్సౌమ్)** అనేది బీజం. **"సోఽహమ్"** – అనేది శక్తి. **"హ్లూమ్" (హ్సూమ్)** అనేది కీలకం. ఈ మంత్రాలకు ఇహలోక ప్రయోజనాలలో, మోక్షసిద్ధిలో వినియోగం అకార, ఉకార, మకారాలతో అంగన్యాసాన్ని చేయాలి. ఇక హయగ్రీవ ధ్యాన శ్లోకం ఏమంటే –

**శంఖచక్రమహాముద్రాపుస్తకాఢ్యం చతుర్భుజమ్ ।**
**సంపూర్ణచంద్రసంకాశం హయగ్రీవ ముపాస్మహే ॥**

(శంఖం, చక్రం, వ్యాఖ్యానముద్ర, పుస్తకం – అనే ఈ నాల్గింటిని నాల్గు చేతులలో కలవాడు, పూర్ణచంద్రునివంటివాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.)



(ఈ విధంగా మూడు హయగ్రీవ మంత్రాలను తెల్పిన తరువాత, ఇక మఱి మూడు హయగ్రీవ మంత్రాలు ఉపాసనార్థం తెలుపబడుతున్నాయి. ఈ మంత్రాలలోని అక్షరాలు, వాటి క్రమం నిర్దేశించి తెలుపబడుతున్నాయి.)

4. **"ఓమ్ శ్రీమ్"** – అని రెండక్షరాలు. **"హ్లౌమ్" (హ్సౌమ్)** అని ఒక అక్షరం. (హకార లకారాలతో కూడుకొన్న ప్రణవం లక్ష్మీహయగ్రీవ బీజాక్షరమంత్రమని, దీనిని జపిస్తే సకల విద్యలు లభిస్తాయని, హకార సకారాలతో కూడుకొన్న ప్రణవాన్ని జపిస్తే, సకల సంపదలు లభిస్తాయని, ఇందువల్లనే ఈ రెండువిధాలైన బీజాక్షర మంత్రాలను ఏర్పడ్డాయని కొందరి పెద్దల అభిప్రాయం.) **"ఓమ్ నమో భగవతే"** – అని ఏడు అక్షరాలు. **"హయగ్రీవాయ"** అని అయిదు అక్షరాలు. **"విష్ణవే"** – అని మూడు అక్షరాలు. **"మహ్యం మేధామ్ ప్రజ్ఞామ్"** అని ఆఱు అక్షరాలు. **"ప్రయచ్ఛ స్వాహా!"** అని అయిదు అక్షరాలు. ఇది హయగ్రీవుని ఉపాసించే నాల్గవ మంత్రం.

(పై ప్రస్తారక్రమాన్ని బట్టి – **"ఓమ్ శ్రీమ్ హ్లౌమ్ (హ్సౌమ్) ఓమ్ నమో భగవతే హయగ్రీవాయ విష్ణవే మహ్యం మేధామ్ ప్రజ్ఞామ్ ప్రయచ్ఛ స్వాహా"** అనేది ఈ మంత్ర స్వరూపం. ఈ విధంగా ఈ మంత్రంలో 29 అక్షరాలున్నాయి.)

5. ఇపుడు అయిదవ హయగ్రీవ మంత్రం ప్రస్తారక్రమపూర్వకంగా తెలుపబడు తున్నది.)

**"ఓమ్ శ్రీమ్"** – అని రెండక్షరాలు. **"హ్లౌమ్" (హ్సౌమ్)** అని ఒకటే అక్షరం. **"ఐమ్ ఐమ్ ఐమ్"** – అని మూడక్షరాలు. **"క్లీమ్ క్లీమ్"** – అని రెండక్షరాలు. "సౌః సౌః" – అని రెండక్షరాలు. **"హ్లీమ్" (హ్సీమ్)** అని ఏకాక్షరం. **"ఓమ్ నమో భగవతే"** అని ఏడక్షరాలు. **"హయగ్రీవాయ"** – అని అయిదక్షరాలు. **"మహ్యం మేధామ్ ప్రజ్ఞామ్"** అని ఆఱు అక్షరాలు. **"ప్రయచ్ఛ స్వాహా"** అని అయిదక్షరాలు ఈ విధంగా ఈ మంత్రంలో ముప్పై నాల్గు అక్షరాలున్నాయి.

ఈ మంత్రం యొక్క పూర్ణమైన స్వరూపం ఏమంటే – **"ఓమ్ శ్రీమ్ హ్లౌమ్ (హ్సౌమ్) ఐమ్ ఐమ్ ఐమ్ క్లీమ్ క్లీమ్ సౌః సౌః హ్లీమ్ ఓమ్ నమో భగవతే హయగ్రీవాయ మహ్యం మేధామ్ ప్రజ్ఞామ్ ప్రయచ్ఛ స్వాహా"** అని.

6. ఇక, హయగ్రీవుని ఏకాక్షరబ్రహ్మవిద్య తెలుపబడుతున్నది. దీనిని బ్రహ్మ – మహేశ్వరునకు, మహేశ్వరుడు – సంకర్షణునకు, సంకర్షణుడు – నారదునకు, నారదుడు – వ్యాసునకు, వ్యాసుడు – లోకానికి ఉపదేశించారు. ఈ విధంగా ఇది ఆచార్యవరం పరాప్రోక్తం. సదాచార్యపరిగృహీతం. మంత్రరాజం కనుక సర్వార్థసాధకం, దాని అర్థాన్ని

అనుసంధించేవారికి శరీరసంబంధం తీరిన తరువాత వారు కోరిన ఫలాన్ని (కైవల్యార్థులకు కైవల్యాన్ని – భగవత్ప్రాప్తిని కోరిన వారికి భగవత్ప్రాప్తిని) పొందిస్తుంది.

హకార, లకార (సకార), ఉకారాలతో కూడిన ఓకారం ఈ మంత్రస్వరూపం అంటే **"హ్లౌమ్" (హ్సౌమ్)** అనేది ఈ మంత్రం. **"హకారః పరమేశః స్యాత్ తత్పదం చేతి నిశ్చితమ్, లకారః (సకారః) ఖేచరీప్రోక్తః త్వంపదం చేతి నిశ్చితమ్"** అనే శ్రుత్యనురోధంగా హకారం పరమాత్మను, లకారం (సకారం) జీవతత్త్వాన్ని తెలుపగా, అవధారణార్థకమైన ఉకారం – హకార శబ్దవాచ్యుడైన పరమాత్మకు లకార (సకార) శబ్దవాచ్యుడైన జీవవర్గం ప్రకారభూతమని – ఈ మంత్రం ద్వారా సూచింపబడిన అర్థం. ఈ అర్థమే **"తత్త్వమసి"** వాక్యార్థం. ఈ విధంగా హకార, లకార (సకార), ఉకారాలచే తెలుపబడిన అర్థాన్నే తరువాత గల **"ఓమ్"** అనే ప్రణవం ద్రఢీకరిస్తున్నది. ఈ విధంగా జీవతత్త్వం పరమాత్మకు ప్రకారభూతమని తెలిసే ఈ ఏకాక్షర బ్రహ్మవిద్యను ఉపాసించినవారికి, తదనుగుణమైన సిద్ధి కల్గుతుంది. ఆర్తులకు అర్థార్థులకు ఇహలోక ఫలాలు, జిజ్ఞాసువునకు కైవల్యం, జ్ఞానికి భగవత్ప్రాప్తి కల్గుతుంది. ఈ మంత్రాక్షరాన్ని జపించేవారికి సంపద, విద్య ప్రాప్తిస్తుంది. దీని యథార్థాన్ని తెలిసిన వారికి **"వైదేహీ ముక్తి"** – పరమపద ప్రాప్తి కల్గుతుంది. దిక్పాలకుల, త్రిరాజులు, నాగుల, కిన్నరుల అధిపతి – కాగలడు – అంటే – సర్వేశ్వరుడు కాగలడు. హయగ్రీవైకాక్షర మంత్ర జపాన్ని చేసే వానికి భయపడి, అతని ఆజ్ఞలో సూర్యుడు మొదలైనవారు తమ తమ కర్మలలో ప్రవర్తిస్తారు. బీజాక్షరమంత్రాలన్నిటిలో ఇటువంటి మహిమను కల్గినందున ఈ హయగ్రీవైకాక్షర మంత్రం గొప్పది. **"హ్లౌమ్"** (హ్సౌమ్) అనేది హయగ్రీవ స్వరూపాన్ని తెలిసే మంత్రం.

**"ఓమ్ హ్లౌమ్ (హ్సౌమ్) అమృతం కురు కురు స్వాహా"** అనే మంత్రాన్ని జపించినవారికి వాక్సిద్ధి, శ్రీసిద్ధి, అష్టాంగ యోగసిద్ధి కల్గుతుంది.

**"ఓమ్ హ్లౌమ్ (హ్సౌమ్) సకలసామ్రాజ్యేన సిద్ధిం కురు కురు స్వాహా"** అనే పదిహేడు అక్షరాలను కల మంత్రాన్ని జపిస్తే సకలసామ్రాజ్యసిద్ధి కల్గుతుంది.

ఈ విధంగా ఇంతవరకు తెల్పిన **"విశ్వోత్తీర్ణస్వరూపాయ"** ఇత్యాది మంత్రాలను తెలిసికొన్నవాడు అపవిత్రుడైనా పవిత్రుడు కాగలడు. బ్రహ్మచారి కానివాడు కూడా చక్కని బ్రహ్మచర్యాన్ని కలవాడు కాగలడు. పూర్వం పోదగని చోటికి పోయినా ఆతడు పవిత్రుడు కాగలడు. పతితునితో సంభాషించినా పవిత్రుడు కాగలడు. గృహపతి గృహాన్ని ప్రవేశించినట్లుగా, ఈ మంత్రాలను జపించినవాడు దేహావసానంలో సులభంగా పరమాత్మను చేరగలడు.



ఈ మంత్రాలన్నీ – **"ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ"** మొదలైన మహా వాక్యాలు తెలిపే అర్థాన్ని ప్రతిపాదిస్తున్నాయి. **"నమః త్వమర్థో విజ్ఞేయో రామ స్తత్పద ముచ్యతే అసీత్యర్థే చతుర్థీ స్యాదేవం మంత్రేషు యోజయేత్"** అని చెప్పబడిన రీతిలోని నమశ్శబ్దం **"తత్త్వమసి"** అనే వేదాంతవాక్యంలోని **"త్వమ్"** అనే పదంయొక్క అర్థాన్ని, **"రామ"** అనే ప్రాతిపదిక **తచ్ఛబ్దం**యొక్క అర్థాన్ని, **"ఆయ"** అనే చతుర్థీవిభక్తి ప్రత్యయం **"అసి"** అనే పదం యొక్క అర్థాన్ని తెల్పుతున్నందున **"రామాయ నమః"** అనే మంత్రం **"తత్త్వమసి"** అనే వేదాంతవాక్యార్థ ప్రతిపాదికం. ఇదే రీతిని నమశ్శబ్ద ఘటితాలైన మాలామంత్రాదులన్నిటిలో గమనించాలి.

స్వరవ్యంజన భేదంతో మంత్రసముదాయం రెండుగా విభాగింపబడింది.

ఇక ఇపుడు అనుమంత్రాలు నాల్గు జపింపబడుతున్నాయి. ఈ నాల్గు ఋగ్వేదీయ మంత్రాలు. ఇవి వాగ్దేవతావైభవాన్ని తెలిపే అర్థవాదవాక్యాలైనందున ఇక్కడ చివరలో అనుసంధింపబడుతున్నాయి. వీటిలో మొదటి మంత్రం ఋగ్వేదసంహితలోని అష్టమమండలం లోనిది. (8–100–10) తైత్తిరీయ బ్రాహ్మణంలో (2–4–6) కూడా ఉన్నది. ఇవి అన్నీ వాగ్దేవతయొక్క సంపత్ ప్రదాయకత్వాన్ని, విద్యాప్రదాయకత్వాన్ని విశదం చేస్తున్నాయి.

ఏ వాగ్దేవత అచేతన సదృశులైన మూగప్రాణులను చక్కగా మాట్లాడేటట్లు చేస్తున్నదో, సమస్తదేవతలను పాలించేదై, హృష్టురాలై, మన కర్మలన్నిటిలో ఉపవిష్టురాలై ఉన్నదో, ఏవాగ్దేవత అనుగ్రహంచేత నాల్గు దిగ్దేవతలు క్షీరాదిరసద్రవ్యాలను, జలాన్ని సంపాదిస్తున్నవో, అటువంటి ఈ వాగ్దేవతయొక్క గొప్ప స్థానాన్ని పొందడానికి ఎవడూ సమర్థుడు కాడు.

ఈ విధంగా ఈ మంత్రం వాగ్దేవతయొక్క విద్యాప్రదాయకత్వాన్ని, ఐశ్వర్య ప్రదాయకత్వాన్ని తెల్పుతున్నది.

2. (ఈ మంత్రం కూడా ఋగ్వేదీయ మంత్రమే. ఇది ప్రథమ మండలంలోనిది (1–164–41))

పరబ్రహ్మలో ప్రతిష్ఠిత అయిన, గౌరవవర్ణాన్ని కల ఈ వాగ్దేవత సృష్ట్యారంభంలో సకలసదృశాలైన వర్ణపదవాక్యాలను సృష్టిస్తున్నదై శబ్దించింది. ఏవిధంగా అంటే – మొదట ప్రణవాత్మకంగా ఏకపదియై పరబ్రహ్మ ముఖంనుండి వెలువడింది. తరువాత వ్యాహృతి, సావిత్రి రూపాలలో ద్విపది అయినది, తదనంతరం నాల్గు వేదాల రూపంలో చతుష్పది అయనది. పిదప ఆఱు వేదాంగాలు, పురాణ ధర్మశాస్త్రాలతో అష్టాపది అయినది. తరువాత, మీమాంసా, న్యాయ, సాంఖ్య, యోగ, పాంచరాత్ర, పాశుపత, ఆయుర్వేద, ధనుర్వేద,

గాంధర్వ వేదాలతో నవపది అయినది. తరువాత, అనంతవాక్య సందర్భాలతో సహస్రాక్షరియై, అనంత విద్యల రూపంగా సంపన్నమైనది.

(ఈ మంత్రంలో ఒకటి, రెండు, నాల్గు, ఎనిమిది, తొమ్మిది, వేయి అనే సంఖ్యలు నిర్దేశింపబడ్డాయి. వీటిని కలిపినపుడు 1024 అనే సంఖ్య వస్తుంది. ఈ సంఖ్యకు అనేక వైలక్షణ్యాలున్నవి. విద్యలు అఱువది నాల్గు. ప్రతి విద్యలోను 16 భాగాలు చొప్పున మొత్తం అరవైనాల్గు విద్యలలోని 1024 భాగాలు ఈ సంఖ్యచే నిర్దేశింపబడ్డాయి. సంస్కృత భాషా వ్యాకరణానుసారం అచ్చులు - 16, వర్ణాలు - 64. వీటిని గుణిస్తే వచ్చే సంఖ్య 1024.

ఈ విధంగా ఈ సంఖ్య, భాషాస్వరూపాన్ని, విద్యల స్వరూపాన్ని లక్షించడం గమనార్హం. అందువల్ల ఈ ఋక్కు వాగ్దేవతయొక్క సర్వవిద్యాప్రవర్తకత్వాన్ని తెల్పుతున్నది.)

3. ఈ మంత్రం విద్వత్స భారంజనహేతులైన మంత్రవిశేషంగా వాగ్దేవతాపరంగా ఐతరేయారణ్యక వ్యాఖ్యలో సాయణాచార్యులవారిచే వివరింప బడింది.

వేదశాస్త్రలౌకిక శబ్దరూపమైన సమస్తవాఙ్మయానికి అధిదేవతయైన వాగ్దేవత ఈ విద్వత్సభలో మాట్లేడేటట్లు, చక్కగా, అందఱి నిరంజింపచేసే విధంగా నన్ను మాట్లాడేటట్లు ప్రేరేపించాలి. ఈ వాగ్దేవత ఓష్ఠద్వయాన్ని ఆచ్ఛాదక వస్త్రంగా కల్గినది. వజ్రాలవలె గట్టిగా ఉండేవి, మధ్యలో అంతరాళం (సందు) లేనివి అయిన దంతాలతో పరివృతమైన, తీక్ష్ణమైన (ప్రతివాదులను నిరసించడంలో మిక్కిలి సమర్థమైన) వజ్రం వంటిది. ఈ వాగ్దేవత నన్ను సభలో అందఱు మెచ్చే రీతిలో నన్ను పలికించాలి.

ఈ మంత్రాన్ని పదిరోజులు నిష్ఠతో జపించిన ఉపాసకునకు మహావిష్ణువు పట్ల అనన్యమైన భక్తి సిద్ధిస్తుందని **“ఓష్ఠాపిధానా మంత్రస్య జపేద్దశదినం ప్రతి, ఏకబుద్ధి స్సదా తస్య మహావిష్ణౌ ప్రవర్తతే”** అనే శౌనకీయ ఋగ్విధానంలో తెలుపబడింది.

4. (ఈ మంత్రం ఋగ్వేదం తృతీయమండలంలోనిది. (3-53-15))

జ్వలించే అగ్నిని కల్గిన ఋషులచే (జమదగ్నులచే) అనుగ్రహింపబడినది, అజ్ఞానాన్ని నశింపజేసేది, అంతటా శబ్దరూపంలో అంతటా వ్యాపించేది అయిన వాగ్దేవత గొప్పగా ఆకాశంలో శబ్దిస్తున్నది. ఈ సూర్యుని మహిత అయిన వాగ్దేవత ఇంద్రాది దేవతలకు అక్షయమైన అమృతలక్షణమైన అన్నాన్ని అంతట విస్తరింపజేస్తున్నది.

(ఈ మంత్ర మహిమ పలుచోట్ల ఉగ్గడింపబడింది. **“వాగింద్రియ ప్రమూఢో యో న విద్యాం ప్రతిపద్యతే, ఇంద్రియార్థాన్ యథార్థాన్ వా యో న వేత్తి కథంచన, విద్యావాऽధిగతా యస్య ప్రణశ్యత పునః పునః, ససర్పరీ ఋచో జప్త్వా ద్వౌ మాసౌ ప్రతిపద్యతే”** (ఋగ్విధానం - 185) (వాగింద్రియశక్తి లేనివాడై ఎవడు విద్యను పొందలేదో, లౌకిక విషయాలను గూర్చి, యథార్థాలనుగూర్చి గాని ఎవడు తెలిసికొనలేదో, విద్యను పొందినా దానిని ఎవడు మాటిమాటికి కోల్పోతాడో (మఱచిపోతాడో) అతడు **“స సర్పరీ”** ఇత్యాది ఋక్‌ను రెండు నెలలు జపించి తిరిగి విద్యను పొందగలడు) అని ఋగ్విధానం తెల్పింది. **“నాస్తి విద్యా సమో యస్య సుయుక్తస్యాపి భార్గవ, స సర్పరీరితి జపన్ మాసాత్తం ప్రతిపద్యతే”** (**“ససర్పరీ”** అనే మంత్రాన్ని ఒక నెల జపించినవానితో విద్యలో ఎవరూ సాటిరారు) అని విష్ణు ధర్మోత్తరంలో (124-52) తెలుపబడింది.



ఈ మంత్రంలోని **“ఆసూర్యస్య దుహితమ్”** అనే ప్రయోగానికి “హయగ్రీవ రూపంలోని సూర్యునకు సంబంధించినది, యాజ్ఞవల్క్యమహర్షి కోరికను తీర్చినది” - అనే అర్థం వ్యాసభగవానునకు వివక్షతం. ఈ మంత్రం, దీని తర్వాత గల మంత్రం కూడా వాగ్దేవతాపరమే.

**“స సర్పరీర్ధ్నచే ప్రాహు రితిహాసం పురావిదః, సౌదాస నృప యజ్ఞే వై వసిష్ఠాత్మజ శక్తినా, విశ్వామిత్రస్యాభిభూతం బలం వాక్ చ సమంతతః, వసిష్ఠేనాభిభూతః న హ్యావాత్సీదథ గాధిజః, తస్మై బ్రాహ్మీం తు సౌరీం వా నామ్నా వాచం స సర్పరీమ్, సూర్యవేశ్మన ఆహృత్య దదు ర్వై జమదగ్నయః, కుశికానాం మతి స్సా వాగమతిం తామపానుదత్”** అనే అనుగీతా భాష్యంలోని సాయణాచార్యసూక్తికూడా ఇక్కడ అనుసంధేయం. (సౌదాసుడనే ప్రభువు చేసే యజ్ఞంలో విశ్వామిత్రుని శక్తి, వాక్కు కూడా వసిష్ఠకుమారుడైన శక్తిచే జయించబడ్డాయి. వశిష్ఠునివల్ల విశ్వామిత్రుడు పరాభవాన్ని పొందాడు. అపుడు విశ్వామిత్రుని ప్రార్థనవల్ల ఋషులు **“బ్రాహ్మీ”** అని, **“సౌరీ”** అని పేరును కల **“స సర్పరీ”** అనే ఋక్కును సూర్యుని నివాసంనుండి తీసికొని వచ్చి విశ్వామిత్రునకు ఇచ్చారు. కుశికుని అజ్ఞానాన్ని ఆ ఋక్ పోగొట్టి, జ్ఞానాన్ని కల్గించింది.) ఈ విధంగా ఈ ఋక్ జ్ఞానప్రదాయకం.

(హయగ్రీవోపాసనవల్ల జ్ఞానం, సంపద లభిస్తాయి. ఈ అనుమంత్రాలలో కూడా ఈ రెండు అంశాలు ప్రధానంగా ప్రతిపాదింపబడ్డాయి.)

ఈ హయగ్రీవ బ్రహ్మవిద్యను ఎవడు ఏకాదశినాడు పఠిస్తాడో, అతడు హయగ్రీవానుగ్రహాన్ని పొంది మహాపురుషుడవుతాడు. జీవన్ముక్తుడవుతాడు.

ఓ హయగ్రీవ పరమాత్మా! నీకు నమస్కారం. నీ అనుగ్రహంవల్ల ఆచార్యునివద్ద పొందిన విద్యను నేను ధరించగల్గినవాడను కావాలి. ఆ విద్యను మఱువనివాడను కావాలి. నా చెవుల ద్వారా ఆలకించిన మంచిని నేను మఱువని వాడను కావాలి. అంతేకాక, నాకు ఆముష్మికమైన విద్యాఫలం కలగాలి.

**ఇది హయగ్రీవోపనిషత్తు.**

# శ్రీహయగ్రీవ స్తోత్రమ్

## (గరుడపురాణాంతర్గతమ్)

1. ఓమ్ నమో హయశిరసే విద్యాధ్యక్షాయ వై నమః ।
నమో విద్యాధరస్వరూపాయ విద్యాదాత్రే నమో నమః ॥

2. నమః శాంతాయ దేహాయ త్రిగుణాయాత్మనే నమః ।
సురాసురనిహంత్రే చ సర్వదుష్టవినాశినే ॥

3. సర్వలోకాధిపతయే బ్రహ్మరూపాయ వై నమః ।
నమ ఈశ్వరవంద్యాయ శంఖచక్రధరాయ చ ॥

4. నమ ఆద్యాయ దాంతాయ సర్వసత్త్వహితాయ చ ।
త్రిగుణాయ గుణాయైవ బ్రహ్మవిష్ణుస్వరూపిణే ॥

5. కర్త్రే హర్త్రే సురేశాయ సర్వగాయ నమో నమః ।
ఇత్యేవం సంస్తవం కృత్వా దేవదేవం విచింతయేత్ ॥

6. హృత్పద్మవిమలే రుద్ర! శంఖచక్రగదాధరమ్ ।
సూర్యకోటిప్రతీకాశం సర్వావయవసుందరమ్ ॥

7. ఇతి తే కథితా పూజా హయగ్రీవస్య శంకర ।
యః పఠేత్ భయభక్త్యా చ స గచ్ఛేత్ పరమం పదమ్ ॥





## శ్రీవిష్ణుతిలకసంహితలోని హయగ్రీవమంత్ర వివరణ శ్లోకాలు

1. **అథ హంసమనుం వక్ష్యే భక్తిముక్తిప్రదాయకమ్ ।
యవర్గే చాష్టమే వర్గః తద్వర్గే సప్తమః పునః ॥**

2. **ప్రణవశ్చ భవేన్మంత్రో హంసైవాక్షరసంజ్ఞితః ।
హంసైకాక్షరమంత్రస్య బ్రహ్మో ఋషి రుదాహృతః ॥**

ఇహలోక – పరలోక సంపదలను కల్గించే హంసమనువు అనబడే హయగ్రీవ మంత్రాన్ని గూర్చి పల్కుతున్నాను. యవర్గంలోని ఎనిమిదవ వర్ణం అంటే – **హకారం**, ఆ వర్ణంలోని ఏడవ అక్షరం – అంటే – **సకారం** – ప్రణవం కలిపి – అంటే **'హ్సౌమ్'** – అనేది హయగ్రీవ ఏకాక్షరమంత్రం. ఈ ఏకాక్షర మంత్రానికి ఋషి **'బ్రహ్మ'**.

3. **ఛంద శ్చ దేవీ గాయత్రీ దేవతాఽస్య హయాననః ।
యవర్గే చాష్టమం బీజం తద్వర్గే సప్తమం పునః ॥**

4. **ప్రణవ శ్చ భవేచ్ఛక్తిః ప్రతీకా హంసమంత్రతః ।
సర్వదీర్ఘైః షడప్యస్య వక్ష్యే ధ్యానమితః శ్రుణు ॥**

దీని ఛందస్సు – దేవీ గాయత్రి. ఈ మంత్రానికి అధిదేవత – హయగ్రీవుడు. యవర్గలోని ఎనిమిదవ అక్షరమైన హకారం, ఏడవ అక్షరమైన సకారం ప్రణవం – అంటే **"హ్సౌమ్"** అనేది శక్తి. ప్రతీకలు – స్వరదీర్ఘాలు – ఆఱు. ఇక హయగ్రీవమూర్తి ధ్యానాన్ని గూర్చి తెల్పుతున్నాను. విను.

5. **హయగ్రీవ మహం వందే స్ఫటికాచలసన్నిభమ్ ।
చంద్రమండలమధ్యస్థం సరస్వత్యా సమన్వితమ్ ॥**

6. **వ్యాఖ్యాం చ పుస్తకం శంఖం చక్రం చ దధతం కరైః ।
మేఘగంభీరయా వాచా వ్యాఖ్యాంతం నిఖిలాగమాన్ ॥**

7. **బ్రహ్మశంకరవాగీశ భారతీవ్యాససేవితమ్ ।
ప్లావయంతం జగత్సర్వం స్వదేహోత్థామృతాంశుభిః ॥**

శుద్ధస్ఫటిక పర్వతంవింటివాడు, చంద్రమండలం మధ్యలో వేంచేసి ఉన్నవాడు, సరస్వతి అనే పేరును కల దేవేరితో కూడబడి ఉన్నవాడు, వ్యాఖ్యాసముద్ర, పుస్తకం, శంఖం, చక్రం – అనే ఈ నాల్గిటిని నాల్గు చేతులలో ధరించి ఉండేవాడు,

మేఘధ్వనివలె గంభీరమైన ధ్వనిని కల్గిన వాక్కుతో అన్ని వేదాలను వ్యాఖ్యానించేవాడు, బ్రహ్మ, శంకరుడు, బృహస్పతి, భారతీదేవి, వ్యాసుడు మొదలైనవారిచే సేవింపబడేవాడు, జగత్తును అంతటిని తన దివ్యమంగళవిగ్రహంనుండి వెలువడే అమృతకిరణాలతో చల్లగా తడిపేవాడైన హయగ్రీవుని నమస్కరిస్తున్నాను.

**8. ఏవం ధ్యాత్వా జపేన్మంత్రం లక్షత్రయ మతంద్రితః ।**
**త్రింశత్ సహస్రం జుహుయా త్తావదేవాంబుతర్పణమ్ ॥**

**9. జలతర్పణహోమాంతే స్వయం సిద్ధ్యతి మంత్రరాట్ ।**
**సిద్ధే హంసమనౌ వాణీ వాచి నృత్యతి సర్వదా ॥**

**10. అనేన మంత్రరాజేన నాసాధ్యం విద్యతే భువి ।**

ఈవిధంగా హయగ్రీవుని ధ్యానించి, మూడు లక్షలమార్లు మంత్రాన్ని సోమరితనం లేనివాడై జపించాలి. ముప్పైవేలసార్లు జపాన్ని, జలతర్పణాన్ని ఆ మంత్రంతో చేయాలి. ఈవిధంగా జలతర్పణాన్ని, హోమాన్ని చేసిన తరువాత హయగ్రీవమంత్రరాజసిద్ధి కల్గుతుంది. హయగ్రీవమంత్ర సిద్ధి కల్గినవాని జిహ్వలో సరస్వతి సదా ఉంటుంది. ఈ మంత్రరాజంతో అసాధ్యం అనేది ఏదీ లేదు.





# హయగ్రీవ కవచమ్-1

(ఈ కవచాన్ని శ్రీ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారు శ్రీలక్ష్మీహయగ్రీవ సహస్రనామస్తోత్రాది- అనే గ్రంథంలో ముద్రించారు)

### పార్వత్యువాచ - పార్వతి పల్కినది.

**1. దేవదేవ! మహాదేవ! కరుణాకర! శంకర! ।**
**త్వయా ప్రసాదశీలేన కథితాని రమాపతేః ॥**

**2. బహూనా మవతారాణా బహూని కవచాని చ ।**
**ఇదానీం శ్రోతు మిచ్ఛామి హయాస్యకవచం విభో ! ॥**

దేవదేవా! మహాదేవా! కరుణకు నిలయమైన ఓ శంకరా! సహజమైన కరుణను కల నీవు విష్ణువుయొక్క పలు అవతారాలకు చెందిన కవచస్తోత్రాలను నాకు తెలిపావు. ఇపుడు హయగ్రీవకవచాన్నిగూర్చి నేను వినగోరుతున్నాను. - అని పార్వతి శివునితో అన్నది.

### శివ ఉవాచ - అపుడు శివుడు (ఈవిధంగా) అన్నాడు.

**3. దేవి! ప్రియంవదే! తుభ్యం రహస్యమపి మత్ప్రియే! ।**
**కలశాంబుధి పీయూషం హయాస్యకవచం వదే ॥**

ప్రియంగా పలికే పార్వతీదేవీ! నీవు నాకు చాలా ప్రియమైన దానవు అయినందున, చాలా రహస్యమైనదే అయినా, పాలసముద్రంనుండి పుట్టిన అమృతంవంటి హయగ్రీవ కవచాన్ని గూర్చి పల్కుతున్నాను. విను.

**4. మహాకల్పాంతయామిన్యాం సంచరంస్తు హరిః స్వయమ్ ।**
**లీలయా హయవక్త్రాఖ్యరూప మాస్థాయ యోఽహరత్ ॥**

**5. పుత్రవాత్సల్యతో మహ్యం విరించి రుపదిష్టవాన్ ।**
**హయాస్యకవచస్యాస్య ఋషి ర్బ్రహ్మా ప్రకీర్తితః ॥**

**ఛందోఽనుష్టుప్ తథా దేవో హయగ్రీవ ఉదాహృతః ॥**

బ్రహ్మ నాపై ఉండే పుత్రవాత్సల్యం కారణంగా ఈ హయగ్రీవకవచస్తోత్రాన్ని నాకు ఉపదేశించాడు. ఈ కవచానికి ఋషి - బ్రహ్మం. ఛందస్సు - అనుష్టుప్. అధిదేవత - హయగ్రీవుడు.

**6. హ్స్రామ్ బీజం తు సమాఖ్యాతు హ్స్రామ్ శక్తిః సముదాహృతా ।**
**ఓమ్ కీలకం సమాఖ్యాత ముచ్చైరుత్కీలకం తథా ॥**

**"హ్స్రామ్"** అనేది బీజం, శక్తి కూడా. **"ఓమ్"** అనేది కీలకం.

**7. లక్ష్మీకరాంభోరుహహేమకుంభపీయూషపూరై రభిషిక్తశీర్షమ్ ।**
**వ్యాఖ్యాక్షమాలాంబుజపుస్తకాని హస్తై ర్వహంతం హయతుండ మీడే ॥**

లక్ష్మీదేవి తన కరకమలంతో బంగారుపాత్రలలోని అమృత రసధారలతో అభిషేకింప బడిన శిరస్సును కలవానినిగా, వ్యాఖ్యాసముద్ర, అక్షమాల, పద్మం, పుస్తకం – అనే వీనిని చేతులలో కలవానినిగా హయగ్రీవుని ధ్యానిస్తున్నాను – (అనేది హయగ్రీవ ధ్యాన స్వరూపం. ఇక కవచం వివరింపబడుతున్నది.)

**8. సుధాసిక్తః శిరః పాతు ఫాలం పాతు శశిప్రభః ।**
**దృశౌ రక్షతు దైత్యారిః నాసాం వాగ్జృంభవారిధిః ॥**

అమృతంతో తడుపబడిన హయగ్రీవుడు నా శిరస్సును రక్షించాలి. చంద్రకాంతివంటి కాంతిని కలవాడు ఫాలాన్ని రక్షించాలి. మధుకైటభులనే దైత్యులను వధించినవాడు నా నేత్రాలను రక్షించాలి. నాసికను వాగ్జృంభణానికి వారిధి (సముద్రం) వంటి వాడు రక్షించాలి.

**9. శ్రోత్రే పాతు స్థిరశ్రోత్రః కపోలౌ కరుణానిధిః ।**
**ముఖం పాతు గిరాం స్వామీ జిహ్వాం పాతు సురారిహృత్ ॥**

నా చెవులను స్థిరమైన శ్రోతాలను కలవాడు రక్షించాలి. కపోలాలను కరుణకు నిధి అయినవాడు రక్షించాలి. ముఖాన్ని వాక్కులకు ప్రభువు రక్షించాలి. జిహ్వను దేవతల శత్రువులను హరించినవాడు రక్షించాలి.

**10. హనూ హనూమత స్సేవ్యః కంఠం వైకుంఠనాయకః ।**
**గ్రీవాం పాతు హయగ్రీవః హృదయం కమలాకరః ॥**

దవుడలను హనుమంతునిచే సేవింపదగినవాడు రక్షించాలి. కంఠాన్ని వైకుంఠ నాయకుడు రక్షించాలి. మెడను హయగ్రీవుడు రక్షించాలి. హృదయాన్ని (వక్షస్సులో లక్ష్మిని కలవాడైన) కమలాకరుడు రక్షించాలి.

**11. ఉదరం విశ్వభృత్ పాతు నాభిః పంకజలోచనః ।**
**మేఢ్రం ప్రజాపతిః పాతు ఊరూ పాతు గదాధరః ॥**



ఉదరాన్ని విశ్వాన్ని భరించేవాడు రక్షించాలి. నాభిని పద్మనేత్రుడు రక్షించాలి. మేఢ్రాన్ని (గుహ్యాంగాన్ని) ప్రజాపతి రక్షించాలి. ఊరువులను గదాధరుడు రక్షించాలి.

**12. జానునీ విశ్వభృత్ పాతు జంఘే చ జగతాం పతిః ।**
**గుల్ఫౌ పాతు హయధ్వంసీ పాదౌ విజ్ఞానవారధిః ॥**

మోకాళ్ళను విశ్వాన్ని ధరించేవాడు రక్షించాలి. పిక్కలను జగత్తుకు ప్రభువు రక్షించాలి. మడమలను హయగ్రీవుడనే రాక్షసుని సంహరించినవాడు రక్షించాలి. పాదాలను విజ్ఞానానికి సముద్రంవంటివాడు రక్షించాలి.

**13. ప్రాచ్యాం రక్షతు వాగీశః దక్షిణస్యాం వరాయుధః ।**
**ప్రతీచ్యాం విశ్వభృత్ పాతు ఉదీచ్యాం శివవందితః ॥**

తూర్పుదిక్కులో వాక్కులకు అధిపతి రక్షించాలి. దక్షిణ దిక్కులో గొప్ప ఆయుధాలను కలవాడు రక్షించాలి. పడమటిదిక్కులో విశ్వాన్ని భరించేవాడు రక్షించాలి. ఉత్తరదిక్కులో శివునిచే నమస్కరింపబడినవాడు రక్షించాలి.

**14. ఊర్ధ్వం పాతు హరిః సాక్షాత్ అధః పాతు గుణాకరః ।**
**అంతరిక్షే హరిః పాతు విశ్వతః పాతు విశ్వసృట్ ॥**

ఊర్ధ్వదిశలో హరి సాక్షాత్తుగా రక్షించాలి. క్రింది దిశలో కల్యాణగుణాలకు ఆకరమైనవాడు రక్షించాలి. అంతరిక్షంలో హరి రక్షించాలి. నన్ను అంతటా విశ్వాన్ని సృష్టించినవాడు రక్షించాలి.

**15. య ఏతత్ కవచం ధీమాన్ సన్నహ్యేత్ నిజవిగ్రహే ।**
**దుర్వాదిరాక్షసవ్యూహైః స కదాచి న్న బాధ్యతే ॥**

ఈ కవచాన్ని ఏ బుద్ధిమంతుడు తన శరీరంలో వహిస్తాడో (ధ్యానిస్తాడో), అతడు దుర్వాదులనే రాక్షసవ్యూహాలచేత ఎపుడూ బాధింపబడడు.

**16. పఠేత్ య ఏతత్ కవచం త్రిసంధ్యం భక్తిభావతః ।**
**మూఢోఽపి గీష్పతిస్పర్ధీ జాయతే నాత్ర సంశయః ॥**

ఈ కవచాన్ని మూడు సంధ్యలలో (ప్రాతః – మాధ్యాహ్నిక – సాయం సంధ్యా సమయాలలో) భక్తితో పఠిస్తాడో, అతడు మూఢుడైనా, బృహస్పతితో పోటీపడేవాడుగా కాగలడు, సందేహం లేదు.

# హయగ్రీవ కవచమ్ - 2

**(హయగ్రీవమంత్రే, అథర్వణవేదే మంత్రఖండే పూర్వసంహితాయామ్ శ్రీహయగ్రీవ కవచమ్)**

**అస్య శ్రీహయగ్రీవకవచమహామంత్రస్య హయగ్రీవ ఋషిః అనుష్టుప్ ఛందః. శ్రీహయగ్రీవపరమాత్మా దేవతా. ఓం శ్రీం వాగీశ్వరాయ నమ ఇతి బీజమ్. ఓం క్లీం విద్యాధరాయ నమ ఇతి శక్తిః. ఓం సౌం వేదనిధయే నమ ఇతి కీలకమ్. ఓం నమో హయగ్రీవాయ శుక్లవర్ణాయ విద్యామూర్తయే ఓంకారాయాచ్యుతాయ బ్రహ్మవిద్యా ప్రదాయ స్వాహా. నమః హయగ్రీవప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.**

ఈ శ్రీహయగ్రీవకవచమనే మహామంత్రానికి హయగ్రీవుడు – ఋషి. ఛందస్సు – అనుష్టుప్. దేవత – శ్రీహయగ్రీవ పరమాత్మ. బీజం – **ఓమ్ శ్రీమ్ వాగీశ్వరాయనమః. ఓమ్ క్లీమ్ విద్యాధరాయనమః – అని శక్తి. ఓమ్ సౌమ్ వేదనిధయే – అని కీలకం. ఓమ్ నమో హయగ్రీవాయ శుక్లవర్ణాయ విద్యామూర్తయే ఓంకారాయ అచ్యుతాయ బ్రహ్మవిద్యా ప్రదాయస్వాహా నమః** – అని న్యాసం. హయగ్రీవప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః– అని వినియోగం.

## ధ్యానమ్

**కలశాంబుధిసంకాశం కమలాయతలోచనమ్ ।**
**కలానిధికృతావాసం కర్ణికాంతరవాసినమ్ ॥**

**జ్ఞానముద్రాక్షవలయశంఖచక్రలసత్కరమ్ ।**
**భూషాకిరణసందోహవిరాజితదిగందరమ్ ॥**

**వక్త్రాబ్జనిర్గతోద్దామవాణీసంతానశోభితమ్ ।**
**దేవతాసార్వభౌమం తం ధ్యాయే దిష్టార్థసిద్ధయే ॥**

పాలసముద్రంవంటివాడు, తామరలవంటి విశాలమైన నేత్రాలను కలవాడు, చంద్రమండలంలో వేంచేసి ఉండేవాడు, ఆసనపద్మంలోని కర్ణిక (మధ్యభాగంలో) ఉండేవాడు, జ్ఞానముద్రతో, అక్షమాలతో, శంఖచక్రాలతో ప్రకాశించే హస్తాలను కలవాడు, భూషణాల కిరణాల సమూహంతో ప్రకాశించే దిక్కుల మధ్యభాగాన్ని కలవాడు, ముఖ



పద్మం నుండి వెలువడే గొప్పదైన వాక్సమూహంతో శోభిల్లేవాడు, దేవతా సార్వభౌముడైన ఆ హయగ్రీవుని ఇష్టార్థసిద్ధికోసం ధ్యానించాలి.

## కవచం

1. **హయగ్రీవః శిరః పాతు లలాటం చంద్రమధ్యగః ।**
**శాస్త్రదృష్టిః దృశౌ పాతు శబ్దబ్రహ్మాత్మకః శ్రుతీ ॥**

శిరస్సును హయగ్రీవుడు రక్షించుగాక. చంద్రమండలం మధ్యలో ఉండేవాడు లలాటాన్ని రక్షించుగాక. శాస్త్రాలను దృష్టిగా కలవాడు నేత్రాలను, శబ్దబ్రహ్మాత్మకుడైనవాడు చెవులను రక్షించుగాక.

2. **ఘ్రాణం గంధాత్మకః పాతు వదనం యజ్ఞసంభవః ।**
**జిహ్వాం వాగీశ్వరః పాతు ముకుందో దంతసంహతీః ॥**

**"సర్వగంధః"** (అని స్తుతింపబడినందున) గంధాత్మకుడు ఘ్రాణాన్ని (ముక్కును) రక్షించుగాక. ముఖాన్ని యజ్ఞసంభవుడు రక్షించాలి. దంతపంక్తిని ముకుందుడు రక్షించాలి.

3. **ఓష్ఠం బ్రహ్మాత్మకః పాతు పాతు నారాయణోఽధరమ్ ।**
**శివాత్మా చిబుకం పాతు కపోలౌ కమలాప్రభుః ॥**

పై పెదవిని బ్రహ్మాత్మకుడు రక్షించాలి. కింది పెదవిని నారాయణుడు రక్షించాలి. చుబుకాన్ని శివునకు అంతర్యామియైనవాడు రక్షించాలి. కపోలాలను లక్ష్మీపతి రక్షించాలి.

4. **విద్యాత్మా పీఠకం పాతు కంఠం నాదాత్మకో మమ ।**
**భుజౌ చతుర్భుజః పాతు కరౌ దైత్యేంద్రమర్దనః ॥**

విద్యాస్వరూపుడు నా స్వరపేటికను రక్షించాలి. నాదస్వరూపుడు కంఠాన్ని రక్షించాలి. భుజాలను చతుర్భుజుడు, దైత్యుల ప్రభువులను మర్దించినవాడు చేతులను రక్షించాలి.

5. **జ్ఞానాత్మా హృదయం పాతు విశ్వాత్మా తు కుచద్వయమ్ ।**
**మధ్యమం పాతు సర్వాత్మా పాతు పీతాంబరః కటిమ్ ॥**

హృదయాన్ని జ్ఞానస్వరూపుడు రక్షించాలి. కుచద్వయాన్ని విశ్వాత్మకుడు రక్షించాలి. మధ్యభాగాన్ని, అందటికి ఆత్మయైనవాడు, నడుమును పీతాంబరుడు రక్షించాలి.

6. **కుక్షిం కుక్షిస్థవిశ్వో మే బలిభంగో వలిత్రయమ్ ।**
**నాభిం మే పద్మనాభోఽవ్యాత్ గుహ్యం గుహ్యార్థబోధకృత్ ॥**

ఉదరాన్ని ఉదరంలో విశ్వాన్ని కలవాడు రక్షించాలి. బలిని భంజించినవాడు వలిత్రయాన్ని (మధ్యభాగంలో ఉండే మూడు మడుపులను) రక్షించాలి. నాభిని పద్మనాభుడు, గుహ్యాంగాన్ని రహస్యార్థాన్ని బోధించేవాడు రక్షించాలి.

**7. ఊరూ దామోదరః పాతు పాతు జానునీ మధుసూదనః ।**
**పాతు జంఘే మహావిష్ణుః గుల్ఫౌ పాతు జనార్దనః ॥**

ఊరువులను దామోదరుడు, మోకాళ్ళను మధుసూధనుడు రక్షించాలి. పిక్కలను మహావిష్ణువు, గుల్ఫాలను (చీలమండలను) జనార్థనుడు రక్షించాలి.

**8. పాదౌ త్రివిక్రమః పాతు పాతు పాదాంగుళీహరిః ।**
**సర్వాంగం సర్వగః పాతు పాతు రోమాణి కేశవః ॥**

పాదాలను త్రివిక్రముడు, పాదాల వేళ్ళను హరి రక్షించాలి. అన్ని అంగాలను అంతట ఉండేవాడు, కేశాలను కేశవుడు రక్షించాలి.

**9. ధాతూన్ నాడీగతః పాతు భార్యాం లక్ష్మీపతి ర్మమ ।**
**పుత్రాన్ విశ్వకుటంబీ మే పాతు బంధూన్ సురేశ్వరః ॥**

ధాతువులను నాడులలో ఉండేవాడు, భార్యను లక్ష్మీపతి రక్షించాలి. పుత్రులను విశ్వకుటుంబి రక్షించాలి. బంధువులను పరులకు ప్రభువు (అయిన హయగ్రీవుడు) రక్షించాలి.

**10. మిత్రం మిత్రాత్మకః పాతు మహాత్మా శత్రుసంహతీ ।**
**ప్రాణాన్ వాయ్వాత్మకః పాతు వ్యోమాత్మా హృద్గుహాంతరమ్ ॥**

. మిత్రులను సూర్యాత్మకుడు రక్షించాలి. శత్రుసమూహంనుండి అగ్ని స్వరూపుడు రక్షించాలి. ప్రాణాలను వాయుస్వరూపుడు, ఆకాశస్వరూపుడు హృదయగుహాంతరాన్ని రక్షించాలి.

**11. దివారాత్రం హృషీకేశః పాతు సర్వం జగద్గురుః ।**
**విషమే సంకటే చైవ పాతు క్షేమంకరో హరిః ॥**

రాత్రింబగళ్ళలో హృషీకేశుడు, అన్నిటిని జగద్గురువు రక్షించాలి. విషయమైన ఆపదలనుండి క్షేమాన్ని కల్గించే హరి రక్షించాలి.



**12. సచ్చిదానందరూపో మే జ్ఞానం రక్షతు సర్వదా ।**
**ప్రాచ్యాం రక్షతు సర్వాత్మా ఆగ్నేయ్యాం జ్ఞానదీపకః ॥**

నా జ్ఞానాన్ని సదా సచ్చిదానందరూపుడు రక్షించాలి. తూర్పున ఆందటికి ఆత్మ, ఆగ్నేయదిక్కులో జ్ఞానదీపకుడు రక్షించాలి.

**13. యామ్యాం బోధప్రదః పాతు నైఋత్యాం చిద్ఘనప్రభః ।**
**విద్యానిధి స్తు వారుణ్యాం వాయవ్యాం చిన్మయోఽవతు ॥**

దక్షిణదిక్కులో బోధను కల్గించేవాడు, నైఋతిలో చైతన్యరూపంలోని గొప్ప ప్రభను కలవాడు రక్షించాలి. పడమటి దిశలో విద్యానిధి, వాయవ్యంలో చిద్రూపుడు రక్షించాలి.

**14. కౌబేర్యాం విత్తదః పాతు ఐశాన్యాం చ జగద్గురుః ।**
**ఊర్ధ్వం పాతు జగత్స్వామీ పాత్వధస్తాత్ పరాత్పరః ॥**

ఉత్తరదిక్కులో ధనాన్ని ఇచ్చేవాడు, ఈశాన్యంలో జగద్గురువు రక్షించాలి. పై దిశలో జగత్స్వామి, క్రింది దిశలో పరాత్పరుడు రక్షించాలి.

**15. రక్షాహీనం తు యత్స్థానం రక్షత్వఖిలనాయకః ।**
**ఏవం వ్యస్తశరీరోఽసౌ సాక్షాత్ వాగీశ్వరో భవేత్ ॥**

ఇంకా మిగిలిన రక్షలేని ఏ చోటును అయినా అఖిలనాయకుడు రక్షించాలి. ఈవిధంగా శరీరంలో సర్వత్ర హయగ్రీవుడు (కవచంగా) రక్షించేవాడు కావాలి.

**16. ఆయురారోగ్య మైశ్వర్యం సర్వశాస్త్రప్రవక్తృతామ్ ।**
**లభతే నాత్ర సందేహో హయగ్రీవప్రసాదతః ।**

**ఇతీదం కీర్తితం దివ్యం కవచం దేవపూజితమ్ ॥**

**ఇతి హయగ్రీవమంత్రేకాండే పూర్వసంహితాయాం**
**శ్రీహయగ్రీవకవచమ్**

ఆయుస్సు, ఆరోగ్యం, ఐశ్వర్యం, సర్వశాస్త్రాలను గొప్పగా పలుకగలిగే స్థితి హయగ్రీవానుగ్రహం వల్ల పొందుతున్నాడు. ఈ విషయంలో సందేహం లేదు.

(ఇది హయమంత్రకాండంలోని పూర్వ సంహితలోగల హయగ్రీవకవచం)

# నారదీయ మహాపురాణంలోని హయగ్రీవోపాసనా నిరూపణమ్

(నారదీయ మహాపురాణంలో పలు ఉపాసనల ప్రకారాలు తెలుపబడ్డాయి. వాటిలో హయగ్రీవోపాసన ఒకటి. ఇది పూర్వభాగం తృతీయపాదంలో 72వ అధ్యాయంలో 32వ శ్లోకం నుండి 54వ శ్లోకం వరకు 23 శ్లోకాలలో తెలుపబడింది.)

1. **ఉద్గీథ పద మారభ్య ప్రణవోద్గథశబ్దతః ।
సర్వవాగీశ్వరేత్యంతే ప్రవదేదీశ్వరేత్యథ ॥**

2. **సర్వవేదమయాచింత్య పదాంతే సర్వమీరయేత్ ।
బోధయద్వితయాంతోఽయం మంత్ర స్తారాదిరీరితః ॥**

**"ఉద్గీథ"** అనే పదం నుండి ఆరంభించి, **"ప్రణవోద్గీథ"** అనే శబ్దంవరకు, ఆ తరువాత **"సర్వవాగీశ్వర"** అనే పర్యంతం ఉచ్చరించాలి. **"సర్వవేదమయాచింత్య"** అనే పదం చివర **"సర్వ"** మనే పదాన్ని పలకాలి. తరువాత **"బోధయ బోధయ"** అనే పదాలను చివర కల్గిన ఈ మంత్రం ప్రణవాదిగా ఉచ్చరింపబడుతున్నది.

ఈ శ్లోకంలో, హయగ్రీవోపనిషత్తులో తెలుపబడిన హయగ్రీవమంత్రాలలో మూడవ మంత్రంయొక్క పదాల క్రమం నిర్దేశింపబడింది. **"ఓమ్, ఉద్గీథ! ప్రణవోద్గీథ! సర్వవాగీశ్వరేశ్వర, సర్వవేదమయాచింత్య సర్వం బోధయ బోధయ"** అనేది ఈ మంత్రం. ఇందులో ప్రణవంతోపాటు ముప్పైమూడు అక్షరాలున్నాయి. ఈ మంత్రం జపాదులలో నమశ్శబ్దఘటితంగా, తర్పణ హెూమాదులలో స్వాహాశబ్దఘటితంగా ఉచ్చరింపబడుతుంది.

3. **ఋషిః బ్రహ్మాస్య నిర్దిష్టః ఛందోఽనుష్టుప్ ఉదాహృతమ్ ।
దేవతా స్యాత్ హయగ్రీవో వాగైశ్వర్యప్రదో విభుః ॥**

ఈ మంత్రానికి ఋషి బ్రహ్మ, అనుష్టుప్ ఛందస్సు, వాక్కును, ఐశ్వర్యాన్ని అనుగ్రహించే ప్రభువైన హయగ్రీవుడు దేవత.

4. **తారేణ పాదైః మంత్రస్య పంచాంగాని ప్రకల్పయేత్**

ఇక ఈ మంత్రం ఉపాసనాప్రకారం తెలుపబడుతున్నది. ప్రణవం, మంత్రంలోని నాల్గు పాదాలు కలిపి అయిదు అంగాలను కల్పించాలి.

5. **తుషారాద్రిసమచ్ఛాయం తులసీదామభూషితమ్ ।
తురంగవదనం వందే తుంగసారస్వత ప్రదమ్ ॥**



6. **ధ్యాత్వైవం ప్రజపే న్మంత్రమయుతం తద్దశాంశతః ।
మధ్వక్తైః పాయసైర్హుత్వా విమలాదిసమన్వితే ॥**

7. **పూజయేద్వైష్ణవే పీఠేమూర్తిం సంకల్ప్య మూలతః ।**

ఇక్కడ ఉపాసనా మూర్తి (రూపం) తెలుపబడుతున్నది.

మంచుకొండవలె తెల్లని వర్ణాన్ని కలవాడు, తులసీమాలను ఆభరణంగా కలవాడు, గొప్ప సారస్వతాన్ని (గొప్ప జ్ఞానాన్ని) కల్గించేవాడైన హయగ్రీవుని త్రికరణాలతో నమస్కరిస్తున్నాను. (**"వది - అభివాదనస్తుత్యోః"**- అనే ధాత్వర్థాన్ని బట్టి **"వందే"** అనే క్రియ అభివాదనం చేయడం, స్తుతించడం - అనే కాయిక, వాచిక రూపసేవను తెలుపడం ద్వారా, ఉపలక్షణప్రక్రియలో పరిశేషన్యాయం ద్వారా మానసికమైన ధ్యానాన్ని కూడా తెల్పుతున్నది.)

ఈ విధమైన హయగ్రీవమూర్తిని ధ్యానించి, పూర్వం తెల్పిన మంత్రాన్ని పదివేలమార్లు (అయుతం) జపించాలి. ఈ సంఖ్యలో పదవ భాగం - అంటే - వేయిసార్లు తేనెతో కలిపిన పాయసాన్ని హెూమం చేయాలి.

విమలాది చామరగ్రాహిణులతో కూడిన వైష్ణవపీఠంలో ఇటువంటి హయగ్రీవమూర్తిని మూలమంత్రంతో భావన చేయాలి.

8. **కర్ణికాయాం చతుర్దిక్షు యజేత్ పూర్వాదితః క్రమాత్ ।
సనందనం చ సనకం శ్రియం చ పృథివీం తథా ॥**

కర్ణికలో లోపల నాల్గు దిక్కులలోను సనందనుని, సనకుని, లక్ష్మిని, భూదేవిని ఆవాహన చేసి పూర్వం తెల్పిన క్రమంలో పూజించాలి.

9. **తద్బహిర్దిక్షు వేదాశ్చ షట్కోణేషు తతోఽర్చయేత్ ।
నిరుక్తం జ్యోతిషం పశ్చాద్యజే ద్వ్యాకరణం తతః ॥**

10. **కల్పం శిక్షాం చ ఛందాసి వేదాంగాని త్విమాని వై ।**

ఆ కర్ణికకు బయట నాల్గు దిక్కులలో నాల్గు వేదాలను, ఆఱు కోణాలలో నిరుక్తం, జ్యోతిషం, వ్యాకరణం, కల్పం, శిక్ష, ఛందస్సు అనే షడంగాలను ఆరాధించాలి.

**11.** **తతో౨ష్టదళమూలే తు మాతరో౨ష్టౌ సమర్చయేత్ ॥**

**12.** **వక్రతుండాదికానష్టౌ దళమధ్యే ప్రపూజయేత్ ।**
**దళాగ్రేష్వర్చయేత్ పశ్చాత్ సాధకశ్చాష్ట భైరవాన్ ॥**

**13.** **అసితాంగం రురుం చైవ భీషణం రక్తనేత్రకమ్ ।**
**బటుకం కాలదమనం దంతురం వికటం తథా ॥**

తరువాత షట్కోణానికి బయట గల అష్టదళపద్మంలోని ఎనిమిది దళాల మూలలలో ఎనిమిదిమంది మాతృకలను, దళమధ్యంలో వక్రతుండాదులను పూజించాలి. దళం చివరలో అసితాంగుడు, రురుడు, భీషణుడు, రక్తనేత్రుడు, బటుకుడు, కాలదమనుడు, దంతురుడు, వికటుడు – అను ఎనిమిదిమంది భైరవులను ఆరాధించాలి.

**14.** **తద్బహిః షోడశదళేష్వవతారాన్ హరేర్దశ ।**
**శంఖం చక్రం గదా పద్మం నందకం శార్ఙ్గమేవ చ ॥**

అష్టదళపద్మానికి బయట గల షోడశదళ పద్మంలో భగవానుని పది అవతారాలను, శంఖం, చక్రం, గద, పద్మం, నందకం, శార్ఙ్గమనే ఆఱింటిని – మొత్తం ఈ పదహాఱింటిని అర్చించాలి.

**15.** **తద్బహిః భూగృహే శక్రముఖాన్ దశ దిగీశ్వరాన్ ।**
**వజ్రాద్యాన్ తద్బహిశ్చేష్ట్వా ద్వారేషు చ తతః క్రమాత్ ॥**

దానికి బయట గల భూగృహంలో ఇంద్రాది పదిమంది దిక్పాలకులను, వారికి బయట ద్వారాలలో వజ్రాదులను ఆరాధించి,

**16.** **మహాగణపతిం దుర్గాం క్షేత్రేశం బటుకం తథా ।**
**సమస్తప్రకటాద్యాశ్చ యోగిన్య స్తద్బహి ర్భవేత్ ॥**

**17.** **తద్బహిః సప్తనద్యశ్చ తద్బాహ్యేతు గ్రహాన్ నవ ।**
**తద్బాహ్యే పర్వతానష్టౌ నక్షత్రాణి చ తద్బహిః ॥**

**18.** **దీపం పంచదశావృత్యా సంపూజ్య తురగాననమ్ ।**
**వాగీశ్వర సమోవాచి ధనై ర్ధనపతిర్భవేత్ ॥**

మహాగణపతిని, దుర్గను, క్షేత్రపాలకుని, బటుకుని, సమస్తప్రకట మొదలైన యోగినులను ఆరాధించాలి. దానికి బయట ఏడు నదులు, వాటికి బయట నవగ్రహాలు, వాటికి బయట అష్ట పర్వతాలను, వాటికి బయట నక్షత్రాలను ఆరాధించాలి. ఈ విధంగా



పదిహేనుసార్లు హయగ్రీవుని ఆరాధించి వాక్కులో సాక్షాత్తు హయగ్రీవుడు కాగలడు. ఐశ్వర్యంలో కుబేరుడు కాగలడు.

**19.** **ఏవం సిద్ధే మనౌ మంత్రప్రయోగాన్ కర్తు మర్హతి ।**
**అష్టోత్తరసహస్రం తు శుద్ధవార్యభిమంత్రితమ్ ॥**

**20.** **బీజేన మాసమాత్రం యః పిబేద్ధీమాన్ జితేంద్రియః ।**
**జన్మమూకో౨పి స నరో వాక్సిద్ధిం లభతే ధ్రువమ్ ॥**

ఈ విధంగా మంత్ర సిద్ధి కల్గిన తర్వాత, మంత్ర ప్రయోగాలను చేయవచ్చును. వెయ్యి ఎనిమిది సార్లు బీజాక్షరంతో అభిమంత్రింపబడిన శుద్ధజలాన్ని పానం చేసిన వాడు జితేంద్రియుడు, ప్రట్టుమూగ అయినా వాక్సిద్ధిని పొందినవాడు కాగలడు.

**21.** **చంద్రసూర్యోపరాగే తు పాత్రే రుక్మమయే క్షిపేత్ ।**
**దుగ్ధం గవాం తతో మంత్రీ కంఠమాత్రోదకే స్థితః ॥**

**22.** **స్పర్శాద్విమోక్షపర్యంతం ప్రజపేన్మంత్రమాదరాత్ ।**
**పిబేత్ తత్సర్వ మచిరాత్తస్య సారస్వతం భవేత్ ॥**

**23.** **జ్యోతిష్మతీ లతాబీజం దినేష్వేకైకవర్ధితమ్ ।**
**అష్టోత్తరశతం యావద్భక్షయేదభిమంత్రితమ్ ॥**

**24.** **సరస్వత్యవతారో౨సౌ సత్యం స్యాద్భువి మానవః ।**
**కిం బహూక్తేన విప్రేంద్ర! మనో రస్య ప్రసాదతః ॥**

**25.** **సర్వవేదాగమాదీనాం వ్యాఖ్యాతా జ్ఞానవాన్ భవేత్ ।**

సూర్యచంద్రగ్రహణ సమయంలో బంగారు పాత్రలో పాలను పోసి, ఉపాసకుడు కంఠంలోతు నీళ్ళలో నిలచి ఉండి, గ్రహణంస్పర్శకాలం మొదలు మోక్షపర్యంతం హయగ్రీవమంత్రాన్ని భక్తితో జపించాలి. తరువాత ఆ పాలను పానం చేస్తే అతనికి గొప్ప సారస్వతం లభిస్తుంది. జ్యోతిష్మతీలతాబీజాన్ని దినానికి ఒక్కొక్కటి చొప్పున పెంచుతూ నూట ఎనిమిది దినాలు భుజిస్తే అతడు సాక్షాత్తు సరస్వతీ అవతారం కాగలడు. ఇది సత్యం. ఇంకా పలుమాటలెందుకు? విప్రేంద్రా! ఈ హయగ్రీవమంత్రప్రసాదంవల్ల అన్ని వేదాలను, ఆగమాలను వ్యాఖ్యానం చేయగల్గిన జ్ఞాని కాగలడు.

# శ్రీహయగ్రీవాష్టోత్తర శతనామ వివరణము

(ఈ అష్టోత్తర శతనామస్తోత్రం పరాశరపురాణోక్తంగా, అగస్త్య – నారద సంవాద రూపంగా ప్రసిద్ధం. ఇందులోని పలు నామాలలో ఎన్నో హయగ్రీవ తత్త్వ రహస్యాలు ఇమిడి ఉన్నాయి. నాకు తెలిసినంతలో కొన్ని నామాలకు మాత్రమే హయగ్రీవ పరంగా వివరణ ఇవ్వగలిగాను. పెద్దల సన్నిధిలో ఈ నామాల వైభవాన్ని పాఠకులు పూర్ణంగా గ్రహించగలరని మనవి.)

**1. హయగ్రీవః** – హయశిరస్సును కలవాడు

**2. మహావిష్ణుః** – మహావిష్ణుస్వరూపుడు

**3. కేశవః** – అందమైన, ప్రశస్తమైన కేశాలను – జూలును – కలవాడు. ఈవిధంగా ఈనామం ఇష్టప్రాప్తికి సూచకం.

**4. మధుసూదనః** – భక్తుల ఇంద్రియాలు తనపై నిలిచేటట్లు వశీకరించగలిగినవాడు. లేక, మధువు అనే అసురుని సంహరించినవాడు. ఈ నామం అనిష్టనివృత్తికి సూచకం.

**5. గోవిందః** – భక్తులకు అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని కల్గించేవాడైనందున వారి స్తుతివచనాలకు పాత్రమైనవాడు.లేక, మధుసూదనుడై, వేదాలను కాపాడి పొందినవాడు – అని ముందు నామంతో కలిపి అన్వయించి అర్థం చెప్పవచ్చు.

**6. పుండరీకాక్షః** – ఆ అవతారదశలోను అసాధారణ లక్షణమైన పుండరీకాక్షత్వాన్ని కలవాడు.

**7. విష్ణుః** – జగద్రూపుడై సర్వత్ర వ్యాపించి ఉండేవాడు. దీనివల్ల వ్యాపనం తెలుపబడింది.

**8. విశ్వంభరః** – విశ్వాన్ని భరించేవాడు. దీని ద్వారా భరణం తెలుపబడింది. హయశిర ఉపాఖ్యానంలో హయగ్రీవుని రూపం విశ్వతత్త్వాత్మకంగా తెలుపబడింది.

**9. హరిః** – అశ్వరూపుడు, లేక, భక్తుల ఆర్తిని తీర్చేవాడు. దీనివల్ల రక్షణం, తద్ద్వారా నియమనం తెలుపబడింది. **"హరత్వంతర్ధ్వాంతమ్"** అనే రీతిలో అజ్ఞాన నివర్తకుడు. ఉపసర్గార్థం ధాతులీనమై ఉంటుందనే క్రమంలో **"ఆహరతి సర్వాభీష్టాన్"** అనే వ్యుత్పత్తిద్వారా ఇష్టప్రాపకుడు.

**10. ఆదిత్యః** – ఆదిత్యమండలంలో హయగ్రీవరూపుడై వేంచేసి ఉండి, యాజ్ఞవల్క్యునకు వేదోపదేశాన్ని (శుక్లయజుర్వేదాన్ని) ఉపదేశించినవాడు. (లేక) **"ఆత్ గమ్యః"** – అనే వ్యుత్పత్తినిబట్టి, ఆకారం సంకర్షణ బీజమంత్రమని చెప్పబడినందున, తనకు వాచకమైన **"ఆ"** అనే వర్ణాన్ని జపించేవారిచే పొందబడేవాడని అర్థం. సంకర్షణుడు జ్ఞానబలగుణకుడు. హయగ్రీవుడు **"జ్ఞానానంద"** మయుడు కదా! హయగ్రీవుడు సంకర్షణమూర్తినుండి ఉద్భవించినట్లు విష్ణుతిలకసంహితలో తెలుపబడినది కూడా.



**11. సర్వవాగీశః** – సమస్తవాక్ప్రపంచానికి అధిపతి. **"అవ్యాకృతాత్ వ్యాకృతవానసి త్వమ్, నామాని రూపాణి చ యాని పూర్వమ్, శంసంతి తేషాం చరమాం ప్రతిష్ఠామ్ వాగీశ్వర! త్వామ్"** అని వేదాంతదేశికులు హయగ్రీవస్తోత్రంలో పలికారు. **"గోపతిః"** అనే నామాన్ని భట్టర్ **"అశేషచ్ఛందో భాషావేషవాఙ్మిర్వాహః"** అని ఘట్టం వివరిస్తూ **"వాక్పతయే – ఇతి తన్మంత్రవర్ణే"** అని హయగ్రీవ మంత్రంలోని తెలుపబడినదని కూడా అన్నారు.

**12. సర్వాధారః** – అన్నిటికి ఆధారమైనవాడు. హయగ్రీవుడు సమస్తతత్త్వజాతాన్ని ధరించిన వైనాన్ని హయశిర ఉపాఖ్యానం తెల్పింది.

**13. సనాతనః** – సర్వాధారుడు కనుక సనాతనుడు. మిక్కిలి పురాతనమైనవాడైనా, ఎప్పటికప్పుడు నూతనంగా భాసించేవాడు.

**14. నిరాధారః** – హయగ్రీవుడు తత్త్వాలకు అన్నిటికి ఆధారమైనవాడైనా, తనకు ఇంకొక ఆధారం ఏమీ లేనివాడు. **"స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"**– అని వేదం కూడా పల్కింది.

**15. నిరాకారః** – **"న తే రూపం న చాకారో"** అనే రీతిలో తనకోసంగా ఏ రూపాన్ని లేనివాడు. **"యే యథా మాం ప్రపద్యంతే తాన్ తథైవ భజామ్యహమ్", "తమరు కన్దదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే"** అనే రీతిలో భక్తులు ఆదరించిన రూపాన్నే తన రూపంగా కలవాడు.

**16. నిరీశః** – తనను శాసించే వేఱొక ఈశ్వరుని లేనివాడు. **"ఆత్మేశ్వరమ్"** – అనేవిధంగా తనకు తానే ఈశ్వరుడు.

**17. నిరుపద్రవః** – ఏ ఉపద్రవం – ఆపద – లేనివాడు.

**18. నిరంజనః** – కర్మసంబంధం లేనివాడు.

**19. నిష్కలంకః** – అచిద్గత – చిద్గతదోషాల సంబంధం ఏమీ లేనివాడు. హేయగుణ ప్రతిభటుడు.

**20. నిత్యతృప్తః** – **"వాసుదేవోఽసి పూర్ణః"** – అనే రీతిలో పూర్ణుడు కనుక, పూర్ణత్వ ప్రయుక్తమైన తృప్తిని కలవాడు. పూర్ణత లేనపుడుకదా అతృప్తి కల్గుతుంది.

**21. నిరామయః** – **"విజరో విమృత్యు ర్విశోకః"** ఇత్యాదిగా శ్రుతి పల్కిన రీతిలో ఏ రోగం లేనివాడు. **"ఆమయ"** శబ్దం జరాదులను ఉపలక్షిస్తుంది.

**22. సదానందమయః** – జ్ఞానానందస్వరూపుడు, జ్ఞానానందాలను గుణంగా కలవాడు. **"జ్ఞానానందమయం దేవమ్"** అని కదా హయగ్రీవ ధ్యానం.

**23. సాక్షీ** – భక్తుల యోగక్షేమాలను సాక్షాత్తుగా చూచేవాడు, ఇంద్రియ సహకారం లేకుండానే జగత్తులోని సర్వవ్యాపారాలను సాక్షాత్తు చూచేవాడు, తన భక్తులకు జ్ఞానానందాలను కల్గించి, వారు ఆనందిస్తూ ఉండగా తృప్తిగా వారిని చూచేవాడు.

**24. శరణ్యమ్** – ఏ తారతమ్యం లేకుండా అందఱికి గొప్ప రక్షకుడు.

**25. సర్వదాయకః** – అందఱికి అన్ని అభీష్టాలను ఇచ్చేవాడు.

**26. శ్రీమాన్** – ఆ విధంగా సర్వాభీష్టప్రదాయకత్వానికి మూలమైన, నిత్యమైన లక్ష్మీసంబంధాన్ని కలవాడు.

**27. లోకత్రయాధీశః** – ముల్లోకాలకు ప్రభువు. లక్ష్మీపతిత్వప్రయుక్తమైన లోకత్రయాధిపత్యాన్ని కలవాడు.

**28. శివః** – శుభకరుడు. **"మంగళాయతనం హరిః"** అని ప్రమాణం. ముల్లోకాలలోని బుభుక్షు – ముముక్షువులకు అందఱికి శుభాన్ని ఇచ్చేవాడు. **"శివ శ్శివానామ్"** అని మహాభారతవచనం.

**29. సారస్వతప్రదః** – **"తుంగసారస్వతప్రదమ్"** అని హయగ్రీవ ధ్యానశ్లోకసూక్తి.

**30. వేదోద్ధర్తా** – వేదాలను ఉద్ధరించినవాడు **"వేదాహరణకర్మణే"** అని ధ్యాన ప్రకారం.

**31. వేదనిధిః** – వేదాలలో గుప్తంగా ఉండే నిధి వంటివాడు.

**32. వేదవేద్యః** – **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"** అనే రీతిలో వేదాలచే తెలియదగిన వాడు. **"శాస్త్రయోనిత్వాత్"** అనే బ్రహ్మసూత్రం, **"న చక్షుషా గృహ్యతే నాపి వాచా"** అనే శ్రుతి పరమాత్మ వేదాలచేతనే తెలియదగినవాడని, బాహ్యేంద్రియ జ్ఞానానికి విషయం కాడని తెల్పినది.

**33. ప్రభృత్తమః** – ప్రకృష్టంగా భారాన్ని మోసేవారిలో గొప్పవాడు. భరణమనేది భగవానుని ప్రధానలక్షణాలలో ఒకటి.

**34. పూర్ణః** – భక్తులు భక్తితో దేనిని సమర్పించినా భగవానుడు ప్రీతితో స్వీకరిస్తాడు. దానికి కారణం అతని అవాప్తసమస్త కామత్వమే. **"అవాకీ అనాదరః"** అని అంటూ వేదం కూడా భగవానుని పూర్ణత్వాన్ని సూచించింది. ఏ విషయంపట్ల ఆసక్తి లేకపోవడం, **"అన్యత్ పూర్ణాదపాం కుంభాత్ అన్యత్ పాదావనే జనాత్, అన్యత్ కుశల సంప్రశ్నాత్ న చేచ్ఛతి జనార్దనః"** అనే విధంగా ఏ స్వల్పద్రవ్యాన్ని అయినా ప్రీతితో స్వీకరించడం రెండు పూర్ణత్వసూచనలు.



**35. పూరయితా** – తాను పూర్ణుడైతే, ఇతర దేవతలవలె భక్తులు చేసే స్తుతులను ఎందుకు కోరుతున్నాడు? అంటే, ఆ భక్తుల స్తుతించాలనే వారి కోరికను తీర్చడం కోసమే. ఆ రీతిలో వారి కోరికలను తీర్చేవాడు కనుక పూరయిత.

**36. పుణ్యః** – తనను స్తుతించేవారు పూర్వం ఎంత పాపిష్ఠివారైనా వారిని తన సంబంధంతో పవిత్రులను చేసి అర్హతను కల్గించేవాడు.

**37. పుణ్యకీర్తిః** – పుణ్యమైన నామసంకీర్తనాన్ని కలవాడు. **"సాంకేత్యం పారిహాస్యం చ స్తోభం హేళన మేవ వా, వైకుంఠనామగ్రహణ మశేషాఘనాశకమ్"** అనే రీతిలో పవిత్రాన్ని చేసే నామసంకీర్తనాన్ని కలవాడు. **"అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః, పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రస్తైః మృగైరివ"** ఇత్యాది ప్రమాణాలు కూడా స్మరణీయాలు.

**38. పరాత్పరః** – పరులైన – ఉత్కృష్టులైన – నిత్యముక్తుల కంటే గొప్పవాడు.

**39. పరమాత్మా** – సమస్త భూతాలు ఈ భగవానునివల్ల ఆత్మను (తమ లోపల ప్రవేశించి నిలచి, నియామకుడై ఉండేవానిని) కల్గినవి అవుతున్నవి కనుక ఇతడు పరమాత్మ.

**40. పరం జ్యోతిః** – **"తస్య భాసా సర్వ మిదం విభాతి"** అనే రీతిలో జ్యోతులన్నిటిలో గొప్ప జ్యోతిస్సు.

**41. పరేశః** – ఉత్కృష్టుడైన నియామకుడు. లోకంలో లోపల వ్యాపించి ఉండేవాడు నియామకుడు కాడు, నియామకుడు వ్యాపకుడు కాడు. వ్యాపనాన్ని, ఈశనాన్ని రెండిటిని కల్గినవాడు కనుక పరేశుడు. పరశబ్దవాక్యులైన నిత్యులను, ముక్తులను కూడా నియమించేవాడు.

**42. పారగః** – దేశకాలవస్త్వాదిగా అన్నివిధాలైన అవధులను అతిక్రమించి ఉండేవాడు.

**43. పరః** – అందువల్లనే చాలా గొప్పవాడు.

**44. సర్వవేదాత్మకః** – **"సర్వే వేదాః సర్వయజ్ఞా శ్చ కృష్ణః"** అనే రీతిలో సమస్త వేదస్వరూపుడు, హయగ్రీవుడు. **"ఋగ్యజుస్సామరూపాయ"** అని హయగ్రీవానుష్టుభ్ మంత్రం తెల్పినది.

**45. విద్వాన్** – అన్ని కాలాలలోను అన్నిటియొక్క అన్ని విధాలైన జ్ఞానాన్ని కలవాడు. **"యో వేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః"** అనే రీతిలో సార్వపథీనమైన జ్ఞానాన్ని కలవాడు.

**46. వేదాంతపారగః** – వేదాంతాల పారాన్ని – అవధిని దాటిన వాడు. **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అని వేదం తెల్పింది.

**47. సకలోపనిషద్వేద్యః** – అన్ని ఉపనిషత్తులచే వేద్యమైనవాడు. **"వేదై శ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్"** అని అంటూ సర్వ వేదాంత ప్రతిపాద్యుడు తానేనని భగవానుడే తెలిపాడు.

**48. నిష్కలః** – **"నిష్కలమ్ నిష్క్రియమ్ శాంతమ్ నిరవద్యం నిరంజనమ్"** అని వేదం చెప్పిన రీతిలో నిష్కలుడు.

**49. సర్వశాస్త్రవిత్** – సమస్తశాస్త్రాలను తెలిసినవాడు. హయగ్రీవుడు. సకలవిద్యా ప్రవర్తనుడు. **"విద్ల్–లాభే"** అనే ధాతువును అనుసరించి పుట్టిన పదంగా **"విత్"** అనే దానిని భావిస్తే, సర్వశాస్త్రాలచే ప్రతిపాద్యుడుగా పొందబడేవాడని భావం.

**50. అక్షమాలాజ్ఞానముద్రాయుక్త హస్తః** – అక్షమాలికను, వ్యాఖ్యానముద్రను తన చేతులలో కలవాడు. **"వ్యాఖ్యాముద్రామ్"** ఇత్యాది హయగ్రీవ ధ్యానశ్లోకం భావ్యం.

**51. వరప్రదః** – వరప్రదాత. (లేక) వరమైన – శ్రేష్ఠమైన ముక్తిని అనుగ్రహించేవాడు.

**52. పురాణః** – **"పురా అపి నవః"** – ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా భాసించేవాడు.

**53. పురుషశ్రేష్ఠః** – **"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః"** అనే రీతిలో పురుషులలో గొప్పవాడు.

**54. శరణ్యః** – ఉత్తముడైన రక్షకుడు. **"శ్రూ–హింసాయామ్"** అనే ధాతువు నుండి పుట్టిన శరణశబ్దం, పాపాలను నివర్తింపజేసేవాడనే అర్థాన్ని తెల్పుతుంది. అటువంటి పాపనివర్తములలో గొప్పవాడు – అని అర్థం. లేక, **"శరణం గృహరక్షిత్రోః"** అనే నిఘంటువు వచనాన్ని బట్టి, భక్తులకు గొప్ప అపాశ్రయం – నివాసస్థానమని అర్థం. మొదట తెలుపబడిన అర్థం ప్రాపకత్వాన్ని, రెండవ అర్థం ప్రాప్యత్వాన్ని తెల్పుతున్నది.

**55. పరమేశ్వరః** – ఉభయవిభూతిరూపమైన పరమైశ్వర్యాన్ని కలవాడు.

**56. శాంతః** – నిస్తరంగసముద్రం వలె, ఊర్మిషట్కం (కామక్రోధాది అరిషడ్వర్గం) లేనివాడు. పరమాత్మ శాంతస్వభావాన్ని కలవాడే కాక, అతని సామీప్యంలో ఉన్నవారు కూడా అటువంటి శాంతిని పొందుతున్నారు కదా! ఇది భగవానుని శాంతత్వపరాకాష్ఠ.

**57. దాంతః** – శత్రువులను అణిచే శక్తిని కలవాడు.

**58. జితక్రోధః** – క్రోధాన్ని జయించినవాడు – అనియేకాక **"జితాః క్రోధాః యేన సః"** అనే వివరణాన్నిబట్టి తనను ధ్యానించే భక్తుల మనస్సులలో క్రోధాది దోషాలను పోగొట్టేవాడని కూడా అర్థం. క్రోధశబ్దం మిగిలిన వానిని లక్షిస్తుంది.



**59. జితామిత్రః** – భక్తుల శత్రువులను జయించినవాడు.

**60. జగన్మయః** – జగద్రూపుడు.**"సర్వం విష్ణుమయం జగత్"** అని, **"తత్సర్వం వై హరే స్తనుః"** అని, **"ఐతదాత్మ్యమిదం సర్వమ్"** – అని ఇత్యాదిగా గల ప్రమాణాలు స్మరణీయాలు.

**61. జన్మమృత్యుహరః** – జన్మమృత్యురూపమైన సంసారాన్ని హరించేవాడు.

**62. జీవః** – **"జీవయతీతి జీవః"** – భక్తులను ఆత్మనాశం నుండి నివర్తింపజేసి, తన సేవను అనుగ్రహించి ఉజ్జీవింపజేసేవాడు. **"ఆనందమూర్తి ర్భగవాన్ హరి స్త్రైలోక్య పూజితః, ద్రష్టుం న సహతే దేవి! క్లిష్టాన్ స్వపరిచారకాన్"** అని అంటూ భట్టర్ **"జీవః"** అనే నామ వివరణలో తెల్పిన ప్రమాణం ఇక్కడ కూడా స్మరణీయం.

**63. జయదః** – జయాన్ని ఇచ్చేవాడు.

**64. జాడ్యనాశనః** – దానికి ఆవశ్యకమైన జాడ్యాన్ని – మనో వికారాలను పోగొట్టేవాడు.

**65. జనప్రియః** – భక్తజనులకు ప్రియుడు. భక్తులను ప్రియులుగా కలవాడు. **"భక్తాస్తేఽ తీవ మే ప్రియాః"** అని భగవదుక్తి.

**66. జనస్తుత్యః** – భక్తజనులకు స్తుతించడానికి సాధ్యమైనవాడు. తననే అనన్యంగా కొలిచేవారికి కరుణతో తన వైభవాన్ని సమగ్రంగా దర్శింపజేస్తాడు. కనుక, వారికి స్తుతించడానికి సాధ్యమైనవాడు.

**67. జాపకప్రియకృత్** – తన మంత్రాన్ని జపించేవానికి ప్రియాన్ని చేసేవాడు.

**68. ప్రభుః** – ఈవిధంగా ఉపాసనలకు ప్రియాన్ని అనుగ్రహించి, తన అలౌకిక సౌందర్యంతో వారిని వశం చేసికొని, జ్ఞానిదశను పొందించగల సమర్థుడు.

**69. విమలః** – దోషరహితుడు. స్వచ్ఛమైన ఆకారాన్ని, స్వభావాన్ని కలవాడు. **"నిర్మల స్ఫటికాకృతిమ్"** అని ధ్యానస్వరూపక్రమం.

**70. విశ్వరూపః** – విశ్వాన్ని తన రూపంగా కలవాడు. హయగ్రీవావిర్భావసందర్భంలో ఈ విషయం వ్యక్తం.

**71. విశ్వగోప్తా** – విశ్వాన్ని రక్షించేవాడు. లేక, సమస్త విద్యారూపమైన వేదాన్ని రక్షించేవాడని అర్థం. **"గోప్తా"** అనే హయగ్రీవావతార పరమైన నామానికి పరాశరభట్టర్ ఈ అర్థాన్నే తెలిపారు.

**72. విధిస్తుతః** – బ్రహ్మచే స్తుతింపబడినవాడు. వేదాలను రక్షించిన భగవానుని బ్రహ్మ స్తుతించిన సందర్భాన్ని ఈ నామం సూచిస్తున్నది.

**73. విధీంద్ర శివసంస్తుత్యః** – బ్రహ్మాశివేంద్రాదులచే స్తుతింపదగినవాడు. **"బ్రహ్మశంకర వాగీశభారతీవ్యాససేవితమ్"** అని విష్ణుతిలక సంహితలోని ధ్యానశ్లోకంలోని సూక్తి స్మరణీయం.

**74. శాంతిదః** – ఆరాధించేవారికి శాంతిని ఇచ్చేవాడు. తనను ధ్యానించే వారికి **"మత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్"** అని గీతలోను, **"తమీశానం వరదం దేవమీడ్యమ్... నిచాయ్యాత్మానం శాంతి మత్యంతమేతి"** అని శ్వేతాశ్వతరోపనిషత్తులోను చెప్పబడిన రీతిలో శాంతిరూపమైన మోక్షాన్ని ఇచ్చేవాడు.

**75. శాంతిపారగః** – శాంతియొక్క పరమావధిచేత పొందబడేవాడు. అనన్యభక్తి చేత పొందబడేవాడు.

**76. శ్రేయఃప్రదః** – శ్రేయోరూపమైన పరమపురుషార్థాన్ని ఇచ్చేవాడు.

**77. శ్రుతిమయః** – **"ఋగ్యజుస్సామవపుషే"** అని కీర్తింపబడే రీతిలో వేదమయుడు.

**78. శ్రేయసాం పతిః** – శ్రేయస్సులకు అన్నిటికి అధిపతి.

**79. ఈశ్వరః** – అప్రతిహతమైన స్వేచ్ఛను కలవాడు. **ఈశనమ్** – ఈశ్వరత్వం షాడ్గణ్యంలో ఒకటికదా.

**80. అచ్యుతః** – అవతారాలను ఎత్తినా తన మహిమలో చ్యుతిలేనివాడు. ప్రపన్నులను విడువనివాడు. హయగ్రీవ కవచంలోని న్యాసంలో **"ఓంకారాయ అచ్యుతాయ"** అని ఈ నామంతో ఘటితమై ఉండటం గమనించదగినది.

**81. అనంతరూపః** – సాధుపరిత్రాణం కోసం, దుష్కృద్వినాశంకోసం, ధర్మసంస్థాపన కోసం ఎత్తిన లెక్కలేనన్ని రూపాలను కలవాడు.

**82. ప్రాణదః** – ఈవిధంగా పరిగ్రహించిన అవతారరూపాలను పెక్కింటిని **"య ఆత్మదా బలదాః"** అని, **"సదైవ ప్రాణః ఆవిశతి"** అని చెప్పబడిన రీతిలో అనుభవించడానికి తగిన శక్తిని భక్తులకు ఇచ్చేవాడు.

**83. పృథివీపతిః** – **"నరాణాం చ నరాధిపమ్"** అనే రీతిలో మానవులలో భూమిని శాసించే ప్రభువులో విశిష్టాధిష్ఠానాన్ని కలవాడు.

**84. అవ్యక్తః** – ఈవిధంగా ఉండే తేజస్సుయొక్క విశేషాంశను అవ్యక్తంగా కలవాడు. లేక, తనను ఆరాధించని వారికి, స్వప్రయత్నంతో దర్శించగోరిన వారికి వ్యక్తం కానివాడు.

**85. వ్యక్తరూపః** – భక్తులకు వ్యక్తం చేసిన రూపాన్ని కలవాడు.

**86. సర్వసాక్షీ** – అందటిని భక్తుల యోగక్షేమాలను సాక్షాత్తుగా దర్శించువాడు.



**87. తమోహరః** – జ్ఞాన ప్రదానంద్వారా వారి తమోగుణాన్ని హరించేవాడు.

**88. అజ్ఞాన నాశకః** – **"తమస్త్వజ్ఞానజం విద్ధి"** అనే రీతిలో ఆ తమోగుణానికి మూలమైన అజ్ఞానాన్ని నశింపజేసేవాడు.

**89. జ్ఞానీ** – జ్ఞానాన్ని గుణంగా కలవాడు.

**90. పూర్ణచంద్రసమప్రభః** – **"సంపూర్ణ చంద్రసంకాశమ్"** అని ధ్యానింపబడే రీతిలో పున్నమినాటి చంద్రుని కాంతివంటి ఆహ్లాదకరమైన కాంతిని కలవాడు.

**91. జ్ఞానదః** – తత్త్వజ్ఞానప్రదుడు.

**92. వాక్పతిః** – సర్వవిద్యాధిపతి. (లేక) **"విద్యా"** అనబడే లక్ష్మికి నాథుడు.

**93. యోగీ** – **"యోగః అఘటితార్థఘటనమ్, మహాప్రభవః, సోఽస్యాతిశయేన నిత్యయోగేన చ"** అనే పరాశరభట్టర్ విష్ణుసహస్రనామ భాష్యంలో చేసిన వ్యాఖ్య స్మరణీయం. అఘటితఘటనవలనే గొప్ప ప్రభావాన్ని నిత్యంగా, గొప్పగా కలవాడని భావం. రూపంలో అఘటితఘటనం రెండు రూపాల కలయిక. ఇది అతిశయాన్ని కల్గినది. నిత్యమైనది. ఇక స్వభావంలోని అఘటితఘటన కూడా ప్రసిద్ధమే కదా.

**94. యోగీశః** – గొప్ప యోగులైన సనకసనందనాదులకు ప్రభువై, వారి అధికారం తీరగానే వారికి ముక్తిని ప్రసాదించేవాడు. **"సనందనాదీన్ అపకల్మషాన్ మునీంశ్చకార భూయోఽపివపి త్రితమ్ పదమ్"** అని భట్టర్ ఉట్టంకించిన ప్రమాణం స్మరణీయం.

**95. సర్వకామదః** – యోగంనుండి పతనం చెందినవారికి యోగాభ్యాసఫలంగా అణిమాద్యష్టసిద్ధులను ఇచ్చేవాడు. ఆ తరువాత మళ్ళీ వారిని యోగసాధనను కొనసాగించేటట్లు చేసి, ఆ సాధన చివరిలో మోక్షాన్ని అనుగ్రహించేవాడు.

**96. మహాయోగీ** – గొప్పదైన యోగాన్ని – ఉభయవిభూతి రూపమైన ఐశ్వర్యాన్ని కల్గినవాడు.

**97. మహామౌనీ** – ముని అంటే మననశీలుడు. జగద్రక్షణరూపమైన గొప్ప చింతనను కలవాడు.

**98. మౌనీశః** – సనకసనందాది మునులకు ఈశుడు.

**99. శ్రేయసాం పతిః** – వారి శ్రేయస్సులకు అధిపతి.

**100. హంసః** – **"హంతా సంగానామ్"** – అనే రీతిలో వారి ప్రాపంచిక విషయ సంగాలను నశింపజేసేవాడు. **"హయముఖం ధ్యాయామి హంసాత్మకమ్"** – అనే హయగ్రీవ

ధ్యానశ్లోక సూక్తి స్మరణీయం. హయగ్రీవగాయత్రీమంత్రంలో కూడా **"తన్నో హంసః ప్రచోదయాత్"** అని ఈ నామఘటితమై ఉన్నది. **"హంస"** శబ్దవాచ్యుడైన సూర్యునకు అంతర్యామియై, యాజ్ఞవల్క్యునకు శుక్లయజుర్వేదాన్ని ప్రసాదించినవాడు.

**101. పరమహంసః –** పరమహంస రూపంలో బ్రహ్మకు సాక్షాత్కరించినవాడు. ఈవృత్తాంతం భారతం మోక్షధర్మం (349) హయగ్రీవ సంహితలలో ప్రసిద్ధం. **"దిదృక్షుర్భగవంతం తమనిరుద్ధతనౌ స్థితమ్, తం దేవో దర్శయామాస కృత్వా హయశిరో మహత్"** అనే మోక్షధర్మ సూక్తి స్మరణీయం.

**102. విశ్వగోప్తా** – విశ్వాన్ని రక్షించేవాడు. అన్ని విద్యలను రక్షించేవాడు. **"సర్వవిద్యేశ్వరాయ"** అని హయగ్రీవమంత్రం.

**103. విరాట్** – విశేషమైన దీప్తిని కలవాడు.

**104. స్వరాట్** – **"సోఽక్షరః పరమః స్వరాట్"** అనే రీతిలో **"స్వరాట్"** శబ్దవాచ్యుడు. సర్వస్వతంత్రుడు.

**105. శుద్ధస్ఫటికసంకాశః – "నిర్మలస్ఫటికాకృతమ్"** అనే రీతిలో స్వచ్ఛమైన స్ఫటికం వంటివాడు.

**106. జటామండలసంయుతః –** హయగ్రీవరూపానుగుణమైన జూలును కలవాడు. **"కేశా అస్యాభవన్ దీర్ఘాః రవే రంశుసమాః"** అని హయశిర ఉపాఖ్యాన సూక్తి.

**107. ఆదిమధ్యాంతరహితః –** ఆదిని, మధ్యను, అంతాన్ని లేనివాడు. నిత్యుడు.

**108. సర్వవాగీశ్వరేశ్వరః** – వాక్కులకు అధిపతులుగా చెప్పబడే బ్రహ్మ, దక్షిణామూర్తి, బృహస్పతి, సరస్వతివంటివారికి అందరికీ ఈశ్వరుడు. హయగ్రీవోపనిషత్తులోని మూడవ మంత్రం ఈ నామఘటితమై ఉండటం గమనించదగినది.





# శ్రీ హయగ్రీవ మూలమంత్రస్తుతి

(ఈ స్తుతి నారదపురాణంలో వ్యాసనారద సంవాద రూపంగా ప్రసిద్ధమైన హయగ్రీవ పంజరంలో అంతర్గతమై ఉన్నది. ఈ స్తుతిలోని 10వ, 11వ, 12వ, 13వ శ్లోకాలలో వరుసగా మొదటి, రెండవ, మూడవ, నాల్గవ పాదాలను కలిపితే హయగ్రీవానుష్టుభ్ శ్లోకం రూపొందడం గమనార్హం ఈవిధంగా ఈ స్తుతి అర్థంలోనే కాక, శబ్దతః కూడా హయగ్రీవమంత్రాత్మకం).

1. **నమ స్తుభ్యం జగన్నాథ! లక్ష్మీకాంత! పరాత్పర! ।<br>నమోవాచం పురశ్చక్రే విద్యారాజాయ విష్ణవే ॥**

ఓ జగన్నాథా! లక్ష్మీకాంతా! పరాత్పరా! విద్యకు ప్రభువు, విష్ణువైన నీకు ముందుగా నమస్కారం.

2. **ఓంకారోద్గీథరూపాయ ఋగ్యజుస్సామమూర్తయే ।<br>నమోఽస్తు దేవదేవాయ వాంఛితార్థం ప్రయచ్ఛ మే ।**

ప్రణవపూర్వకమైన ఉద్గీథాన్ని స్వరూపంగా కలవాడవు, ఋగ్వేద – యజుర్వేద – సామవేదాల మూర్తీభవించినవాడవు, దేవతలకు దేవుడవైన నీకు నమస్కారం. నాకు మనోరథాన్ని అనుగ్రహించు.

3. **అజ్ఞానతిమిరం ఛింధి జ్ఞాన మాశు ప్రయచ్ఛ మే ।<br>దేహి మే సంపదం దేవ! హయశీర్ష! నమోఽస్తు తే ॥**

దేవా! హయగ్రీవా! నా అజ్ఞానమనే చీకటిని ఛేదించు. నాకు జ్ఞానాన్ని వేగంగా కల్గించు. నాకు సంపదను అనుగ్రహించు. నీకు నమస్కారం.

4. **భూతప్రేతపిశాచాదీన్ ఛింధి దేవ! జనార్దన! ।<br>జ్వరాదీన్ సకలాన్ రోగాన్ నాశయాభ్యుదయం కురు ॥**

దేవా! జనార్దనా! భూతప్రేత పిశాచాలను ఛేదించు. జ్వరం మొదలైన అన్ని రోగాలను నశింపజేయి. అభ్యుదయాన్ని కల్గించు.

5. **దారిద్ర్యం సకలం ఛింధి కురు సౌభాగ్యభాజనమ్ ।<br>శత్రూన్ నాశయ మే దేవ! హయగ్రీవ! నమోఽస్తు తే ॥**

దేవా! హయగ్రీవా! నా దారిద్ర్యాన్ని అంతటిని ఛేదించు. నన్ను సౌభాగ్యానికి పాత్రం అయేటట్లు చేయి. శత్రువులను నశింపజేయి. నీకు నమస్కారం.

**6. మేధాం విద్యాం బలం ప్రజ్ఞాం సంపదం పుత్రపౌత్రవాన్ ।**
**దేహి మే దేవదేవేశ! హయగ్రీవ! నమోఽస్తు తే ॥**

దేవదేవేశా! హయగ్రీవా! నాకు మేధను, విద్యను, బలాన్ని, గొప్ప జ్ఞానాన్ని, సంపదను, పుత్రులను, పౌత్రులను అనుగ్రహించు. నీకు నమస్కారం.

**7. కర్కోటకముఖాన్ సర్పాన్ సవిషాన్ విలయం నయ ।**
**అమృతం కురు మాం దేవ! హయగ్రీవ! నమోఽస్తు తే ॥**

కర్కోటకుడు మొదలైన విషాన్ని కల సర్పాలను నశింపజేయి. ఓ దేవా! హయగ్రీవా! నన్ను మృతిలేనివానినిగా చేయి. నీకు నమస్కారం.

**8. స్త్రీవశ్యం రాజవశ్యం జనవశ్యం పరాత్పర !।**
**కురు దేవాంగనాబృందసేవ్యమానపదాంబుజ !॥**

ఓ పరాత్పరా! దేవతాస్త్రీల సమూహంచే సేవించబడే పాదపద్మాలను కలవాడా! స్త్రీలు, ప్రభువులు, జనులు అందఱు నాకు వశం అయేటట్లు చేయాలి.

**9. హంసాయ పరమేశాయ చంద్రమండలవాసినే ।**
**నమో హయోత్తమాంగాయ వాంఛితార్థప్రదాయినే ॥**

(కర్మబంధాన్ని నశింపజేసేవాడు, లేక, అందమైన గమనాన్ని కలవాడు, లేక శుద్ధసత్త్వ స్వరూపుడు కనుక) హంసశబ్దవాచ్యుడు, గొప్ప ప్రభువు, చంద్రమండలం మధ్యలో వేంచేసి ఉండేవాడు, కోరిన కోరికలను అనుగ్రమించేవాడైన హయగ్రీవునకు నమస్కారం.

**10. ఋగ్యజుఃసామరూపాయ ఋతాయ మహసే నమః ।**
**ఋక్షేశబింబమధ్యస్థరాజీవాసనభాజినే ॥**

ఋగ్వేద, యజుర్వేద, సామవేద స్వరూపుడు, సత్యస్వరూపుడు, తేజోరూపుడు, చంద్రమండలం మధ్యలో గల పద్మాసనంలో వేంచేసి ఉండేవాడైన హయగ్రీవునకు నమస్కారం.

**11. వేదవేదాంతవేద్యాయ వేదాహరణకర్మణే ।**
**భేదావహమహామోహధ్వంసినే బ్రహ్మణే నమః ॥**

వేద, వేదాంతాలచే తెలియబడేవాడు, మధుకైటభులు అపహరించిన వేదాలను తిరిగి తీసికొని వచ్చినవాడు, వేదవాదాల పోరులో కలిగే అజ్ఞానాన్ని పోగొట్టేవాడు, పరబ్రహ్మ స్వరూపి అయిన హయగ్రీవునకు నమస్కారం.



**12. ప్రజ్ఞాప్రదాయినే నిత్యం భజతాం భావితాత్మనామ్ ।**
**ప్రణవోద్గీథవచసే (వపుషే) ప్రణతిం ప్రతిపాదయ ॥**

తనను అనన్యమైన భావనతో కొలిచేవారికి ప్రజ్ఞను అనుగ్రహించే వాడు, ఓంకార పూర్వకమైన ఉద్గీథంచే ప్రతిపాదింపబడే హయగ్రీవునకు నమస్కారం.

**13. మందారకుందస్ఫటికమహాతిచారువర్చసే ।**
**మనీషాప్రదదేవాయ మహాశ్వశిరసే నమః ॥**

తెల్లమందారం, కుందం, స్ఫటికంవలె చాలా గొప్పదైన అందమైన వర్చస్సును కలవాడు, బుద్ధిప్రదాయకుడైన హయగ్రీవదేవునకు నమస్కారం. (10వ శ్లోకం నుండి 13వ శ్లోకం వరకు గల నాల్గు శ్లోకాలలోని హయగ్రీవానుష్టుభ్ మంత్రంలోని ప్రథమ, ద్వితీయ, తృతీయ, పాదాలను వరుసగా కూర్చబడ్డాయి.)

**14. ఇతి ద్వాదశమంత్రైశ్చ నమస్కృత్య జనార్దనమ్ ।**
**ప్రసన్నవదనః ప్రాహ పారాశర్య స్తపోనిధిః ॥**

ఈ విధంగా ద్వాదశమంత్రాలతో జనార్దనుని తపోనిధి, ప్రసన్నమైన ముఖం కలవాడైన వ్యాసుడు నమస్కరించి పలికాడు.

**15. ప్రాచీ సంధ్యా కాచిదంతర్నిశాయాః**
**ప్రజ్ఞాదృష్టే రంజనశ్రీ రపూర్వా ।**
**వక్త్రీ వేదాన్ భాతు మే వాజివక్త్రా**
**వాగీశాఖ్యా వాసుదేవస్య మూర్తిః ॥**

అజ్ఞాన మను రాత్రిని అంతము చేయునది, అనిర్వచనీయమైన ప్రాతఃసంధ్య వంటిది, త్రైకాలికజ్ఞానరూపమైన ప్రజ్ఞ – అను నేత్రమునకు లోకోత్తరమైన కాటుకయు, వేదములను వ్యక్తము చేయునది, హయవదనమును కల్గినది, హయగ్రీవులను పేరు కల్గినది అగు వాసుదేవుడను పరమాత్మయొక్క హయగ్రీవమూర్తి నామనస్సున నిరంతరము భాసించునుగాక !

**16. నిర్మలజ్ఞానసందోహం ధ్వాంతధ్వంసనకర్మఠమ్ ।**
**నమామి తురగగ్రీవం హరిం సారస్వతప్రదమ్ ॥**

నిర్మలజ్ఞానస్వరూపుడు, అజ్ఞానాన్ని పోగొట్టేవాడు, సారస్వతాన్ని అనుగ్రహించే వాడు, హరియైన హయగ్రీవుని నమస్కరిస్తున్నాను.

# హయగ్రీవ ప్రార్థనా ద్వాదశకమ్

**1.** **నమోవేదాంతనిధయే శాస్త్రాణాం పతయే నమః ।**
**యజ్ఞానాం నిధయే తుభ్యం కర్మణాం ఫలదాయినే ॥**

వేదాంతాలకు నిధివి, శాస్త్రాలకు పతివి, యజ్ఞాలకు నిధివి, కర్మల ఫలాన్ని ఇచ్చే వాడవైన నీకు నమస్కారం.

**2.** **విద్యాధరాయ యోగాయ వాగీశాయ నమో నమః ।**
**అచింత్యాయ నమో నిత్యం సర్వజ్ఞానాత్మనే నమః ॥**

విద్యాధరుడు, యోగస్వరూపుడు, వాక్కులకు అధిపతి అయిన హయగ్రీవునకు నమస్కారం. భావించడానికి సాధ్యం కాని రూపాన్ని కలవాడు, సమస్త జ్ఞానస్వరూపుడైన హయగ్రీవునకు నిత్యం నమస్కారం.

**3.** **ఋక్మూర్తి స్త్వం మహాబాహో! యజుర్మూర్తి రధోక్షజః ।**
**సామమూర్తి స్త్వ మేవాద్యః సర్వదాఽథర్వమూర్తిమాన్ ॥**

గొప్ప బాహువులను కలవాడా! నీవు ఋగ్వేదస్వరూపుడవు. అధోక్షజా! నీవు యజుర్వేదమూర్తివి. జగత్కారణభూతుడవైన నీవే సామవేదమూర్తివి. అథర్వణవేదమూర్తివి.

**4.** **సర్వజ్ఞానమయోఽసి త్వం హతజ్ఞానోఽహ మచ్యుత !।**
**దేహి మే సర్వవిజ్ఞానం హయగ్రీవ! నమోఽస్తు తే ॥**

అచ్యుతా! హయగ్రీవా! నీవు సమస్తజ్ఞానస్వరూపుడవు. నేను జ్ఞానం నశించిన వాడను. నీవు నాకు సమస్తజ్ఞానాన్ని ప్రసాదించాలి. నీకు నమస్కారం.

**5.** **ప్రపన్నోఽహం హయగ్రీవం ప్రపన్నార్తిహరం హరిమ్ ।**
**యస్య ప్రసాదలేశేన వాగీశత్వ ముపావిశత్ ॥**

ప్రపన్నుని ఆర్తిని పోగొట్టేవాడు, హరి అయిన హయగ్రీవుని శరణుపొందాను. ఆ స్వామి అనుగ్రహం లేశం చేత వాగీశత్వం (బృహస్పతి వలె బుద్ధిమంతుడై ఉండటం) సిద్ధించింది.

**6.** **ధన్యోఽహం కృతకృత్యోఽహం ముక్తోఽహం కర్మబంధనైః ।**
**హయగ్రీవపదాంభోజస్మరణేనైవ చేతసా ॥**

హయగ్రీవస్వామి పాదాంబుజాలను మనస్సులో ధ్యానించడంవల్ల నేను ధన్యుడనయ్యాను. కృతకృత్యుడను అయ్యాను. కర్మబంధాలనుండి ముక్తుడనయ్యాను.



**7.** **శ్రీభూనీళాదిసహితం సర్వాభరణభూషితమ్ ।**
**హయగ్రీవ మహం వందే చక్రపద్మధరం హరిమ్ ॥**

లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవులతో కూడి ఉండేవాడు, అన్ని ఆభరణాలతో అలంకరింపబడినవాడు, శ్రీసుదర్శనాన్ని, పద్మాన్ని ధరించినవాడు, హరి అయిన హయగ్రీవునకు నమస్కరిస్తున్నాను.

**8.** **శంఖచక్రమహాపద్మజ్ఞానపుస్తకధారిణమ్ ।**
**హయగ్రీవ మహం వందే విద్యైశ్వర్యప్రదాయకమ్ ॥**

శంఖ చక్రాలను, పద్మాన్ని, పుస్తకాన్ని ధరించినవాడు, విద్యను, ఐశ్వర్యాన్ని అనుగ్రహించేవాడు అయిన హయగ్రీవునకు నమస్కరిస్తున్నాను.

**9.** **శుద్ధస్ఫటికసంకాశం పుండరీకాయతేక్షణమ్ ।**
**సర్వశాస్త్రప్రదాతారం హయగ్రీవ ముపాస్మహే ॥**

ఏ దోషం లేని స్ఫటికంవంటి తెల్లని వర్ణాన్ని కలవాడు, పుండరీకాలవంటి, విశాలమైన నేత్రాలను కలవాడు, అన్ని శాస్త్రాలను అనుగ్రహించేవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**10.** **జ్ఞానానందమయందేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥**

జ్ఞానానందములను స్వరూపనిరూపకములుగా కల్గినవాడు, ఏ దోషము లేని, స్వచ్ఛమైన, స్ఫటికమువంటి ఆకారమును కల్గినవాడు, సమస్తవిద్యలకు ఆధారమైనవాడగు శ్రీహయగ్రీవభగవానుని ధ్యానించుచున్నాను.

**11.** **శంఖచక్రమహాముద్రాపుస్తకాఢ్యం చతుర్భుజమ్ ।**
**సంపూర్ణచంద్రసంకాశం హయగ్రీవ ముపాస్మహే ॥**

శంఖం, చక్రం, వ్యాఖ్యానముద్ర, పుస్తకం –అనే వానిని కలవాడు, చతుర్భుజుడు, సంపూర్ణ చంద్రునివంటివాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాము.

**12.** **విశుద్ధవిజ్ఞానఘనస్వరూపం విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్ ।**
**దయానిధిం దేహభృతాం శరణ్యం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

నిర్మలమైన విజ్ఞానమే స్వరూపముగా కల్గినవాడు, అట్టి విజ్ఞానమును అనుగ్రహించుటయే దీక్షగా కల్గినవాడు, దయకు నిధి, ప్రాణులకు గొప్ప శరణము అగు శ్రీహయగ్రీవదేవుని శరణు వేడుచున్నాను.

# శ్రీహయగ్రీవమంగళశ్లోకాః

(ఈ స్తుతిలో గల శ్లోకాలలోని మొదటి అక్షరాలను కూర్చినపుడు **"ఓమ్ హయగ్రీవాయనమః"** అనే అష్టాక్షరాత్మకమైన హయగ్రీవమంత్రం రూపొందుతుంది. (తొమ్మిదవ శ్లోకంలో పూర్వార్ధంలోని విసంధి ఆర్షంగా గ్రహించాలి.)

**1. ఓంకారపంజరస్థాయ ఓజస్తేజోధరాయ చ ।**
**ఓషధీశాలయాంతస్థవాగధీశాయ మంగళమ్ ॥**

ప్రణవాత్మకుడు, ఓజస్సు, తేజస్సు – అనే గుణాలను కలవాడు, చంద్రమండల మధ్యస్థుడైన వాగధీశునకు (హయగ్రీవునకు) మంగళం.

**2. హరిణాంకాంతరస్థాయ హరిణాంకాసనాయ చ ।**
**హరిణ్యధిష్ఠితాంకాయ హయగ్రీవాయ మంగళమ్ ॥**

చంద్రమండలం మధ్యలో వేంచేసి ఉన్నవాడు, చంద్రునివంటి అందమైన ముఖాన్ని కలవాడు, **"హరిణీ"** అనబడే లక్ష్మిని ఒడిలో కలవాడైన హయగ్రీవునకు మంగళం.

**3. యమినా మతిమోదాయ యమబాధానివారిణే ।**
**యజ్వనే యజ్ఞపతయే యజ్ఞాంగాయాస్తు మంగళమ్ ॥**

యోగులకు ఆనందాన్ని కల్గించేవాడు, యమబాధలను నివారించేవాడు, యజ్వ (యజ్ఞకర్త), యజ్ఞకు పతి, యజ్ఞాంగుడైన హయగ్రీవునకు మంగళం.

**4. గ్రీవాభరణయుక్తాయ గీతాశాస్త్రప్రదాయినే ।**
**గీర్వాణానందదాయాఽస్తు హయగ్రీవాయ మంగళమ్ ॥**

కంఠాభరణాలను కలవాడు, గీతాశాస్త్రాన్ని అనుగ్రహించినవాడు, దేవతలకు ఆనందాన్ని కల్గించేవాడైన హయగ్రీవునకు మంగళం.

గీతను అనుగ్రహించిన శ్రీకృష్ణుడు వాసుదేవుడు. హయగ్రీవుడు కూడా **"వాగీశాఖ్యా వాసుదేవస్యమూర్తిః"** అని వాసుదేవుడే కదా!

**5. వాజివక్త్రాయ హరయే వాగీశత్వప్రదాయినే ।**
**వామాంకస్థాంగనాపాంగసంగతాయాస్తు మంగళమ్ ॥**

హరి, వాగీశత్వాన్ని (గొప్ప పాండిత్యాన్ని – బృహస్పతితో సామ్యాన్ని) కల్గించే వాడు, కుడివైపు ఒడిలో కూర్చున్న లక్ష్మీదేవి కటాక్షాల సంబంధాన్ని కల (లక్ష్మీదేవిని ప్రేమగా చూడబడే) హయగ్రీవునకు మంగళం.



**6. యశస్వినే చ చక్రాబ్జజ్ఞానపుస్తకధారిణే ।**
**సర్వాభరణయుక్తాయ సైంధవాస్యాయ మంగళమ్ ॥**

గొప్ప కీర్తిని కలవాడు, చక్రాన్ని, శంఖాన్ని, జ్ఞానాన్ని కల్గించే పుస్తకాన్ని ధరించిన వాడు, అన్ని ఆభరణాలను కలవాడైన హయగ్రీవునకు మంగళం.

**7. నతదేవేశమౌళిస్థనవరత్నాంకితాంఘ్రయే ।**
**హేమాంబరాంచితాంగాయ హేషారావాయ మంగళమ్ ॥**

(తనకు) నమస్కరించిన దేవతల ప్రభువుల కిరీటాలలో పొదిగిన నవరత్నాల కాంతులు సోకే చరణాలను కలవాడు, బంగారు వన్నెను కల వస్త్రాన్ని ధరించడం చేత శోభిల్లే అంగాలను కలవాడు, హేషారవాన్ని (సకిలింపును) చేసేవాడైన హయగ్రీవునకు మంగళం.

**8. మత్స్యావతారకృత్యాయ మంగళౌఘప్రదాయినే ।**
**మహాశ్వశిరసే సర్వమంగళాయాస్తు మంగళమ్ ॥**

మత్స్యావతారకృత్యాన్ని – అంటే – వేదోద్ధరణాన్ని చేసినవాడు, అన్ని మంగళాలను కల్గించేవాడు, గొప్ప అశ్వశిరస్సును కలవాడు, అనరుస్తమంగళ స్వరూపుడైన హయగ్రీవునకు మంగళం.

**9. ముక్తివిద్యాప్రదాత్రే చ అనంతఫలదాయినే ।**
**పద్మపీఠాంతరస్థాయ పద్మాశ్లిష్టాయ మంగళమ్ ॥**

ముక్తిని, విద్యను ఇచ్చేవాడు (లేక, ముక్తి విద్యను అనుగ్రహించేవాడు), అంతులేని ఫలాన్ని ఇచ్చేవాడు, ఆసనపద్మంలో వేంచేసి ఉన్నవాడు, లక్ష్మీదేవిచే ఆలింగనం చేసికోబడినవాడైన హయగ్రీవునకు మంగళం

శ్రీవేదాంతదేశికులు రచించిన

# శ్రీహయగ్రీవస్తోత్రమ్

శతాధిక గ్రంథకర్తలు, కవితార్కిక సింహులు, సర్వతంత్ర స్వతంత్రలు. వేదాంతాచార్యులుగా ప్రసిద్ధులైన శ్రీ వేంకటనాథకవి వేదాంతదేశికులుగా జగత్ప్రసిద్ధులు. వీరు గొప్ప హయగ్రీవోపాసకులు. హయగ్రీవస్వామి తత్త్వాలను, మంత్రరహస్యాలను ఆవిష్కరిస్తూ హయగ్రీవస్తోత్రమనే అద్భుత కృతిని వెలయించారు. విద్యాధిదేవత అయిన హయగ్రీవుని స్తుతించే ఈ కృతిలోని శ్లోకాల సంఖ్య బ్రహ్మవిద్యల సంఖ్య అయిన 32 తో సమానంగా ఉండడం దీనికొక చిన్న తార్కాణం.

## శ్రీదేశికుల ప్రార్థనా శ్లోకం

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।**
**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥**

కవులలో, తార్కికులలో సింహం వలె గొప్పవారు, వేదాంతాచార్యవర్యులైన శ్రీవేంకటనాథులు సదా హృదయంలో నెలకొని ఉండాలి.

---

**జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥**

జ్ఞాన + ఆనందమయం = జ్ఞానానంద స్వరూపుడు, నిర్మల =(స్వచ్ఛమైన÷ దోషము లేని, స్ఫటిక = స్ఫటికమువంటి, ఆకృతిం = ఆకారమును కల్గినవాడు, సర్వవిద్యానాం = అన్ని విద్యలకు, ఆధారం =ఆధారభూతుడును అగు, హయగ్రీవం దేవం = హయగ్రీవభగవానుని, ఉపాస్మహే = ఉపాసించుచున్నాము.

ఈ శ్లోకమున భగవానుని శాస్త్రచోదితమైన స్వరూపము ధ్యానింపబడుచున్నది.

జ్ఞానానందములను స్వరూపనిరూపకములుగా కల్గినవాడు, ఏ దోషము లేని, స్వచ్ఛమైన, స్ఫటికమువంటి ఆకారమును కల్గినవాడు, సమస్తవిద్యలకు ఆధారమైనవాడగు శ్రీహయగ్రీవభగవానుని ధ్యానించుచున్నాను.

(ఈ శ్లోకం దేశికకృతం కాదని కొందఱు, దేశిక కృతమేనని మఱికొందఱు భావిస్తున్నారు. అందువల్లనే కొన్ని హయగ్రీవస్తోత్ర వ్యాఖ్యలలో ఈ శ్లోకం వ్యాఖ్యానింపబడలేదు.)



1. **స్వతస్సిద్ధం శుద్ధస్ఫటికమణిభూభృత్ప్రతిభటమ్**
**సుధాసధ్రీచీభిః ద్యుతిభి రవదాత త్రిభువనమ్ ।**
**అనంతై స్త్రయ్యంతై రనువిహితహేషాహలహలమ్**
**హతాశేషావద్యం హయవదన మీడీమహి మహః ॥**

స్వతస్సిద్ధం = కర్మమూలముగా పుట్టినదిగా కాక, సహజముగా అవతరించినది, శుద్ధ = పరిశుద్ధమైన, స్ఫటికమణి = స్ఫటిక మణులతో కూడిన, భూభృత్ = పర్వతముతో, ప్రతిభటం = స్పర్ధించునది (పోలినది, దానిని మించినది), సుధాసధ్రీచీభిః = అమృతముతో పోలిన, ద్యుతిభిః = కాంతులచే, అవదాత = తెల్లగా చేయబడిన, త్రిభువనం = ముల్లోకములను కల్గినది, అనంతైః = అవధి లేని, త్రయ్యంతైః = వేదములచే, అనువిహిత =అనువదింపబడిన, హేషాహలహలం = హలహలమను హేషారవమును కల్గినది, హత= నశించిన, అశేష = సమస్తమైన, అవద్యం = దోషములను కల్గినది అగు, హయవదనం = హయగ్రీవరూపమగు, మహః = కాంతిని, ఈడీమహి = స్తుతింతుము.

ఈ శ్లోకమున శ్రీహయగ్రీవరూపము ధ్యానింపబడుచున్నది.

**"అజాయమానో బహుధా విజాయతే"** అనునట్లు కర్మఫలితమువలన కాక నిర్హేతుక కృపవలన అవతరించినది, నిర్మలమైన, స్ఫటికమణులతో కూడిన పర్వతముతో స్పర్ధించునది, అమృతమువంటి కాంతులతో ముల్లోకములను తెల్లగా చేయునది, అసంఖ్యాకములగు, వేదముల ప్రతిరూపములగు హలహలమని శబ్దించు హేషారవములను చేయునది, ఎట్టి హేయగుణమును లేనిది అగు హయగ్రీవులనెడి పరంజ్యోతిని స్తుతింతుము– అని భావము.

**"త్రయ్యంతైః అనువిహితహేషాహలహలమ్"** – అనే ప్రయోగం విలక్షణమైనది. **"హలహల్"** శబ్దాన్ని **"హల్ + అహల్" –** అని విడదీసి, హల్లుల, అచ్చుల రూపంలోని సమస్త శబ్దరాశికి హయగ్రీవుని హలహలరూపకమైన హేషారవం మూలం కనుక, దానిని వేదాలు సైతం అనువదిస్తున్నవి – అనే అర్థస్వారస్యం స్ఫురిస్తుంది. **"అహల్"** అంటే అచ్చు. సమస్త శబ్దరాశికి వేదం మూలంకాగా ఆ వేదానికి కూడా హయగ్రీవుని హలహలరవం మూలమని తాత్పర్యం. ఈ అర్థాన్నే నాల్గవ శ్లోకం వివరిస్తున్నది.

ఈ శ్లోకంలోను **"సమాహారః"** ఇత్యాది నాల్గవ శ్లోకంలోను హయగ్రీవ దేవతా బీజాక్షరాలైన హకార, లకార నిక్షేపం చేయబడడం గమనార్హం. ఈ స్తుతి హయగ్రీవ మంత్రాత్మకమనే విషయానికి ఇది ఒక సూచన.

**2. ప్రాచీ సంధ్యా కాచిదంతర్నిశాయాః**
**ప్రజ్ఞాదృష్టే రంజనశ్రీ రపూర్వా ।**
**వక్త్రీ వేదాన్ భాతు మే వాజివక్త్రా**
**వాగీశాఖ్యా వాసుదేవస్య మూర్తిః ॥**

అంతః నిశాయాః= మనస్సులోని అజ్ఞానము అను రాత్రియొక్క (అంతమును సూచించు), కాచిత్ = అనిర్వచనీయమైన, ప్రాచీ సంధ్యా = ప్రాతఃసంధ్య, ప్రజ్ఞాదృష్టేః = ప్రతిభ అను నేత్రమునకు, అపూర్వా = ఇంతకు ముందు లేని (గొప్పదైన), అంజనశ్రీః= అంజనము (కాటుక) యొక్క సిరి, వేదాన్ = వేదములను, వక్త్రీ = పల్కునది, వాజివక్త్రా = హయవదనమును కల్గినది, వాక్+ఈశ + ఆఖ్యా = హయగ్రీవులను పేరు కల్గినది అగు, వాసుదేవస్య = వాసుదేవుడను పరమాత్మయొక్క, మూర్తిః = రూపము, మే = నాకు, భాతు = ప్రకాశించునుగాక !

తమ కన్నులముందు సాక్షాత్కరించిన హయగ్రీవుల రూపము నిత్యము మనస్సున ప్రకాశింపవలెనను కోరికను కవి ఇందు ప్రకటించుచున్నారు. తైలధారవలె అవిచ్ఛిన్నమైన భావనయేకదా భక్తి. అట్టి నిరంతరధ్యానమువలన పరభక్తి, తన్మూలముగా నిత్యము మనస్సున భగవానుని రూపసాక్షాత్కర రూపమైన పరజ్ఞానము, దానివలన పునర్విశ్లేషభీరుత్వరూపమగు పరమభక్తియు క్రమముగా కల్గును. ఈ మూడును ఇచట కవికి అపేక్షితములు.

అజ్ఞాన మను రాత్రిని అంతము చేయునది, అనిర్వచనీయమైన ప్రాతఃసంధ్య వంటిది, త్రైకాలికజ్ఞానరూపమైన ప్రజ్ఞ –అను నేత్రమునకు లోకోత్తరమైన కాటుకయు, వేదములను వ్యక్తము చేయునది, హయవదనమును కల్గినది, హయగ్రీవులను పేరు కల్గినది అగు వాసుదేవుడను పరమాత్మయొక్క హయగ్రీవమూర్తి నామనస్సున నిరంతరము భాసించునుగాక !

**3. విశుద్ధవిజ్ఞానఘనస్వరూపం**
**విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్ ।**
**దయానిధిం దేహభృతాం శరణ్యం**
**దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

విశుద్ధ = నిర్మలమైన, విజ్ఞానఘన = విజ్ఞానమనే నిబిడమైన, స్వరూపం = స్వరూపమును కల్గినవాడు, (నిర్మలజ్ఞానస్వరూపుడు), అందువలననే, విజ్ఞాన = శాస్త్ర జ్ఞానమును, విశ్రాణన = అనుగ్రహించుటలో, బద్ధదీక్షం = దీక్షను కల్గినవాడు, దయానిధిం



= కరుణకు నిధి, దేహభృతాం = ప్రాణులకు, శరణ్యం = గొప్ప శరణమును అగు, హయగ్రీవం దేవం = హయగ్రీవుడను పేరును కల భగవానుని, అహం = నేను, ప్రపద్యే = శరణు వేడుచున్నాను.

తమకు ప్రత్యక్షమైన శ్రీహయగ్రీవ భగవానుని దేశికులు ఈ శ్లోకము ద్వారా ప్రపత్తి చేయుచున్నారు.

నిర్మలమైన విజ్ఞానమే స్వరూపముగా కల్గినవాడు, అట్టి విజ్ఞానమును అనుగ్రహించుటయే దీక్షగా కల్గినవాడు, దయకు నిధి, ప్రాణులకు గొప్ప శరణము అగు శ్రీహయగ్రీవదేవుని శరణు వేడుచున్నాను.

**4. సమాహార స్సామ్నాం ప్రతిపద మృచాం ధామ యజుషాం**
**లయః ప్రత్యూహానాం లహరివితతిర్బోధజలధేః ।**
**కథాదర్పక్షుభ్యత్కథకకుల కోలాహలభవం**
**హరత్వంతర్ధ్వాంతం హయవదన హేషాహలహలః ॥**

సామ్నాం = సామవేదముయొక్క, సమాహారః = సమూహము, ఋచాం= ఋగ్వేదముయొక్క, ప్రతిపదం = ప్రతిరూపము, యజుషాం = యజుర్వేదము యొక్క, ధామ = స్థానము (శరీరము), ప్రత్యూహానాం = ప్రతిబంధకములయొక్క, లయః = ధ్వంసము (చేయునది), బోధజలధేః = జ్ఞానసముద్రముయొక్క, లహరివితతిః = కెరటముల సమూహమగు, హయవదన = శ్రీహయగ్రీవ మూర్తియొక్క, హేషాహలహలః = హలహలమని శబ్దించు హేషారవము, కథాదర్ప= వాదగర్వముచే, క్షుభ్యత్ = అహంకరించు, కథకకుల = ప్రతివాదుల సమూహము యొక్క, కోలాహల = కలకలముచే, భవం = పుట్టిన, అంతర్ధ్వాంతం= అజ్ఞానమును, హరతు = పోగొట్టునుగాక!

మొదటి శ్లోకములోని ఉత్తరార్ధమును ఈ శ్లోకము విశదీకరించుచున్నది. అనగా– హయగ్రీవుల హేషాధ్వనియొక్క వైశిష్ట్యము ఈ శ్లోకములోని ప్రతిపాదితార్థము. పూర్వశ్లోకమున దేశికులు హయగ్రీవులను ధ్యానించి **"ఈడీమహి"** అని పలుకగానే భక్తపరతంత్రుడగు హయవదన భగవానుడు తావన్మాత్రముననే తృప్తిచెంది, వారి ముందు హలహలమను హేషారవమును చేయుచు ప్రత్యక్షము కాగా ఆరవమును విని పరవశులైన దేశికులు ఆ ధ్వనిని స్తుతించుచున్నారనియు చెప్పవచ్చును. హయవదనస్తుతితో పనియే లేదు, ఆ స్వామి హేషాహలహలరవము మాత్రమే ధ్యానించువారికి ఇష్టప్రాప్తిని, అనిష్టప్రాప్తిని కలుగచేయుచున్నదని పల్కుచున్నారనియు చెప్పవచ్చును. **"హరత్వంతర్ధ్వాంతమ్"** అనే ప్రయోగం **"హరి"** నామ వివరణం. హరి శబ్దవాచ్యుడు కదా హయవదనుడు.

సామవేదముల సమాహారము, ఋగ్వేదప్రతిరూపము, యజుర్వేదముయొక్క నిలయము, జ్ఞానసముద్రముయొక్క కెరటముల సమూహమగు శ్రీహయగ్రీవుల హేషారూపమైన హలహలధ్వని ప్రతివాదులు మిక్కిలి గర్వించి చేయు కోలాహలమువలన తన భక్తుల మనస్సులలో కల్గు సంశయవిపర్యయాది రూపమైన అజ్ఞానాంధకారమును పోగొట్టును గాక ! – అని భావము.

**5.** **అపౌరుషేయై రపి వాక్ప్రపంచై**
**రద్యాపి తే భూతి మదృష్టపారామ్ ।**
**స్తువ న్నహం ముగ్ధ ఇతి త్వయైవ**
**కారుణ్యతో నాథ ! కటాక్షణీయః ॥**

నాథ ! = స్వామీ !, అపౌరుషేయైః = మానవనిర్మితములు కాని వేదముల రూపములో నున్న, వాక్ ప్రపంచైః = వాక్సమూహములచే, అపి = కూడ, అద్య అపి = ఈనాటికిని, అదృష్టపారాం = అంతు చూడబడని, తే = నీయొక్క, భూతిం = సంపదను, స్తువన్ = స్తోత్రముచేయుచున్న, అహం = నేను, ముగ్ధః + ఇతి =మోహవశుడను కారణముచే, త్వయా = నీచే, కారుణ్యతః ఏవ = సహజమైన కారుణ్యము కారణముచేతనే, కటాక్షణీయః ఏవ = కరుణింపబడవలసినవాడనే సుమా !

పూర్వశ్లోకమున హయగ్రీవభగవానుని శరణుజొచ్చిన శ్రీదేశికులు, ఆ స్వామి విషయమున స్వరూపానుగుణమైన వాచిక కైంకర్యమును చేయనెంచిరి. అట్టి వాచిక కైంకర్యము స్తుతించుటయేకదా ! కాని, భగవానుని స్తుతించుట తమ శక్తికి మించినది కావున అట్టి ప్రయత్నమును చేయు తమను క్షమింపవలయునని స్వామిని దేశికులు ఇందు కోరుచున్నారు.

స్వామీ ! ఉభయవిభూతులకు ప్రభువగు నీ ఐశ్వర్యము ఎంత గొప్పదో అపౌరుషేయములగు వేదములుకూడ ఈ నాటికినీ తెలియలేకున్నవి. అట్టి నీ గొప్పతనమును కీర్తించు నేను ఎంత మూర్ఖుడను ! ఇట్టి నన్ను నీవు నీ నిర్హేతుక కృపవలననే కరుణింపవలయును సుమా !– అని భావము.

**“ముగ్ధ ఇతి”** – అనే ప్రయోగము విలక్షణమైనది. నీ వైభవములో వ్యామోహాన్ని పొందినవాడను, కనుక, వ్యామోహమే నన్ను స్తుతించేటట్లు చేస్తున్నదని దీని తాత్పర్యం.

**6.** **దాక్షిణ్యరమ్యా గిరిశస్య మూర్తిః**
**దేవీ సరోజాసనధర్మపత్నీ ।**



**వ్యాసాదయోఽపి వ్యపదేశ్యవాచః**
**స్ఫురంతి సర్వే తవ శక్తిలేశైః ॥**

దాక్షిణ్యరమ్యా =విద్యాదిప్రదానములచే రమ్యమైన, గిరిశస్య = రుద్రుని యొక్క మూర్తిః = రూపము, సరోజాసనధర్మపత్నీ = బ్రహ్మదేవుని ధర్మపత్ని అగు, దేవీ = సరస్వతీదేవి, వ్యపదేశ్యవాచః = లోకప్రసిద్ధిని పొందిన కవులగు, వ్యాస + ఆదయః + అపి = వ్యాసభగవానుడు మొదలగువారును, సర్వే = అందఱు, తవ= నీయొక్క, శక్తిలేశైః = (నీవు అనుగ్రహించిన) స్వల్పమైన శక్తులచే, స్ఫురంతి = ప్రకాశించుచున్నారు.

భగవానుని గుణసంపదను పొగడుట వేదములకే సాధ్యము కానిచో, శ్రీరామాయణ, మహాభారతాది ప్రసిద్ధగ్రంథములను రచించిన వాల్మీకి వ్యాసాదుల ప్రయత్నములనుగూర్చి ఏమనవలెను?– అనినచో, వారికట్టి కవితాశక్తి నీవను గ్రహించుటవలననే కల్గినది. అంతేకాక, దక్షిణామూర్తిగా పేరొందిన రుద్రుడు, చదువుల తల్లి సరస్వతియు నీ అనుగ్రహమువలననే ప్రకాశించుచున్నారు. కావున, నీ కరుణవలన నేనీ స్తుతిని చేయుట సాధ్యమేననుట ప్రస్తుత శ్లోక ప్రమేయము.

“ఓయీ! నీవిట్లు సంకోచపడనేల ! నీకు సహజముగా నున్న శక్తి సామర్థ్యములతో స్తుతింపవచ్చునుకదా !” అని భగవానుడు అనగా, అందులకు సమాధానముగా “స్వామీ! లోకములో విద్యాప్రదానాదిశక్తిచే రమ్యమైన దక్షిణా మూర్తి, వాగ్రూపిణియైన సరస్వతి, వ్యాసాదిప్రసిద్ధగ్రంథకర్తలు అందఱు నీవు అనుగ్రహించిన స్వల్పశక్తిచే మిణుగురులవలె మినుకు మినుకు మనుచున్నారు కదా!”–అని భావము –అని వేఱొక వ్యాఖ్యానము.

విద్యాదిప్రదానములచే రమ్యమైన రుద్రుని మూర్తి, బ్రహ్మదేవుని ధర్మపత్ని అయిన సరస్వతీదేవి, లోకములో గొప్ప కవులుగా పేరు పొందిన వ్యాసవాల్మీకి పరాశరాది మహర్షులు – మీరు అందఱు నీవు అనుగ్రహించిన అత్యల్పమైన శక్తులచే భాసిల్లుచున్నారు– అని భావము.

**7.** **మందో భవిష్యన్ నియతం విరించో**
**వాచాం నిధే ! వంచితభాగధేయః ।**
**దైత్యాపనీతాన్ దయయైవ భూయోఽ**
**పృధ్యాపయిష్యో నిగమాన్ న చేత్ త్వమ్ ॥**

వాచాం నిధే = వాక్కులకు నిధి అగు, ఓ హయగ్రీవస్వామీ !, త్వం = నీవు, దైత్య+ అపనీతాన్ = మధుకైటభులచే అపహరింపబడిన, నిగమాన్ = వేదములను,

దయయా + ఏవ = నీ నిర్హేతుకకృపచేతనే, భూయః + అపి = మఱల, న అధ్యాపయిష్యః చేత్ = ఉపదేశింపకపోయినచో, విరించిః = బ్రహ్మ, వంచితభాగధేయైః = మోసగింపబడిన భాగ్యము కలవాడై (అపహరింపబడిన వేదమనెడి భాగ్యమును కలవాడై), నియతం = తప్పక, మందః = అజ్ఞుడు, అభవిష్యత్ = అయియుండును.

పూర్వశ్లోకమున **"సరోజాసనధర్మపత్నీ"** అనుచు బ్రహ్మ పేరును పరోక్షముగా ప్రస్తుతింపగానే భగవానుడు "ఓయీ! నీకున్న శక్తియుక్తులు నన్ను స్తోత్రము చేయుటకు చాలకున్నను, శీఘ్రఫలప్రదుడు, ఎల్లప్పుడును వేదమును నాల్గు ముఖములతో అభ్యసించువాడగు బ్రహ్మను ప్రార్థించిన, అతడు నీకట్టి కవనశక్తిని ప్రసాదింపగలడు కదా!" అనగా, అందులకు సమాధానముగా దేశికులు, ఈ శ్లోకమున "స్వామీ! ఆ బ్రహ్మకు కూడ నీవు సృష్టిప్రారంభమున వేదముల నిచ్చి, అతడు వానిని కోల్పోయిన ఆపత్సమయమున సహాయపడి, వేదములను తిరిగి అతనికి అనుగ్రహించితివి కదా! కావున నీవే కటాక్షింపవలెను" అని అనుచున్నారు.

వాక్కులకు నిధి అగు ఓ హయగ్రీవప్రభూ! మధుకైటభులనెడి దైత్యులు వేదములను అపహరించినపుడు నీవు నిర్హేతుకకృపతో హయగ్రీవరూపమును దాల్చి వారిని మర్దించి, తిరిగి వేదములను బ్రహ్మకు **"వేద మధ్యాపయద్విధిమ్"** అని, **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై"** అనునట్లు అనుగ్రహించియుండక పోయినచో, ఆ బ్రహ్మకూడ సృష్టికి అవసరమైన జ్ఞానము లేని అభాగ్యుడై అలమటించి, మందబుద్ధియై యుండును కదా ! –అని భావము.

**8. వితర్కడోలాం వ్యవధూయ (త) సత్త్వే**
**బృహస్పతిం వర్తయసే యతస్త్వమ్ ।**
**తేనైవ దేవ ! త్రిదశేశ్వరాణామ్**
**అస్పృష్టడోలాయిత మాధిరాజ్యమ్ ॥**

దేవ = స్వామీ !, యతః = ఎందువలన, త్వం = నీవు, బృహస్పతిం = సురుల గురువగు బృహస్పతిని, వితర్కడోలాం = దురూహలచే కల్గు చిత్తచాంచల్యమునుండి, వ్యవధూయ= నివారించి, సత్త్వే = సత్త్వ (గుణ) మార్గమున, వర్తయసే = ప్రవర్తించునట్లు చేయుచున్నావో, తేన +ఏవ = ఆ కారణముచేతనే, త్రిదశ+ఈశ్వరాణాం = ఇంద్రాదులయొక్క, ఆధిరాజ్యం = ఆధిపత్యము, అస్పృష్టడోలాయితం = ఊగిసలాటను లేనిదిగా (స్థిరమైనదిగా) అగుచున్నది.



భగవానుడు కవితో "ఓయీ! నీవు బ్రహ్మదేవుని ప్రార్థింపకున్నను ఆ బ్రహ్మకు పిమ్మట బుద్ధిశాలిగా, జ్ఞాననిధిగా చెప్పబడు బృహస్పతిని ప్రార్థింపవచ్చును కదా!" అనగా, అందులకు కవి, "ఆ బృహస్పతికూడ నీవు కటాక్షించుటవలనే సత్త్వమార్గమున ప్రవర్తించుచున్నాడు. కావుననే ఇంద్రాదుల ఐశ్వర్యము సైతము అవిచాల్యముగా నున్నది" అని పల్కుచున్నారు.

స్వామీ ! నీవు దేవగురువగు బృహస్పతికి కల్గు దురూహలను పోగొట్టి, అతనికి సన్మార్గమును చూపించుచున్నావు. అట్టి ఆ బృహస్పతియొక్క బుద్ధిబలము చేతనే ఇంద్రాది సురప్రభువుల అధికారము స్థిరముగా నున్నది –అని భావము.

**9. అగ్నౌ సమిద్ధార్చిషి సప్తతంతో–**
**రాతస్థివాన్ మంత్రమయం శరీరమ్ ।**
**అఖండసారై ర్హవిషాం ప్రధానై**
**రాప్యాయనం వ్యోమసదాం విధత్సే ॥**

సమిద్ధార్చిషి = దీప్తజ్వాలలను కల, సప్తతంతోః = సప్తతంతువనబడు క్రతువుయొక్క, అగ్నౌ = అగ్నియందు, మంత్రమయం = వేదమంత్రరూపమైన, శరీరం = శరీరమును, ఆతస్థివాన్ = పొందినవాడవై, అఖండసారైః = సమగ్రమైన సారమును కల, హవిషాం ప్రధానైః = ప్రధానములైన చరుపురోడాశాది హవిస్సులతో, వ్యోమసదాం = దేవతలకు, ఆప్యాయనం = తృప్తిని, విధత్సే = కల్గించు చున్నావు.

పూర్వశ్లోకములలో ప్రస్తుతింపబడిన బ్రహ్మ, రుద్రుడు, బృహస్పతి, ఇంద్రుడు మొదలగు దేవతలు స్వతంత్రులు కదా ! యజ్ఞములలో స్వతంత్రరూపముగ ఆరాధ్యులు కదా ! అనినచో, యజ్ఞయాగాదులలో వారి పేర్లు ప్రత్యేకముగా ఉచ్చరింపబడినను, యజ్ఞమున అగ్నిరూపుడవై, మంత్రమయమైన శరీరమును దాల్చు నీవే ఆ హవిస్సులను ఆస్వాదించి, ఆ దేవతలకు తృప్తిని కల్గించుచున్నావు. కావున వారందఱు సర్వథా నీకు పరతంత్రులు– అని పల్కుట ఇందలి విశేషము. **"సత్రే మమాస భగవాన్ హయశీర్ష ఏషః"** అనే భాగవతపురాణ వృత్తాంతం ఇక్కడ స్మారితం.

దేవా! మిక్కిలిగా వెలుగొందు జ్వాలలను కల్గిన మఖాగ్నియందు మంత్రమయమైన శరీరమును కల్గినవాడవై, ఆ క్రతువులో సమర్పింపబడిన చరుపురోడాశాది హవిస్సులను నీవు గ్రహించి, ఆయా దేవతలకు తృప్తిని కల్గించుచున్నావు –అని భావము.

ఈ శ్లోకమున హయగ్రీవ భగవానుడు, ఆయా దేవతల శరీరములలో అంతర్యామియై, ఆ దేవతలను ఉద్దేశించి మంత్రపూర్వకంగా సమర్పించిన హవిస్సులను స్వీకరించి, వారికి తృప్తిని కల్గించాడని చెప్పబడినందున హయగ్రీవుడు శరీరి, మిగిలిన దేవతలు శరీరద్భూతములనే శరీర శరీరి భావం సూచింపబడింది. ఈ శరీర, శరీరిభావమే విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతితంత్రార్థం.

**10.** **యన్మూల మీదృక్ ప్రతిభాతి తత్త్వం**
**యా మూల మామ్నాయమహాద్రుమాణామ్ ।**
**తత్త్వేన జానంతి విశుద్ధసత్త్వాః**
**తా మక్షరా మక్షరమాతృకాం తే ॥**

ఈదృక్ = ఇట్టి (కంటికి కనుపించు), తత్త్వం = ఆకాశాదితత్త్వ సమూహము, యత్ + మూలం = దేనిని కారణముగా కల్గినదై, ప్రతిభాతి = ప్రతీయమానమగు చున్నదో, ఆమ్నాయ మహాద్రుమాణాం = వేదములనబడు మహావృక్షములకు, యా = ఏ అక్షరమాతృక, మూలం = ఆదిభాగమో, అట్టి, అక్షరాం = నశింపని, తాం =ఆ, అక్షరమాతృకాం = అకారాది అక్షరమాతృకను, తే = నీకు సంబంధించినదిగా, విశుద్ధసత్త్వాః = నిర్మలమైన సత్త్వగుణమును కలవారు, తత్త్వేన = యథార్థతత్త్వముగా, జానంతి = తెలిసికొనుచున్నారు.

"స్తోత్రమును చేయుటకు అవసరమైన జ్ఞానము మీకు కావలయునన్న అక్షర సమిష్టిరూపమైన మాతృకను ప్రార్థించినచో, మీ కోరిక తీరును కదా !" అని భగవానుడనగా, అందులకు కవి "స్వామీ ! ఆ అక్షరమాతృకయు నీకు శేషమే కదా ! ఆమెకును అంతర్యామియై, తచ్ఛబ్దవాచ్యుడవై యున్నవాడవు నీవే కదా ! కావున నిన్నే ప్రార్థింతును" అనుచున్నారు. లేక, "సర్వప్రపంచమునకును మూలకారణము నీవే" అనుచున్నారనియు చెప్పవచ్చును. శ్లోకములోని చివరిపాదంలోని అర్థము నాల్గవ శ్లోకంలోని అర్థానికి అనుగుణముగా అనుసంధేయము.

స్వామీ ! కంటికి కనుపించు ఆకాశాది సర్వప్రపంచతత్త్వములకు, వేదములనెడి మహావృక్షములకు మూలమును, అనశ్వరమును అగు అక్షరమాతృక నీకు శేషమైనదిగా విశుద్ధస్వభావమును కల్గిన మహాత్ములు తెలిసికొనుచున్నారు– అని భావము.

హయగ్రీవోపనిషత్తు చివరిలో అనుసంధింపబడే ఈ క్రింది మంత్రం యొక్క భావం ఈ సందర్భంలో అనుసంధేయం.



**గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ ।**
**అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥**

(పరబ్రహ్మలో ప్రతిష్ఠిత అయిన, గౌరవవర్ణాన్ని కల ఈ వాగ్దేవత సృష్ట్యారంభంలో సకలసదృశాలైన వర్ణపదవాక్యాలను సృష్టిస్తున్నదై శబ్దించింది. ఏవిధంగా అంటే – మొదట ప్రణవాత్మకంగా ఏకపదియై పరబ్రహ్మ ముఖంనుండి వెలువడింది. తరువాత వ్యాహృతి, సావిత్రి రూపాలలో ద్విపది అయినది, తదనంతరం నాల్గు వేదాల రూపంలో చతుష్పది అయనది. పిదప ఆఱు వేదాంగాలు, పురాణ ధర్మశాస్త్రాలతో అష్టాపది అయినది. తరువాత, మీమాంసా, న్యాయ, సాంఖ్య, యోగ, పాంచరాత్ర, పాశుపత, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వ వేదాలతో నవపది అయినది. తరువాత, అనంతవాక్య సందర్భాలతో సహస్రాక్షరియై, అనంత విద్యల రూపంగా సంపన్నమైనది.)

ఈ విధంగా ఈ స్తుతిలో అడుగడుగునా ఎన్నో హయగ్రీవ తత్త్వరహస్యాలు నిక్షిప్తాలై ఉన్నాయి. వివరాలను విజ్ఞులైన పెద్దల సన్నిధిలో గ్రహించాలి.

**11.** **అవ్యాకృతాత్ వ్యాకృతవా నసి త్వం**
**నామాని రూపాణి చ యాని పూర్వమ్ ।**
**శంసంతి తేషాం చరమాం ప్రతిష్ఠాం**
**వాగీశ్వర! త్వాం త్వదుపజ్ఞవాచః ॥**

వాక్ + ఈశ్వర = వాక్కులు ప్రభువగు హయగ్రీవస్వామీ !, త్వం = నీవు, పూర్వం = సృష్టిసమయమున, అవ్యాకృతాత్ = నామరూపములు లేని, మఱియు, సత్ అను పేరును కల్గిన జగత్తునందు ప్రవేశించి, ఆ జగత్తుయొక్క, యాని = ఏ, నామాని = పేర్లను, చ = మఱియు, రూపాణి = రూపములను (స్వభావము లను), వ్యాకృతవాన్ = విభాగమును చేసినవాడవై, అసి = ఉన్నావో, తేషాం = ఆ నామరూపములయొక్క, చరమాం ప్రతిష్ఠాం = పర్యవసానభూమిగా, త్వాం = నిన్ను, త్వత్ +ఉపజ్ఞవాచః = నీచే దర్శింపబడిన వేదములను కల మహాత్ములు (నీ అనుగ్రహమువలన జ్ఞానమును పొందిన మహనీయులు), శంసంతి = కీర్తించుచున్నారు.

సృష్టిచేయబడిన ప్రపంచముయొక్క పర్యవసానస్థితియు నీవే అనుచు కవి స్తుతించుచున్నారు.

ఓ వాగీశ్వరా ! నీవు సృష్టిప్రారంభమున నామరూపవిభాగానర్హమై, **'సత్'** పేరుతో మాత్రము వ్యవహరింపబడు ఈ జగత్తుయందు అనుప్రవేశించి, **"నామరూపే వ్యాకరవాణి"**

అనునట్లు దానిని నామరూపములతో విభాగించితివి. కావున, లోకములోని వస్తువుల ఆయా నామములయొక్క, రూపములయొక్క పర్యవసానరూపము నీవే – అని నీచే దర్శింపబడిన (నీకృపమూలముగా) జ్ఞానమును పొందిన మహాత్ములు పొగడుచున్నారు– అని భావము.

ఇందు హయగ్రీవస్వామియొక్క సర్వశబ్దవాచ్యత్వము, విశ్వాకారము తెలుపబడినవి.

**12. ముగ్ధేందునిష్యందవిలోభనీయాం**
**మూర్తిం తవానందసుధాప్రసూతిమ్ ।**
**విపశ్చిత శ్చేతసి భావయంతే**
**వేలా ముదారా మివ దుగ్ధసింధోః ॥**

ముగ్ధ + ఇందు= బాలచంద్రునియొక్క, నిష్యంద =వెన్నెలవలె, విలోభనీయాం = మనోహరమైనది, ఆనంద = ఆనందమనెడి, సుధా = అమృతమునకు, ప్రసూతిం = జన్మస్థానము (కావుననే), దుగ్ధసింధోః = పాలసముద్రముయొక్క, ఉదారాం =గొప్పదైన, వేలాం = సేతువువలె, (అభివృద్ధివలె, తీరమువలె) ఉన్న, తవ = నీయొక్క, మూర్తిం = రూపమును, విపశ్చితః = విద్వాంసులు, చేతసి = మనస్సుయందు, భావయంతే = భావించుచున్నారు (ఉపాసించుచున్నారు).

యోగులును మోక్షసిద్ధికొఱకు నిన్నే ఉపాసించుచున్నారనుట ఇందలి ప్రధానవిషయము. లేక, "నీవు పల్కు విధముగా నన్ను సర్వాధికునిగా ఎవరైనను ఉపాసించిరా?" అని భగవానుడు ప్రశ్నింపగా, అందులకు సమాధానమును కవి ఇందు తెలుపుచున్నారనియు చెప్పవచ్చును.

బాలచంద్రుని వెన్నెలవలె మనస్సును హరించునది. ఆనందమును అమృతప్రవాహమును ప్రవహింపచేయునది, పాలసముద్రముయొక్క అవధివలె నున్నదగు నీ రూపమును యోగులు తమ మనస్సున నిలుపుకొని, ధ్యానము చేయుచున్నారు– అని భావము.

**13. మనోగతం పశ్యతి య స్సదా త్వాం**
**మనీషిణాం మానసరాజహంసమ్ ।**
**స్వయం పురోభావవివాద (విభావ) భాజః**
**కింకుర్వతే తస్య గిరో యథార్హమ్ ॥**



మనీషిణాం = బుద్ధిమంతులయొక్క, మానసరాజహంసం = మనస్సు అనెడి మానససరస్సులో క్రీడించు గొప్ప హంస అగు, త్వాం = నిన్ను, యః = ఎవడు, సదా = ఎల్లప్పుడు, మనోగతం = మనస్సున నిలచినవానినిగా, పశ్యతి = చూచుచున్నాడో, తస్య = ఆ వ్యక్తియొక్క, గిరః = వాక్కులు, స్వయం = స్వయముగా, పురోభావ = అహమహమికతో, వివాదభాజః = వివాదమును కల్గినవై, యథార్హం = యథాయోగ్యముగా, కింకుర్వతే = కైంకర్యమును చేయుచున్నవి.

శ్రీహయగ్రీవమూర్తిని ఉపాసించినవారికి అప్రయత్నముగానే విద్య లభించునని పల్కుట ఇందలి సారము. లేక, "నన్ను ఆరాధించిన వారికి ఫలితము సిద్ధించుననుట ఎట్లు" అని భగవానుడు ప్రశ్నింపగా, అందులకు కవి "స్వామీ ! నిన్ను ఎల్లప్పుడు మనస్సున ధ్యానించువారి హృదయమును స్థిరనివాసముగా కల్గియున్నావు. వాక్సిద్ధిని కోరి, ఆరాధించువారికి అట్టికి సిద్ధి తనకుతానే కల్గునట్లు అనుగ్రహించుచున్నావు" అని సమాధానమును పల్కుచున్నారనియు చెప్పనగును.

స్వామీ! గొప్ప బుద్ధిని కల్గిన మహాత్ముల మనస్సు అనెడు మానస సరోవరమున విహరించు రాజహంసవు అగు నిన్ను ఏ సాధకుడు తన హృదయమున నిత్యము ధ్యానించునో, అతనికి అమోఘములైన వాక్కులు ప్రథమదశలోనే అహమహకమికతో స్ఫురించి, సేవచేయును. వారు కోరిన వాక్సిద్ధి వారికి కల్గును –అని భావము.

**"సిద్ధే హంసమనౌ వాణీ వాచి నృత్యతి సర్వదా"** అను విష్ణుతిలక సంహితావచనం స్మరణీయం.

**14. అపి క్షణార్ధం కలయంతి యే త్వామ్**
**ఆప్లావయంతం విశదై ర్మయూఖైః ।**
**వాచాం ప్రవాహై రనివారితై స్తే**
**మందాకినీం మందయితుం క్షమం తే ॥**

విశదైః = స్వచ్ఛమైన, మయూఖైః = కిరణములచే, ఆప్లావయంతం = (అమృతధారతో తడపునట్టి) చల్లపఱచునట్టి, త్వాం = నిన్ను, యే = ఎవరు, క్షణ+ అర్ధం అపి = ఒక అరక్షణమైన, కలయంతి = ధ్యానింతురో, తే = వారు, అనివారితైః = అడ్డులేని (ప్రత్యర్థులచే నివారింపబడని), వాచాం ప్రవాహైః = వాక్ ప్రవాహములచే, మందాకినీం = గంగానదినికూడ, మందయితుం = అల్ప వేగమును కల్గినదిగా చేయుటకు, క్షమంతే = సమర్థులగుచున్నారు.

నిన్ను కొల్చువారికి విద్యాలాభము మాత్రమే కాదు వారికి అప్రతిహతకవితా రచనాశక్తియు కలుగును అనుచున్నారు. లేక, "నీవు పల్కిన సిద్ధి చిరకాలము సాధకులు ఆరాధించిన పిమ్మట కదా కల్గునది! శీఘ్రముగా పొందినవారు కలరా?" అని భగవానుడు పలుకగా, అందులకు కవి "స్వామీ! నిన్ను చిరకాలము ఆరాధింప పనిలేదు. అరక్షణము ధ్యానించిన మాత్రముననే, గంగానదీప్రవాహ వేగమును సైతము మించిన వేగమును కల్గిన వాక్కులు వారికి కల్గును" అని పల్కుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ! (తెల్లని) స్వచ్ఛమైన కిరణములతో నీ భక్తులను సర్వాంగము చల్లపఱచునట్టి నిన్ను అరక్షణమైనను ఎవరు మనఃపూర్వకముగా ధ్యానింతురో, వారు తమ వాగ్వేగముతో గంగానదినికూడ తక్కువ వేగమును కల్గినట్లు చేయగల్గుదురు– అని భావము.

**"యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మ చ, వేదాః శాస్త్రాణి విజ్ఞాన మేతత్ సర్వం జనార్దనాత్"** అనునట్లు సమస్త వాఙ్మయము, కళలు స్వామి అనుగ్రహముచే కలుగునుకదా! ఇక కవితను గూర్చి చెప్పవలసిన పని ఏమి? ఇందులకు ప్రస్తుత స్తోత్రకర్త అగు దేశికులే సాక్షి.

**15.** **స్వామిన్! భవద్ధ్యానసుధాభిషేకాత్**
**వహంతి ధన్యాః పులకానుబంధమ్ ।**
**అలక్షితే క్వాపి నిరూఢమూల**
**మంగేష్వివానందథు మంకురంతమ్ ॥**

స్వామిన్ = స్వామీ!, ధన్యాః = అదృష్టవంతులు, భవత్ = నీయొక్క, ధ్యాన = ధ్యానము అనెడి, సుధా + అభిషేకాత్ = అమృతసేచనమువలన, అలక్షితే అపి = కనుపింపనిది అయినను, క్వ = ఒకానొక ప్రదేశమున, నిరూఢమూలం = స్థిరమైన మూలమును కల్గినది, అంగేషు = అవయవములయందు, అంకురతం= ఉద్భవించునదియు, ఆనందథుమ్ ఇవ = ఆనందమువలె నున్నదియు అగు, పులక = అనుబంధం = గగుర్పాటును, వహంతి = పొందుచున్నారు.

కవి ఇందు, ధన్యులు మాత్రమే నీయందు గొప్ప భక్తిని కల్గియుందురను చున్నారు. లేక, "నన్ను ధ్యానించినవారు ఎట్టి ఫలితమును పొందిరో? ఏమో! అది అట్లుండనిమ్ము. వారి అనుభవమును తెలుపుటకు చిహ్నము లేమైన కలవా" అని భగవానుడనగా, అందులకు కవి ఈ శ్లోకముద్వారా భక్తులకు కల్గు రోమాంచనము, అనంతరశ్లోకమునందు ఆనందబాష్పములను వర్ణించుచున్నా రనియు చెప్పవచ్చును. ఉత్కటమైన భక్తి కల్గినపుడు



**"స్వరనేత్రాంగ విక్రియా"** అనునట్లు కంఠస్వరమున, నేత్రమున, శరీరమున మార్పు కల్గును కదా!" **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః"** అను ప్రసిద్ధప్రమాణ మిచట స్మరణీయము.

స్వామీ ! నీ ధ్యానమనెడి అమృతాభిషేకమువలన మహాత్ములు కంటికి కనుపింపని హృదయప్రదేశమున స్థిరమైన మూలమును కల్గి, అవయవము లన్నిటియందు ఉద్భవించి, వ్యాపించు ఆనందమువలె, తమ శరీరమునందు అంతట గగుర్పాటును పొందుచున్నారు –అని భావము. ((ఆనందథువనగా ఆనందమే). **"స్యాదానందథురానందః"** అని అమరము.)

**16.** **స్వామిన్ ! ప్రతీచా హృదయేన ధన్యాః**
**త్వద్ధ్యానచంద్రోదయవర్ధమానమ్ ।**
**అమాంత మానందపయోధి మంతః**
**పయోభిః రక్ష్ణాం పరివాహయంతి ॥**

స్వామిన్ = స్వామీ!, ధన్యాః = భాగ్యవంతులు, ప్రతీచా = అంతర్ముఖమైన, హృదయేన = హృదయముతో, త్వత్ = నీయొక్క, ధ్యాన= ధ్యానము అనెడి, చంద్ర + ఉదయ = చంద్రోదయమువలన, వర్ధమానం = పెంపొందు, అంతః = మనస్సులోన, అమాంతం = నిరవధికమైన, ఆనందం = ఆనందమనెడి, పయోధిం= సముద్రమును, అక్ష్ణాం = కన్నులయొక్క, పయోభిః = నీటిచే, పరివాహయంతి = ప్రవాహమును కల్గినదానినిగా చేయుచున్నారు.

హయగ్రీవభగవానుని ధ్యానించువారు బ్రహ్మానందమును పొందుదురనుట ఇందలి సారాంశము. పూర్వశ్లోకమున హయగ్రీవ భగవద్భక్తుల పులకాంకురములు వర్ణింపబడగా, ఇందు ఆనందబాష్పములు వర్ణింపబడుచున్నవి.

స్వామీ! అంతర్ముఖమైన మనస్సుతో నీ భక్తులు చేయు ధ్యానము చంద్రోదయము వంటిది. వారి మనస్సులో (భగవద్ధ్యానమువలన) కల్గిన ఆనందము అను సముద్రమును ధ్యానమనెడి చంద్రోదయము వృద్ధి పొందించుచున్నది. వారి మనస్సులో ఈ విధముగా పెంపొంది, పెల్లుబికిన అంతు లేని ఆనందసముద్రము బాష్పముల రూపమున బయటకు ప్రవహించుచున్నదని భావము.

**17.** **స్వైరానుభావా స్త్వదధీనభావాః**
**సమృద్ధవీర్యాః (సంరుద్ధవీర్యాం) త్వదనుగ్రహేణ ।**

**విపశ్చితో నాథ ! తరంతి మాయాం**
**వైహారికీం మోహనపింఛికాం తే ॥**

నాథ = స్వామీ!, స్వైర+అనుభావాః = నిరంకుశమైన ప్రభావమును కల, త్వత్+ అధీనభావాః = నీయందు ఎల్లప్పుడును (లగ్నమైన) అధీనమైన భావమును కల, విపశ్చితః = జ్ఞానులు, త్వత్ + అనుగ్రహేణ = నీయొక్క ప్రసాదము కారణముచే, (నీసంకల్పముచే) సమృద్ధవీర్యాః = మిక్కిలి అభివృద్ధి చెందిన ఆనందానుభవమును కల్గినవారై, (సంరుద్ధవీర్యాం = అడ్డగింపబడిన శక్తిని కల్గినది), వైహారికీం = నీ లీలకు ఉపకరణమైనది, మోహనపింఛికాం = సకలలోకములను సమ్మోహనపఱచు ఇంద్రజాలిక పింఛమువలె నున్నదగు, తే = నీయొక్క, మాయాం = ప్రకృతిని, తరంతి = దాటుచున్నారు.

భగవానుని అనన్యమైన మనస్సుతో ధ్యానించువారు, భగవన్మాయకు లోనుకారను విషయమిచట ప్రస్తుతింపబడుచున్నది. లేక, "నన్ను ధ్యానము చేయువారికి పులకలు కల్గుట, ఆనందబాష్పములు కల్గుటవంటి దృష్టఫలములే తప్ప, సంసారబంధమునుండి వారు విడివడిరా ?" అని భగవానుడు ప్రశ్నింపగా, అందువలకు కవి, "స్వామీ! నీ అనుగ్రహముచే వారు ప్రకృతిసంబంధమునుండి దూరము కాగల్గుచున్నారు" అని పల్కుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ ! నిరంకుశప్రభావమును కల్గినవారు, నీయందు నిత్యము అగ్నమైన మనస్సును కలవారు, కావుననే మిక్కిలి వృద్ధి చెందిన, అడ్డు లేని ఆనందానుభవమును కలవారు అగు విద్వాంసులు (నీ అనుగ్రహమువలన నిరోధింపబడిన మోహనశక్తిని కల్గినది) నీకు ఉపకరణమైనది, సర్వజగత్తును మోహింపచేయు ఇంద్రజాలికుని చేతిలోని పింఛమువలె నున్నదియును అగు మాయను దాటుచున్నారు– అని భావము.

**18.** **ప్రాఙ్నిర్మితానాం తపసాం విపాకాః**
**ప్రత్యగ్ర నిఃశ్రేయససంపదో మే ।**
**సమేధిషీరన్ తవ పాదపద్మే**
**సంకల్పచింతామణయః ప్రణామాః ॥**

ప్రాక్ +నిర్మితానాం = పూర్వము సంపాదించిన, తపసాం = తపస్సుల యొక్క విపాకాః = ఫలములవంటివి, మే = నాకు, ప్రత్యగ్ర = నూతనమైన, నిఃశ్రేయససంపదః = మోక్షసంపదను కల్గించునవి, సంకల్ప = కోరికల విషయమున, చింతామణయః = చింతామణివంటివి అగు, తవ =నీయొక్క, పాదపద్మే = పద్మములవంటి పాదములయందలి, ప్రణామాః = (నా) నమస్కారములు, సమేధిషీరన్ = అభివృద్ధినొందునుగాక !



పూర్వజన్మమున గొప్ప తపస్సు చేసినవారికిని నీ మాయను దాటుటలో నీ పాదారవిందములందు ప్రణమిల్లుటయే సాధన మనుచున్నారు. లేక, ఇంతవరకును భక్తియోగనిష్ఠులనుగూర్చి పల్కిన కవి, ఇందు ప్రపత్తినిష్ఠులను గూర్చి పల్కుచున్నారు – అని చెప్పనగును. అనగా – జన్మాంతరసుకృతఫలము వలన భగవానుని పాదారవిందములలో ప్రపత్తిని చేసినవారు ఆ స్వామి అనుగ్రహముచే సంసారమును దాటి కృతార్థులగుచున్నారు. కావున ప్రపత్తి సకలఫలసాధనమని పల్కుచున్నారు. లేక, పూర్వశ్లోకమున తెలుపబడిన మాయను పోగొట్టు ఉపాయము ఇందు తెలుపబడుచున్నది– అని చెప్పవచ్చును.

నీ పాదపద్మములయందలి నా ప్రణామములు పూర్వజన్మార్జితములైన తపస్సులయొక్క ఫలములవంటివి, వెంటనే ఈ జన్మలోనే మోక్షమను సంపదను నాకు అనుగ్రహించునవి, నా కోరికను సఫలములు చేయు చింతామణులవంటివి. అవి వృద్ధి పొందునుగాక !– అని భావము.

**19.** **విలుప్తమూర్ధన్యలిపిక్రమాణాం**
**సురేంద్రచూడాపదలాలితానామ్ ।**
**త్వదంఘ్రిరాజీవరజఃకణానాం**
**భూయాన్ ప్రసాదో మయి నాథ ! భూయాత్ ॥**

నాథ = స్వామీ!, విలుప్త = లోపింపజేయబడిన, మూర్ధన్య = లలాట మందలి, లిపిక్రమాణాం = (విపరీతమైన లేక వ్యతిరేకమైన) వర్ణక్రమమును కల్గినవి, (నుదుటి రాతను సైతము మార్చునవి –అని భావము), సుర + ఇంద్ర = ఇంద్రుడు, బ్రహ్మ మొదలగువారియొక్క, చూడాపద = శిఖాబంధములచే, లాలితానాం = గౌరవింపబడినవి, త్వత్ = అంఘ్రి = నీ పాదములనెడి, రాజీవ = పద్మములయొక్క, రజఃకణానాం = పరాగకణములయొక్క, భూయాన్ = గొప్పదైన, ప్రసాదః = అనుగ్రహము, మయి = నాయందు, భూయాత్ = కలుగుగాక!

పూర్వశ్లోకమున ప్రణామముల అభివృద్ధిని ప్రార్థించిన కవి ఇందు తాము నమస్కరించు భగవత్పాదారవిందపరాగముయొక్క అనుగ్రహమును ప్రార్థించుచున్నారు. లేక, భగవానుడు కవిని చూచి "ఓయీ ! నీ అపేక్షితమును తెలుపుము" అనగా అందులకు "స్వామీ! నీ శ్రీపాదరేణువులను అనుగ్రహింపుము" అనుచున్నారనియు చెప్పవచ్చును. లేక, భగవన్నమనమునకు ప్రతిబంధకమైన లలాటలిపిని తుడిచివేయుమని స్వామిని ప్రార్థించుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ ! బ్రహ్మచే నుదుటిపై వ్రాయబడిన వ్రాతను సైతము మార్చునవి, బ్రహ్మ, ఇంద్రుడు మొదలగువారి శిరస్సులచే దాల్చబడునవి అగు నీ పాదారవింద రజఃకణములయొక్క పరమానుగ్రహము నాకు లభించునుగాక !– అని భావము.

**20. పరిస్ఫురన్నూపురచిత్రభాను–**
**ప్రకాశనిర్ధూతతమోఽనుషంగామ్ ।**
**పదద్వయీం తే పరిచిన్మహేఽంతః**
**ప్రబోధరాజీవవిభాతసంధ్యామ్ ॥**

పరిస్ఫురత్ = అంతటప్రకాశించు, నూపుర = మణిమంజీరములనెడి, చిత్రభాను =సూర్యునియొక్క ప్రకాశ = వెలుగుచే, నిర్ధూత = పోగొట్టబడిన, తమోఽనుషంగాం = చీకటి సంబంధమును కల్గినది, ప్రబోధ = జ్ఞానమనెడి, రాజీవ= పద్మమునకు, విభాతసంధ్యాం = వికసింపచేయు ప్రాతఃసంధ్యయును అగు, తే = నీయొక్క, పదద్వయీం = పదద్వంద్వమును, అంతః = మనస్సులో, పరిచిన్మహే = ధ్యానింతుము.

అజ్ఞానాంధకారమును తొలగించునది, జ్ఞానోదయమును కల్గించునది అగు నీ పాదద్వంద్వమును ధ్యానింతును – అని ఇందు కవి పల్కుచున్నారు. పూర్వ శ్లోకమున కవి భగవానుని పాదధూళిని శిరోభూషణముగా అపేక్షించిరి. భగవానుడును పరమకృపతో అట్లే అనుగ్రహింపగా, పరమానందమును పొందిన కవి, ఆ పాదధూళికి ఆశ్రయమగు పాదారవిందములను స్తుతించుద్వారా వానిపట్ల తమ కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారనియు చెప్పవచ్చును.

అంతటను ప్రకాశించు సూర్యునివంటి మణిమంజీరములచే సూర్యునిచే దూరము చేయబడిన చీకటిని –అనగా –అజ్ఞానమనెడి చీకటిని కల్గినది, జ్ఞానమనెడి పద్మములకు ప్రాతఃసంధ్యవంటిది అగు నీ పదద్వంద్వమును నా మనస్సున ధ్యానింతును– అని భావము.

**21. త్వత్కింకరాలంకరణోచితానాం**
**త్వయైవ కల్పాంతరపాలితానామ్ ।**
**మంజుప్రణాదం మణినూపురం తే**
**మంజూషికాం వేదగిరాం ప్రతీమః ॥**

మంజుప్రణాదం = మనోహరమైన ధ్వనిని కల్గినది (చేయునది) అగు, తే = నీయొక్క, మణినూపురం = మణిమయమైన పాదకటకమును, త్వత్ = నీయొక్క, కింకర = సేవకులయొక్క, (భక్తులయొక్క), అలంకరణ = అలంకారమునందు, ఉచితానాం = తగినవి, త్వయా + ఏవ = నీచేతనే, కల్ప+ అంతర = వేర్వేరు కల్పములలో



(సమయములలో), పాలితానాం = రక్షింపబడినవి అగు, వేదగిరాం = వేదవాక్కులయొక్క మంజూషికాం =భద్రపఱచు పెట్టెగా (బరిణె), ప్రతీమః = తెలిసికొందుము.

పూర్వశ్లోకమున భగవానుని మంజీరముల ప్రస్తావన రాగా, ఇందు ఆ మంజీరమును కవి అభివర్ణించుచున్నారు.

నీ భక్తులకు తగిన అలంకారముల వంటివియు, నీచేతనే వేర్వేరు కల్పములలో హయగ్రీవరూపమున (హంసరూపమున) రక్షింపబడినవి అగు వేదములను దాచు రత్నపేటికగా మనోహరముగా ధ్వనించు నీ మణిమంజీరమును భావింతును –అని భావము.

**22. సంచింతయామి ప్రతిభాదశాస్థాన్**
**సంధుక్షయంతం సమయప్రదీపాన్ ।**
**విజ్ఞానకల్పద్రుమపల్లవాభం**
**వ్యాఖ్యానముద్రామధురం కరం తే ॥**

విజ్ఞాన = విజ్ఞానమను, కల్పద్రుమ = కల్పవృక్షముయొక్క, పల్లవ+ ఆభం= చిగురుయొక్క కాంతివంటి కాంతిని కల్గినది. (చిగురుతో పోలినది), వ్యాఖ్యాన ముద్రామధురం =వ్యాఖ్యానముద్రచే మనోహరమైనది అగు, తే = నీయొక్క, కరం, చేతిని, ప్రతిభా = మేధ అను, దశాస్థాన్ = వత్తి (దశ)యందు కల, సమయ = సిద్ధాంతము అను, ప్రదీపాన్ = గొప్ప దీపములను, సంధుక్షయంతం= పెంపొందించునదిగా, (వెలుగునట్లు చేయునదిగా) సంచింతయామి = భావించుచున్నాను.

పూర్వశ్లోకమున తెలిపిన విధముగా కవి తన ఆభరణముల శోభయందు ఆసక్తులగుటను గమనించిన హయగ్రీవస్వామి, “ఓయీ ! ఈ ఆభరణముల శోభనే కాక, నా దివ్యాంగముల సొబగును దర్శింపుము” అని సేవను అనుగ్రహింపగా, భగవానుని దివ్యరూపమును దర్శించి సంతుష్టులైన కవి, వ్యాఖ్యానముద్రతో అందమైన భగవానుని దక్షిణకరమును వర్ణించుట ఇందలి విషయము. వరుసగా మూడు శ్లోకములలో శ్రీహయగ్రీవస్వామియొక్క కరవర్ణము చేయబడుచున్నది.

విజ్ఞానమను కల్పవృక్షముయొక్క చిగురువలె ఉన్నది. వ్యాఖ్యానముద్రచే మనోహరమైనది అగు నీ కరమును ప్రతిభ అను వత్తిచివర వెలుగు సిద్ధాంతదీపములను ప్రజ్వరిల్లచేయుదానినిగా భావింతును– అని భావము.

**23. చిత్తే కరోమి స్ఫురితాక్షమాలం**
**సవ్యేతరం నాథ ! కరం త్వదీయమ్ ।**

**జ్ఞానామృతోదంచనలాలసానాం (లంపటానాం)**
**లీలాఘటీయంత్ర మివాఽఽశ్రితానామ్ ॥**

నాథ = స్వామీ !, స్ఫురిత+అక్షమాలం = ప్రకాశించు జపమాలను కల, త్వదీయం = నీకు చెందిన, సవ్య+ ఇతరం కరం = దక్షిణహస్తమును, జ్ఞాన+అమృత = జ్ఞానము అను అమృతముయొక్క, ఉదంచన = పైకి తెచ్చుటయందు (ఉద్ధరణమందు), లాలసానాం (లంపటానాం) = ఆసక్తిని కల, ఆశ్రితానాం =భక్తులకు, లీలాఘటీయంత్రమ్ +ఇవ = లీలార్థమైన ఘటీయంత్రమునువలె (ఏతాము అను యంత్రమువలె), చిత్తే = (నా) మనస్సున, కరోమి = చేయుదును. (నిలుపుకొందునని భావము).

అక్షమాలను ధరించియున్న శ్రీహయగ్రీవ భగవానుని దక్షిణహస్తమును కవి ఇందు వర్ణించుచున్నారు.

స్వామీ ! ప్రకాశించు జపమాలను ధరించియున్న నీ దక్షిణహస్తమును జ్ఞానమును అమృతమును పైకి తెచ్చుటలో మిక్కిలి ఆసక్తిని కల్గిన నీ భక్తులకు ఉపయోగించు సులభమైన ఘటీయంత్రము వలె (ఏతాము అనెడి నీరు తోడు యంత్రమువలె) నా మనస్సున భావించుచున్నాను – అని భావము.

**24.** **ప్రబోధసింధో రరుణప్రకాశైః**
**ప్రవాళసంఘాత మివోద్వహంతమ్ ।**
**విభావయే దేవ ! సపుస్తకం తే**
**వామం కరం దక్షిణ మాశ్రితానామ్ ॥**

దేవ = స్వామీ!, సపుస్తకం = పుస్తకముతో కూడినది, ఆశ్రితానాం = భక్తులకు, దక్షిణం = జ్ఞానమును అనుగ్రహించుటలో సమర్థమైనదగు, (ఉదారమైనదగు), తే = నీయొక్క, వామం = ఎడమ, కరం = చేతిని, అరుణైః= ఎఱ్ఱని, ప్రకాశైః = కాంతుల కారణముచే, ప్రబోధ సింధోః = జ్ఞానమను సముద్రములోని, ప్రవాళసంఘాతం = పగడపు సమూహమును, ఉద్వహంతమ్ ఇవ = ధరించుచున్నదానివలె, విభావయే = భావింతును.

ఇందు పుస్తకమును ధరించియున్న హయగ్రీవస్వామి ఎడమ చేయి వర్ణింపబడుచున్నది.

స్వామీ! పుస్తకమును కల్గినది, భక్తులను రక్షించుటలో సమర్థమైనది అగు నీయొక్క ఎడమ చేయి ఎఱ్ఱని కాంతులను కల్గియుండుటచే, దానిని జ్ఞాన సముద్రమునుండి పైకి తీయబడిన పగడపు సమూహమును ధరించియున్నట్లు భావింతును– అని భావము.



**25.** **తమాంసి భిత్త్వా విశదై ర్మయూఖైః (ప్రకాశైః)**
**సంప్రీణయంతం విదుష శ్చకోరాన్ ।**
**(నిశామయే) విభావయే త్వాం నవపుండరీకే**
**శరద్ఘనే చంద్ర మివ స్ఫురంతమ్ ॥**

విశదైః = స్వచ్ఛమైన, మయూఖైః= కిరణములచే, తమాంసి = చీకట్లను, భిత్త్వా = భేదించి, విదుషః = విద్వాంసులు అను, చకోరాన్ = చోకరపక్షులను, సంప్రీణయంతం = (ఆ కిరణములతో) ఆనందపఱచునట్టి, నవ పుండరీకే = నూతనమైన తెల్లతామరలో, స్ఫురంతం = ప్రకాశించునట్టి, త్వాం = నిన్ను, శరద్ఘనే= శరత్కాలములోని తెల్లని మేఘముపై గల, చంద్రమ్ ఇవ = చంద్రునివలె, విభావయే = భావింతును. (నిశామయే= దర్శింతును)

ఇంతవరకును హయగ్రీవభగవానుని యొక్క అవయవశోభను వర్ణించిన కవి. ఇకపై ఆస్వామి దివ్యమంగళవిగ్రహ శోభను వర్ణించుచున్నారు. సౌందర్యవర్ణనకు పిమ్మట లావణ్యవర్ణను చేయుచున్నారని తాత్పర్యము. లావణ్యమనగా – సముదాయ శోభ. సౌందర్యమనగా –ప్రత్యవయవ శోభ.

తన తెల్లని కాంతులతో చీకట్లను పారద్రోలి, జ్ఞానులు అను చకోర పక్షులను తృప్తిపఱచునది, అప్పుడే వికసించిన తామరపూవులో ప్రకాశించునది అగు నీ రూపమును, తెల్లని శరత్కాలమేఘముపై ప్రకాశించు చంద్రునిగా భావింతును– అని భావము.

**26.** **దిశంతు మే దేవ ! సదా త్వదీయాః**
**దయాతరంగానుచరాః కటాక్షాః ।**
**శ్రోత్రేషు పుంసా మమృతం క్షరంతీం**
**సరస్వతీం సంశ్రితకామధేనుమ్ ॥**

దేవ= స్వామీ!, దయాతరంగ +అనుచరాః = దయా (ప్రవాహ) కెరటములను అనుసరించునవి(దయ అను నదియొక్క కెరటములవంటివి), అగు, త్వదీయాః = నీకు సంబంధించిన, కటాక్షాః = కడగంటిచూపులు, పుంసాం = జనులయక్క, శ్రోత్రేషు = చెవులయందు, అమృతం = సుధను, క్షరంతీం = స్రవించునది, సంశ్రితకామధేనుం = భక్తులకు (స్తోత్రములను పఠించువారికి) అభీష్టప్రదమైనది అగు, సరస్వతీం = కవిత్వసంపదను, సదా = ఎల్లప్పుడు, మే= నాకు, దిశంతు = ఇచ్చునుగాక!

శ్రీహయగ్రీవభగవానుని దేశికులు తమకు గొప్ప కవిత్వశక్తిని ప్రసాదింపు మని ఇందు ప్రార్థించుచున్నారు. ఈ శ్లోకమునకు ముందు రెండు శ్లోకములలో కవి **“విభావయే”**

అనుచు శ్రీహయగ్రీవమూర్తిని ధ్యానించిరి. అందులకు భగవానుడు “ఓయీ! నీవు నా రూపమును ధ్యానించితివి కదా! నన్ను నోరార కీర్తింపుము” అనగా, అందులకు “స్వామీ! నాకు అట్టి స్తుతించు శక్తిని నీవే ప్రసాదింపుము” అని అనుచున్నారనియు చెప్పవచ్చును– అని మణిప్రవాళ వ్యాఖ్య.

స్వామీ! దయానదీతరంగములకు సహచరములు (పోలినవి) అగు నీకడగంటి చూపులు శ్రోతల చెవులలో అమృతమును ఒలికించునది, పఠించినపుడు వినినవారికి అభీష్టసిద్ధిని కల్గించునది అగు గొప్ప వాక్‌శక్తిని నాకు అనుగ్రహింప వలయును– అని భావము.

**27.** **విశేషవిత్పారిషదేషు నాథ!**
**విదగ్ధగోష్ఠీసమరాంగణేషు ।**
**జిగీషతో మే కవితార్కికేంద్రాన్**
**జిహ్వాగ్రసింహాసన మభ్యుపేయాః ॥**

నాథ= స్వామీ!, విశేషవిత్ = సర్వశాస్త్రములలోని విశేషములను తెలిసిన, వారియొక్క, గోష్ఠీ = సభ అను, సమరాంగణేషు = (వాదమను) యుద్ధస్థానములలో, కవితార్కికేంద్రాన్ = గొప్ప కవులను, తార్కికులను, జిగీషతః = జయింపగోరు, మే = నాయొక్క, జిహ్వా +అగ్ర= నాలుక చివర అను, సింహాసనం = ఇంద్రపీఠమును, అభి+ ఉపేయాః = అధిష్ఠింతువు గాక!

కవి ఇందు వాదసమయములలో ప్రతివాదులను ఓడించుటకు భగవానుని సాన్నిధ్యమును ప్రార్థించుచున్నారు. పూర్వశ్లోకమున తమకు గొప్ప కవనశక్తిని అనుగ్రహింపుమని ప్రార్థించిన కవిని చూచి భగవానుడు “ఓయీ! అట్లే కానిమ్ము! నీకు అట్టి శక్తిని అనుగ్రహించితిని” అనగానే, అందులకు కవి సమాధానమును ఈ శ్లోకమున పల్కుచున్నారు.

“స్వామీ! అది చాలదు. మహనీయుల జిహ్వాగ్రమున నీవు అధివసించి, ప్రబంధములను వారిచే పాడించిన విధముగా, నీవు నా జిహ్వాగ్రమున నిలచి, స్తోత్రమును రచింపజేసి, కవితార్కికులను జయింపగోరు నా జిహ్వాగ్ర మను సింహాసనమును అధిరోహించి, నన్ను అనుగ్రహించి, వారిని జయించునట్లు చేయుము.

తాము **“కవితార్కికసింహ”** బిరుదమును పొందుటకు హయగ్రీవానుగ్రహమే కారణమనుటను దేశికులిందు సూచించిరి.



**28.** **త్వాం చింతయన్ త్వన్మయతాం ప్రపన్నః**
**త్వాముద్గృణన్ శబ్దమయేన ధామ్నా ।**
**స్వామిన్! సమాజేషు సమేధిషీయ**
**స్వచ్ఛందవాదాహవబద్ధశూరః ॥**

స్వామిన్ = స్వామీ!, సమాజేషు = విద్వాంసుల సభలలో, త్వాం = నిన్ను, చింతయన్ = ధ్యానించు, త్వత్ + మయతాం = నీరూపమును, ప్రపన్నః= పొందినవాడనై, శబ్దమయేన = శబ్దరూపమగు, ధామ్నా = తేజస్సుతో (శరీరముతో), త్వాం = నిన్ను, ఉద్గృణన్ = స్తుతించుచు, స్వచ్ఛంద = సర్వతోముఖమైన, వాద+అహవే = వాదయుద్ధమున, బద్ధ = బంధింపబడిన, శూరః = ప్రతివాదులను కల్గినవాడనై, సమేధిషీయ = వృద్ధిని పొందును గాక!

హయగ్రీవ భగవానుని సాన్నిధ్యవశముచే ప్రతివాదులను ఓడింతుననుట ఇందలి సారము. తమ జిహ్వాగ్రమున అధిష్ఠించి, పరమతనిరసనమును చేయునట్లు తమను అనుగ్రహింపవలసినదిగా పూర్వశ్లోకమున ప్రార్థించిన కవిని చూచి భగవానుడు, “ఓయీ! నీవు కోరినట్లే చేయుదును. కాని, మఱి నీవు పొందు లాభ మేమి?” అని ప్రశ్నింపగా, అందులకు దేశికులు “స్వామీ! నా నాలుకతోనే స్తుతించుటచే నేను స్తుతి చేసినట్లును అగును. నాకును కొంత ఆనందము కల్గును. మఱియు నన్ను సాధనముగా గొని పరమతనిరసనముతో కూడిన స్వమతస్థాపనము చేయుటకే కదా దాసుడనగు నన్ను నీవు సృజించినది. ఈ సందర్భమున ప్రధానఫలమును పొందువాడవు నీవే అయినను, నేను నీ క్రీడాపరికరమే అయినను, **“రమమాణా వనే త్రయః”** అనునట్లు, **“అహమన్న మదంత మద్మి”** అనునట్లును అప్రధానమైన ఫలితము నాకును కల్గును– అని పల్కుచున్నారని మణిప్రవాళవ్యాఖ్యలో తెలుపబడినది.

స్వామీ! నిన్ను నిరంతరము చిరకాలము ధ్యానించుచు, తత్ఫలితముగా నీ సారూప్యమును పొంది, వాగ్రూపమున నిన్ను స్తుతించుచు, సభలలో సర్వశాస్త్ర నిష్ణాతులైన ప్రతివాదులను, శూరులను వాదయుద్ధమున ఓడించినవాడనై, కీర్తిని పొందెదను– అని భావము.

**“తమ్మైయే నాళుమ్ వణఙ్గి త్తొళువార్క్కు తమ్మైయే ఒక్క అరుళ్‌శెయ్‌వర్”** (తనను నిత్యం ఆరాధించేవారికి భగవానుడు తనతో పరమసామ్యాన్ని అనుగ్రహిస్తాడు) అనే ఆళ్వార్ల సూక్తి స్మరణీయం.

**29. నానావిధానా మగతిః కలానాం**
**న చాపి తీర్థేషు కృతావతారః ।**
**ధ్రువం తవానాథపరిగ్రహాయాః**
**నవం నవం పాత్ర మహం దయాయాః ॥**

నానావిధానాం = అనేకవిధములైన, కలానాం = విద్యలకు, అగతిః = స్థానము కానివాడను (నేర్వనివాడను), తీర్థేషు = పుణ్యతీర్థములయందు, (గురువుల సన్నిధిలో), కృత+అవతారః న = స్నానమాడనివాడను కాదు (సేవించినవాడను కాదు), (కావున, అహం =నేను) అనాథపరిగ్రహాయాః = అనాథులను పరిగ్రహించు నట్టి (రక్షించునట్టి), తవ = నీయొక్క, దయాయాః = కరుణకు, నవం నవం = మిక్కిలి నూతనమైన, పాత్రం = విషయమును అయితిని, ధ్రువం= నిజము.

ఇంతవఱకు శ్రీహయగ్రీవస్వామివలన సకలాభీష్టములను ప్రార్థించిన కవి, ఇందు ఆ స్వామి నిర్హేతుకకరుణ తమపై ప్రసరించుటకై తమయొక్క అనన్యగతికత్వమును అనుసంధించుచున్నారు. ఇట్లు అనుసంధించుట ప్రపన్నుని స్వరూపము. **"న ధర్మనిష్ఠోஉస్మి న చాత్మవేదీ న భక్తిమాన్ త్వచ్చరణారవిందే"** అని శ్రీయామునులు, ఇదే విధముగా కూరేశులు, భట్టరు మొదలగు పూర్వాచార్యులందఱు స్వరూపప్రకాశమగు ఆకించన్య, అనన్యగతికత్వమును ప్రకటించిరి. దేశికులును ఆ పద్ధతిని ఇందు అనుసరించిరి. లేక, భగవానుడు కవిని చూచి, "ఓయీ! నీవు పల్కినట్లే అన్నియు చేయుదుము, కాని నీ ప్రయత్నము కొంచమైనను కావలయును కదా!" అని పల్కగా అందులకు కవి ఇందు సమాధానమును పల్కుచున్నారనియు చెప్పనగును. లేక, రక్షణదీక్షను వహించిన స్వామికి తనకంటె రక్షణీయుడు వేఱొకడు లేడని పల్కుచున్నారనియు చెప్పవచ్చును. ఇదే భావమును దేశికులు దేవనాయకపంచాశత్ స్తోత్రమున **"కిం నామ పాత్ర మపరం మను తే కృపాయాః"** అనుచు ప్రకటించుట ఇచట గుర్తింపదగినది. **"నానావిధానామ్"** ఇత్యాదిగా కర్మయోగరాహిత్యం, **"న చాపి"** ఇత్యాదిగా జ్ఞానయోగరాహిత్యం, తద్ద్వారా భక్తియోగరాహిత్యం సూచితం.

హయగ్రీవస్వామీ! నేను ఏవిద్యను అభ్యసించలేదు. ఏ పుణ్య తీర్థమున స్నాన మాడలేదు. కాని, అనాథులను రక్షించే నీ దయకు వినూత్నమైన పాత్రమైనాను, ఇది నిజం- అని భావము.



**30. అకంపనీయాన్యపనీతిభేదైః**
**అలంకృషీరన్ హృదయం మదీయమ్ ।**
**శంకాకలంకాపగమోజ్జ్వలాని**
**తత్త్వాని సమ్యంచి తవ ప్రసాదాత్ ॥**

అపనీతిభేదైః = పలు అపన్యాయములచేకూడ, అకంపనీయాని = అవిచాల్యములైనవి, శంకాకలంక +అపగమ+ ఉజ్జ్వలాని= సంశయమనెడి దోషములను తొలగించుటచే మిక్కిలి ప్రకాశించునవి, సమ్యంచి = యథార్థములైనవి అగు, తత్త్వాని = చిదచిదీశ్వరములను తత్త్వత్రయములు, మదీయం = నాయొక్క, హృదయం = హృదయమును, తవ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అలంకృషీరన్ = అలంకరించును గాక !

అనన్యశరణ్యుడవగు నీ అనుగ్రహమువలన సమస్తతత్త్వములు నా మనస్సున స్ఫుటముగా ప్రకాశించుచున్నవి- అని అనుచున్నారు.

ఎట్టి కుతర్కములచే అయినను చలింప సాధ్యము కానివి, సంశయ విపర్యయాది దోషములు అన్నియు పోవుటచే మిక్కిలి స్పష్టముగా ప్రకాశించునవి అగు తత్త్వములు నీ అనుగ్రహవిశేషమువలన నా మనస్సును అలంకరించునుగాక!- అని భావము.

**"తత్త్వాని"** అనుటకు తత్త్వత్రయమని కాని, మహదహంకారాది ఇరువది నాల్గు తత్త్వములని కాని చెప్పవచ్చును. ఈ శ్లోకమున తత్త్వార్థములు కుతర్కము లచే చలింప వీలు కానట్లు, ఎట్టి సంశయవిపర్యయాది దోషములు లేకుండునట్లు ఉండవలెనను విషయము తెలుపబడినది.

**"మయర్వఱ మదినలమ్"** అని నమ్మాళ్వార్లు పొందిన విశుద్ధజ్ఞానాన్ని దేశికులు ఇందు ప్రార్థించుచున్నారు.

**31. వ్యాఖ్యాముద్రాం కరసరసిజైః పుస్తకం శంఖచక్రే**
**బిభ్రద్భిన్నే స్ఫటికరుచిరే పుండరీకే నిషణ్ణః ।**
**అమ్లానశ్రీ రమృతవిశదై రంశుభి ప్లావయ న్మాం**
**ఆవిర్భూయా దనఘమహిమా మానసే వాగధీశః ॥**

కరసరసిజైః = పద్మములవంటి నాల్గు హస్తములచే, వ్యాఖ్యాముద్రాం = ఉపదేశముద్రను, పుస్తకం = పుస్తకమును, శంఖచక్రే = శంఖమును, చక్రమును, బిభ్రత్= ధరించుచు, భిన్నస్ఫటిక = ఛేదింపబడిన (భిన్నమైన) స్ఫటికమణివలె, రుచిరే =

మనోహరమైన, తెల్లని, పుండరీకే = తెల్ల తామరయందు, నిషణ్ణః = ఆసీనుడై, అమ్లాన శ్రీః = వాడని కాంతిని (నూతనమైన కాంతిని) కల్గిన (లక్ష్మీదేవితో కూడుకొన్న), అనఘమహిమా = దోషము లేని గొప్పతనమును కల్గిన, వాక్+ అధీశః = వాక్కులకు ప్రభువగు హయగ్రీవమూర్తి, అమృతవిశదైః = అమృతమువలె తెల్లని, అంశుభిః = కాంతులతో, మాం = నన్ను, ప్లావయన్ = తడపుచు, మానసే = (నా) మనస్సున, ఆవిర్భూయాత్ = ప్రకాశించును గాక!

ఈ శ్లోకమున కవి శ్రీహయగ్రీవమూర్తియొక్క అసాధారణస్వరూపమును ధ్యానించుచున్నారు.

పద్మములవంటి నాల్గు చేతులయందు వ్యాఖ్యానముద్రను, పుస్తకమును, శంఖచక్రములను దాల్చిన, స్ఫటికప్రాంతభాగమువలె అందమైన, తెల్లని పుండరీకమున ఆసీనులైయున్న, వన్నె తగ్గని శోభను కల్గిన, దోషము లేని మహిమను కల వాగధీశ్వరుడు (శ్రీహయగ్రీవస్వామి) తన తెల్లని, నిరవధికములైన కాంతులతో సంసారమున తాపమును పొందిన నన్ను సేదదీర్చుచు నా మనస్సున ప్రత్యక్షమగు గాక ! – అని భావము.

ప్రకృతశ్లోకం – **"హయగ్రీవ మహం వందే స్ఫటికాచల సన్నిభమ్, చంద్రమండల మధ్యస్థం సరస్వత్యా సమన్వితమ్, వ్యాఖ్యాం చ పుస్తకం శంఖం చక్రం చ దధతం కరైః, మేఘగంభీరయా వాచా వ్యాఖ్యాం తు నిఖిలాగమాన్, ... ప్లావయంతం జగత్సర్వం స్వదేహోత్థామృతాంశుభిః**" అనే విష్ణుతిలకవచనాలను అనుసరిస్తున్నది. దీనిద్వారా ఈ స్తుతిలో పాంచరాత్రాగమంలోని హయగ్రీవస్వామికి చెందిన రహస్యాలు నిక్షిప్తాలై ఉండే విషయం సూచింపబడింది. వివరాలు ఆచార్యోపదేశగమ్యాలు.

**32.** **వాగర్థసిద్ధిహేతోః పఠత హయగ్రీవసంస్తుతిం భక్త్యా ।**
**కవితార్కికకేసరిణా వేంకటనాథేన విరచితా మేతామ్ ॥**

కవితార్కికకేసరిణా = **'కవితార్కికకేసరి'** అని బిరుదును కల, వేంకట నాథేన = వేంకటనాథకవిచే, విరచితాం = రచింపబడిన, ఏతాం = ఈ, హయగ్రీవ సంస్తుతిం = హయగ్రీవస్తోత్రమును, వాక్ + అర్థసిద్ధిహేతోః = శబ్దార్థముల సిద్ధిని పొందుటకై (వాక్సిద్ధిని, ఐశ్వర్యసిద్ధిని పొందుటకై), భక్త్యా = భక్తితో, పఠత = పఠింపుడు.

స్తోత్రము చివర కవి తన నామమును కూర్చుట ఆ స్తోత్రముయొక్క విశ్వసనీయతను తెలుపును. మఱియు, **"ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే"** అను లౌకికన్యాయము చొప్పున తమ స్తోత్రమును చదివినవారికి కల్గు ఫలితమును



తెలుపవలయును. ఈ రెండు అంశములను దేశికులు ఈ చివరి శ్లోకమున తెలియజేయు చున్నారు.

హయగ్రీవభగవానుని స్తోత్రమును ఈ విధముగా పూర్తిచేసిన కవి, ఎంతయో శ్రమపడి తాము పొందిన ఫలమును మిగిలినవారు ఎట్టి శ్రమ లేకుండ పొందవలెనను ఔదార్యముతో, భక్తులనందఱును పిలచి, ఈ స్తోత్రమును పఠించిన మాత్రముననే తాము పొందినవారును ఫలమును పొందెదరని ఉపదేశించుచున్నారని వేఱొక వ్యాఖ్యాత వివరించెను.

ఓ భక్తులారా ! **"కవితార్కిక కేసరి"** అను పేరును కల వేంకటనాథకవిచే చక్కగా రచింపబడిన ఈ హయగ్రీవస్తోత్రమును భక్తిశ్రద్ధలతో పఠింపుడు. మీకు వాగర్థసిద్ధి కలుగగలదు – అని భావము.

**"కవితార్కికకేసరిణా వేంకటనాథేన విరచితామ్"** అనుటచే స్తోత్రముయొక్క విశ్వసనీయత, **"వాగర్థసిద్ధిహేతోః"** అనుటచే స్తోత్రపఠనప్రయోజనమును సూచింపబడినవి. కవి తమను ప్రథమ పురుషలో నిర్దేశించుకొనుట కవియొక్క వినయమును తెలుపుచున్నది. **"వాగర్థసిద్ధిహేతుమ్"** అను పాఠాంతరమును సంస్తుతికి విశేషణముగా అన్వయింప నగును. ఇచట వాగర్థములనగా లక్ష్మీనారాయణులే – అని కవి అభిప్రాయము. విష్ణుపురాణమున శ్రీపరాశరభగవానులు **"నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ,... తథైవేయం ద్విజోత్తమ, అర్థో విష్ణు రియం వాణీ నీతి రేషా నయో హరిః"** అనుచు జగన్మాత అగు లక్ష్మీదేవి ఎల్లప్పుడు భగవానుని వెంటనుండు నని, విష్ణువువలె ఆమెయు సర్వగత అని, విష్ణువు అర్థము కాగా, ఈమె వాక్కు అని, అతడు నయము, ఈమె నీతి అని తెలిపిరి. ఈ విధముగా వాగర్థముల ప్రతిరూపములగు లక్ష్మీనారాయణులు ఈ శ్లోకమున ప్రస్తుతింపబడిరి. కావున ఈ స్తుతిలో లక్ష్మీహయగ్రీవతత్త్వము ప్రతిపాదితమని పెద్దల అభిప్రాయము. **"వాగర్థసిద్ధిహేతోః"** అనునపుడు వాక్సిద్ధి, అర్థసిద్ధి – అను అర్థమును చెప్పి, హయగ్రీవ ప్రభావం చేత సిద్ధించే జ్ఞానైశ్వర్యాలు రెండు దీని ద్వారా సూచింపబడ్డాయని చెప్పవచ్చు. ఇదికూడా హయగ్రీవమంత్ర వివరణాత్మకమే.

## శతదూషణి గ్రంథంలోని హయగ్రీవస్తుతి శ్లోకాలు

(శ్రీవేదాంత దేశికులు రచించిన శతదూషణి– అనే వాదగ్రంథంలో అక్కడక్కడ తమ ఇష్టదైవమైన హయగ్రీవుని కీర్తిస్తూ పల్కిన శ్లోకాలు ఇవి.)

1. **హయగ్రీవసుధాసింధు హర్షహేషారవోర్మయః ।**
**జయంతి వాదవేలాంతక్షిప్తబాహ్యకుదృష్టయః ॥ (9వ వాదంలో)**

వాదాలనే సముద్రతీరాంతంలో (లేక, వాదసమయం చివరలో) బాహ్యకు దృష్టులను చెల్లాచెదఱు చేసే హయగ్రీవస్వామి అనే అమృతసముద్రం ఆనందంతో చేసే హేషారవాలు (సకిలింపు శబ్దాలు) అనే కెరటాలు వర్ధిల్లుతున్నాయి.

హయగ్రీవుడు ఒక అమృతసముద్రం. **"అమృతవిశదైః అంశుభిః"** అని హయగ్రీవుని కాంతులు అమృత స్వరూపాలైనపుడు, అతడొక సముద్రమే కదా. సముద్రం ఆనందించినపుడు అందులో ఎత్తైన కెరటాలు ఎగిసిపడతాయి. హయగ్రీవుడైన అమృత సముద్రంనుండి కూడా హేషారవాలనే కెరటాలు ఎగిసిపడ్డాయి. సముద్రంలోని కెరటాల తాకిడివల్ల తీరంలో ఉండే వస్తువులు చెల్లాచెదఱుగా అవుతాయి. హయవదనుని హేషారవాలు సామాన్యమైనవి కావు. వేదార్థస్వరూపాలు. వాటి తాకిడితో వేదవిరుద్ధాలను పలికే – బాహ్యకుదృష్టి సిద్ధాంతాలను పలికే – ప్రతివాదులు చెల్లాచెదఱు అవుతున్నారు. అటువంటి హయగ్రీవుని హేషారవాలు సర్వోత్కృష్టంగా వెలుగొందుతున్నాయి.

బాహ్యులంటే వేదాలను ప్రమాణంగా అంగీకరించనివారు. కుదృష్టులంటే – వేదప్రామాణ్యాన్ని అంగీకరించినా, వాటికి అపార్థాలను తెలిపేవారు.

2. **సంప్రజ్ఞాతస్థితి మధిగతే నిర్వికల్పే సమాధౌ**
**శాంతావద్యం స్తిమితబహుళానందసందోహ మంతః ।**
**యత్ తత్ బ్రహ్మ స్ఫురతి యమినాం పూర్ణషాడ్గుణ్యరూపం**
**సా మే నిత్యం హృది హయముఖీ దేవతా సంవిధత్తామ్ ॥ (11వ వాదంలో)**

సంప్రజ్ఞాత సమాధిస్థితిని పొందిన నిర్వికల్పసమాధి స్థితిలో ఉపాసకునకు మనస్సు లోపలి నిరవద్యమైనది, స్తిమితమైనది, పరిపూర్ణజ్ఞానస్వరూపమైనది అయిన ఏ పరమాత్మ స్వరూపం సాక్షాత్కరిస్తున్నదో, అటువంటి, జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజస్సులనే ఆఱు ప్రధాన గుణాలతో పూర్ణుడైన హయగ్రీవస్వామి నా హృదయంలో నిత్యం నిలచి ఉండాలి.

3. **యదాత్మానో వేదా యదనుగుణవర్ణాకృతిజుషః**
**ప్రమాణం యత్రైతే నియత మపరిచ్ఛేద్యవిభవే ।**



**య ఏషా మాహర్తా దనుజమథనో వాజివదనః**
**స మే దేవః శ్రీమాన్ విదళయతు సంమోహ మఖిలమ్ ॥ (14వ వాదంలో)**

భగవదాత్మకాలైన వేదాలు ఏ భగవానుని వర్ణాన్ని, ఆకారానికి అనుగుణమైన వర్ణాన్ని, ఆకారాన్ని కల్గినవై, ఆ స్వామియొక్క అపరిచ్ఛేద్యమైన వైభవానికి ప్రమాణాలు అవుతున్నవో, ఏ భగవానుడు అసురులను వధించి, వేదాలను తిరిగి ఉద్ధరించి తీసికొని వచ్చాడో, ఆ లక్ష్మీహయగ్రీవస్వామి నా అజ్ఞానాన్ని అంతటిని పటాపంచలు చేయాలి.

4. **అబాధాదధ్యక్షప్రభృతిమితివర్గేష్వధికృతం**
**శరీరం యస్యేదం జగదఖిల మంతర్యమయితుః ।**
**స మే తర్క్యై రేతైః నిజవిభవలుంతాకమథనైః**
**ప్రసీదత్వాసీదన్ నిగమశతసీమా హయముఖః ॥ (15వ వాదంలో)**

ఏ భగవానుడు లోకాలను అన్నిటిని తనకు శరీరంగా కలవాడై, వానిలోపల ఉంటూ నియమిస్తున్నాడో, అటువంటి, వందలకొలదిగా గల శ్రుతులచే ప్రతిపాదింపబడే వాడైన హయగ్రీవస్వామి, తన వైభవాన్ని హరించే (లేదనే) వారిని మథించే వాదాలతో నాకు సాక్షాత్కరించి అనుగ్రహించాలి.

5. **అజ్ఞానసంతమస మాశ్రయణోన్ముఖానాం**
**సంవిత్ప్రతీపమహసా సహసా నిరుంధన్ ।**
**విద్యాస్వయంవరపతిః వ్యపహంత్వవిద్యాం**
**సర్వానుభూః స భగవాన్ పురుషోత్తమో నః ॥ (18వ వాదంలో)**

జ్ఞానమనే దీపం యొక్క ప్రకాశంతో, అతనను ఆశ్రయించడానికి ఉద్యుక్తులైన వారి అజ్ఞానమనే చీకటిని వేగంగా పోగొట్టేవాడు, **"విద్యా"** అనే పేరును కల లక్ష్మీదేవిచే స్వయంగా వరింపబడిన పతి, సమస్తజగత్తుకు మూలకారణమైనవాడు, పురుషోత్తముడైన ఆ భగవానుడు మన అవిద్యను నశింపజేయాలి. **"విద్యాస్వయంపరపతిః"** అనే ప్రయోగం ద్వారా హయగ్రీవావతారసందర్భంలో లక్ష్మీదేవి విద్యా అనే నామం కల రూపాన్ని ధరించి స్వామిని వరించిందనే స్వారస్యం సూచితం.

6. **అనన్యచేతసాం పుంసా మజ్ఞాన మవధూన్వతే ।**
**నిరస్తాజ్ఞానగంధాయ నిత్యం సర్వవిదే నమః ॥ (19వ వాదంలో)**

తనను అనన్యభక్తితో ఆరాధించేవారి అజ్ఞానాన్ని పోగొట్టేవాడు, హేయ ప్రతిభటుడు, జ్ఞానాదిసమస్తకల్యాణగుణపూర్ణుడైన హయగ్రీవస్వామికి నమస్కారం

7. **విదిత మనువదంతో విశ్వ మేతద్యథావత్**
**విదధతి నిగమాంతాః కేవలం యన్మయత్వమ్ ।**

**అవిదితబహుభూమా నిత్య మంతర్విధత్తాం**
**హయపరవదనోఽసౌ సన్నిధి స్సన్నిధి ర్నః ॥ (29వ వాదంలో)**

జగత్తు అంతా భగవదాత్మకమనే తాము గ్రహించిన విషయాన్ని వేదాంతాలు యథాతథంగా అనువదిస్తున్నవి. అటువంటి జగద్రూపుడు, పూర్తిగా ఎవరికీ తెలియని గొప్పదైన, పలు విధాలైన మహిమను కలవాడైన హయగ్రీవస్వామి మన మనస్సులలో గొప్ప నిధి వంటి తన సాన్నిధ్యాన్ని అనుగ్రహించాలి.

**8. హయముఖముఖైః తత్తద్రూపై రకర్మవినిర్మితైః**
**ఉపదిశతి యస్తథ్యం పథ్యం సతా మవసీదతామ్ ।**
**జననపదవీయాతాయాతశ్రమాపహరాం ధియం**
**జనయతు స మే దేవః శ్రీమాన్ ధనంజయసారథిః ॥ (34వ వాదంలో)**

కర్మవల్ల కాకుండా కేవలం కృపవల్లనే ఆవిర్భవించిన హయగ్రీవావతారం మొదలైన ఆయా అవతారాల ద్వారా సంసారంవల్ల ఆర్తిని పొందిన మహనీయులకు యథార్థమైన హితాన్ని ఉపదేశించేవాడైన ఆ దేవుడు, లక్ష్మీపతి, విజయసారథి నాకు మాటిమాటికి జన్మించడంవల్ల కలిగే శ్రమను తీర్చే జ్ఞానాన్ని (తత్త్వజ్ఞానాన్ని) కల్గించాలి. (మళ్ళీ పునర్జన్మ లేని రీతిలో అనుగ్రహించాలి.)

**9. నమ స్త్రేధా విభక్తానా మాత్మనా మంతరాత్మనే ।**
**బ్రహ్మణే హయవక్త్రాయ బంధమోక్షైకహేతవే ॥ (36వ వాదంలో)**

బద్ధులు, ముక్తులు, నిత్యులనే మూడు విధాలైన జీవులకు అంతరాత్మ అయినవాడు, బంధమోక్షాలకు హేతువైనవాడు, పరబ్రహ్మ అయిన హయగ్రీవునకు నమస్కారం.

**10. జ్ఞానానందగుణోపేతం జ్ఞానానందమయం మహః ।**
**పాయా దపాయాత్ భవతో భవబంధవిధాయకాత్ ॥ (38వ వాదంలో)**

జ్ఞానానందాలను స్వరూపంగా కలవాడు, వాటిని గుణాలుగా కలవాడు, తేజః స్వరూపుడైన హయగ్రీవుడు సంసారబంధాన్ని కల్గించే అపాయంనుండి మిమ్ములను రక్షించుగాక!

**11. స ఏకో దుర్లంఘత్రిగుణనిజమాయానిగళితైః**
**విచిత్రైః క్షేత్రజ్ఞైః విహరతి సరోజాసహచరః ।**
**జగత్సర్గక్షేమక్షపణపరికర్మీణమహిమా**
**దయాళుః దేవోఽసౌ తురగవదన స్తారయతు నః ॥ (42వ వాదంలో)**



దాటడానికి సాధ్యం కానిది, త్రిగుణాత్మకమైనది అయిన ప్రకృతి అనే పాశాలతో కట్టబడినవారు, విచిత్రమైన – వివిధమైన స్వరూప స్వభావాలను కల్గిన – జీవులతో ఆ ఒక్క దేవుడైన లక్ష్మీపతి క్రోడిస్తున్నాడో, జగత్తుయొక్క సృష్టిస్థితిసంహారాలనేవానిచే అలంకరింపబడే – శోభిల్లే– మహిమను కలవాడు, కరుణాళువులైన ఆ హయగ్రీవస్వామి మనలను ఉద్ధరించాలి.

**12. అనన్యానాం పుంసాం నిరవధికభక్తిస్థితిజుషామ్**
**అవిద్యాధ్వంసో యచ్చరణపరివస్యాపరిణతేః ।**
**తదేకం తత్సంవిత్ సుఖమవధిదూరీకృతగుణం**
**హతాశేషావద్యం హయవదన మీడీమహి మహః ॥ (43వ వాదంలో)**

భగవదేకమనస్కులై, నిరవధికమైన పరమభక్తిని కల్గినవారియొక్క అజ్ఞానం ఏ హయగ్రీవుని సేవాపరిణతివల్ల నశిస్తున్నదో, అటువంటి, అవధి లేని అద్వితీయమైన జ్ఞానస్వరూపుడు, ఏ హేయగుణాన్ని లేనివాడు, జ్యోతిస్స్వరూపుడైన హయగ్రీవుని కీర్తిస్తున్నాము.

**13. త్రివిధచిదచిదంతర్యామితాం ప్రాప్య తిష్ఠన్**
**నిఖిలనిగమనిష్ఠైః నిత్య మైక్యోపదేశైః ।**
**భ్రమ మమలధియాం యో వారయత్యేకభక్త్యా**
**భవతు శరణవాణీ తత్పదే శాశ్వతీ నః ॥ (49వ వాదంలో)**

మూడు విధాలైన చిదచిత్తులలో అంతర్యామిగా వేంచేసి ఉన్నవాడై, సకల వేదాలచేత తెలుపబడే విశిష్టాద్వైతత్త్వోపదేశాలతో నిర్మలమైన బుద్ధిని కల్గిన భక్తులకు కలిగే భ్రమలను పోగొట్టే హయగ్రీవుని పాదాలలో అనన్యభక్తిపూర్వకమైన శాశ్వతమైన శరణాగతిని మనం చేయాలి.

**14. హతాశేషక్లేశా నిరవధికమహానందధనినో**
**వయం భూయాస్మేతి స్థిర మనఘవర్త్మన్యధికృతాః ।**
**అనాఘ్రాతద్వంద్వా హయముఖపదద్వంద్వరుచయః**
**స్వదంతాం మేఽనంతః శ్రుతిజలధిముష్టింధయధియః ॥ (50వ వాదంలో)**

ఏ దుఃఖం లేని, నిరవధికమైన మహానందమనే ధనాన్ని కల్గినవారం మనం కావాలి – అనే స్థిరమైన, పాపరహితమైన మార్గంలో అధికారాన్ని కలవారు, సుఖదుఃఖాలు, కామక్రోధాలు, ఈర్ష్యాసూయాలవంటి ద్వంద్వాల స్పర్శను లేనివారు, హయగ్రీవుని శ్రీచరణాలలో భక్తిని కలవారు, వేదాలనే సముద్రాన్ని పుడిసిట పట్టిన బుద్ధిని కలవారైన మహాత్ములు నాకు రుచించాలి – వారి విషయంలో భక్తిని కలవాడను కావాలి.

## మహావిద్వాన్, తర్కతీర్థం, శ్రీకస్తూరి రంగాచార్యస్వామి ప్రణీతమైన

# శ్రీలక్ష్మీహయవదనమంత్రమాలికాస్తుతి

శ్రీలక్ష్మీహయగ్రీవస్వామి విషయంలో మంత్రాలు అనేకం ఉన్నాయి. **"ఋగ్యజుస్సామరూపాయ వేదాహరణకర్మణే, ప్రణవోద్గీథవపుషే మహాశ్వశిరసే నమః"** అనే 32 అక్షరాలు కల్గిన అనుష్టుభ్ శ్లోకరూపంలోని మంత్రం హయగ్రీవోపనిషత్ ప్రసిద్ధమైనది. ఈ మంత్రానికి ముందు ప్రణవాన్ని చేర్చి అనుసంధించాలి. అప్పుడు మొత్తం ముప్పై మూడు అక్షరాలను ఈ మంత్రం కల్గినది అవుతుంది. ఈ అక్షరాలు వరుసగా– 1) ఓమ్, 2) ఋక్, 3) య, 4) జుస్, 5) సా, 6) మ, 7) రూ, 8) పా, 9) య, 10) వే, 11) దా, 12) హ,13) ర, 14) ణ, 15) కర్, 16) మ, 17) ణే, 18) ప్ర, 19) ణ, 20) వోద్, 21) గీ, 22) థ, 23) వ, 24) పు, 25) షే, 26) మ, 27) హాశ్, 28) వ, 29) శి, 30) ర, 31) సే, 32) న, 33) మః– అనే క్రమంలో ఉంటాయి.

ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలనే మూడు వేదాలను తనరూపంగా కలవాడు, వేదాలను ఉద్ధరించి బ్రహ్మకు తిరిగి ఇచ్చినవాడు, ప్రణవమని చెప్పబడే (సామ అవయవాలలో ఒకటైన) ఉద్గీథమే మూర్తీభవించినవాడు, గొప్ప అశ్వశిరస్సును కలవాడైన ఆ హయగ్రీవునకు నమస్కారం – అని ఈ మంత్రంయొక్క భావం.

మంత్రాలు సామాన్యంగా చాలా తక్కువ సంఖ్యలో అక్షరాలను కల్గి ఉంటాయి షడక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి – అనే రీతిలో తక్కువ అక్షరాలను కల్గిన రూపంలో క్లుప్తంగా ఉండే మంత్రాలను చాలా నియమాలతో జపించాలి. విధింపబడిన నియమాలను అనుసరించి జపించకపోతే ఆశించిన ఫలాలు లభించవు.

కాని, ఆ విధంగా కఠిన నియమాలను అనుసరించి జపించలేనివారి గతి ఏమి? – అని అంటే, ఎక్కువగా అక్షరాలను కల్గిన మంత్రాలు అయితే వాటిని జపించడంలో ఎక్కువ నియమాలను పాటించనక్కఱలేదనే క్రమం ఉన్నది. అందువల్ల, అల్పశక్తిని కలవారు ఎక్కువ అక్షరాలను కల మంత్రాలను అనుసంధించడం (జపించడం) మంచిది. ఈవిధంగా ఎక్కువ సంఖ్యలో అక్షరాలను కల మంత్రాలను **"మాలామంత్రాలు"** – అని పేరు. పైన ప్రస్తావించిన **"ఋగ్యజుస్సామరూపాయ"** ఇత్యాది మంత్రాలవంటివే ఈ మాలామంత్రాలు.

అయితే, ఈ మాలామంత్రాలు కూడా, కొన్ని కనీసనియమాలను పాటించినపుడే ఫలాన్ని ఇస్తాయి. అటువంటి అల్పనియమాలను కూడా అనుష్ఠించలేని అల్పశక్తుమైన



మనవంటివారికి ఏమి గతి? అంటే, ఆ మంత్రాలలోని అర్థాన్ని వివరిస్తూ పెద్దలు అనుగ్రహించిన స్తోత్రాలను అనుసంధించి ఆశించిన ఫలాలను పొందవచ్చు. వీటి అనుసంధానం క్రమక్రమంగా మనకు పవిత్రతను కల్గించి, భగవదనుగ్రహానికి పాత్రులను చేస్తుంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని కూరేశుల శిష్యులైన కూరనారాయణజీయర్ శ్రీసుదర్శన మంత్రార్థాన్ని సుదర్శనశతకంగా అనుగ్రహించారు. శ్రీదేశికులు పలు మంత్రాల అర్థాలను పలు స్తోత్రాల రూపంగా అనుగ్రహించారు. హయగ్రీవమంత్రార్థం హయగ్రీవ స్తోత్రంగా, గోపాలమంత్రం గోపాలవింశతిగా రూపొందాయి. కూరనారాయణజీయర్ శ్రీదేశికులువంటి పూర్వాచార్యులు చూపిన క్రమాన్ని అనుసరిస్తూ అనంతరకాలంలో పలువురు మహానుభావులు పలు మంత్రాల అర్థాలను ఈ విధంగా స్తోత్రాల రూపంలో వెలయించారు. అటువంటి అర్వాచీన పండితులో ఒకరు, **మహావిద్వాన్, తర్కతీర్థం, కస్తూరి రంగాచార్యస్వామివారు.** వీరు, 19వ శతాబ్దిలో వెలిగిన ప్రముఖ **చతుఃశాస్త్రపండితులలో ఒకరు.** తర్కశాస్త్రంలో సాటి లేని పాండిత్యాన్ని కలవారు, వీరు. పైన పేర్కొన్న హయగ్రీవానుష్టుభ్ మంత్రంలోని ఒక్కొక్క అక్షరాన్ని శ్లోకంలోని మొదటి అక్షరంగా కూర్చి, 33 శ్లోకాలను గల శ్రీలక్ష్మీహయగ్రీవస్వామి వైభవాన్నిగూర్చి ఒక స్తోత్రాన్ని **"శ్రీలక్ష్మీహయవదన మంత్రమాలికాస్తుతి"** అనే పేరుతో రచించారు. చివరలో ఉండే శ్లోకం ఫలశ్రుతి రూపమైనది. ఈ స్తుతిని పఠించినందువల్ల కలిగే ప్రయోజనాన్ని అది తెల్పుతున్నది.

శ్రీ హయగ్రీవానుష్టుభ్ మంత్రంలోని అక్షరాలను వరుసగా ఆరంభంలో కల్గిన శ్లోకాలతో కూడిన ఈ స్తోత్రం ఒక మాలికయే. వాఙ్మాలికా రూపమైనది. ఇది, శ్రీలక్ష్మీహయగ్రీవస్వామి ప్రీతిలో హృదయసీమలో ధరించే మాలిక – అనే భావం సూచింపబడే రీతిలో దీనికి **"శ్రీలక్ష్మీహయవదన మంత్రమాలికాస్తుతి"** అనే పేరు పెట్టబడింది.

ఈ స్తుతి, ప్రతిపాదంలోను 22 అక్షరాలను కల్గిన **"స్రగ్ధరా"** అనే వృత్తంలో కూర్చబడింది. **"స్రక్"** అంటే – పూమాలిక. **"ధరా"** అంటే ధరించేది. అందువల్ల **"స్రగ్ధరా"** అంటే – మాలికను ధరించినది – అని అర్థం. శ్రీ హయగ్రీవుని విషయంలోని వాఙ్మాలికా రూపమైన ఈ స్తుతి స్రగ్ధరా అనే వృత్తంలో రచింపబడడం చాలా ఉచితం. దీనిని అనుసందించిచే భక్తులు శ్రీలక్ష్మీహయవదన స్వామి అనుగ్రహానికి పాత్రం కాగలరనడంలో ఏ సందేహం లేదు. ఇందులోని శ్లోకాలు దేశికుల హయగ్రీవస్తోత్రంలోని పలు శ్లోకాలను స్మరింపజేస్తాయి.

1. ఓ మిత్యాత్మాన మంతర్నియమితకరణైః ధ్యాయతాం ధ్యాయతీహం
ఓమిత్యేవ స్వయం యః పరిహృతవిహతిం సిద్ధి మాధాతుకామః ।
వక్త్రే వాహస్య తస్య స్తుతి మతిమితవాక్ ప్రస్తువే తన్మనూద్య –
దూర్ణాద్యస్రగ్ధరాభిః విమృదితవివిధావద్యధారాభి రద్య॥

ఇంద్రియాలను నియంత్రించి, **"ఓమ్"** అనే గొప్ప మంత్రంతో హయవదన భగవానుని పెద్దలు ధ్యానం చేస్తారు. వారు చేసిన ధ్యానానికి ప్రీతుడై, వారికి హయముఖుడైన భగవానుడు వారి ఆటంకాలను అన్నిటిని తీర్చి వారికి కార్యసిద్ధిని కల్గిస్తాడు. **"ఓమ్"** అని అంటూ భగవానుడు తాను సంకల్పం చేస్తాడు. (**"ఓమ్"** అనేది అంగీకారాన్ని తెలిపే పదం. ఆ విధంగానే కాగలదు– అనే అర్థాన్ని ఇది తెల్పుతుంది.) అటువంటి హయగ్రీవుని, చాలా అల్పమైన వాక్‌శక్తిని కల నేను ఆ స్వామి వైభవాన్ని తెలిపే మంత్రాలలో ఒక మంత్రంలో గల అక్షరాలను ఒక్కొక్కటిని క్రమానుసారంగా ఒక్కొక్క శ్లోకం ఆరంభంలో కల్గిన స్రగ్ధరా అనే వృత్తంలో కూర్చిన శ్లోకాలతో స్తుతించాలని ఆశపడుతున్నాను. ఈ శ్లోకాలు అన్నీ హయగ్రీవ స్వామి వైభవాన్ని కీర్తించేవి. అందువల్ల శబ్దదోషాలు, అర్థదోషాలు, వక్తృగత దోషాలు, చెప్పే క్రమంలోని దోషాలు – అని ఈ విధంగా పలు రీతులలోని దోషాలు ఎంత బలమైనవి అయినా, వాటిని పోగొట్టగలడు.

ఈ శ్లోకం ఆరంభంలో హయగ్రీవ మంత్రం లోని **"ఓమ్"** అనే మొదటి అక్షరం కూర్చబడింది.

2. ఋగ్భిః శాశస్యమానో మహిమజుషి యజుష్ష్వేష జోఘుష్యమాణః
సామ్నా తోష్టూయమానో మునిజనహృదయాబ్జేషు రారాజ్యమానః।
నీహారోర్వీధరాభాప్రతిభటరుచిభిః కించ వాభాస్యమానః
శ్రేయః స్థేయో విధత్తాం మమ హయవదనాభిఖ్యయాఽఖ్యాయమానః॥

హయవదనుడనే నామంతో ప్రసిద్ధి జెందిన స్వామి ఎటువంటివాడు? అంటే, అతడు ఋగ్వేద మంత్రాలలో పలు చోట్ల గొప్పదైన రీతిలో పొగడబడేవాడు. గొప్పదైన యజుర్వేదంలో మాటిమాటికి మిక్కిలిగా ఘోషింపబడేవాడు. సామవేదంచేత మెండుగా స్తుతింపబడేవాడు. మునిజనుల హృదయపద్మాలలో గొప్పగా ప్రకాశించే రీతిలో ధ్యానింపబడేవాడు, మంచు పర్వతంయొక్క కాంతులతో స్పర్ధించే కాంతులతో గొప్పగా ప్రకాశించేవాడు. అటువంటి హయగ్రీవుడు స్థిరంగా నిలచి ఉండే శ్రేయస్సును (ముక్తిని, లేక, తత్త్వజ్ఞానాన్ని, భక్తిరూప సంపదను) నాకు అనుగ్రహించాలి.



శ్రీదేశికుల హయగ్రీవస్తుతిలోని **"సమాహారస్సామ్నామ్"** అనే శ్లోకంలోని పూర్వార్ధంలో గల భావం ప్రకృతంలో భావనీయం. ఈ శ్లోకం హయగ్రీవమంత్రంలోని **"ఋక్"** అనే రెండవ అక్షరంతో ఆరంభమవుతున్నది.

3. యచ్ఛృత్వచ్ఛాచ్ఛబోధప్రసర మిహ స న శ్ఛందమాత్రాప్రక్లుప్తా –
చిచ్చాచ్చాత్రప్రపంచస్థితిగతినియతిః మూర్ధ్ని తుంగ స్తురంగః।
భంగవ్యాసంగదూరప్రసృమరశరదుద్భూతరాకాసుధాంశు –
జ్యోత్స్నాసచ్ఛాయవిద్యావిసరవితరణస్థూలలక్షో వళక్షః॥

గొప్ప దైవమైన హయగ్రీవుడు, శిరస్సులో ఉన్నతమైన అశ్వరూపాన్ని కలవాడు. అతడు తెల్లని కాంతిని కలవాడు. ఆ స్వామి చాలా ఉదారుడు. అతడు ధారాళంగా దేనిని అనుగ్రహిస్తాడు? అని అంటే, జ్ఞానాన్నే. అతడు చాలా ఔదార్యంతో ఇచ్చే జ్ఞానం ఎటువంటిది? అంటే, ఏకొఱత లేని, శరత్కాలంలో పున్నమినాటి పూర్ణచంద్రుని కిరణాలకు ఏ అడ్డు లేనపుడు అవి అంతటా వ్యాపిస్తాయి కదా! ఆ రీతిలోనే సర్వత్ర వ్యాపించేటపుడు అవి అమృతాన్ని వర్షిస్తాయి. ఆ విధంగా అమృతాన్ని వర్షించే చంద్ర కిరణాలవలె లోకాలను ఉజ్జీవింపజేసే చల్లని స్థితిలో, ఆ హయగ్రీవ స్వామి అనుగ్రహించే జ్ఞానం (అమృత మయంగా, లోకాలను ఉజ్జీవింపజేసేదిగా) అంతట వ్యాపిస్తుంది. ఆ స్వామి తన సంకల్పంతోనే చిత్తు, అచిత్తుల రూపంలోని గొప్పదైన ఈ జగత్తుయొక్క స్థితిని, గతిని, నియమనాన్ని నిర్వహించగలవాడు. అటువంటి ఉదారుడైన హయగ్రీవుడు మనకు చాలా స్వచ్ఛమైన, స్పష్టమైన జ్ఞానవిస్తృతిని అనుగ్రహించాలి.

శ్రీ వాత్స్యవరదదేశికులనే ఆచార్యులు, శ్రీదేశికులకు పరమాచార్యులైన నడాదూర్ అమ్మాళ్ రచించిన **"అభంగురకలాదానస్థూలలక్షత్వ మీయుషే, తుంగాయ మహసే తస్మై తురంగాయ ముఖే నమః"** అనే శ్లోకార్థం ప్రకృతశ్లోకార్థానికి అనుగుణంగా భావనీయం. **"స్థూలలక్షః"** – అంటే – అధికంగా ఇచ్చే ఉదారుడని అర్థం. వలక్షమంటే – తెల్లని– అని అర్థం. హయగ్రీవుడు తెల్లని రంగును కలవాడు కదా! ఈ మూడవ శ్లోకంలో హయగ్రీవ మంత్రంలోని **'య'** అనే మూడవ అక్షరంతో ఆరంభింపబడడం గమనార్హం.

4. జుష్టో దేవ్యా చయాఽవ్యాన్నిగమసముదయద్రోహసంరంభగర్జత్–
దైతేయారణ్యవాహద్విషదుదితరవవ్యక్తికీర్ణాకులస్య।
వక్త్రే వాహస్య హేషాహలహలనినదేఽభూతపూర్వేఽప్రవృత్తే
భ్రాంత్యోరస్థాఽవతీర్య ద్రుతతర మము మాశ్లిష్య యా విస్మితాఽస్తే॥

**"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్ మేల్ మజ్గై"** (క్షణం కూడా విడచి ఉండలేను అని వక్షస్సులో నిత్యవాసం చేసే పద్మావతీదేవి) అనే రీతిలో లక్ష్మి భగవానుని వక్షస్సులో సదా నివసిస్తుంది. అయితే హయగ్రీవమూర్తి ఒడిలో కదా ఆమె వేంచేసి ఉన్నది. ఎందువల్ల ఈవిధంగా మార్పు ఏర్పడింది? అనే విషయానికి స్తుతికర్త ఒక హేతువును ఉత్ప్రేక్షిస్తున్నారు, ఈ శ్లోకంలో.

వేదాలకు ఆపద కల్గించి, ద్రోహం చేయాలనే తొందరలో మధుకైటభుల రూపంలోని అసురులనే అడవిదున్నలు గర్జనలను చేశారు. వాటిని నిర్వీర్యం చేయాలనే వేగంతో శ్రీహయగ్రీవస్వామి గట్టిగా అశ్వజాతిప్రయుక్తమైన సకిలింపును (హేషాశబ్దాన్ని) చేశాడు. ఆ సకలింపు **"హలహలహల"** మని విన్పిస్తుంది. ఈ హేషారూపమైన హలహల శబ్దాన్ని శ్రీహయగ్రీవుడు చేయగానే, అది ముందెన్నడూ ఎక్కడా వినని నూతనమైన గొప్ప ధ్వనిగా రూపొందింది. ఆ శబ్దాన్ని విని, స్వామి వక్షఃస్థలంలోని లక్ష్మీదేవికి భయం కల్గింది. వెంటనే వక్షఃస్థలంనుండి కిందకు దిగి వేగంగా స్వామిని ఆలింగనం చేసికొంది. ఆశ్చర్యాన్ని పొందింది. ఆ విధంగా తన ఒడిని చేరిన లక్ష్మీదేవితోకూడిన హయగ్రీవ స్వామి మనలను కాపాడాలి.

ప్రణవసహితమైన హయగ్రీవ అనుష్టుభ్ మంత్రంలోని **"జు"** అనే నాల్గవ అక్షరంలో ఈ నాల్గవ అక్షరం ఆరంభమవుతున్నది.

**5. సారః సామ్నా ముదారః సరసతరఋచా మృద్ధి మంతర్ధిదూరా**
**భద్రావష్టంభయష్టిః విధినిధి యజుషాం భాగ్య మాథర్వణానామ్।**
**అంగానాం తుంగశృంగం లగతు మమ తురంగోత్తమాంగోఽంతరంగే**
**సద్యో హృద్యాని పద్యాన్యపి పరికలన్ విశ్వవిద్యానిషద్యా ॥**

లోకంలో పలు కళలున్నాయి. ఆ కళలను అన్నిటిని ఎవరు మనకు అనుగ్ర హిస్తారు? శ్రీహయగ్రీవస్వామియేకదా! అందువల్ల అతనిని సమస్తకళలను అనుగ్రహించే ఒక ఆపణంగా (అంగడిగా) చెప్ప వచ్చు. అతడు సామవేదాల గొప్ప దైన సారం అని, సరసతరమైన (భోగ్యాలైన) ఋక్కుల వృద్ధియే అతడు – అని భక్తులు భావిస్తారు. మఱపు (విస్మృతి) లేకుండా ఉండే రీతిలో యజుర్వేదాన్ని అధ్యయనం చేయడం సులభం కాదు. ఎందుకంటే, అందులో పలుచోట్ల ఒకే విధమైన శబ్దం మాటిమాటికి వస్తుంది. ఆ సందర్భంలో కూడా క్రమం తప్పకుండా అందులోని సూక్తులను అధ్యయనం చేయాలి.



యజుర్వేదం అనేది "ఈ రీతిలో యాగాన్ని చేయాలి." – అనే నియమాలతో కూడిన క్రమాన్ని తెలిపే భాగాలతో కూడి ఉంటుంది. అటువంటి యజుర్వేదాన్ని ఏ తొట్రుపాటు, మఱుపు లేకుండా అధ్యయనం చేయాలంటే శ్రీహయగ్రీవుని అనుగ్రహం లేకపోతే వీలు కాదు. అందువల్ల అతడే యజుర్వేదానికి రక్షకమైన చేతిదండంవంటివాడు. అథర్వణవేదాల భాగ్యమే రూపొందినట్లున్నవాడు కూడా ఆ హయగ్రీవుడే. వేదాల అర్థాలను యథాతథంగా తెలియాలంటే వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, శాస్త్రం, శిక్ష, కల్పం, జ్యోతిషం – అనే వేదాంగాలను తెలియాలి. కేవలం వాటిని తెలిస్తే చాలదు. ఉన్నతమైన పర్వత శిఖారాన్ని ఎత్తినట్లుగా వాటిని అధిరోహించి అధిగమించే విద్యను అభ్యసించాలి. శ్రీహయగ్రీవుని అనుగ్రహం ఉంటే, ఆ షడంగాలనే ఉన్నత శిఖరాలను అధిరోహించి ఆనందించవచ్చు. అందువల్ల ఆ హయగ్రీవుడే ఆ ఆఱు అంగాలకు చాలా ఉన్నతమైన శృంగం (శిఖరం) గా పెద్దలు భావిస్తారు.

ఇటువంటి నాల్గు వేదాల, ఆఱు అంగాల రూపుడైన శ్రీ హయగ్రీవుడు నా మనస్సులో వేంచేసి ఉండి, "ఇక ఇక్కడ నుండి ఎక్కడికీ వెళ్ళను" అనే రీతిలో స్థిర నివాసం చేయాలి. భావించిన వెంటనే మనస్సును ఆకర్షించే శ్లోకాలను రచించే శక్తిని నాకు అనుగ్రహించాలి.

శ్రీ దేశికులు శ్రీహయగ్రీవ స్తోత్రంలో అనుగ్రహించిన **"దిశంతు మే దేవ! సదా త్వదీయాః దయాతరంగానుచరాః కటాక్షాః, శ్రోత్రేషు పుంసా మమృతం క్షరంతీం సరస్వతీం సంశ్రితకామధేనుమ్"** అనే శ్లోకంయొక్క అర్థం ఈ శ్లోకం చివరి పాదానుగుణంగా అనుసంధేయం. అదే విధంగా ఆస్తుతిలోని **"సమాహార స్సామ్నాం ప్రతిపద మృచాం ధామ యజుషామ్"** ఇత్యాదిశ్లోకార్థాన్ని ప్రకృత శ్లోకంలోని పూర్వార్ధానికి అనుగుణంగా భావ్యం.

**6. మధ్యే బింబం సుధాంశోః ద్యుమణిమణినిభమణిశ్రోణి భారాజిరాజత్ –**
**హారై స్తారై రుదారై రపహసితసుధాసాగరోత్సారిపూరైః।**
**వామాంకావాసలీలా కుతుకలలితయాఽప్యంకితః పంకజాక్ష్యా**
**శంకాతంకం చ పంకం తిరయతు కరుణాపంకిలః కశ్చిదర్వా॥**

ఒక అమృతసముద్రం ఉన్నట్లు, అందులో పొంగే ప్రవాహం ఉన్నట్లు భావిస్తే, ఆ ప్రవాహం ఎంత తెల్లగా, హృద్యంగా ఉంటుంది! చంద్రమండలం మధ్యలో సూర్యునితో సాటి వచ్చేటట్లు వెలిగే మణుల సమూహంయొక్క కాంతులతో ప్రకాశించే ముత్యాల

మాలను ధరించి వేంచేసి ఉండే శ్రీహయగ్రీవునిరూపం, ఆ అమృతసముద్రంలోని ప్రవాహాన్ని కూడా పరిహసించే రీతిలో ఉంటుంది. ఆ స్వామి వక్షస్సులో నివసించే పద్మాక్షి అయిన లక్ష్మీదేవి స్వామి ఎడమ తొడపై వేంచేసి ఉండడమనే లీలలో ఆసక్తిని కల్గినదై మనోహరంగా ఉన్నది. అటువంటి, సాటిలేని అశ్వముఖాన్ని కల స్వామి, మనపట్ల గల కరుణవల్ల తాను కూడా మనస్సులో కలతను (ప్రేమవల్ల కల్గిన ఆర్తిని) పొందినవానివలె భాసిస్తాడు. ఆ హయగ్రీవ భగవానుడు మనకు సందేహాలు, దుఃఖాలు – అనే బురద లేకుండా చేసి అనుగ్రహించాలి.

ఈ శ్లోకం ఆరంభంలో, హయగ్రీవ మంత్రంలోని **"మ"** అనే ఆఱవ అక్షరం కూర్పబడింది.

**7.** **రూఢా ప్రౌఢాసు వాచాస్వపి పురుషమతివ్యాపృతివ్యాప్త్యపోఢాసు**
**ఆధూతాంతాసు తాసు ప్రతిహతగతితా త్వన్నుతా వాననేఽర్వన్।**
**ఇత్థం సత్యప్యహం యత్తవ గుణగణనారంభసంరంభనిఘ్నః**
**స్థానే తత్ యేన బాలోఽప్యతివితతభుజో విస్తృతిం వక్తి సింధోః॥**

హయగ్రీవస్వామీ! వేదాలు మానవుని మనస్సు యొక్క భావనకు అందనంత దూరంలో ఉండేవి. అవి చాలా గంభీరమైనవి. అంతు లేని విస్తృతిని కల్గినవి. అటువంటి వేదరూప శాస్త్రాలలో కూడా నీ వైభవం పూర్తిగా చెప్పబడలేదు. యథార్థ స్థితి ఈ విధమైనది కాగా, నీ కల్యాణగుణాలను లెక్కించి, స్తుతించాలనే అభినివేశానికి అధీనుడనైన నేను నిన్ను స్తుతించాలని ఆరంభించాను. "ఇది తగినదా?" – అని కొందఱు భావించవచ్చు. కాని, "ఇది తగినదే" – అని నేను భావిస్తున్నాను. ఏవిధంగా? అంటే, సముద్రం యొక్క విస్తృతిని లెక్కించడం వీలు కాకపోయినా, చిన్న బాలుడొక్కడు తన రెండు చేతులను తనకు సాధ్యమైనంతవరకు చాచి, **"సముద్రం ఏతావన్మాత్రమైన విస్తృతిని కల్గినది"** అని అనడం లోకంలో సహజం; ప్రత్యక్షసిద్ధం కదా! అదే రీతిలో, నేను నీ కల్యాణగుణవర్ణనను చేయడం కూడా లోకరీతిలో తగినదే.

ప్రణవసహితమైన శ్రీహయగ్రీవ మంత్రంలోని **"రూ"** అనే ఏడవ అక్షరం ఈ శ్లోకంలోని మొదటి అక్షరంగా కూర్పబడింది.

**8.** **పాతాపాతాళభూమ్యంతరతలనిలయావాసజాయానసారాత్**
**యాతాయాతానుపూర్వ్యా దవిగతజననీగర్భవిభ్రాంతియోగాత్।**
**వేద్యా వేద్యావమర్శ్యాః స్ఖలితగతియతీశానరాజ్యాసభాజ్యః**
**శాంతాశాం తాం సమృద్ధిం వితరతు స మమ వ్యాజవాజీ విరాజీ॥**



తన భక్తుడైన బ్రహ్మదగ్గరనుండి వేదాలను మధువు, కైటభుడనే అసురులు అపహరించి తీసికొని పోయినపుడు, బ్రహ్మకు ఆ వేదాలను తిరిగి తీసికొని వచ్చి ఇవ్వాలనే వ్యాజంతో అశ్వముఖాన్ని పరిగ్రహించి శ్రీహయగ్రీవస్వామి వర్ధిల్లాడు. అటువంటి ఇతడు మనకు అంతు లేని సమృద్ధిని కల్గించాలి. అన్ని (తగని) ఆశల యొక్క అవధిని దాటిన స్థితిని కల్గి ఉండేటట్లుగా ఆ సమృద్ధి ఉండాలి. (మనకు మనస్సులో కలిగే తగని కోరికలను లేకుండా చేసి, కోరదగిన భగవత్సేవలోని ఆశ్రమ దిగంతాలు దాటే రీతిలో సమృద్ధిగా కల్గించాలి). పాతాళం, భూమి, ఆకాశం – ఈ విధంగా పలు చోట్ల లోకులు జన్మలను ఎత్తడం వల్ల ఆయాసంతో మళ్ళ తిరిగి ఇంకొక తల్లి గర్భంలో పడే క్లేశంనుండి మనలను కాపాడే ఆ హయగ్రీవుడు **"వేదీ"** అనబడే వాగ్దేవతచేత ఆరాధింపబడేవాడు. వేది అనబడే ఆ వాగ్దేవత చేత, వేద్యాలైన విషయాలను పరామర్శించేటపుడు ఏ తడబాటు లేని జ్ఞానాన్ని కల భగవద్రామానుజులకు కానుకగా ఇవ్వబడినవాడు. అటువంటి హయగ్రీవస్వామి అంతు లేని సమృద్ధిని మనకు అనుగ్రహించాలి.

ఈ శ్లోకం అష్టప్రాసానుగుణంగా రచింపబడడం విశేషం. ప్రణవసహితమైన హయగ్రీవ మంత్రంలోని **"పా"** అనే ఎనిమిదవ వర్ణం ఈ శ్లోకం మొదట కూర్పబడడం గమనార్హం.

**9.** **యస్మిన్ విజ్ఞానవార్ధావధిజగతి పురో జృంభమాణేఽష్టమూర్తేః**
**మూర్తిః సా దక్షిణాఖ్యా త్రిదశపరిషదా బిందురాలక్ష్యదక్షా।**
**వాణీ సా పద్మ సద్మప్రియతమగృహిణీ కాఽప్యభాణీహ వేణీ**
**పారాశర్యప్రధానోఽప్యగణి మునిగణః పల్వలం పాతు సోఽర్వా॥**

శ్రీహయగ్రీవస్వామి ఒక విజ్ఞాన సముద్రం. ఆ సముద్రం లోకంలో విజృంభించి నపుడు (ఉప్పొంగినపుడు) దేవతలు ఒక యథార్థాన్ని గ్రహించారు. గొప్పజ్ఞానం కల్గినవారికి ప్రతీకగా శివుని రూపమైన దక్షిణామూర్తి ఉదాహరింపబడుతున్నాడు. ఆ దక్షిణామూర్తి నల్గురు మునులకు వటవృక్షంక్రింద జ్ఞానాన్ని అనుగ్రహించాడు. ఆ దక్షిణామూర్తి, శ్రీ హయగ్రీవుడనే జ్ఞానసముద్రంలోని ఒకబిందువు మాత్రంగా దేవతలకు తోచాడు. శ్రీ హయగ్రీవస్వామి అంత గొప్ప జ్ఞానసముద్రం, భగవానుని నాభీపద్మంలో నివసించే చతుర్ముఖుని భార్య అయిన సరస్వతీదేవి ఆ జ్ఞానసముద్రుడైన హయగ్రీవుని ముందు చిన్న ప్రవాహం వంటిది. శ్రీహయగ్రీవుని ముందు వ్యాసుడు మొదలైన ముని సమూహం చిన్న గుంటవలె దేవతలకు తోచింది. ఇటువంటి గొప్పతనాన్ని కల్గిన శ్రీహయగ్రీవస్వామి మనలను కాపాడాలి.

శ్రీ దేశికుల హయగ్రీవస్తోత్రంలోని **"దాక్షిణ్యరమ్యా గిరిశస్య మూర్తిః దేవీ సరోజాసన ధర్మపత్నీ, వ్యాసాదయోఽపి వ్యపదేశ్యవాచః స్ఫురంతి సర్వే తవ శక్తిలేశైః"** అనే శ్లోకభావాన్ని అనుసరిస్తూ ప్రకృత శ్లోకం రచింపబడింది. ప్రణవ సహితమైన శ్రీ హయగ్రీవ మంత్రంలోని **"య"** అనే తొమ్మిదవ అక్షరం ఈ తొమ్మిదవ శ్లోకంలోని మొదటి అక్షరంగా కూర్పబడింది.

**10.** **వేదోద్ధారోద్యతం తత్ ప్రదిశతు మిథునం శర్మ శర్వాదిమానాం**
**సేవాహేవాకభూమోద్యదహమహమికాకుంచనద్వేషి మూర్ధ్నామ్।**
**శీర్షేష్వాభాంతి యస్య ద్విగుణమణిలతాభావభాజః కటాక్షాః**
**కల్యోత్ఫుల్లాంబుజాతప్రమదభరనిరాకారనిస్తంద్రదృష్టేః॥**

శ్రీహయగ్రీవస్వామి, లక్ష్మీదేవి – అనే ఆదర్శదంపతులు మనకు మంగళాలను కల్గించాలి. ఆ దివ్యమిథునం ఎటువంటిది? అంటే – వేదాలను అసురులవద్దనుండి తిరిగి తీసికొనివచ్చే ప్రయత్నంలో అభినివేశాన్ని కల్గినది. శివుడు మొదలైన దేవతలు ఆ దంపతులను సేవించడంకోసం అంతు లేని ఆశను కలవారై, "నేను ముందు, నేను ముందు" అని ఒకరికి మించి ఇంకొకరు పోటీపడుతూ, తమ శిరస్సులతో గెంటుకుంటూ వస్తున్నారు. వీరి ఈ సంరంభాన్ని చూచి ఆదర్శదంపతులు వారిని ప్రేమతో కటాక్షిస్తున్నారు. అందువల్ల, లక్ష్మీదేవియొక్క కటాక్షం, శ్రీహయగ్రీవుని కటాక్షం – అనే రెండు పురులను కల్గిన ఒక మణిమయమైన లత వారి శిరస్సులను అలంకరిస్తున్నట్లున్నది. ఈ రీతిలో కటాక్షించే దివ్యదంపతుల నేత్రాలు ప్రాతఃకాలంలోని సూర్యకిరణాలవల్ల వికసించిన తామరపూల అందాన్ని జయించడంలో ఏనాడూ ఆలస్యం చేయని దృష్టిని కల్గినవి. అటువంటి గొప్పతనాన్ని కల్గిన ఈ దివ్యదంపతులు మనకు సుఖాన్ని కల్గించాలి.

హయగ్రీవ మంత్రంలోని **"వే"** అనే పదవ అక్షరం ఈ శ్లోకారంభంలోని కూర్పబడింది.

**11.** **దాక్ష్యం లక్ష్యేత ధాతుః క్వ ను ఖలు జగతీజాలనిర్మాణలీలా –**
**రంభే సంజ్ఞావిధావప్యథ చ తదుచితానేకమూర్తిప్రక్లృప్తౌ।**
**తత్తత్కృత్యప్రపంచేష్వపి చ దివిషదాం దైత్యపాశాహృతానామ్**
**ఆమ్నాయానాం దయార్ద్రో యది హయవదనో నోద్ధృతిం సంవిదధ్యాత్॥**

సృష్టికర్త అయిన బ్రహ్మ లోకాలను అన్నిటిని సృష్టించే పనిని లీలగా చేయడం ఆరంభించేటపుడు వస్తువులకు పలు పలు పేర్లను పెట్టి, వానికి తగిన రూపాలను



కల్పిస్తున్నాడు కదా! ఆ విధంగా చేయడంలో అతనికి సహాయపడేవి వేదాలేకదా! అంతేకాక, ఇంద్రుడు మొదలైన దేవతలు తమ తమ కృత్యాలను నిర్వహించడంలో హస్తావలంబం ఏది? వేదాలేకదా! ఇటువంటి వేదాలను అధములైన అసురులు ఇద్దరు – మధుకైటభులనే పేర్లను కలవారు – అపహరించుకొనిపోయినపుడు, భగవానుడు దయతో హయగ్రీవ రూపాన్ని దాల్చి, ఆ వేదాలను తిరిగి తీసికొని వచ్చాడు. అతడు ఆ విధంగా అనుగ్రహించి, ఉండకపోతే, బ్రహ్మ, తన సృష్టికార్యాన్ని చేయగలడా? దేవతలు తమ తమ కార్యాలను నిర్వహించగలరా? ఇటువంటిది కదా హయగ్రీవ స్వామి మహిమ!

ఈ శ్లోకం, **''మందోఽభవిష్యన్నియతం విరించో వాచాం నిధే ! వంచితభాగధేయః, దైత్యాపనీతాన్ దయయైవ భూయోఽప్యధ్యాపయిష్యో న్నిగమాన్ న చేత్ త్వమ్"** అని, **"వితర్కడోలాం వ్యవధూయ సత్త్వే బృహస్పతిం వర్తయసే యత స్త్వమ్, తేనైవ దేవ! త్రిదశేశ్వరాణా మస్పృష్టడోలాయిత మాధిరాజ్యమ్"** అనే శ్లోకాల భావాలను అనుసంధిస్తున్నది. శ్రీ హయగ్రీవమంత్రంలోని **"దా"** అనే పదకొండవ వర్ణం ఈ శ్లోకం మొదటగా కూర్పబడింది.

**12.** **హస్తాలంబాయ భూయాత్ స మమ పథి సతాం ప్రస్తవృత్తస్య నిత్యం**
**న్యస్తాశేషాగమాబ్ధే రధిక మపి సమం వస్తునీ యస్య న స్తః।**
**శస్తా మస్తోకధీసంస్తుతిమపి జనయన్ యో నయన్ మోహ మస్తం**
**న్యస్తం య స్సవ్యహస్తే కలయతి చ ముదా పుస్తకం మస్తకేఽర్వా॥**

శ్రీలక్ష్మీహయగ్రీవుడు చతుర్భుజుడు, తన నాల్గు చేతులలో – ఎడమ వైపున గల క్రింది చేతిలో ఒక పుస్తకాన్ని ఆనందంతో పెట్టుకొని ఉంటాడు. దీనితో ప్రసిద్ధిని, కీర్తిని కల్గించే విస్తృతమైన జ్ఞానంతో స్తుతులను రచించే శక్తిని మనకు అనుగ్రహిస్తాడు. అజ్ఞానాన్ని పోగొడుతున్నాడు. సమస్తవేదాల సముద్రాన్ని ఉద్ధరించినవాడైన ఆ హయగ్రీవునకు సాటి వచ్చేది, మించినది అయిన వేఱొక తత్త్వం ఏదీ లేదు . సత్పురుషులు సన్మార్గం నుండి భ్రంశాన్ని పొందిన నాకు ఆ స్వామి నిత్యం చేయూతను ఇవ్వాలి.

ఈ శ్లోకంలో మొదటి అక్షరంగా హయగ్రీవ మంత్రంలోని **"హ"** అనే పన్నెందవ అక్షరం కూర్పబడింది. ప్రతిపాదానికి 21 అక్షరాలను కల ఈ శ్లోకంలో **'స్త'** అనే అక్షరం పలుమార్లు ఆవృత్తం కావడంవల్ల దానివల్ల ఎర్పడే శబ్దాలంకృతి రూపమైన శ్రుతిసుభగత్వం గమనించదగినది.

**13.** **రత్నం యత్ప్రత్నవాచా నిరుపమసుషమాకాంతసీమంతినీనాం**
**సీమంతే నిత్యలాల్యం హృదయసరసిజేఽజస్రధార్యం బుధానామ్।**
**దుగ్ధోదన్వత్తనూజాకరజలజయుగీలాలనోద్యన్మృజాతో**
**నిత్యం నూత్నం హయాస్యం మమ కలయతు తన్నిస్సపత్నం ప్రయత్నమ్॥**

శ్రీ హయగ్రీవుడు ఒక అసమానమైన రత్నం. సాటి, మేటి లేని రూప సౌందర్యాన్ని కల కాంతలవలె లోకంలోనివారిని ఆకర్షించే వేదాలు అనే ప్రాచీన వాక్కుల శిరస్సులనబడే ఉపనిషత్తులలో నిత్యం లాలింపబడే గొప్ప రత్నమే ఈ హయగ్రీవుడు. జ్ఞానులు తమ హృదయకమలాలలో నిత్యం నిరంతరం ఈ రత్నాన్ని నిలుపుకొని ధ్యానిస్తున్నారు. క్షీరాబ్ధినుండి అవతరించిన కుమార్తె అయిన లక్ష్మీదేవియొక్క శ్రీకరాలనే తామరపూవులతో సంవాహనం చేసినందువల్ల ఈ రత్నం ఎల్లప్పుడు రజస్సు లేనిదై (ధూళి లేనిదై – రజోగుణం, తమోగుణం లేనిదై), నిత్యనూతనంగా భాసిస్తున్నది. అటువంటి హయగ్రీవుడనే ఈ రత్నం నా ప్రయత్నాలను అన్నిటిని ఎదురులేనివిగా చేయాలి.

ఈ శ్లోకంలోని మొదటి అక్షరం, హయగ్రీవ మంత్రం లోని **"ర"** అనే అక్షరమై ఉండటం గమనార్హం.

**14.** **ణత్వం యద్భిన్నవృత్తా వఘటిత ముపలభ్యోద్యమాత్ ద్రాగ్విరేముః**
**తే తే నారాయణాఖ్యా మితరవిబుధసాధారణీం కర్తుకామాః।**
**యస్మిన్ తద్యోగరూఢ్యోః గుణమణిజలధౌ పుష్కలం వర్తనం స్యాత్**
**దేవో మాయాధవోఽసౌ దయతు హృది రుజాం సైంధవో బాంధవో నః॥**

**"యస్యాస్మి న తమంతరేమి"** అని అంటూ వేదం జీవాత్మలన్నీ భగవానునకు శేషభూతులని తెలియజేసింది. గోదాదేవికూడా తిరుప్పావై అనే వైకుంఠంలో **"ఉన్దన్నోడు ఉఱవేల్ నమక్కు ఇఙ్గు ఒళిక్క ఒళియాదు"** (నీతో ఉండే నిత్యసంబంధం మాకు ఏనాడూ విడదీయరానిది, వీలు లేనిది) అని అన్నది. ఆ విధంగానే ఇక్కడ శ్రీ హయగ్రీవస్వామి జీవులందఱికి (సర్వవిధ) బంధువుగా తెలుపబడుతున్నాడు.

ఇందువల్లనే భగవానుడు నారాయణుడనే నామంతో నిర్దేశింపబడుతున్నాడు. జీవులమైన మనకు నారాలని పేరు. అయనమంటే – ఉండే చోటు – ఆధారమని పేరు. నారాలనబడే మనకు ఆధారమై, మనలను ధరించేవాడు – భగవానుడు. ఈ క్రమంలో – నారాలకు అయనమైనవాడు – నారాయణుడు – అనే యౌగిక నామం అతనికి ఏర్పడుతుంది. అయితే, ఈ నామం అతనినే తెల్పుతున్నందున ఇది రూఢినామమైనపుడు (నకారస్థానంలో ణకారం వచ్చి) **"నారాయణః"** అనే రూపాన్ని పొందుతున్నది.



ఈవిధమైన లక్షణప్రక్రియను పాణిని మహర్షి విధించాడు. రెండు పదాలు కలిసి ఒక సమస్తపదమై, ఆ సమస్తపదం ఒకనికి యౌగికనామమై, ఆ పదమే అతనిని మాత్రమే నిర్దేశించే రూఢినామమైనపుడు, సమసించిన ఆ రెండు పదాలలో, మొదటి పదంలో **'ర'** అనే అక్షరం ఉంటే, అపుడు రెండు పదాలు కలిసి రూపొందే సమాసంలోని **"న"** అనే అక్షరం **"ణ"** అని (మూర్ధన్యంగా) మాఱుతుంది – అనేది సంస్కృతవ్యాకరణ నియమం.

**"నార"** అనే పదం **"అయన"** అనే పదంతో సమసించినపుడు, అది భగవానునకు యౌగికనామం అవుతున్నది. అదే, అతనిని మాత్రమే నిర్దేశించే రూఢివాచకమవుతున్నది కదా! అందువల్ల పూర్వం తెల్పిన వ్యాకరణనియమానుసారం నకారస్థానంలో ణ కారం రాగా **"నారాయన"** అనే పదం **"నారాయణ"** అనే రూపాన్ని పొందుతున్నది.

వేదంలో శివుడే పరదైవమని కొన్ని చోట్ల తెలుపబడింది. ఇది శివుడనే పేరును కల, తాము ఆరాధించే దైవాన్ని తెల్పుతున్నదని కొందఱు భావించారు. **"శంభు"** అనే పదాన్ని చూపి, **"శంభువే పరదైవం"** అని వేదం తెల్పుతున్నది అని, "**శంభు** శబ్దంచేత తాము ఆరాధించే దైవాన్నే తెల్పుతున్నదని కొందఱు తలుస్తున్నారు.

ఆ వేదంలోనే **"నారాయణః పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః, నారాయణ పరోజ్యోతిః, ఆత్మా నారాయణః పరః"** అని అంటూ స్పష్టంగా "నారాయణుడే పరబ్రహ్మ, నారాయణుడే పరతత్త్వం, నారాయణుడే పరంజ్యోతి, నారాయణుడే పరమాత్మ" అని ఘోషింపబడింది.

"శివుడే పరతత్త్వం, శంభువే పరమాత్మ, నారాయణుడే పరమాత్మ" అని అంటూ ఒకే వేదం తెలిపేటపుడు, శివుడు, నారాయణుడు వేఱ్వేఱు తత్త్వాలై ఉంటే, వేదార్థాలలో పరస్పర విరోధం ఏర్పడుతుంది కదా! అందువల్ల, ఆ ఇరువురు ఒకరే – అని చెప్పవలసి ఉంటుంది – అని కొందరు తలచారు. అయితే, శివుడు వేఱు, నారాయణుడు వేఱు – అని పలు ప్రమాణాలవల్ల స్ఫుటపడుతున్నది. అపుడు ఈ అర్థవిరోధం ఏవిధంగా తీరుతుంది? అంటే, **"శివః, శంభుః"** ఇత్యాది శబ్దాలు "మంగళకరుడు, మంగళాన్ని కల్గించేవాడు" అనే అర్థంలో యౌగిక పదాలై, నారాయణునే నిర్దేశిస్తున్నవి – అని తెలిసికొంటే అర్థవిరోధానికి సమాధానం ఏర్పడుతుంది. అందువల్ల, "నారాయణుడే పరదైవం" – అని వేదం తెలియజేస్తున్నది – అని విశిష్టాద్వైతసిద్ధాంతంలో తెలుపబడింది.

అయితే, శైవులు, "ఈ న్యాయాన్నే శివుని విషయంలో ఎందుకు అన్వయించి చెప్పకూడదు? నారాలు – అనబడే జీవులకు – అయనం – అంటే – ఆధారమై ఉండేవాడు – అనే యౌగిక పదం శివునకు పొసగుతుంది – అని మా సిద్ధాంతానుగుణంగా

నారాయణుడనే నామం శివునకు యౌగికనామం కావచ్చునుకదా! అందువల్ల నారాయణుడనే యౌగిక నామాన్ని కల శివుడే పరదైవం – అని ఎందుకు చెప్పకూడదు?" అని అన్నారు.

మంచిదే, కాని, ఈవిధంగా **"నారాయణ"** నామాన్ని మీరు శివునకు యౌగిక నామంగా చెప్పదలిస్తే, పాణిని మహర్షి చూపిన లక్షణ ప్రక్రియానుసారం **"నారాయనుడు"** అనే రూపంతోనే పరతత్త్వాన్ని వేదం నిర్దేశించి ఉండాలి. అయితే, ఆవిధంగా కాకుండా, వేదం **"నారాయణః"** అని కదా నిర్దేశించింది. ఈ ణత్వం **"నారాయణః"** అనే పదం యౌగిక నామం, రూఢివాచకం – అనే క్రమంలో రూపొందిన పేరు – అనే విషయాన్ని స్పష్టం చేస్తున్నది కదా! ఇక, **"నారాయణః"** – అనే పదం విష్ణువాచకం" – అని లోకంలో ప్రసిద్ధంగా వ్యవహరింపబడుతున్నది. అది కేవలం యోగనామం మాత్రమే అయితే, మీరు ఆ పదంతో శివుని నిర్దేశించవచ్చు. అయితే, అపుడు **"నారాయనః"** అనే రూపాన్నే వేదం నిర్దేశించి ఉండాలి. కాని, వేదం **"నారాయణః"** అని కదా పల్కింది. కనుక పూర్వం తెల్పిన మార్గమే వేదానికి అభిమతమైన క్రమం – అని విశిష్టాద్వైతసిద్ధాంత (శ్రీవైష్ణవ సిద్ధాంత) ప్రవర్తకులైన ఆచార్యులు వివరించారు. ఈ రీతిలో నారాయణ నామంలో ణత్వం (ణకారం) ఉన్నందున, వేదమే ప్రమాణం కాదని వీరశైవులు భావించారు. ఈవిధంగా యౌగికమై, రూఢియై ఉండే పదం యోగరూఢమనబడుతుంది. నారాయణ నామం ఈ విధమైన యోగరూఢం. భగవానునకు నారాయణశబ్దం యోగరూఢక్రమంలో వాచకమైనదనే విషయాన్ని ఆ పదంలోని ణత్వం దృఢీకరిస్తున్నది. ఈ సంగతిని దృష్టిలో ఉంచుకొని ఈ పదునాల్గవ శ్లోకం రచింపబడింది.

**"నారాయణు"**డనే నామమే అన్యదైవాలకు కూడా సాధారణమైనది – అని చెప్పాలని ప్రయత్నించిన వారు **"ణత్వం"** – అనే వ్యాకరణ నియమం తమకు బాధకంగా (అడ్డుగా) ఉండడం గమనించి, ఆ ప్రయత్నాన్ని విరమించారు. ఆ **"నారాయణ"** నామం యోగంగాను, రూఢిగాను కల్యాణగుణ వారిధిని అయిన హయగ్రీవునిలోనే పూర్ణంగా సమన్వయిస్తుంది. అటువంటి ఆ హయగ్రీవస్వామి అనే దైవం లక్ష్మీవల్లభుడు. అతడు మనకు బంధువు. అతడు మన హృదయంలో ఉండే క్లేశాలను అన్నిటినీ పోగొట్టాలి.

ఇంతకు ముందు వివరించిన క్రమంలో ప్రణవసహితమైన శ్రీహయగ్రీవ మంత్రంలో పదునాల్గవ అక్షరమైన **"ణ"** అనే వర్ణంతో ఈ శ్లోకం ఆరంభమవుతున్నది. సంస్కృతభాషలో **"ణ"** అనే అక్షరంతో ఆరంభమయ్యే వేదాలు ఇంచు మించుగా లేవు. అందువల్ల **"ణ"** అనే అక్షరంతో శ్లోకాన్ని ఆరంభించే దారి ఏది? అని ఆలోచన అక్కఱ లేని రీతిలో హయగ్రీవానుగ్రహం స్తుతికర్తకు లభించింది. అందువల్ల **"ణత్వ"**మనే



వ్యాకరణశాస్త్రనియమాన్ని, దానిద్వారా వేదరహస్యం సిద్ధాంతీకరింపబడిన విషయాన్ని స్తుతికర్తకు స్మరింపజేసి, శ్రీహయగ్రీవస్వామియే ఈ శ్లోకాన్ని రచింపజేశాడు. ఈవిధంగా హయగ్రీవుడు భక్తుల తగిన మనోరథాన్ని నెరవేరడానికి ఆవశ్యకమైన జ్ఞానాన్ని అనుగ్రహించి, కాపాడతాడు – అనేదానికి ప్రకృతశ్లోకమే ప్రబల సాక్షి.

**15.** **కర్ణా వర్ణౌజరాజన్ముకులదలసమా వర్ప్వతోఽ నర్ప్వణో మే**
**ప్రోర్ణుయాస్తాం లలాటే కుటిలవిధిసముత్కీర్ణసంకీర్ణవర్ణాన్।**
**వర్ణ్యేతే యావముష్య త్రిభువనవపుషో వ్యోమపాతాళరూపౌ**
**పూర్ణై ర్వాఽ ప్యర్ణసా వా సతత మపి రుచిం పూర్ణయద్భి ర్మహద్భిః॥**

శ్రీహయగ్రీవస్వామియొక్క రెండు చెవులు తామరమొగ్గలవలె ఉన్నాయి. "పర్ణాలను (ఆకులను), నీటిని మాత్రమే భుజించాలి" అనే నియమాన్ని అనుష్ఠిస్తూ తపస్సు చేసే మహాత్ములు, ముల్లోకాలను రూపంగా కల్గిన విశ్వరూపంలో హయగ్రీవస్వామి తమకు భాసించేటపుడు, ఆ స్వామియొక్క ఒక చెవి ఆకాశంగాను, వేఱొక చెవి పాతాళంగాను, స్తుతిస్తున్నారు. ఆ కర్ణాలు తనను (హయగ్రీవుని) సమీపించడానికి సందేహించే నా వరకు వ్యాపించి, నా దుష్కర్మవశంచేత నా లలాటంలో వక్రంగా లిఖింపబడిన రాతలను అన్నిటిని చెఱిపి వేయాలి. నా తలరాత చక్కగా ఉండేటట్లు చేయాలి.

**"విలుప్తమూర్ధన్యలిపిక్రమాణామ్... భూయాత్, ప్రసాదో మయి నాథ భూయాత్"** అనే దేశికసూక్తి స్మరణీయం. ఈ శ్లోకంలో కూడా పూర్వోక్త క్రమంలో, శ్రీహయగ్రీవమంత్రంలోని **"కర్"** అనే అక్షరం మొదటి వర్ణంగా కూర్పబడింది. పదహాఱవ అక్షరం **"ర్మ"** అనే సంయుక్తాక్షర మైనందున, ఈ సంయుక్తాక్షరంతో సంస్కృతభాషలో ఏ పదం ఆరంభ కాదు కనుక, పదహాఱవ అక్షరప్రారంభంలోని **"ర్"** అనే హల్లుతో కలిపి పదిహేనవ అక్షరం ఈ శ్లోకం ఆరంభంలో ప్రయోగింపబడడం గమనించాలి. సంయుక్తాక్షరాలు వచ్చిన సందర్భాలలో ఇదే క్రమాన్ని ఇకపై కూడా ఈ స్తుతిలో అనుసరింపబడడం గమనార్హం.

**16.** **మండల్యా మండనానాం మణిగణఘృణిభిః ఘూర్ణితద్యోమణీనాం**
**నీరంధ్రం మండితాంగః సితకరరుచిరే పుండరీకే నిషణ్ణమ్।**
**ఆమ్నాయానాం శిఖండై రవగతగరిమా ఖండితాఖండలారిః**
**దండం పాషండషండే క్షిపతు స తరసా వాజితుండప్రకాండః॥**

శ్రీహయగ్రీవస్వామి పలు ఆభరణాలు ధరించాడు. ఆ ఆభరణాల సమూహాలలో పొదగబడి వెలిగే రత్నాలు అనేకం. వాటి కాంతుల ముందు బ్రహ్మాండంలో ఉండే పలువురు

సూర్యుల కాంతులు వెలవెలపోతున్నాయి. చంద్రునివలె చల్లదనం, కాంతి, తెల్లదనం – అనే వీటితో నిండిన తెల్లతామర పూవులో అతడు వేంచేసి ఉన్నాడు. ఆ స్వామి మహిమలను మనం ఉపనిషత్తుల ద్వారా తెలియగలం. ఇంద్రుని విరోధులైన అసురులను అతడు నశింపజేస్తాడు. ఆ హయగ్రీవస్వామి పాషండుల సమూహానికి తగిన దండనను వెంటనే ఇచ్చి లోకాలను రక్షించాలి.

ఈ శ్లోకం, శ్రీహయగ్రీవ మంత్రంలోని **"మణ్"** అనే పదహారవ వర్ణంతో ఆరంభమవుతున్నది. మంత్రంలోని పదహారవ అక్షరం **"ర్మ"** అనే సంయుక్తాక్షరం. ఇందులోని **"ర్"** అనే మొదటి వర్ణమైన హల్లు పూర్వశ్లోకం ఆరంభంలోనే కూర్చబడినందున, మిగిలిన వర్ణమైన మకారం ఈ శ్లోకం ఆదిలో కూర్చబడింది. ఇంతేకాక, మంత్రంలోని పదిహేడవ అక్షరం **"ణే"** అనే అక్షరంతో ప్రారంభమయే పదాలు సంస్కృత భాషలో లేవు. అందువల్ల ఈ పదిహేడవ అక్షరంలోని **"ణ్"** హల్ వర్ణాన్ని **"మ"** అనే పదహారవ అక్షరంతో కలిపి **"మణ్"** అని ప్రయోగింపబడడం కూడా గమనించదగినది. ఇక **"ణే"** అనే పదిహేడవ అక్షరంలో మిగిలిన "ఏ" అనే వర్ణంతో పదిహేడవ శ్లోకం ఆరంభమవుతున్నది.

**17.** **ఏకోఽగ్రే లోకమాత్రా సహ మహితవిహృత్యున్మనా స్తన్ముదే యో**
**నాభీపద్మే విధాతుః జని మపి కలయన్ యో నయత్యాగమాం స్తమ్।**
**(నాభీపద్మే విధాయ ద్రుహిణమముమథో యో నయత్యాగమౌఘమ్)**
**లోకామ్నాయైకమూలా క్షరరుచిరకలామాతృకా సా యదీయా**
**సోఽసావిష్టం ప్రకృష్టం ఘటయతు దితిజస్ఫోటకో ఘోటకో నః॥**

మధుకైటభులనే అసురులను మర్దించి సంహరించినవాడు – శ్రీహయగ్రీవుడు. అతడు సృష్టి మొదలైన లీలలను లోకమాత అయిన లక్ష్మీదేవి ఆనందంకోసం చేయదలచాడు. అందుకోసం అతడు తన నాభినుండి పద్మాన్ని జనింపజేశాడు. దానినుండి చతుర్ముఖుని సృష్టించాడు. ఆ చతుర్ముఖునకు వేదాలను ఉపదేశించాడు. లోకంలోని, వేదంలోని వ్యవహారాలకు అన్నిటికి మూలమైనవి అందమైన అక్షరమాతృకలే కదా. అవి అన్నీ ఆ హయగ్రీవస్వామి రూపాలే కదా. అటువంటి ఈ హయగ్రీవస్వామి మన గొప్పలైన అభీష్టాలను అన్నిటినీ ఘటింపజేయాలి.

శ్రీదేశికుల హయగ్రీవస్తోత్రంలోని **"యన్మూల మీదృక్ ప్రతిభాతి తత్త్వం యా మూల మామ్నాయమహాద్రుమాణామ్, తత్త్వేన జానంతి విశుద్ధసత్త్వాః తామక్షరా మక్షరమాతృకాం తే"** – అనే సూక్త్యర్థం ప్రకృతిలో భావనీయం. హయగ్రీవ మంత్రంలోని



**"ణే"** అనే అక్షరంలోని **"ఏ"** అనే అచ్చుతో ఈ శ్లోకం మొదలవుతున్నది. దానికి ముందున్న **"ణ్"** అనే హల్లు పూర్వశ్లోకంలో ఆరంభంలో ప్రయోగింపబడినదని పూర్వోక్తమే. ఇంతవరకు హయగ్రీవ అనుష్టుప్ శ్లోకంలోని పూర్వార్ధం గల అక్షరాలతో శ్లోకాలు ఆరంభమయ్యాయి. ఇక ఉత్తరార్థంలోని అక్షరాలతో రాబోయే శ్లోకాలు ఆరంభమవుతాయి.

**18.** **ప్రణ్యా యేనాధ్వరాణాం మనుమయతను మాధాయ విష్వగ్వినిర్యత్ –**
**జ్వాలామాలాజటాలానలహుతహవిషాం సార మాస్వాద్య చారుమ్।**
**గీర్వాణాన్ వారణానాన్నియమితకరణాన్ స్తూర్ణ మాప్యాయకామాః**
**కల్ప్యంతే యాజమానాః కలయతు స ముదం కోఽప్యనర్వాఽననేఽర్వా॥**

శ్రీహయగ్రీవస్వామి మంత్రమయమైన రూపాన్ని కలవాడు. పలు దిక్కులలో ఎగసే జ్వాలలు అనే జటలతో నిండినదై, విజృంభించి ఎగసిపడే అగ్నిలో ఆ మంత్రాలను పురస్కరించుకొని నిర్వహింపబడే యాగాలను అతడే కదా చేయిస్తున్నాడు. (హయగ్రీవస్వామి అనుగ్రహం లేకుండా యాగం, హోమం మొదలైనవానిని ఎవరూ చేయలేరు. అందువల్ల యాగాలను అతడే చేయిస్తున్నాడని భావం) ఆ యాగాలలో హోమం చేయబడిన వస్తువుల భోగ్యమైన సారాన్ని దేవతలు ఆస్వాదించి, ఆనందించేటట్లు అతడు చేస్తాడు. ఆ దేవతలు అందఱు అతనికి కంచుకాల (చొక్కాల) వంటివారు. (అతడే వారికి అంతర్యామి) వారు చేయదలచిన వానిని అన్నిటినీ అతడే నిర్ణయించాడు. అందువల్లనే దేవతలు అతడు చేసిన నియమాలను అనుసరించి, యాగాలను చేసేవారు కోరే అభిమతాలను అనుగ్రహిస్తున్నారు. ఈ విధంగా అందఱికి మంచిని కల్గించే సుహృత్తు – శ్రీహయగ్రీవస్వామి. ఆ హయగ్రీవుడు మనకు ఆనందాన్ని కల్గించాలి.

ఈ శ్లోకం, దేశికుల హయగ్రీవస్తోత్రంలోని **"అగ్నౌ సమిద్ధార్చిషి"** ఇత్యాది శ్లోకాన్ని అనుసరించి రచింపబడింది. **"భోక్తారం యజ్ఞతపసామ్"** అనే గీతాశ్లోకం యొక్క అర్థం, **"యజ్ఞకృత్"** అనే నామం కూడా అనుసంధేయం. హయశిర ఉపాఖ్యానంలోని–

ఇంతవరకు తెలుపబడిన క్రమంలో, శ్రీహయగ్రీవ మంత్రంలోని పద్దెనిమిదవ అక్షరమైన **"ప్ర"** అనే అక్షరంతో ఈ శ్లోకం ఆరంభమవుతున్నది.

ఈ మంత్రంలోని పందొమ్మిదవ అక్షరం **"ణ"** అనే అక్షరం. అయితే, సంస్కృత భాషలో ఈ వర్ణంతో ప్రారంభమయ్యే పదాలు లేవు కనుక ఈ అక్షరంలోని **"ణ్"** అనే హల్లును పద్దెనిమిదవ అక్షరమైన **"ప్ర"** అనే అక్షరంతో కలిపి **"ప్రణ్"** అని పద్దెనిమిదవ శ్లోకం ఆరంభంలో **"ప్రణ్యా"** అని ప్రయోగింపబడింది. ఇక మిగిలిన **"అ"** అనే అచ్చుతో పందొమ్మిదవ శ్లోకం ఆరంభమవుతున్నది. ఇందువల్ల పద్దెనిమిదవ, పందొమ్మిదవ శ్లోకాలలో

ఆరంభంలోని అక్షరాలను కలిపితే "ప్రణ్+అ"=ప్రణ" అని రూపొందుతుంది కనుక, మంత్రంలోని పద్దెనిమిదవ, పందొమ్మిదవ అక్షరాలు క్రమానుసారంగా స్తుతిలో కూర్పబడినట్లయినది. ఈ విధంగా మంత్రంలోని అక్షరాల క్రమానికి భంగం లేకుండా వరుసగా శ్లోకాల ఆరంభంలో ఆ అక్షరాలను కూర్చిన కవిచాతుర్యం అనితరసాధారణం కదా!

**19. అవ్యాదవ్యాహతార్థో ధియ ముపజనయన్ అవ్యయోఽ వ్యాజవాజీ**
**భవ్యా భవ్యాకృతాద్యాకృతి మతనుత యో నామరూపద్వయస్య।**
**యోఽ ంతర్యంతుం చ మంతుం వ్యదసితు మదిశత్ జంతుజాతస్య యో వా**
**కల్పాంతేఽ ల్పాన్యలోకగ్రసనసముదితాపీనతానందితుందః॥**

శ్రీహయగ్రీవస్వామి ఏ అవరోధం లేని జ్ఞానాన్ని అనుగ్రహించేవాడు. ఏనాడూ మార్పు లేని (వ్యయం లేని) వాడు. లోకంలోని నామాలు, రూపాలు – అనే రెండింటిలో మంగళ – అమంగళ స్థితులున్నాయి. వానిని అన్నిటిని ఏర్పరచినవాడు –ఆ హయగ్రీవస్వామియే. జగత్తులో అందఱు ఆయా నియమాలకు కట్టుబడి ఉండేటట్లుగా, తప్పులను చేయకుండా ఉండేటట్లుగా తగిన నియమాలను, మార్గాలను అనుగ్రహించినవాడతడే. అంతేకాక, కల్పాంతంలో ఈ గొప్ప జగత్తులను అన్నిటినీ గ్రహించి, కడుపులో పెట్టుకొని రక్షించి ఆనందిస్తాడు. అందువల్ల బాగా పెద్దదిగా విస్తరించి ఉండే బొజ్జతో భాసిల్లుతున్నాడు. అటువంటి శ్రీహయగ్రీవస్వామి మనలను కాపాడాలి.

పూర్వం తెల్పిన రీతిలో మంత్రంలోని పందొమ్మిదవ అక్షరమైన "ణ" కారంలోని "ణ్" అనే హల్లు ఇంతకుముందు శ్లోకం ఆరంభంలోనే ప్రయోగింపబడినది కనుక, మిగిలిన "అ" అనే అచ్చుతో ఈ శ్లోకం ఆరంభమైనది.

**20. ఓదన్వన్మేఖలాంతాద్భలినిలయయుతాత్ క్ష్మాతలా దాచలోకాత్**
**నాళీకావాసవాసా దవహితమనసాఽ పీక్షతే స్థాస్నుజాతే।**
**యాదృఙ్నాలక్షి కశ్చిత్ సకృదపి నమతాం సాధ్వసధ్వంసదక్షో**
**భక్తానుక్రోశలక్ష్మా క్షపయతు మమ హృత్క్షోభ మక్ష్ణా సవాజీ॥**

భక్తులవట్ల దయ చూపి, అనుగ్రహించే స్వభావాన్నే తన గొప్పదైన గుర్తుగా (లక్షణంగా) కలవాడు – శ్రీహయగ్రీవస్వామి. పాతాళంతో కూడిన భూలోకంనుండి నాభీకమలంలో నివసించే బ్రహ్మదేవుని, సత్యలోకం వరకు గల అన్ని లోకాలలోను మిక్కిలి ఏకాగ్రత కూడిన మనస్సుతో వెదకి చూచినా, ఆ స్వామివలె దాసుల (భక్తుల) భయాన్ని తీర్చగల్గినవాడు ఇంకొకడు – ఏనాడైనా, ఒకసారి అయినా, ఆవిధంగా చేయగల్గినవాడు – కన్పించడు. అటువంటి హయగ్రీవస్వామి తన కటాక్షాలతో నా మనః క్లేశాలను తీర్చాలి.



ఈ శ్లోకం "ఓత్" అని ఆరంభమవుతున్నది. "ఓత్" అనేది మంత్రంలో ఉండే ఇరవై అక్షరం. ఈ "ఓత్" అనే అక్షరానికి ముందున్న "అవ్" అనే అక్షరంతో కలిపి ఉచ్చరించినపుడు "వోద్" అనే ఇరవైయవ అక్షరంయొక్క రూపం తనకు తానే సిద్ధిస్తుంది.

**21. గీతే దైతేయమోహం కలయితుమనసో యస్య హేషానుషక్తే**
**ప్రఖ్యాతోద్గీథభక్తిం శ్రితవతి జనితే రోధసీరోధకే ద్రాక్।**
**దేవాః సంభ్రాంతభావాః దితిజకుల మలం వ్యాకులం ధూతగర్వా**
**గంధర్వామోహశేషం సమజని జగతీశేష మేషోఽ వతాన్మామ్॥**

మధుకైటభులనే అసురులు మోహాన్ని పొందాలి – అని శ్రీహయగ్రీవస్వామి హేషాధ్వనిని చేశాడు. ఆ ధ్వని ఉద్గీథమనబడే సామమే. దాని అంగాలు అనేకం. వానిలో ఒక భాగం నుండి ఆకాశాన్ని, భూమిని ఆక్రమించే గానం ఉద్భవించినపుడు దేవతలు విభ్రాంతిని పొందారు. అసురులు వ్యాకులంతో తల్లడిల్లారు. గంధర్వులు గర్వాన్ని విడిచారు. జగత్తులోని మిగిలినవారంతా మోహాన్ని పొందారు. అటువంటి హయగ్రీవస్వామి నన్ను కాపాడాలి.

ఈ శ్లోకం, హయగ్రీవమంత్రంలోని 21వ అక్షరమైన "గీ" అనే అక్షరంతో ఆరంభమైనది.

**22. థం కిమ్ శబ్దస్య మూర్ధ్ని క్వచిదుచిత ముపశ్రుత్య తత్పదాదిషు**
**అప్యేతద్యోజయిత్వా కటురటనపటుస్వైరవాచోఽ పి జంతోః ।**
**సద్యః సిద్ధ్యంతి వాణ్యో నమదమరశిస్సద్మ యత్పాదపద్మ–**
**ధ్యానాత్ ద్రాక్షాసదృక్షాః కలితగురుశిరఃకంపనాః పాతు సోఽ ర్వా॥**

"థమ్" అనే అక్షరాన్ని "కిం" శబ్దంతో కలిపితే "కథమ్" అనే పదం ఏర్పడుతుంది. ఈ "కథ"మనే శబ్దం "ఏవిధంగా?" అనే అర్థాన్ని ఇస్తుంది. వాదాలు జరిగేటపుడు ఈ పదం మాటిమాటికి ఉపయోగింపబడుతుంది. ఈ పదం చెవిన పడినపుడు దీనిని విని "అది ఏవిధంగానో, ఇది ఆవిధంగా" అనే అర్థంలో "యథమ్ కథమ్" అనే పదాలను కల్పించి, వాదించాలని ప్రయత్నించే విద్వాంసులుంటారు. ఆ పదాలు "యథా తథా" అనే రూపాన్ని పొందుతాయి తప్ప "యథం కథమ్" అనే రూపాన్ని పొందవు– అనే విషయాన్ని తెలియని ఆ మహావిద్వాంసులు భరించలేని రీతిలో కటువుగా వ్యాకరణ నియమాన్ని ఉల్లంఘిస్తారు. ఆ విధంగా అఱకొఱ జ్ఞానాన్ని కల్గినవారుకూడ హయగ్రీవస్వామిని పాదపద్మాలను ధ్యానిస్తే మఱుక్షణంలో బృహస్పతికూడా ఆనందంతో

తలను ఊగిస్తూ శ్లాఘించే, ద్రాక్షవలె మిక్కిలి మధురమైన రీతిలోని వాక్సామర్థ్యాన్ని పొందగలరు. హయగ్రీవస్వామిని పలువురు దేవతలు సేవిస్తారు. వారి శిరస్సులే ఆ స్వామి పాదాల నివాసం. (దేవతలందఱు తమ శిరస్సులను వంచి హయగ్రీవస్వామి శ్రీచరణాలకు తాకించినందున, వారి శిరస్సులే హయగ్రీవస్వామి పాదాల నిలయం – అని భావం) అటువంటి హయగ్రీవస్వామి మనలను అందఱిని రక్షించాలి.

హయగ్రీవమంత్రంలోని **"థ"** అనే ఇరవై రెండవ అక్షరం ఈ శ్లోకం ఆరంభంలో కూర్పబడింది.

**23.** **వక్తుం సూక్తం సుధాక్తం ప్రతికథకవచోవీచివేగం చ హర్తుం**
**కర్తుం కావ్యం చ భవ్యం హితమపి పురుషార్థం చ తత్త్వం చ వేత్తుమ్।**
**వాంఛా చేత్ మానసం చ స్ఫటికమణిమయక్ష్మాధరామాధరీకృత్**
**రోచిర్వీచీభి రారాదఖిల మపి జగత్ ప్లావయంతం హయంతమ్॥**

ఓ మనసా! నీకు అమృతంలో తడిసిన అందమైన సూక్తాలను పలకాలనే కోరిక ఉన్నదా? లేక, వాద యుద్ధంలో ప్రతివాదులు పలికే వాదాల కెరటాల వేగాన్ని జయించే రీతిలో వాదించాలనే ఆశ ఉన్నదా? లేక, మంగళకరమైన కావ్యాలను రచించాలనే అభిలాష ఉన్నదా? లేక, (ఆత్మకు) తత్త్వహితపురుషార్థాలను (భగవానుడు, అతనిని పొందే ఉపాయం, అతనిని పొందిన తరువాత పొందే ఫలం – అనే వానిని) తెలిసికోవాలి అనే వాంఛ ఉన్నదా? నీవు ఏమి చేస్తే వీటిని అన్నిటిని పొందగలవో తెలుసా? స్ఫటికరత్న మయమైన పర్వతాన్ని జయించే తెల్లని మేనియొక్క కాంతుల అలలతో అన్నిటిని చుట్టి, వానిని తెల్లగా చేసే శ్వేతాశ్వముఖుడైన హయగ్రీవస్వామిని శరణువేడాలి సుమా!

హయగ్రీవమంత్రంలోని **"వ"** అనే ఇరవైమూడవ అక్షరంతో ఈ ఇరవైమూడవ శ్లోకం ఆరంభమవుతున్నది.

**24.** **పుష్ణన్ హర్షం సురాణాం జనిమయ మయతి స్మేతి నో వక్తు మీశో**
**ప్రాగేవాసీత్ ప్రమత్తాసురగృహనికరే యత్సురాణాం ప్రహర్షః।**
**శ్రుత్యావిర్భూతిహేతుః శ్రవణసముదయానంతరేఽస్మిన్నియుక్తః**
**తస్మాదస్మాదనన్యాన్ ధ్రువ మవితు మసా వావిరాసాశ్వభాసా॥**

మధుకైటభులు అనే అసురులు వేదాలను అపహరించారు; వాటిని తిరిగి తీసికొని రావడంకోసం శ్రీహయగ్రీవస్వామి అవతరించాడు– అనే వార్త అసురకులం చెవికి సోకింది. "ఈ హయగ్రీవుడు వేదాలను తిరిగి తీసికొని వచ్చి దేవతలను ఆనందింపజేయ గలడా?"



అని అసురులు పరిశీలించి చూచారు. కాని, వారు అజ్ఞానవశంచేత, "ఇతడు మనలను జయించి వేదాలను తిరిగి తీసికొనిపోలేడు" అని నిర్ణయించుకొని గర్వాన్ని పొందారు. అయితే, హయగ్రీవస్వామి అవతరించగానే మధుకైటభులను మర్దించి వేదాలను తిరిగి తీసికొనివచ్చాడు. దేవతలు గొప్ప ఆనందాన్ని పొందారు. హయగ్రీవస్వామి శ్రావణమాసంలోని శ్రవణానక్షత్రంలో ఆవిర్భవించాడు. శ్రవణమనే పదానికి చెవితో వినడం – అనే అర్థం కూడా ఉన్నది. ఆ విధంగానే శ్రుతి – అనబడే వేదాన్ని చెవులతో విని – ఆచార్యుడు చెప్పగా శిష్యుడు దానిని చెవులతో విని – అధ్యయనం చేస్తున్నందున **"శ్రుతి"** (**"కేళ్వి"** – అని ద్రావిడంలో) అని ఈవిధంగా వేదం వ్యవహరింప బడుతున్నది. శ్రుతిని తిరిగి తీసికొని వచ్చే కార్యాన్ని శ్రవణంలో ఉదయించిన శ్రీహయగ్రీవుడు తప్ప వేఱెవరు నెఱవేర్చగలరు? ఈ స్వామి మనలను రక్షించడం కోసమే ఈవిధంగా అశ్వముఖంతో ఆవిర్భవించాడు – అని అనడం యుక్తం.

హయగ్రీవమంత్రంలోని ఇరవై నాల్గవ, ఇరవై అయిదవ అక్షరాలు **"పుషే"** అనేవి. వీటిలోని **"పుష్"** అనే భాగాన్ని స్తుతికర్త ఈ శ్లోకారంభంలో కూర్చారు. మిగిలిన **"ఏ"** అనే అచ్చుతో తరువాతి శ్లోకాన్ని ఆరంభిస్తున్నారు. మంత్రాక్షరాలను క్రమానుసారంగా శ్లోకాల ఆరంభంలో కూర్చడంలో స్తుతికర్త చూపిన ఈ సామర్థ్యం సహృదయహృదయంగమం.

**25.** **ఏతత్ శ్వేతోఽపి రాజద్రజతగిరివరాకారధిక్కారకారీ**
**విద్యుత్విద్యోతభాసోద్యదరుణకిరణోన్నిద్రపద్మం వహంత్యా।**
**కాలిందీమందిరేందీవరరుచిరుచిరాపాంగధారాభి రారాత్**
**సించంత్యంగాని దేవ్యా సతతకృతపరిష్వంగతోఽవ్యాత్ తురంగః॥**

ఈ హయగ్రీవస్వామి తెల్లని వర్ణాన్ని కలవాడు. ప్రకాశించే రజతగిరిని – కైలాసాన్ని – సైతం జయించే శ్వేతవర్ణాన్ని కలవాడు. అయితే, ఈ స్వామి ఒడిలో లక్ష్మీదేవి వేంచేసి ఉన్నది కదా! ఆమె విద్యుద్వర్ణంవంటి వర్ణాన్ని కల్గినది. ఆమె తన చేతిలో, అరుణోదయ కాలంలో వికసించిన ఎఱ్ఱ తామరను ధరించి ఉన్నది. ఆమె కన్నులు కాటుక పెట్టుకొనకుండానే సహజంగానే నల్లనివి. **"అసితేక్షణా"** అని కదా ఆమె కీర్తింపబడుతున్నది. కేవలం మంగళకరంగా ఆమె తన కన్నులకు కాటుక పెట్టుకొన్నది. అందువల్ల ఆమె కన్నులు మఱింత అందంగా, నల్లగా ప్రకాశిస్తున్నాయి. ఆమె నల్లని నేత్రాలనుండి వెలువడే కటాక్షాలు నల్లని యమునానదిలో వికసించిన నల్లకలువల పూమాలికవలె ఉన్నాయి. అటువంటి చూపులతో ఆమె తన సమీపంలోని హయగ్రీవస్వామిని

అభిషేకిస్తున్నది. అంతేకాక, అతని దివ్యాంగాలను నిరంతరం తడుముతున్నది. ఇటువంటి హయగ్రీవస్వామి మనలను కాపాడాలి.

**"షే"** పూర్వం తెల్పిన రీతిలో, హయగ్రీవ మంత్రంలోని ఇరవై అయిదవ అక్షరం లోని **'ఏ'** అనే వర్ణంతో ఈ శ్లోకం ఆరంభింపబడింది. **"ష్"** అనే హల్వర్ణం పూర్వ శ్లోకారంభంలోనే కూర్పబడిన విషయం పూర్వోక్తమే. **"షే"** అనే అక్షరంతో ప్రారంభమయ్యే పదాలు సంస్కృత భాషలో ఇంచుమించుగా లేకపోవడంవల్ల ఇటువంటి క్రమాన్ని కవి పాటించారని గ్రహించాలి.

**26.** **మంజీరం మంజులం తే హయముఖ ! మమ సంజీవనాయాస్తు శింజా –**
**వ్యాజేనామ్నాయవాచా మనితరపరతాం వ్యంజయత్ త్వత్పదోర్యత్।**
**లగ్నం తద్ధారణాసు ద్విగుణమునిజనస్తోమహృత్పద్మనిత్యో–**
**ల్లాసాయాసాదితాత్మద్వయ మివ సవిధే జాగ్రదర్కస్య బింబమ్॥**

హయగ్రీవస్వామీ! మధురమైన నీ మంజీరాలు నన్ను ఉజ్జీవింపచేసేవి కావాలి. నీవు సంచరించేటపుడు నీ మంజీరాలు గలగలమని అంటూ మధురంగా ధ్వనిస్తాయికదా! ఆ మంజీరాలు నీ పాదాలకు అలంకరింపబడికదా ఆ విధంగా ధ్వనిస్తాయి! అందువల్ల, ఆ శింజానధ్వనులు (అందెలనుండి పుట్టిన ధ్వనులు) సామాన్యమైన ధ్వనులు కావు. ఆ శింజాన ధ్వనులను వింటే, అవి నిజంగా వేదాలే మాట్లాడుతున్నట్లుగా ఉంటుంది. **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"**– వేదవాక్కులన్నీ నీ శ్రీచరణ మహిమనే తెలియజేస్తున్నవి – అనే అర్థాన్ని ఆ ధ్వనులు వ్యక్తం చేస్తాయి. నీ శ్రీచరణాలను ధ్యానం చేసే మునుల సమూహాల హృదయపద్మాలు ప్రతిదినం రెండింతలైన వైశాల్యాన్ని కల్గినవిగా వికసించాలనే ఆశతో ఉదయించే సూర్యబింబం రెండు రూపాలను పరిగ్రహించి, నీ శ్రీచరణాలపై వేంచేసి ఉన్నట్లుగా ఆ రెండు మంజీరాలు ప్రకాశిస్తున్నాయి. అటువంటి నీ మంజీరాలు నన్ను ఉజ్జీవింపచేయాలి.

ప్రణవసహిత పైన హయగ్రీవమంత్రంలోని **'మ'** అనే ఇరవై ఆఱవ అక్షరంతో ఈ శ్లోకం ఆరంభవుతున్నది.

**27.** **హారిద్రం కిం ను సూత్రం శ్రుతితతిసుదతీకంఠభూషార్థక్లృప్తం**
**స్రోతస్సారస్వతం వాఙ్మయజననగిరేః నిఃసృతా వేతి శంక్యమ్।**
**వక్త్రే వాహస్య వామప్రసృతితలలసద్ధైమ సత్పుస్తకాంతః**
**దీవ్యత్సూత్రం పవిత్రం మమ కలయతు శం భానుభానోః సగోత్రమ్॥**



హయగ్రీవస్వామి ఎడమచేతి వేళ్ళు చాచబడిన సన్నివేశంలో ఉన్నాయి. అటువంటి ఆ కరతలంలో బంగారంవలె వెలిగే ఒక పుస్తకం ఉన్నది. ఆ గ్రంథంలోని పత్రాలను కూర్చిన పసుపుపచ్చని సూత్రం ఉన్నది. అది సూర్యుని బంగారు కిరణాలకు సగోత్రంవలె – అంటే – సూర్యుని బంగారు రంగులోని కిరణాలవలె – ఉన్నది. వేదాల సమూహాలనే కాంతయొక్క కంఠాభరణంగా – మెడలో అలంకరించుకొనే మంగళసూత్రంగా – భాసిస్తున్నది. లేక, సరస్వతీనదీప్రవాహమే వాఙ్మయాన్ని ఉద్భవింపజేసే పర్వతంనుండి పుట్టి, ఈ సూత్రరూపంగా పరిణమించిందా? – అని ఉత్ప్రేక్షించేటట్లున్నది. అటువంటి గ్రంథసూత్రం నాకు సుఖాన్ని కలుగజేయాలి.

ఈ శ్లోకం, హయగ్రీవమంత్రంలోని **"హా"** అనే ఇరవైఏడవ అక్షరంతో ఆరంభమవుతున్నది.

**28.** **శ్వభ్రేష్వభ్రేఽభియాతీన్ దితితనుజనుషో భ్రామయిత్వా విభిందత్**
**శీర్ణాంగాన్ కీర్ణకేశాన్ భృశ మతిరభసం పాతయన్ నిర్జరాణామ్।**
**స్వారాజ్యం ప్రాజ్యయన్యో మిహిర ఇవ హిమజ్యాధరాదుజ్జిహానో**
**భాభాత్యశ్వస్య వామేతరకరవిధృతః చక్రరాజ స్స నోఽవ్యాత్॥**

యుద్ధంలో పోరాడడంకోసం తనను ఎదిరించిన అసురులను ఆకాశంలోని గుంతలలో (పల్లపు ప్రదేశాలలో) పడవేసి, వారిని, శ్రీ హయగ్రీవస్వామి కుడిచేతిలో ఉండే శ్రీసుదర్శనంతో భగ్నం చేస్తున్నాడు. అసురుల కేశాలు చెల్లాచెదఱు కాగా, అవయవాలు అన్నీ చిందరవందర కాగా, చాలా వేగంగా వారు పతనాన్ని పొందుతున్నారు. మంచుపర్వతంనుండి ఉద్గమించే సూర్యునివలె ఆ హయగ్రీవస్వామి బాహువునుండి శ్రీసుదర్శనచక్రం వెలువడుతున్నది, అసురులనుండి కోల్పోయిన రాజ్యాన్ని దేవతలకు తిరిగి పొందిస్తున్నాడు. ఆ సుదర్శనుడు మిక్కిలిగా ప్రకాశిస్తున్నాడు. శ్రీహయగ్రీవుని దక్షిణ హస్తంలో ఉండే అటువంటి శ్రీసుదర్శనచక్రం మనలను కాపాడాలి.

హయగ్రీవ మంత్రంలోని **"శ్వ"** అనే ఇరవై ఎనిమిదవ అక్షరం ఈ శ్లోకం మొదటి అక్షరంగా కూర్పబడింది.

**29.** **శిష్యాణాం చిత్తభూమౌ ప్రచురతరతమః కంటకాని వ్యపోహ్య –**
**సించ్యాత్యర్థం కటాక్షామృతరసవిసరైః శాస్త్రబీజాని వప్తుమ్।**
**నిర్నిద్రో జ్ఞానముద్రారుచిరకరతలే దక్షిణే యోఽక్షమాలాం**
**బిభ్రత్ భాత్యశ్వవక్త్రః స హరతు నితరా మంహసాం సంహతం మే॥**

శ్రీహయగ్రీవభగవానుని రూపంలో కుడివైపు క్రిందచేయి జ్ఞానముద్రతో భాసిస్తున్నది. దీనివల్ల ఆ చేయి గొప్ప అందంగా ఉన్నది. ఆ ముద్రతో కూడిన హస్తంలో

అక్షమాల కూడా ఉన్నది. జపమణి పూసలతో కూర్చిన మాలకదా అక్షమాల. (జ్ఞానముద్రలో చూపుడు వేలు, బొటన వేలు కలిపి ఉంటాయి.) దానిని చూస్తే హయగ్రీవ స్వామి ఏదో ఒక బీజాన్ని విత్తేటట్లుగా ఉన్నది. అవును "అది ఏమంటే – శిష్యుల బుద్ధి అనే భూమిలో వ్యాపించిన అజ్ఞానమనే ముళ్ళ పొదలను తొలగించి, ఆ భూమిని ఉపయోగపడేటట్లు చేస్తున్నాడు – హయగ్రీవ స్వామి. అనే కృషీవలుడు. తరువాత, ఆ భూమిలో వర్ణనాతీతమైన తన కటాక్షమనే అమృతజలాన్ని ప్రవహింపజేసి, తరువాత అక్కడ శాస్త్రజ్ఞానమనే పైరు ఏపుగా పెరుగుతుంది – అని అక్కడ శాస్త్రబీజాలు నాటడంకోసం జాగరూకుడై బీజాలను విత్తడంకోసం బీజమాలను తన కుడిచేతిలో ధరించి ఉన్నాడు. తన రెండు వేళ్ళతో భూమిలో బీజాలను నాటడానికి వీలుగా ఉండే రీతిలో బీజమాలను గ్రహించిన శ్రీహయగ్రీవస్వామి ఒక (జ్ఞాన) భక్తికృషీవలుడు. అటువంటి శ్రీహయగ్రీవుడు నా పాపసమూహాన్ని అపహరించాలి.

ఈ శ్లోకంలో, శ్రీ హయగ్రీవమంత్రంలోని 29వ అక్షరమైన **"శ"** అనే అక్షరం ప్రారంభంలో కూర్పబడింది.

**30.** **రమ్యం స్యాత్ బింబ మిందోః ? శరదుదితరుచే రంబరాన్నిర్యదేతత్**
**కిం వా డిండీరఖండం కలశజలనిధేః ? కిం ను వా పుండరీకమ్ ?।**
**వాం బ్రహ్మోద్దామలీలాగృహ మితి విబుధై రూహ్యమానో హయాస్యే**
**నోపాత్తః సవ్యహస్తే మమ భవతు శుభాలంబనం కంబురాజః॥**

శ్రీహయగ్రీవస్వామి ఎడమవైపు ఊర్ధ్వభాగంలో గల చేతిలో పాంచజన్యశంఖం వెల్గుతున్నది. హయగ్రీవస్వామి శరత్కాలమేఘంవలె తెల్లనివాడు. అతని చేతిలో ఉండే తెల్లని శంఖం శరత్కాలంలో తెల్లని మేఘాల సమూహాల వెనుకనుండి ఉదయించిన చంద్రబింబమా? అని తలచేటట్లున్నది. తెల్లని పాలకడలిలోని నుఱుగును ప్రోగుచేస్తే ఈవిధంగా కన్పిస్తుందా? అనేటట్లున్నది. సరస్వతీదేవి, బ్రహ్మ– అనే వీరిద్దరు కలసి చక్కగా క్రీడించడంకోసం తగిన అందమైన ఒక తెల్ల తామరయా ఇది? అనే సందేహం కలిగేటట్లున్నది.

ఈవిధంగా విజ్ఞులు పలు రీతులలో ఉత్ప్రేక్షించేటట్లుగా శ్రీహయగ్రీవస్వామి చేతిలోని పాంచజన్యశంఖం భాసిస్తున్నది. అటువంటి ఈ పాంచజన్యశంఖం నాకు హయగ్రీవుని రూపాన్ని ధ్యానించడంలో మంగళకరమైన ఆలంబనంగా కావాలి.

ప్రణవసహితమైన హయగ్రీవమంత్రంలోని 30వ అక్షరం **"ర"** అనేది ఈ శ్లోకారంభంలో కూర్పబడింది.



**31.** **సేవ్యా శర్వాదిసర్వత్రిదశపరిషదా శశ్వదా సాఽశ్వినీశ్రీః**
**అస్మాకం యా సపత్నీ లసతి బత శిరోఽస్యాధిరూఢేతి సేర్ష్యమ్।**
**జేతుం తాం సంతతోదిత్వరవరమహసా భాతి నక్షత్రమాలా**
**దేవచ్ఛందే స్థితా యం సతతమపి సమారాధయంతీవ సోఽవ్యాత్॥**

నక్షత్రాలలో కృత్తికా నక్షత్రం మొదటి నక్షత్రంగా వేదంలో నిర్దేశింపబడింది. ఆ క్రమంలో అశ్వినీ నక్షత్రం ఇరవై ఆఱవ నక్షత్రం. భరణి ఇరవై ఏడవ నక్షత్రం. అయితే, ఇపుడు లోకంలో అంతటా అశ్వినినుండి ఆరంభించి నక్షత్రగణన చేయబడుతున్నది. ఈ క్రమంలో భరణి రెండవ నక్షత్రం. కృత్తిక మూడవది. (వేదగణనప్రకారం) ఇరవై ఆఱవ స్థానంలో ఉండే అశ్విని యొక్క గొప్పతనం – అశ్వినీ అనే శ్రీ ఏవిధంగా ప్రథమస్థానాన్ని పొందింది? అంటే, అది హయగ్రీవ స్వామిని సేవించింది కనుక. ఆ స్వామి, దానిని కృపతో శిరసా ధరించాడు. అందువల్లనే అతడు అశ్వశిరస్సును కలవాడయ్యాడు. అశ్వంయొక్క అందం అంతా నిండిన ఆ గొప్ప సిరి (శ్రీః) అతని ముఖంలో ఉన్నది కదా! అశ్వరూపాన్ని అతడు శిరస్సులో కలవాడయ్యాడు కదా! అందువల్లనే ఈ అశ్వినీశ్రీని శివుడు మొదలైన సమస్తదేవతలబృందం నమస్కరిస్తున్నది. ఇందువల్లనే అశ్వినీ నక్షత్రం నక్షత్రగణనలో ప్రథమ స్థానం పొందింది. ఈ విషయాన్ని మిగిలిన నక్షత్రాలు అన్నీ గమనించాయి. అయ్యో! మనలో ఒకటి అయిన ఈ అశ్విని మనలను అందఱిని మించిపోయిందే! అని ఆశ్చర్యపోయాయి. హయగ్రీవస్వామికి అతడు కోరినట్లుగా సేవలను చేస్తే, మనం కూడా ఈవిధంగా గొప్పతనాన్ని పొందవచ్చు – అని గ్రహించి, ఆ స్వామి మనోరథానుసారం నక్షత్రాలు అతని చేతిలోని నక్షత్రమాలగా రూపొందాయి. ఈవిధంగా అవి ఆరాధించే రీతిలో వెలిగే శ్రీహయగ్రీవస్వామి మనలను రక్షించాలి.

ఈ శ్లోకంలో హయగ్రీవ మంత్రంలోని **"సే"** అనే ముప్పైఒకటవ అక్షరం మొదటి అక్షరంగా కూర్పబడింది.

**32.** **నంతుః సంత్రాసహారీ దధదపి హరితాం శశ్వదాత్మన్యనూనాం**
**యస్తాం మూర్ధ్నేవ నిత్యం ప్రకటయతి హరేః పూరుషస్యాపి సత్యమ్।**
**శ్రౌతీం ముఖ్యేతరత్వావగతి మపివిశిష్టాద్వితీయత్వదృష్టిం**
**స్పష్టీకర్తుం జగత్యాం స్ఫుటయతు న ఋటిత్యస్మదిష్టం విశిష్టమ్॥**

హయగ్రీవస్వామి సాక్షాత్తు హరియే కదా! హరి అంటే నారాయణుడే కదా! అతడు తనను సేవించేవారి భయాలను తీర్చేవాడుకదా! ఈవిధంగా భక్తుల భయాలను తీర్చే స్వభావాన్ని తనలో కల్గి ఉన్నా, తన తలను అశ్వరూపంలో ( హరిత్వాన్ని) కల్గి

ఉన్నాడు. అశ్వానికి కూడా **"హరి"** అని పేరు. అందువల్ల హయగ్రీవుని శిరస్సులో హరిత్వం – అంటే – అశ్వరూపత్వం ఉన్నది. శిరస్సుకు క్రింది భాగంలో కూడా హరియొక్క స్వభావం – హరిత్వం – ఉన్నది. అందువల్ల శిరస్సులో హరిత్వం, శిరస్సుకు క్రింది భాగంలోను హరిత్వం ఉన్నది. అయితే, శిరస్సులో హరిత్వం ఒకవిధంగాను, క్రింది భాగంలోని హరిత్వం ఇంకొక విధంగాను ఉన్నది. దానిద్వారా హయగ్రీవుడు – **"ఏకమేవాద్వితీయమ్"** అనే శ్రుత్యర్థాన్ని విశదం చేస్తున్నాడు. అద్వితీయమంటే – సాటిలేని గొప్ప స్వభావాన్ని కల్గినది. ఒకటే అని అర్థం తప్ప, వేఱొకటి ఏదీ లేదు – అని అర్థం కాదు. దాని కంటే తక్కువ అయినది ఇంకొకటి ఉన్నదనే అర్థం గ్రహించాలి. **"ఈ ప్రభువు అద్వితీయుడు"** అని అంటే రాజ్యంలో అతడు తప్ప ఇంక ఎవరు లేరని అర్థం కాదు. అతనితో సాటి వచ్చేవారు ఇంకొకరు లేరనే అర్థం. ఈ విధంగా అర్థాన్ని గ్రహించినపుడే **"ఏకమేవాద్వితీయమ్"** అని అంటూ వేదం తెలిపే అద్వైతం, వేదం తెలిపే మిగిలిన వస్తువులను అన్నిటిని నిరాకరించనిదై, ప్రత్యక్షానికి విరుద్ధం కాకుండా ఉంటుంది. విశేషణాలై ఉండేవి పలు ఉన్నాయి. అయితే వాటిని విశేషణాలుగా కల్గిన విశేష్యం మాత్రం ఒక్కటే – అది సాటి లేనిదై ఉన్నది – అనే ఈ అద్వైతమే విశిష్టాద్వైతం. "నిర్విశేష చిన్మాత్రమైన బ్రహ్మయే సత్యం, మిగిలినది అంతా మిథ్య" – అని వేదం తెల్పుతున్నదని పలికే నిర్విశేషాద్వైతమే అద్వైతమని గ్రహిస్తే, తీర్చడానికి సాధ్యం కాని పలు విరోధాలు ఎదురవుతాయి. వేదాన్ని తప్పుగా అర్థం చేసికొనే స్థితి ఏర్పడుతుంది. "నరకం, స్వర్గం, విష్ణువు, శివుడు, వేదం, నీవు, నేను – అన్నీ కల్పన" – అని వేదం తెల్పుతున్నదని మనం అర్థం చేసికొంటే, ఈ విధమైన కల్పనామయమైన వేదంయొక్క అర్థాన్ని ఏవిధంగా నమ్మడం? – అని దానిలోనే అప్రామాణ్యశంక ఏర్పడుతుంది.

తనను సేవించే వారి భయాలను తీర్చేవాడైన హయగ్రీవుడు ఎల్లప్పుడు తనలో గొప్పదైన హరిత్వాన్ని (హరి – అనే స్వరూపాన్ని) కల్గినవాడైనా, దానిని ఆ హరిత్వాన్ని (హయశిరస్సును కల్గిన రూపాన్ని) శిరస్సుతో నిత్యం వ్యక్తం చేస్తున్నాడు. అదేవిధంగా పురుషరూపాన్ని కూడా సత్యంగా ప్రకటిస్తున్నాడు. వేదంచేత ప్రతిపాదింపబడే విశిష్టాద్వైత సిద్ధాంతంలోని ముఖ్య – అముఖ్యత్వావగతిని కూడా – ఈ హయగ్రీవరూపంద్వారా లోకంలో స్పష్టం చేస్తున్నాడు. అటువంటి హయగ్రీవుడు మన విశిష్టమైన మనోరథాన్ని అనుగ్రహించాలి.

**33.** **మస్తేఽర్వన్ విస్తరైః కిం ? విహర మమ మనోమందురాయా మమందం**
**కల్పంతేఽనుప్లవా స్తే మమ సతత మిమే హీంద్రియాశ్వా దశాఽపి।**



**కిం చాత్రానల్పకల్పావసరవిసరదుచ్చావచాకారమూర్తి –**
**స్ఫూర్తిస్ఫీతోరుకర్మప్రగుణతృణగణశ్చర్వణాయ ప్రణీతః॥**

హయగ్రీవస్వామీ! పలు మాటలు ఎందుకు? నీవు నా మనస్సు అనే అశ్వశాలలో నివసించు. ఇక్కడ నీకు సహాయంగా – నిన్నే అనుసరించగోరే – మనస్సుకు దాసులైన పది అశ్వాలున్నాయి. అవి ఏవి? అంటే అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు. ఇవి ఇక నిన్నే అనుసరించాలి. అంతేకాక, ఇక్క నాలో నీకు ఆహారంగా తృణం మిక్కిలిగా మొలిచి, వ్యాపించి ఉన్నది. దానిని నీవు తృప్తిగా భుజించవచ్చు. ఆ తృణం ఏది? అంటావా? పలుపలు జన్మలలో పటు కోట్ల సంవత్సరాల కాలంగా చాలా బలంగా, పుష్టిగా పెరిగిన నా కర్మలే. వాటిని నీవు మేయాలి – హరించాలి.

ఈ శ్లోకంలో హయగ్రీవమంత్రంలోని చివరి అక్షరమైన **"మః"** వర్ణం కూర్పడింది. ఇంతటితో ప్రణవసహితమైన మంత్రంలోని అక్షరాలు వరుసగా ఆయా శ్లోకాల ఆరంభంలో కూర్చే ప్రక్రియ ముగిసింది. ఇక రాబోయే శ్లోకం ఫలశ్రుతి శ్లోకం.

**34.** **కస్తూరీకర్తు మర్చావిధిషు సముచితం నాన్యదస్యేతి జానన్**
**కస్తూరీరంగనాథః స్తవ మిమ ముపదా మాదిమాశ్వస్య ధత్తే।**
**యస్తూనో యోఽతిరిక్తః సకల మపి చ తం హృద్యయన్నర్థ మస్మిన్**
**స్వస్తూలీకారధీరాం వితరతు పఠతాం వాగధీశః సమృద్ధిమ్॥**

ఆదిమాశ్వరూపుడైన శ్రీహయగ్రీవునకు పూజన చేయడంకోసం ఉపయోగించిన ఈ వాఙ్మాలిక తప్ప వేఱు ఏ వస్తువు లేదు – అని తెలిసి, కస్తూర్తి రంగనాథాచార్యస్వామి దీనిని హయగ్రీవస్వామికి కానుకగా సమర్పించారు. ఈ స్తుతిలో కొఱతలు, గుణాలు ఉండవచ్చు. వాటిని వేనినీ లెక్కించకుండా వాటిని అన్నిటిని మనస్సుకు ప్రియంగానే హయగ్రీవస్వామి గ్రహిస్తాడు. అందువల్ల ఈ స్తుతిని పఠించేవారికి స్వర్గలోకసుఖంకూడా దూదిపింజగా తలచే గొప్ప బుద్ధిని ఆ హయగ్రీవస్వామి అనుగ్రహించాలి. అంటే – లౌకికమైన అల్పసుఖాలను లెక్కించకుండా, నిరంతరమైన ఆ స్వామి శ్రీచరణాలకు కైంకర్యాన్ని చేయగలగాలి – అనే బుద్ధిని ఆ స్వామి వారికి అనుగ్రహించాలి.

### శ్రీరంగనాథ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారు (30వ పట్టం) అనుగ్రహించిన

# హయగ్రీవమంగళమ్

శ్రీరంగనాథ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారు పరకాల మఠాన్ని క్రీ.శ.1873 నుండి 1885 వరకు పాలించారు. వీరు పురుష సూక్త భాష్యమ్, సుదర్శన వాదం మొదలైన పలుగ్రంథాలు రచించారు. మైసూరు పండితరత్నం కస్తూరి రంగాచార్య స్వామి వారు వీరి శిష్యులే.

**1. మంగళం శ్రీహయాస్యాయ వేదాహరణకర్మణే ।**
**ప్రణవోద్గీతవపుషే హయగ్రీవాయ మంగళమ్ ॥**

వేదాలను తిరిగి తీసికొనివచ్చిన లక్ష్మీహయగ్రీవునకు మంగళం. ప్రణవం చేత కీర్తింపబడిన మేనిని కల హయగ్రీవునకు మంగళం.

**2. చతుఃషష్టికలాధీశ ! విశ్వగ్రూప ! హయానన ! ।**
**మహార్ణవాంబుపర్యంక ! విష్ణవే తేఽస్తు మంగళమ్ ॥**

అరవై నాల్గు కళలకు స్వామీ! సమస్తప్రపంచస్వరూపా ! హయగ్రీవా ! మహాసముద్రాన్ని పడుకగా కలవాడా! విష్ణుదేవా ! నీకు మంగళం.

**3. అనిరుద్ధాయ సౌమ్యాయ వేదభర్త్రే సనాతన ! ।**
**శ్రీదాయ శ్రీమయాయాస్తు మంగళం స్వామినే తవ ॥**

ఓ సనాతనా ! అనిరుద్ధస్వరూపుడవు, సౌమ్యుడవు, వేదాలను భరించినవాడవు సంపదను అనుగ్రహించేవాడవు, సంపత్స్వరూపుడవు, స్వామివి అయిన నీకు మంగళం కలగాలి.

**4. భద్రశ్రీవత్సహారాఢ్య ! పంచరాత్రప్రవర్తక ! ।**
**భక్తాత్మభావభవన ! మంగళం తేఽస్తు ముక్తిద ॥**

మంగళకరమైన శ్రీవత్సంతో, హారాలతో ఆఢ్యమైనవాడా ! పంచరాత్రాగమాన్ని ప్రవర్తింపజేసినవాడా ! భక్తులయొక్క భావనలకు ఆశ్రయభూతుడా! ముక్తిని ఇచ్చేవాడా! (హయగ్రీవా!) నీకు మంగళం కలగాలి. (**"భద్ర"** – అనేపదాన్ని ప్రత్యేక సంబోధనగా గ్రహించి, మంగళస్వరూపా!– అనే అర్థాన్ని చెప్పవచ్చు.)



**5. సర్వకర్మసమారాధ్య ! పూర్ణషాడ్గుణ్యవిగ్రహ ! ।**
**శ్రియా గాఢోపగూఢాత్మన్ ! మంగళం తే హయానన! ॥**

సమస్తకర్మలచే ఆరాధింపదగినవాడా! పూర్ణమైన షాడ్గుణ్యం మూర్తీభవించిన వాడా! లక్ష్మిచే గాఢంగా ఆలింగనం చేసికోబడినవాడా! హయాననా! నీకు మంగళం కలగాలి.

**6. అంకేనోదూహ్య వాగ్దేవీ మాచార్యక ముపాశ్రిత! ।**
**మంగళం తేఽస్తు వాగీశ ! శ్రీనిధే ! శ్రీనికేతన ॥**

వాగ్దేవిని ఒడిలో పెట్టుకొని ఆచార్యుల (వేదాంత దేశికుల) దరికి చేరినవాడా! లక్ష్మికి నిధియైనవాడా! సంపదలకు నిలయమైనవాడా! హయగ్రీవా! నీకు మంగళం కలగాలి.

**7. స్వరాజే చ విరాజే చ సమ్రాజే తే హయానన! ।**
**వేదకర్త్రే వేదభర్త్రే వేదహర్త్రేఽస్తు మంగళమ్ ॥**

గొప్పగా ప్రకాశించేవాడవు, సామ్రాట్టువు, వేదాల కర్తవు (మూలమైనవాడవు), వేదాలను భరించినవాడవు, వేదాలను రక్షించినవాడవు అయిన ఓ హయగ్రీవా! నీకు మంగళం కలగాలి.

**8. క్షమాసారాయ హరయే దయాఘన ! హయానన! ।**
**వేదవేదాంతవేద్యాయ సర్వదా తవ మంగళమ్ ॥**

దయాగుణానికి మేఘవంటివాడా! హయగ్రీవా! క్షమాగుణానికి సార భూతుడవు, అన్ని పాపాలను హరించేవాడవు, వేదవేదాంతాలచే తెలియబడేవాడవైన నీకు ఎల్లప్పుడు మంగళం.

**9. శ్రీరంగనాథేన భక్తేన హయగ్రీవస్య మంగళమ్ ।**
**రచితం ప్రీతయే తస్య భూయాత్ సర్వత్ర మంగళమ్ ॥**

భక్తుడైన రంగనాథునిచేత (శ్రీరంగనాథ బ్రహ్మతంత్ర పరకాల యతిచేత) ఈ హయగ్రీవమంగళం ఆ స్వామిప్రీతికోసం రచింపబడింది. దీనివల్ల అందటికి అంతటా మంగళం కలగాలి.

శ్రీకృష్ణబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

# శ్రీహయగ్రీవ పంచరత్నమ్

శ్రీకృష్ణబ్రహ్మతంత్రస్వతంత్ర పరకాల స్వామివారు పరకాల మఠాన్ని క్రీ.శ. 1885వ సంవత్సరం నుండి క్రీ.శ. 1915 వరకు పాలించారు. వీరు క్రీ.శ. 1761వ సంవత్సరంలో జన్మించారు. 70కి మించిన సంఖ్యలో పలు గొప్ప కృతులను రచించారు. వీరు గొప్ప సంగీత విద్వాంసులు కూడా.

**1. జ్ఞానానందామలాత్మా కలికలుషమహాతూలవాతూలనామా**
**సీమాతీతాత్మభూమా మమ హయవదనా దేవతా ధావితారిః ।**
**యాతా శ్వేతాబ్జమధ్యం ప్రవిమలకమలస్రగ్ధరా దుగ్ధరాశిః**
**స్మేరా సా రాజరాజప్రభృతినుతిపదం సంపదం సంవిధత్తామ్ ॥**

జ్ఞానానందమయుడు, కలికాలుష్యమనే గొప్ప దూదిసమూహాన్ని ఎగురగొట్టే పెనుగాలి, అవధిని లేని వైభవాన్ని కలవాడు, శత్రువులను తరిమి కొట్టేవాడు, తెల్లని పద్మం మధ్యలో ఉన్నవాడు, స్వచ్ఛమైన తామరపూల మాలను ధరించినవాడు, పాలసముద్రంవంటి చిఱునవ్వుతో కూడినవాడు, కుబేరుడు (చక్రవర్తులు) మొదలైనవారి స్తుతులకు స్థానమైనవాడైన హయగ్రీవుడనే దైవం నాకు సంపదలను కల్గించాలి.

ఈ శ్లోకం స్రగ్ధరావృత్తంలో కూర్చబడింది. ఆవృత్తం పేరు కూడా ఇందులో ముద్రాలంకార శైలిలో సూచింపబడడం గమనార్హం.

**2. తారాతారాధినాథ స్ఫటికమణిసుధాహీర హారాభిరామా**
**రామారత్నాబ్ధికన్యా కుచలికుచ పరీరంభసురంభధన్యా ।**
**మాన్యాఽనన్యార్హదాస్యప్రణతతతి పరిత్రాణసత్రాత్తదీక్షా**
**దక్షా సాక్షాత్కృతైషా సపది హయముఖో దేవతా సాఽవతాన్నః ॥**

తెల్లని ముత్యాలు, చంద్రుడు, స్ఫటికమణి, అమృతం, మంచు – అనే వీటి వలె మనోహరాలైన హారాలతో అందమైనది, ఎల్లప్పుడు యౌవనంలో ఉన్నది, సముద్రకన్యక అయిన లక్ష్మియొక్క కుచకుంభపరిరంభణాల సంరంభంచేత ధన్యమైనది (లక్ష్మీసంబంధంచేత గొప్పది), మాన్యమైనది, అనన్యార్హమైన దాస్యాన్ని కల్గిన భక్తసమూహాన్ని రక్షించడమనే వ్రతాన్ని నిర్వహించడంలో సమర్థమైనది, నాముందు ప్రత్యక్షమైనది అయిన హయగ్రీవ రూపదేవత మనలను రక్షించుగాక!



**3. అంతర్ధ్వాంతస్య కల్యం నిగమహృదసురధ్వంసనైకాంతకల్యం**
**కల్యాణానాం గుణానాం జలధి మభినమద్బాంధవం సైంధవాఖ్యమ్ ।**
**శుభ్రం విభ్రాజమానం దధత మరిదరౌ పుస్తకం హస్తకంజైః**
**భద్రాం వ్యాఖ్యానముద్రామపి హృది శరణం యామ్యుదారం సదారమ్॥**

ఆంతరమైన (మనస్సులోని) చీకటికి (అజ్ఞానానికి) ప్రభాతం వంటివాడు, వేదాలను అపహరించిన అసురులను ధ్వంసం చేయడంలో అద్వితీయుడు, సమస్త కల్యాణగుణాలకు సముద్రుడు, కొలిచేవారికి బంధువు, స్వచ్ఛమైన కిరణాలతో వెలిగేవాడు, శ్రీహస్తాలలో శంఖచక్రాలను, పుస్తకాన్ని, మంగళకరమైన వ్యాఖ్యాన ముద్రను ధరించినవాడు, లక్ష్మీదేవితో కూడినవాడు, మహానుభావుడైన హయగ్రీవుని నా హృదయంలో శరణు పొందుతున్నాను.

**4. వందే తం దేవమాద్యం నమదమరమహారత్నకోటీరకోటీ –**
**వాటీనిర్యత్ననిర్యద్ఘృణిగణమసృణీభూతపాదాంశుజాతమ్ ।**
**శ్రీమద్రామానుజార్య శ్రుతిశిఖరగురు బ్రహ్మతంత్రస్వతంత్రైః**
**పూజ్యం ప్రాజ్యం సభాజ్యం కలిరిపుగురుభిః శశ్వదశ్వోత్తమాంగమ్ ॥**

కిరీటాలు ధరించిన దేవతలు తమ శిరస్సులతో హయగ్రీవస్వామి పాదాలకు నమస్కరిస్తారు. ఆ దేవతలు తమ శిరస్సులపై ధరించిన కిరీటాలలో గొప్ప గొప్ప రత్నాలు పొదగబడి ఉన్నాయి. ఆ కిరీటాల అగ్రభాగాల వరుసలనుండి అప్రయత్నంగా వెలువడే కాంతికిరణాల సమూహంతో హయగ్రీవస్వామి శ్రీచరణాలు ఎఱ్ఱగా అయినవి. అటువంటి శ్రీపాదాలు కాంతికిరణాల పుంజాలను కల్గి ఉన్నవి. ఆదిదేవుడైన హయగ్రీవస్వామి, శ్రీరామానుజాచార్యులవారు, వేదాంత దేశికులు, బ్రహ్మతంత్ర స్వతంత్రపరకాలజీయర్ మొదలైన గురువులకు పూజనీయుడు. మహనీయుడైన ఆ హయగ్రీవుని సదా నమస్కరిస్తున్నాను.

**5. విద్యా హృద్యాఽనవద్యా యదనఘకరుణాసార సారప్రసారాత్**
**ధీరా ధారాధరాయామజని జనిమతాం తాపనిర్వాయిత్రీ ।**
**శ్రీకృష్ణబ్రహ్మతంత్రాదిమ పదకలిజిత్ సంయమీంద్రార్చితం తత్**
**శ్రీమద్ధామాతిభూమ ప్రథయతు కుశలం శ్రీహయగ్రీవనామ ॥**

హయగ్రీవుని పవిత్రమైన కరుణాప్రవాహసారప్రసారంవల్ల మనోహరమైన, దోషరహితమైన విద్య కల్గుతున్నది. ధీమంతులకు ఆధారమైనది ఆ విద్య. ఈ భూమిలోని జీవుల తాపాన్ని అది తీరుస్తున్నది. శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల జీయర్ స్వామివారిచే అర్చింపబడిన, మనోహరమైన, ఆ లక్ష్మీహయగ్రీవుడనే గొప్ప తేజస్సు మంచిని (అందరికీ) కల్గించాలి.

శ్రీకృష్ణబ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాలస్వామివారు (31వ పట్టం) అనుగ్రహించిన

# లక్ష్మీహయవదన ప్రాబోధికస్తుతి

**1. కరుణావరుణాలయాంబుజ శ్రీస్ఫురణాహంకృతిహారిలోచన శ్రీః ।**
**చరణాబ్జనతార్తిభారహారిన్! తవ భూయాత్తురగాస్య! సుప్రభాతమ్ ॥**

ఓ హయగ్రీవస్వామీ! కరుణకు సముద్రంవంటివి, పద్మాల కాంతి స్ఫురణయొక్క అహంకారాన్ని తొలగించేవి అయిన తిరునేత్రాల శోభను కలవాడా! నీ శ్రీచరణపద్మాలలో శరణాగతి చేసినవారి ఆర్తిని తీర్చేవాడా! నీకు సుప్రభాతం అగుగాక.

**2. పురః ప్రబుద్ధాంబుధిరాజకన్యా ముఖాబ్జనిఃశ్వాస మివానుకుర్వన్ ।**
**మరుత్ సుగంధిః ప్రతవాతి మందం హయానన ! స్యాత్ తవ సుప్రభాతమ్॥**

నిద్ర లేచిన లక్ష్మీదేవియొక్క పద్మంవంటి ముఖంనుండి వెలువడే నిశ్వాసాన్ని అనుకరిస్తూ పరిమళాన్ని కల్గిన వాయువు మెల్లగా నీముందు వీస్తున్నది. హయగ్రీవ స్వామీ! నీకు సుప్రభాతం.

**3. త్వద్దీప్త్యా ప్రవిమలయా జితః కిలాసౌ ఆహో స్విత్ తవ దయితాముఖాంబుజేన।**
**పాశ్చాత్యే పతతి పయోనిధౌ సుధాంశుః భూయాత్తే సపది హయాస్య! సుప్రభాతమ్॥**

హయగ్రీవస్వామీ! మిక్కిలి విమలమైన నీ కాంతిచేత జయింపబడినందువల్లనో, లేక, నీకు వల్లభ అయిన లక్ష్మీదేవి ముఖారవిందంచేత జయింపబడినందువల్లనో, ఈ చంద్రుడు పడమటి సముద్రంలో పడిపోయాడు. (అస్తమించాడు) నీకు వెంటనే సుప్రభాతం అగుగాక !

**4. వరదానకృతిన్ ! స్మరదార్తతర - ద్విరదాఘహృతి స్ఫురదాదరణ! ।**
**ఇతి సన్మతయో యతయః ప్రపదం త్వధునా మధునాశన ! జాగృహి భోః ॥**

"వరాలను అనుగ్రహించేవాడా ! (నిన్ను) స్మరించేవాడు, మిక్కిలి ఆర్తుడైన గజేంద్రుని పాపాన్ని (ఆర్తిని) హరించడంలో వ్యక్తం చేసిన ఆదరాన్ని (తొందరను) కలవాడా!"- అని అంటూ గొప్ప మతిని కల యతులు పల్కుతున్నారు. ఓ మధువనే అసురుని సంహరించిన హయగ్రీవా! నీవు మేల్కనాలి.

ప్రాతఃకాలంలో **"గ్రాహగ్రస్తే గజేంద్రే", "నక్రాక్రాంతే గజేంద్రే"** ఇత్యాది గజేంద్రమోక్ష శ్లోకాలను అనుసంధించడం పెద్దల పరిపాటి.



**5. సమర్చనే తే కృతకౌతుకేన సజ్జీకృతం శోణమణీంద్రపీఠమ్ ।**
**హంసేన కిం సాంధ్య మహో! విభాతి హయాస్య ! భూయాత్తవ సుప్రభాతమ్ ॥**

హయగ్రీవస్వామీ! నీకు అర్చన చేయాలనే ఆసక్తితో హంసచేత (సూర్యుని చేత) సిద్ధం చేయబడిన ఎఱ్ఱని మణులు పొదిగిన సింహాసనంవలె ప్రాతఃకాలికసంధ్య ప్రకాశిస్తున్నది. నీకు సుప్రభాతమగుగాక!

**6. హరిర్హరిరితి మంజుభాషితం ద్విజావళేః సపది నిశమ్య కౌతుకాత్ ।**
**వరద్విజోఽప్యనువదతీవ కూజితైః హయాననానఘగుణ! జాగృహి ప్రభో! ॥**

బ్రాహ్మణసమూహం ఉదయం నిద్రలేచి **"హరిః హరిః హరిః"** అంటూ మెల్లగా పలికే నామాన్ని విని, ఆసక్తితో గొప్ప పక్షులుకూడా ఆ నామాన్ని అనువదిస్తున్నట్లు వాటి ధ్వనులు తోస్తున్నవి. హయగ్రీవస్వామీ! ఏదోషం లేని గుణాలను కలవాడా! ప్రభూ! నిద్రనుండి లే.

**7. ప్రాచీం వధూం సపది మిత్రకరగ్రహార్థం**
**సంధ్యావధూః స్వరుచికుంకుమపంకసాంద్రైః ।**
**ప్రాలేయమంగళజలై రభిషించతీవ**
**శ్రీమన్ ! హయాస్య ! భవతాత్తవ సుప్రభాతమ్ ॥**

లక్ష్మీపతీ! హయగ్రీవస్వామీ! తూర్పు దిక్కు అనే వధువు వెంటనే సూర్యుడనే వరుని పాణిగ్రహణం చేసికోవడంకోసం ఆమెకు ప్రాతఃకాలసంధ్య అనే స్త్రీ తన కాంతి అనే కుంకుమ చిక్కనివి అయిన మంచు నీరు అనే మంగళజలంతో మంగళస్నానాన్ని చేయిస్తున్నట్లున్నది. (సంధ్యాకాలపు ఎఱుపు రంగుతో తూర్పు దిక్కుప్రకాశిస్తున్నది) నీకు సుప్రభాతమగుగాక!

**8. కుముదవనం విముచ్య నవపంకజషండమిమాః**
**సపది సమాశ్రయంతి ముదితా భ్రమరావలయః ।**
**భువి నిఖిలోఽపి చాశ్రయతి సశ్రియమేవ జనో**
**హయవదనాద్య జాగృహి హరే! కరుణైకనిధే! ॥**

హయగ్రీవా! కరుణకు అద్వితీయమైన నిధివంటివాడా ! ఉదయం అయినందువల్ల తుమ్మెదల సమూహాలు ఇపుడు కలువల సమూహాన్ని విడచిపెట్టి, కొత్తగా వికసించిన ఈ తామరల గుంపును ఆనందంతో వెంటనే ఆశ్రయిస్తున్నవి. లోకంలో ప్రతివ్యక్తి సంపదను కలవానినే కదా ఆశ్రయిస్తాడు ! హయగ్రీవస్వామీ! ఇపుడు మేలుకో.

**9. ఫుల్లత్పంకజరత్నపాత్రనివహానాసాద్య హృద్యశ్రియః**
**సౌగంధాఢ్యమరందదివ్యసలిలై రాపూరితా నాదరాత్ ।**
**హంసా స్త్వామివ పూజయంతి విరుతవ్యాజాత్ పఠంతో మనూన్**
**సుస్నాతాః సరసీషు వాహముఖ! తే సుప్రాతరస్తు ప్రభో! ॥**

సుగంధంతో గొప్పదైన మకరందమనే దివ్యజలంతో నిండినవి, మనోహరమైన శోభను కల్గినవైన వికసించిన తామరపూవులు అనే రత్నాల పాత్రలను ఆదరంగా గ్రహించిన హంసలు (సన్న్యాసులు) సరస్సులో చక్కగా స్నానం చేసి, తాము చేసే మధురధ్వనులనే మంత్రాలను ఉచ్చరిస్తూ నిన్ను పూజిస్తున్నట్లుగా ఉన్నది. ఓ హయగ్రీవా! ప్రభూ! నీకు సుప్రభాతం.

**10. ఉచ్చలన్ మధుకరౌఘమంజులం పద్మముల్లసతి పూజనాయ తే ।**
**ధూపపాత్ర మివ హంససజ్జితం సుప్రభాత మిహ తే హయానన! ॥**

తుమ్మెదల సమూహంతో మనోహరంగా ప్రకాశిస్తూ, నీ పూజకోసం పద్మం రేకులను వెలువరిస్తూ వికసిస్తున్నది. అది, హంస సూర్యుడు నీపూజకోసం సిద్ధం చేసిన ధూపపాత్రవలె ఉన్నది. హయగ్రీవస్వామీ ! నీకు సుప్రభాతం.

ఎఱ్ఱనిపద్మం, ఎఱ్ఱని నిప్పు కణికలను కల ధూమపాత్రం. పద్మంలో వాలిన నల్లని తుమ్మెదల గుంపు నల్లని ధూమం.

**11. ఇందీవరాణామివ కాంతి రద్య మందీభవంతీ వ్యపయాతు నిద్రా ।**
**ఫుల్లత్విదం పద్మమివాక్షియుగ్మం హయాస్య! తే సంప్రతి సుప్రభాతమ్ ॥**

కలువల కాంతి ఇపుడు తరిగిపోతున్నట్లుగా నీ నిద్రకూడా తరిగిపోవాలి. పద్మాలు వికసించినట్లుగా పద్మాలవంటి ఈ నీ నేత్రాల జంట వికసించాలి. ఓ హయగ్రీవస్వామీ! నీకు సుప్రభాతం.

**12. ఏతే వేత్రహతిత్రుటత్ పటుమహా కోటీరకోటీమణి–**
**శ్రేణీభి స్తవ మందిరస్య దధతో ద్వారాయ నీరాజనమ్ ।**
**కాంక్షంతి ప్రతిబోధకాల మిహ తే సర్వే సుపర్వాధిపాః**
**తానేతాన్ కరుణావలోకనలవైః ధన్యాన్ విధేహి ప్రభో! ॥**

ప్రభూ! హయగ్రీవా! వేత్రధారులు (చేతి బెత్తాన్ని ధరించిన రక్షకులు) బెత్తంతో అదలిస్తూ కొట్టినందువల్ల దేవతల ప్రభువుల శిరస్సుపై ధరించిన గొప్ప గొప్ప కిరీటాల



అగ్రభాగాలలో పొదిగిన మణులు పగులుతున్నాయి. ఆ మణుల కాంతులతో వారు నీ ఆలయద్వారానికి నీరాజనాన్ని చేస్తూ, నీవు నిద్ర లేచే కాలంకోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు. వీరిని అందఱిని నీ కరుణాకటాక్షలతో (అరమోడ్పు కన్నుల చూపులతో) ధన్యులనుగా చేయాలి.

**"హరవిరించిసనందనాద్యాః ద్వారే వసంతి వరవేత్రహతోత్తమాంగాః"** అనే శ్రీవేంకటేశసుప్రభాతస్తోత్ర సూక్తి స్మరణీయం.

**13. అక్షీణే మయి తిష్ఠ కిం విహరసే సంక్షీయమాణే ముహుః**
**బింబేఽస్మిన్నితి దేవదేవ! నితరాం త్వత్ప్రార్థనాయాగతమ్ ।**
**చాంద్రం బింబమిదం వదంతి హి పరం మోదార్పణం దర్పణం**
**దృష్టిం న్యస్య కృపానిధేఽత్ర భగవన్ ! ప్రాబోధికీం శ్రీపతే! ॥**

"దేవదేవా! ఆగు. ఏనాడూ క్షీణించని నేనుండగా, మాటిమాటికి క్షీణించే ఈ చంద్రబింబంలో విహరిస్తావా! – అని అంటూ నిన్ను ప్రార్థించడంకోసం వచ్చిన చంద్రబింబం ఇది" అని నీముందు నిల్చిన మంగళకరమైన అద్దాన్ని చూచి అంటున్నారు. అటువంటి, నీకు మిక్కిలి ఆనందాన్ని కల్గించే ఈ అద్దంలో నీ మొదటి చూపును నిలిపి కృపజేయి. భగవన్! శ్రీపతీ! కృపానిధీ! నీకు సుప్రభాతం.

**14. నిద్రాశేషకషాయితైః సులలితైః ఉద్యద్దయాప్యాయితైః**
**దివ్యాపాంగఝురైః త్వదర్చనకృతే ద్వార్యత్ర బద్ధాంజలీన్ ।**
**ఆచార్యాన్ నిగమాంతదేశికముఖానాధత్స్వ సుస్నాపితాన్**
**సుప్రాతం తురగాస్య! తేఽస్తు కరుణాసింధో! దినం శ్రీపతే! ॥**

నిద్ర ఇంకా మిగిలి ఉండడంవల్ల ఎఱ్ఱనివి, మిక్కిలి అందమైనవి, పెల్లుబికే దయతో తృప్తి పడివేవి అయిన నీ దివ్యకటాక్షాల ప్రవాహాలతో, నిన్ను అర్చించడం కోసం ఇక్కడ ద్వారంలో అంజలి చేస్తున్న వేదాంతదేశికులు మొదలైన పూర్వాచార్యులను బాగా స్నానం చేసిన వారినిగా (ఆనందింపజేసినవారినిగా) నీవు చేయాలి. ఓ హయగ్రీవస్వామీ! కరుణాసింధూ! శ్రీపతీ! నీకు సుప్రభాతం.

**15. ఇదం కుంభద్వంద్వం ఘుసృణమసృణస్మేరసలిలం**
**ప్రతీహారే లక్ష్మీస్తనయుగమనోహారి లసతి ।**
**ఇయం గౌః సద్వత్సా పరిజనసమూహోఽపి నిభృతో**
**దివం సుప్రాతం తే భవతు కరుణాబ్ధే ! హయముఖ ॥**

యాలకుల పొడితో, పచ్చకర్పూరంతో కూడిన చిక్కని తెల్లని నీటిని కల్గినది, లక్ష్మీదేవి స్తనయుగంవలె (నీకు) మనోహరమైనది అయిన పూర్ణకుంభద్వయం, ఇదిగో, ద్వారంలో ప్రకాశిస్తున్నది ఇది లేగ దూడతో కూడి ఉండే గోవు. పరిజనసమూహం కూడా వినయంగా నిలచి ఉన్నారు. కరుణాసముద్రా! హయగ్రీవస్వామీ ! నీకు సుప్రభాతం.

భగవానుని సుప్రభాత సేవాసమయంలో స్వామి మందిర ద్వారాన్ని తెఱచేటపుడు సిద్ధం చేయబడే మంగళద్రవ్యసామగ్రి అంతా ఇందులో ప్రస్తావింపబడింది.

**16. రవిమండలీ మిదానీ ముదయమహీభృత్తవాభిషేకార్థమ్ ।**
**కనకకలశీమివ వహత్యస్తు హయగ్రీవ! సుప్రభాతం తే ॥**

హయగ్రీవస్వామీ ! సూర్యమండలం ఇపుడు ఉదయాద్రిపై నీ అభిషేకం కోసం సిద్ధం చేయబడిన కనకకలశంవలె ఉన్నది. నీకు గొప్ప సుప్రభాతం.

**17. అనుచిత ఇవ సేవనే త్వదీయే**
**ప్రమదభరాదిహ పంచమం విహాయ ।**
**విదధతి కిల వైణికాశ్చ గానం**
**హయవదనాద్య తవాస్తు సుప్రభాతమ్ ॥**

నీ సేవకు తగినది కాదు అనేటట్లు ఆనందాతిరేకంవల్ల వైణికులు అందఱు పంచమస్వరాన్ని విడచిపెట్టి గానాన్ని చేస్తున్నారు కదా! హయగ్రీవస్వామీ! నీకు ఇపుడు సుప్రభాతం.

**18. పికనికరమదవిధూనన గానమనోహర ముదారసుకుమారమ్ ।**
**ధన్యం కన్యాద్వంద్వం త్వాం నీరాజయతి జాగృహి హయాస్య! ॥**

హయగ్రీవా! కోకిలసమూహంయొక్క మదాన్ని ఎగురగొట్టే గానంతో మనోహరమైనది, గొప్ప సుకుమారమైనది, నీ సేవతో ధన్యమైనది అయిన కన్యాద్వంద్వం (ఇద్దరు కన్యలు) నీకు నీరాజనాన్ని చేస్తున్నది. మేలుకో.

**19. కాహలడిండిమమండల మర్దలపణవాద్య వాద్యానామ్ ।**
**సంస్పర్ధయేవ నినదో విజృంభతే తురగవదన! బుధ్యస్వ ॥**

బాకాలు, ఢక్కలు, మద్దెలలు, డప్పులు మొదలైన వాద్యవిశేషాల ధ్వని ఒకదానితో ఇంకొకటి పోటీపడుతున్నట్లుగా విజృంభిస్తున్నది. హయగ్రీవా ! నిద్రలే.



**20. తవ తనురుచిసాధర్మ్యాత్ సంహృష్టే నర్తనం కిలాతనుతః ।**
**ద్వారభువి చామరే ద్వే హయవదన ! తవాస్తు సుప్రభాత మిహ ॥**

హయగ్రీవస్వామీ ! నీ దేహకాంతియొక్క పోలిక వల్ల మిక్కిలి ఆనందించిన రెండు చామరాలు ద్వారంలో నర్తనం చేస్తున్నట్లున్నవి కదా ! నీకిక్కడ సుప్రభాతం.

**“చిన్మయైః స్వప్రకాశైశ్చ”** అనే పాంచరాత్రాగమోక్తరీతిలో భగవత్సేవకు ఉపయోగపడే ద్రవ్యాలన్నీ చిన్మయాలుగా చెప్పబడ్డాయి కనుక, అచేతనాలుగా కన్పించే చామరాలు అచేతనాలు కావు. అందువల్ల వాటి నర్తనం సహజమే.

**21. త్వత్పాదాంభోజయుగ్మం పరిచరితుమనా మూర్ధ్ని బుద్ధాంజలిస్సన్**
**శ్రీకృష్ణబ్రహ్మతంత్రాగ్రిమపదకలిజిత్సంయమీ త్వాం స్తవీతి ।**
**త్వత్సేవాయై సముద్యన్నిరవధికమహానందధు స్తిష్ఠతీహ**
**శ్రీమాన్ కృష్ణావనీంద్రో హయవదన! తవ శ్రీశ ! సుప్రాతరస్తు ॥**

హయగ్రీవస్వామీ ! నీపాదాంభోజాల జంటను సేవించే మనస్సును కలవారై, శిరస్సుపై అంజలిని పెట్టుకొని, శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాల స్వామి యతీంద్రులు నిన్ను స్తుతిస్తున్నారు. నీ సేవకోసం ప్రయత్నించేవాడై, గొప్ప ఆనందాన్ని కలవాడైన శ్రీకృష్ణభూపతి (కృష్ణరాజ ఒడైయార్) ఇక్కడ నిలచి ఉన్నాడు. నీకు సుప్రభాతం.

**22. జయ జయ నిత్యసూక్తి లలనామణిమౌళిమణే!**
**జయ జయ భక్తసంహతిభవాబ్ధి మహాతరణే! ।**
**జయ జయ వేదమౌళిగురుభాగ్య దయాజలధే!**
**జయ జయ వాజివక్త్ర! పరకాలయతీంద్రనిధే! ॥**

నిత్యవాక్కులైన వేదాలనే కన్యకామణిశిరస్సుపైగల మణివంటివాడా! (వేదాంతప్రతిపాద్యుడా) నీకు జయం. భక్తసమూహంయొక్క సంసారసముద్రాన్ని ఇంకింపజేసే సూర్యునివంటివాడా! నీకు జయం జయం. వేదాంతదేశికుల భాగ్యమా! దయాసముద్రమా! జయం జయం. హయగ్రీవా! పరకాలయతీంద్రులకు నిధివంటివాడా! నీకు జయం జయం.,

### శ్రీఅభినవ రంగనాథ బ్రహ్మతంత్రస్వతంత్ర పరకాలజీయర్‌స్వామివారిచే ప్రణీతమైన

# శ్రీ లక్ష్మీ హయగ్రీవ రత్నమాలా స్తోత్రమ్

(శ్రీఅభినవ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాలస్వామివారు భారతం శాంతిపర్వంలోని హయశిర ఉపాఖ్యానానికి హయశిరోభూషణమనే గొప్ప పరిశోధనాత్మకమైన వ్యాఖ్యానాన్ని రచించారు. చివరిలో ఆ వ్యాఖ్యానంలోని విశేషాంశాలను క్రోడీకరిస్తూ ఈ రత్నమాలా స్తోత్రాన్ని రచించారు. వీరు పరకాల మఠాన్ని క్రీ.శ.1925 నుండి క్రీ.శ.1967 వరకు నిర్వహించారు. శ్రీరామానుజుల శ్రీభాష్యం గ్రంథంపై గూఢార్థ సంగ్రహమనే గొప్ప వివరణాన్ని రచించారు. )

1. **వాగీశాఖ్యా శ్రుతిస్మృత్యుదితశుభతనోః వాసుదేవస్య మూర్తిః**
**జ్ఞాతా యద్వాగుపజ్ఞం భువి దనుజవరైః వాజివక్త్రప్రసాదాత్।**
**ప్రఖ్యాతాశ్చర్యశక్తిః కవికథకహరిః సర్వతంత్రస్వతంత్రః**
**త్రయ్యంతాచార్యనామా మమ హృది సతతం దేశికేంద్రః స ఇంధామ్॥**

వేదాలలో, స్మృతులలో, ఇతిహసాలలో మిక్కిలిగా స్తుతింపబడిన శ్రీపరవాసుదేవుని అవతారమైన, వాగ్దేవతయైన శ్రీహయగ్రీవుడు నామనస్సులో ఎల్లప్పుడు ప్రకాశించాలి. ఈ లక్ష్మీహయగ్రీవుల అనుగ్రహంవల్లనే లోకంలో మానవులందరు మాట్లాడగల్గుతున్నారు. అంతేకాక, కవితార్కికసింహం, సర్వతంత్రస్వతంత్రులు - ఇత్యాదిగా పలు బిరుదులను పొందిన శ్రీ వేదాంతదేశికులుకూడా ఈ లక్ష్మీహయగ్రీవుని అనుగ్రహంతో గొప్ప కీర్తితో ఆశ్చర్యకరమైన సామర్థ్యాలతో ప్రకాశించారు.

2. **సత్త్వస్థం నాభిపద్మే విధి మథ దితిజం రాజసం తామసం చాపి-**
**బ్బింద్వోరుత్పాద్య తాభ్యా మపహృతమఖిలం వేదమాదాయ ధాత్రే।**
**దత్వా ద్రాక్ తౌ చ హత్వా వరగణమదిశద్వేధసే సత్ర ఆదౌ**
**తంత్రం చోపాదిశద్యస్స మమ హయశిరా మానసే సన్నిధత్తామ్॥**

అనిరుద్ధుడై వ్యూహరూపాన్ని పొందినపుడు ఈ హయగ్రీవుడు తన నాభీవద్మం నుండి సత్త్వగుణం అతిశయించిన బ్రహ్మను సృష్టించాడు. పిమ్మట రాజసుడైన - రజోగుణం అధికంగా కల్గిన - కైటభుడు, తమోగుణం అతిశయించి ఉండే మధువు - అనే ఇద్దఱు అసురులను జలబిందువుల ద్వారా సృష్టించాడు. ఆ ఇరువురు బ్రహ్మ దగ్గరనుండి వేదరాశిని అపహరించగా, శ్రీహయగ్రీవుడు వారిద్దఱిని తన ఊరువుల మధ్యలో పెట్టుకొని మర్దించి



వధించి, వేదాలను తిరిగి బ్రహ్మకు ఇచ్చాడు. పాంచరాత్ర శాస్త్రాలను కూడా ఉపదేశించాడు. అటువంటి లక్ష్మీహయగ్రీవుడు నా మనస్సులో ఎల్లప్పుడు ప్రకాశించాలి.

3. **అధ్యాస్తేఽంకం పరా వాక్ వరహరశిరసో భర్తు రాచార్యకే యా**
**వాంఛావాన్ ఐతరేయోపనిషది చరమాత్ ప్రాక్తనే ఖండ ఆదౌ।**
**యస్యా వీణాం చ దైవీం మనసి వినిదధత్ ఖ్యాతి మేత్యంత్యమంత్రే**
**సేశానా సర్వవాచో మమ హృదయగతా చారు మాం వాదయేద్వాక్॥**

ఈ లక్ష్మీహయగ్రీవుని ఒడిలో గొప్పదైన వాగ్దేవత **(పరా వాక్)** అనబడే లక్ష్మి ఎల్లప్పుడు వేంచేసి ఉంటుంది. ఐతరేయోపనిషత్ - అనే ఉపనిషత్తులోని చివరి ఖండానికి ముందు ఖండంలో ఈ విషయం విశదమవుతున్నది. ఈమె తన చేతిలో వీణను ధరించి ఉంటుంది. ఈమెను, ఈమె చేతిలో ఉండే వీణను ఎవరు మనుస్సులో ధ్యానిస్తారో, వారు గొప్ప కీర్తిని పొందుతారు. అటువంటి వాగ్దేవత నా మనస్సులో ఎల్లప్పుడు నిలచి ఉండి నన్ను చక్కని వాక్కులను వలికేట్లు చేయాలి.

4. **కృష్ణం విప్రా యమేకం విదురపి బహుధా వేదయో(రైతయే)రాదిమాంతే**
**స్రష్టా విస్రంసమానః స్వమథ సమదధాత్ ఛందసాం యేన దానాత్।**
**కృష్ణం విష్ణుం చ జిష్ణుం కలయితురపి యస్సంహితా మాయురుక్తం**
**వాక్శ్లిష్టం ప్రాణమేనం హయముఖ మనుసందధ్మహే కిం వృథాఽన్యైః॥**

**"కృష్ణం నియానమ్"** (ఋగ్వేదం - 1- 164 - 47) అనే ఋగ్వేద మంత్రంచేత చెప్పబడే విష్ణువు ఒక్కడే లోకాన్ని సృష్టించినవాడు, అతడే వేదాలను బ్రహ్మను అనుగ్రహించాడు. అందఱి కంటే గొప్పవాడుగా ఐతరేయోపనిషత్తులోను, శ్రీ పాంచరాత్ర సంహితలలోను ఈవిధంగానే చెప్పబడింది. లోకంలో ఉండేవారికి ప్రాణవాయువు వంటివాడు, వాగ్దేవితో నిత్యసంశ్లేషాన్ని కలవాడైన ఈ హయగ్రీవుని నేను సదా మనస్సులో ధ్యానిస్తున్నాను. మిగిలినవారిని వ్యర్థంగా ధ్యానించడం ఎందుకు?

5. **ప్రఖ్యాతా యాఽఽశ్వలాయన్యధికఫలదశశ్లోక్యభిఖ్యా తదంతః**
**శ్రుత్యుక్తా వాక్ సరస్వత్యపి హయముఖ ! తే శక్తిరన్యా న యుక్తా ।**
**పూర్ణా త్వచ్ఛక్తిరర్ధం భవతి విధివధూర్యా నదీ సా కలాస్యా**
**ఇత్యుక్తే బ్రహ్మవైవర్త ఇహ సముదితా స్యాత్ పరా నిమ్నగాఽఖ్యా॥**

ఆశ్వలాయనునిచేత తెలుపబడిన దశశ్లోకి అనే ప్రసిద్ధమైన స్తుతిగ్రంథం ఒకటి ఉన్నది. అందులో, వేదాలలో తెలుపబడిన వాగ్దేవత శ్రీహయగ్రీవుని శక్తి అని (భార్య

అని) తెలుస్తున్నది. ఆమె వేఱొకతె కాదు. **"అర్థం వై పత్నీ"** అని వేదం తెల్పిన రీతిలో ఈ వాగ్దేవత శ్రీహయగ్రీవునిపత్ని అయిన లక్ష్మీదేవియే. ఈ హయగ్రీవ పత్నియైన వాగ్దేవతయొక్క షోడశభాగం మాత్రమే (పదహాఱవ అంశమాత్రమే) బ్రహ్మభార్యగా, సరస్వతి అనే నదీరూపంలో ఉన్నది. బ్రహ్మవైవర్త పురాణంలో ఈ విషయం తెలుస్తున్నది.

**6.** **శ్రీహర్షో విష్ణుపత్నీం వదతి కవి రిమాం నైషధే మల్లినాథః**
**ఖ్యాతామేతాం పురాణే హయముఖ భువి చ స్థాపితాం విష్ణుపార్శ్వే।**
**ధీవాగ్మిత్వార్థజప్యం దినముఖసమయే శౌనకః సూక్తమస్యాః**
**శ్రీయుక్తం బహ్వృచ స్స స్మృతికృదపి తథా చింతనీయం తథైనామ్॥**

నైషధకావ్యమనే పేరుతో నలుని చరిత్రను కావ్యంగా రచించిన శ్రీహర్షకవి సరస్వతిని విష్ణువుయొక్క పత్నిగా, ఆమె విష్ణువుయొక్క సమీపంలో అర్చారూపంలో వేంచేసి ఉన్నట్లు తెలియజేశాడు. దీనిని వ్యాఖ్యానించే మల్లినాథసూరి ఈ విషయం పురాణ ప్రసిద్ధి పొందినదని కూడా అన్నాడు. ఋగ్వేదాన్ని ప్రవర్తింపజేసిన శ్రీశౌనకులు – జ్ఞానం, చక్కని వాక్సిద్ధి – అనే వాటిని కోరేవారు ప్రాతఃకాలంలో జపించవలసినదిగా ఈ వాక్సూక్తాన్ని నిర్దేశించారు. ఈమెను జపించేవారికి జ్ఞానం నిత్యాభివృద్ధం కాగలదు.

**7.** **వాగాంభృణ్యాదిసూక్తే నిరవధిమహిమా యా శ్రుతా వాక్ చ దేవీ**
**పూర్వే సూక్తేఽపి హంస స్త్వమధికమహిమా విశ్రుతో బహ్వృచై ర్యః।**
**యుక్తావారణ్యకే తౌ కథితబహుగుణౌ సామనీ సంహితేఽపి**
**ఆరాధ్యో వ్యూహరూపీ హయముఖ విదితో జ్ఞానినాం కర్మభి స్త్వమ్॥**

ఋగ్వేదంలో వాగాంభృణీసూక్తం అనే భాగంలో అవధిలేని మహిమలను కల్గినదిగా ఈ వాగ్దేవి తెలుపబడింది. ఆ సూక్తానికి ముందున్న సూక్తంలో శ్రీ హయగ్రీవుడు హంస, పరమహంస నామాలతో కీర్తింపబడ్డారు. సామవేదానికి చెందిన ఆరణ్యకంలో కూడా ఈ ఇద్దరు ఇదే విధంగా కలిపి అనుసంధింపబడ్డారు. అందువల్ల జ్ఞానులు తమ యజ్ఞాది కార్యాలతో అరాధించదగినవారు – ఈ ఇరువురే.

**8.** **ఇంద్రో వృత్రం హనిష్యన్ సఖివర వితరన్ ! విక్రమస్వేతి విష్ణుం**
**సంప్రార్థ్యాఽతో హతారి స్తత ఉపజనితబ్రహ్మహత్యాపనుత్త్యై।**
**సూక్తాభ్యా మాదిమం యం ప్రతి పరమజుహోన్మూర్ధ్ని గంధర్వ ఏకో**
**దేవానాం నామధారీ స మమ దృఢమతావద్య వాచస్పతి స్తాత్॥**

వృత్రాసురుని వధించాలని ప్రయత్నించిన ఇంద్రుడు, "నాలో ఉండే తగిన స్నేహితుడవైన ఓవిష్ణూ! నాకు, ఇతనిని వధించదగిన బలిమిని అనుగ్రహించు" అని



వేడి, వృత్రుని వధించాడు. తరువాత, వృత్రుని సంహరించినందువల్ల తనకు కల్గిన పాపం తీరడం కోసం, ముందు పల్కిన రీతిలో రెండు సూక్తాలతో భగవానునకు హోమం చేసి, పాపవిమోచనాన్ని పొంది ఉజ్జీవించాడు. ఈరీతిలో హయశిరస్సును కలవాడు, దేవతలకు పేర్లను పెట్టి, వ్యవహరింపజేసేవాడైన, వాచస్పతి అనబడే ఆ శ్రీహయగ్రీవుడు నా మనస్సులో స్థిరంగా నిలబడి ఉండాలి.

**9.** **వేదే చాథర్వణాఖ్యే ప్రథమత ఉదితం యత్ త్రిషప్తీయసూక్తం**
**తన్మేధాజన్మకర్మాంగమితి నిగదితం కౌశికేన స్వసూత్రే ।**
**మేధాకామః పుమాన్ య స్తురగముఖ తతః సర్వలోకాధినాథం**
**ధ్యాయేత్ వాచస్పతిం త్వాం ప్రభవతి సకల స్తత్ శ్రుతార్థోఽప్రకంప్యః ॥**

అధర్వణవేదంలో మొదట అధ్యయనం చేయబడే త్రిషప్తీయసూక్తమనేది ఒకటి ఉన్నది. పఠించినదానిని మరువకుండా ఉండడంకోసం, మఱు జన్మ ఎత్తకుండా ఉండడంకోసం ఉపయోగించదగినది ఇది – అని కౌశికుడనే ముని తాము రచించిన సూత్రాలలో తెలిపాడు. అందువల్ల, ఓ హయగ్రీవస్వామీ! చక్కని మేధాశక్తిని పొందగోరేవాడు అన్ని లోకాలకు ప్రభువువు, వాచస్పతివి అయిన నిన్ను ధ్యానిస్తే అతడు నేర్చినది విద్యలు అన్నీ మఱువకుండా, ఉంటాడు. అతడు ఎవరికీ జయించడానికి సాధ్యం కానివాడవుతాడు.

**10.** **నాసన్నో సత్తదానీ మపి తు కమలయాఽవాత మేకం తదానీమ్**
**తస్మాదన్యత్ పరం కించిదపి న తమసా గూఢమగ్రే ప్రకేతమ్ ।**
**అద్ధా కో వేద హేతుం త్రివిధ మవిగుణం వాసుదేవాభిధానం**
**వ్యూహం త్వాం ప్రాతరర్చ్యం హయముఖ భగమాహుః క్రమాత్తైత్తిరీయాః॥**

రూపం, నామం – అనే వాటిని కల ఏ వస్తువు ప్రళయకాలంలో నిలిచి ఉండదు. లయాన్ని పొందుతుంది. **"కలా"** అనే పేరును కల లక్ష్మీదేవితో కూడిన ఆ భగవానుడు ఒక్కడే ఆ ప్రళయ సమయంలో నిలిచి ఉంటాడు. ఆ దంపతులు ఇరువురు తప్ప ఇక ఏ వస్తువు ఆ సమయంలో ఉండదు. కేవలం అంధకారంలో ఆవరించబడి, జ్ఞానస్వరూపుడైన భగవానుడు ఎవరికీ తెలియని స్థితిలో ఉంటాడు. అటువంటి భగవానుని ఎవరు తెలియగలరు? లోకాలకు అన్నీటికి ఉపాదానకారణం, నిమిత్త కారణం – అనే ద్వివిధకారణాల రూపమైనవాడు, రజస్సు తమస్సుల స్పర్శ లేని, కేవలం సత్త్వగుణంతో నిండిన స్వరూపాన్ని కలవాడు, వాసుదేవుడనే వ్యూహానికి చెందినవాడుగా, భగుడనే పేరును కలవాడుగా తైత్తిరీయవేదాన్ని అధ్యయనం చేసేవారు ఎవనిని నిర్దేశిస్తున్నారో, ఓ హయగ్రీవస్వామీ! ప్రాతఃకాలంలో పూజింపబడే ఆ దేవుడవు నీవేకదా!

**11.** **ప్రాతః పూజ్యం భగాఖ్యం ప్రథమ మకథయన్ బహ్వృచాః పంచమేఽథో**
**నాసత్సూక్తేఽష్టమే ప్రాగ్వదపి సమవదన్ తైత్తిరీయక్రమాత్త్వామ్ ।**
**పారాశర్యోఽవతీర్ణం వదతి హయముఖాథర్వణః కౌశిక స్త్వాం**
**మేధార్థం ప్రాతరర్చ్యం భగ మనుమనుతే సంహితాఽప్యాహ సాధు ॥**

శ్రీహయగ్రీవా! ఋగ్వేదులు అయిదవ సూక్తంలో ప్రాతఃకాలంలో పూజించదగిన **"భగు"** డనే నామంతో నిన్ను అధ్యయనం చేస్తున్నారు. ఎనిమిదవ **"నాసత్"** అనే సూక్తంలో కూడా పూర్వం తెలుపబడిన తైత్తిరీయులు కూడా అధ్యయనం చేస్తున్నారు. శ్రీపరాశరమహర్షి కుమారుడైన వేదవ్యాసమహర్షి ఇదే అర్థంలో నిన్ను హయగ్రీవావతార రూపునిగా పలికాడు. అధర్వణవేద సూత్రకారుడైన కౌశికుడు, చక్కని జ్ఞానం వృద్ధిజెందడంకోసం ప్రాతః కాలంలో ఆరాధించదగిన **"భగు"** డనే (**"ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిమ్"** అని) తిరునామంతో నిన్ను నిర్దేశించాడు. శ్రీపాంచరాత్రసంహితలు కూడా ఈ విధంగానే చక్కగా తెలిపాయి.

**12.** **ప్రద్యుమ్నాంతం త్రిపాద్భాస్వరవపు రమృతం వాసుదేవాదిబృందే**
**పాద స్త్వత్రానిరుద్ధో భువి తత ఉదభూదాత్మభూ ఋగ్విధిజ్ఞైః**
**హుత్వా త్వాం యజ్ఞరూపం హయవదన ! జితంతే స్తుతిం తన్వతేఽతః**
**నిర్ణీతం సర్వవేదేష్వనుపమమితి తత్ పౌరుషం సూక్త మాప్తైః॥**

ఓ హయగ్రీవా! వాసుదేవ – సంకర్షణ – ప్రద్యుమ్నులనే మూడు ప్రకాశించే రూపాలతో వ్యూహాలలో మొదటి స్వరూపంగా ఆవిర్భవించినట్లుగా ఋగ్విధానం అనే గ్రంథంలో శ్రీ శౌనకుడు మొదలైనవారు తెలిపారు . యజ్ఞం మూర్తీభవించినట్లున్న నీ మేనిని ఉద్దేశించి హోమం చేసి, **"జితం తే"** అనే స్తుతిని ప్రతిదినం అనుసంధిస్తున్నారు. ఈ విధంగా **"త్రిపాత్ ఏక పాత్"** – అని అంటూ పురుషసూక్తంలో తెలుపబడినవాడవు నీవే, సాటి లేనివాడవు, వేదాలలో ప్రతిపాదింపబడేవాడువు నీవే అని యథార్థవక్తలైన ఆప్తులు పల్కుతున్నారు.

**13.** **సర్వే వేదా ప్రజాశ్చ ప్రచురబహుభిదాః సంశ్రయంతే యమేకం**
**శాస్తా యోఽంతః ప్రవిష్ట స్స్వయమపి దశధాత్మాచరత్యర్ణవే యమ్।**
**బ్రహ్మా చైవోన్వవిందద్ధరి మిహ దశహోతార మంతశ్చ చంద్రే**
**దేవా స్సంతం సహైనం న హి విదురవతాత్ సోఽద్య వాచస్పతిర్మామ్॥**

పలు విధాలైన వేదాలు పూర్వులు ఏ హయగ్రీవుని ఒక్కని మాత్రమే ఆశ్రయించాయో, ఏ ఒక్కడు మాత్రమే అన్ని వస్తువుల లోపల బయట వ్యాపించి నిలచి ఉండి నియమించే శక్తిని కలవాడో, ఎవడు సముద్రం లోవల పది రూపాలతో



(విభిన్నావతారాలలో క్షీరాబ్ధమూలం కనుక, ఈ విధంగా చెప్పబడింది.) సంచరిస్తున్నాడో, ఎవనిని బ్రహ్మ మాత్రమే ఏదో కొంతవరకుమాత్రమే తెలిసికొంటున్నాడో, ఎవడు చంద్రమండలం నడుమ వేంచేసి ఉన్నాడో, తోడుగా ఉన్నప్పటికీ దగ్గరలోనే ఉండే ఎవరిని దేవతలుసైతం తెలిసికొనలేరో, అటువంటి వాచస్పతి అయిన హయగ్రీవుడు నన్ను కాపాడాలి.

**14.** **యస్మాత్ బ్రహ్మా చ రుద్రః సకలజగదిదం జాయతేఽంతర్బహిర్యత్**
**వ్యాప్యా సత్తాం చ యస్మిన్ లయమపి లభతే యశ్చతుర్వేదమూర్తిః ।**
**విష్ణు ర్నారాయణోఽష్టాక్షరపదవిదితో దేవకీపుత్ర ఏకో**
**యోఽథర్వాంగే మధోః సూదన ! ఉపనిషది జ్ఞాయతే మే స ఇంధామ్॥**

ఎవరినుండి ఈ లోకం బ్రహ్మ, శివుడు మొదలైనవారు అందఱు పుడుతున్నారో, ఎవడు ఈ అన్నివిధాలైన వస్తువులను లోపల బయలు వ్యాపించి ఉండి ధరిస్తున్నాడో, ఎవనిలో ఈ సమస్త జగత్తు ప్రలయకాలంలో లయిస్తున్నదో, ఎవడు నాల్గు వేదాల యొక్క ప్రతిరూపమో, అటువంటి ఏ విష్ణువు, నారాయణుడు– అని అష్టాక్షరీ మంత్రంలో తెలియబడుతున్నాడో, అతడే అధర్వవేదానికి చెందిన ఉపనిషత్తులో **"బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనోమ్"** (ఇతడే వేదానికి హితాన్ని కల్గించేవాడు. ఓంకారంచేత ప్రతిపాదింపబడేవాడు. ఇతడే దేవకీపుత్రుడై అవతరించాడు. ఇతడే మధువనే అసురుని వధించిన శ్రీహయగ్రీవుడు) అని తెలియబడుతున్నాడు. అటువంటి హయగ్రీవుడు నన్ను తేజస్సును కల్గి ఉండేటట్లు అనుగ్రహించాలి.

**15.** **శక్తిః స్వాభావికీ సాఽత్ర చ వివిధపరా శ్రుయతే జ్ఞానమేవం**
**త్రేధా తత్ర క్రీయేత్థం బలమపి తదసౌ వాసుదేవః స హంసః ।**
**యో బ్రహ్మాణం విధాయ ప్రథమ మథ పరాన్ ప్రాహిణోత్ సర్వవేదాన్**
**తస్మై దేవం ప్రపద్యే శరణ మహ మిమం చామృతస్యైష సేతుః॥**

భగవానునకు సహజంగానే **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** అనే రీతిలో గొప్ప జ్ఞానం, లోకాలను ధరించే బలం, ఏ పనిని అయినా నిర్వహించి ముగించగల సామర్థ్యం, దేనినైనా సృష్టించగల్గిన శక్తి మొదలైన గుణాలున్నాయి. ఇవి అన్నీ సహజమైనవి. వేఱెవ్వరికి లేనివి. మిక్కిలి గొప్పవి. పలు విధాలైనవి – అని శ్వేతాశ్వత రోపనిషత్తులో తెలియబడుతున్నది. ఆ పరమాత్మ వాసుదేవుడే. ఇతనినే మిగిలిన వేదాలు హంస శబ్దంలో కీర్తించాయి. ఇతడు, బ్రహ్మను తన నాభీకమలంలో సృష్టించి, అతనికి చాలా గొప్పవైన వేదాలను అనుగ్రహించాడు. **"అమృతస్యైష సేతుః"**

అనే రీతిలో ఇతడే మనలను అమృతమనబడే మోక్షాన్ని పొందించే సేతువువంటివాడు. ఇతనినే మోక్షాన్ని పొందగోరిన నేను శరణు పొందుతున్నాను.

**16.** **వర్మ్యా విష్ణోః ధనుర్జ్యాం హయవదన ! వరాన్ నేచ్ఛయా చిచ్ఛిదు స్తత్**
**కోట్యా ఛిన్నం చ విష్ణోః శిర ఇతి కథితం యత్ ప్రవర్గ్యార్థవాదే ।**
**తచ్ఛీర్షం యాజమానం శ్రుతిముఖత ఇదం స్థాపితం యుక్తితోఽపి**
**ప్రాదుర్భావః స గౌణో బహుముఖహరివంశాది నిర్ధారితో వా॥**

**17.** **శుక్లం వేదం వివస్వానుపదిశసి పరం యాజ్ఞవల్క్యాయ వాజీ**
**వేదైకార్థైర్వచోభి ర్మితమిద మఖిలామ్నాయధీకారిణీ యామ్ ।**
**వాగ్దేవీం మోక్షధర్మే కథయతి మునిరాట్ తత్కృపాలబ్ధభూమా**
**త్వచ్ఛక్తిః సేత్యకంప్యం హయముఖ ! గదితం బ్రహ్మవైవర్తవాగ్భిః॥**

ప్రవర్గ్యార్థవాదమనే వేదభాగంలో ఒక కథ ఉన్నది. ఒకానొక సమయంలో విష్ణువు చేతిలో ఉండే వింటియొక్క అల్లెతాడును చెదపురుగులు కొఱికివేసినందున, ఆ నారి తెగిపోయింది. అప్పుడు యజమానస్వరూపుడైన విష్ణువుయొక్క తలకు ఆ వింటి చివరి భాగం బలంగా తాకినందున, అతని తల తెగి పడింది – అని ఆ కథలో తెలుపబడింది. ఇక్కడ భగవానుడైన విష్ణువు విష్ణు శబ్దంతో తెలుపబడలేదని గ్రహించాలి. హరిని పూజించే బ్రాహ్మణుడు **"అర్చక స్తు హరి స్సాక్షాత్"** అనే రీతిలో, యజ్ఞాన్ని నిర్వహించే యజమానినే విష్ణువుగా వేదం నిర్దేశించింది. వేదాలను పురస్కరించుకొని, శ్రీహరివంశం అనే ఇతిహాసాన్ని పురస్కరించుకొని, యుక్తులద్వారా అభిజ్ఞులు దీనిని నిరూపించారు. ఈ యజమానిని విష్ణువుగా పల్కడం గౌణప్రాదుర్భావం – అంటే ముఖ్యమైన శ్రీవిష్ణువు యొక్క అవతారం కాదు. **"స్పర్ధమానో విష్ణురేవ భూత్వా ఇమాన్ లోకానపి జయతి"** (పోటీలో స్పర్ధలో నేనే గెలవాలి – అనే కోరికను కలవాడు వామనుడైన విష్ణువును ఉద్దేశించి తెల్లమేకతో యజ్ఞాన్ని చేయాలి. అవుడతడు విష్ణువై ఈ లోకాలను జయిస్తాడు) అనే చోటలోవలె సామ్యంవల్ల పల్కిన రీతి ఇది.

ఓ హయగ్రీవా! నీవు సూర్యమండలం మధ్యలో వేంచేసి ఉండి విశ్వామిత్రుని పౌత్రుడైన యాజ్ఞవల్క్యమహర్షికి శుక్లయజుర్వేదాన్ని అశ్వరూపుడవై వేంచేసి ఉండి ఉపదేశించావు. ఇది వేదవిదులైన మునుల వాక్కుల ద్వారా తెలుస్తున్నది. సమస్త వేదాలలోను స్పష్టమైన జ్ఞానాన్ని కల్గించేదిగా వాగ్దేవిని, మోక్షధర్మంలో మునులలో గొప్పవాడైన వేదవ్యాసుడు పలికాడు. ఎందుకంటే, అతడు ఆ వాగ్దేవియొక్క అనుగ్రహంతో మహిమను పొందాడు. ఆ వాగ్దేవి నీయొక్క శక్తియే అని బ్రహ్మవైవర్త పురాణవచనాలలో తెలుపబడినది.



**18.** **తస్మాద్వేదేఽపి తత్రోపనిషది బృహదారణ్యకే కాండ ఆత్మా**
**త్వం వాగ్దేవ్యా సహాదౌ జనయసి మిథునీభూయ సర్వాంశ్చ వాదాన్।**
**ధాతారం తస్య పత్నీం తదను తదుభయద్వారికాం వృష్టిసృష్టిం**
**తద్యజ్ఞారాధితోఽస్మై హయవదన! వరాన్ యచ్ఛసీతి ప్రతీమః॥**

అందువల్ల, ఓ హయగ్రీవా! ఆ శుక్లయజుర్వేదంలోకూడా సంహితాభాగం, బృహదారణ్యక భాగం – అనే భాగాలలో నీవు ఆ వాగ్దేవితో కూడినవాడవని, సృష్ట్యారంభంలో ఇద్దఱు కలిసి లోకాలను సృష్టిస్తారని, వేదాలను అన్నిటిని అనుగ్రహించేవారని, ఆ బ్రహ్మను పురస్కరించుకొని వృష్టిసృష్టిని నిర్వహిస్తారని తెలిసికొంటున్నాము. బ్రహ్మ చేసిన యజ్ఞాలవల్ల ఆనందించి అతనిచే ఆరాధింపబడి, అతనికి వరాలను నీవు ప్రదానం చేసినట్లుగాకూడా తెలిసికొంటున్నాము.

**19.** **తుర్యేఽధ్యాయే ద్వితీయం తురగముఖ! శిశుబ్రాహ్మణం వ్యూహరూపం**
**ప్రాణం స్థూణాం శిశుం త్వాం చమసమపి శిరోఽర్వాక్బిలం చోర్ధ్వబుధ్నమ్ ।**
**సప్తానాం దేవతానా మధికరణ మమిత్రేంద్రియాణాం జయార్థం**
**వాచాఽష్టమ్యా యుతం త్వాం పరికలయతి తద్బ్రహ్మ భక్తార్తిహారి ॥**

ఓ హయగ్రీవా! బృహదారణ్యకోపనిషత్తులోని నాల్గవ అధ్యాయంలోని శిశు బ్రాహ్మణమనే రెండవ భాగం ఉన్నది. ఆ భాగం – ప్రాణాన్ని స్థూణగా (వ్యూహరూపంగా) నిన్ను అనిరుద్ధరూపుడవైన, వటపత్రశాయివి అయిన శిశువుగా, హృదయ – శరీరాలను అధ్యాన– ప్రత్యాధ్యానాలుగా (గర్భగోళ– ప్రసూతి భూములుగా), చమసపాత్రను క్రింది వైపు ముఖంగా (శిరస్సుగా), పైన గుండ్రని భాగాన్ని (పొట్టను) కల అన్నపాత్రగా రూపించి పల్కింది. అంతేకాక, (ఉపాసకుని) ముఖంలో ఉండే రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు నాసికారంధ్రాలు, ఒక నోరు – అనే ఏడు ఇంద్రియాలనే శత్రువులను జయించడంకోసం ఎనిమిదవది అయిన వాక్కుతో (వాగ్దేవతతో) కూడినవాడవు, భక్తుల ఆర్తిని తీర్చేవాడవుగా నిన్ను **"వాగష్టమా బ్రహ్మణా సంవిదానేతి, వాగష్టమా బ్రహ్మణా సంవిత్తా"** అని అంటూ తెల్పుతున్నది.

**20.** **దధ్యఙ్ ఆథర్వణోఽశ్విత్రిదశకృత శిరోధారణాత్ అశ్వమూర్ధ్నా**
**తాభ్యాం ప్రావర్గ్యతత్త్వం హయముఖ ! సముపాదిక్షతే తద్యథార్థమ్ ।**
**ఏతావత్యేవ తత్త్వే కలిబలవశతః తామసాః శక్త్యధీనం**
**భావత్కం శీర్షమాహు ర్భువి జనిసమయే త్వత్కటాక్షాతిదూరాః॥**

హయగ్రీవా! అశ్వినీదేవతలు కూర్చిన అశ్వముఖాన్ని ధరించినందువల్ల ఆథర్వణుడైన దధీచిమహర్షి అశ్వముఖాన్ని కలిగినవాడయ్యాడు. దధీచివల్ల, అశ్వినీదేవతల వల్ల ప్రవర్గ్యంచే చెప్పబడిన వృత్తాంతంయొక్కతత్త్వం స్పష్టంగా వ్యక్తం చేయబడింది. యథార్థతత్త్వం ఈ విధమైనది కాగా, కలికోలాహలంవల్ల కొందఱు అజ్ఞానులు శక్తి అనే దేవతకు నీ శిరస్సు అధీనమైనదని అంటున్నారు. తల్లి గర్భంనుండి ఈ భూమిపై పడే టపుడు మధుసూదనుడైన హయగ్రీవుని కటాక్షానికి పాత్రమైనవారే **"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"** అనే రీతిలో సాత్త్వికులు కాగలరు. వారే మోక్షాన్నిగూర్చిన ఆలోచనను కలిగినవారు కాగలరు - అనే వేదవ్యాసుని వచనానుసారం ఈ విధంగా నీ కటాక్షానికి దూరమై, తామసులైనవారే ఈ విధంగా పల్కుతారు.

**21.** **దధ్యఙ్ ఆథర్వణో యో హయముఖ ! బృహదారణ్యకే కాండ ఆదౌ**
**ఆహ ప్రావర్గ్యతత్త్వం యదపి కథయతే దీక్షణీయార్థవాదే।**
**విష్ణ్వాఖ్యం తత్త్వముక్తం పునరుపనిషది బ్రహ్మవాగీశరూపం**
**యచ్చ ప్రోక్తం తృతీయే తదపి చ స మధుబ్రాహ్మణే వక్తి తుర్యే ॥**

హయగ్రీవ స్వామీ! అథర్వణుని కుమారుడైన దధీచిమహర్షి, బృహదారణ్యకం లోని మొదటి కాండంలో ప్రవర్గ్యంయొక్క యథార్థాన్ని తెలియజేసాడు. శతపథబ్రాహ్మణంలోని దీక్షణీయార్థవాదమనే భాగంలో శ్రీవిష్ణువే పరతత్త్వమని అతడు తెలిపాడు. ఆ ఉపనిషత్తులలోని మూడవ కాండలో పరతత్త్వం వాగ్దేవత అయిన హయగ్రీవుడే (నీవే) అని తెలుపబడింది. అతడే తిరిగి నాల్గవ భాగమైన మధుబ్రాహ్మణంలో కూడా ఈ విషయాన్ని తెలిపాడు.

**22.** **వాచా దేవ్యాఽ నిరుద్ధేన చ సృజతి జగత్ సర్వ మిత్యగ్ర ఉక్తో**
**వాహాస్యో వాసుదేవః స పర ఇతి మధుబ్రాహ్మణం స్థాపయిత్వా ।**
**దధ్యఙ్ ఆథర్వణోఽశ్విత్రిదశహితమధుత్వాష్ట్రకక్ష్యోపదేష్టా**
**తత్త్వం జానాతి చేత్యప్యఖిలశుభతనుం వక్తి వాగీశ్వరం త్వామ్॥**

వాగ్దేవితో కూడిన అనిరుద్ధుడనే అశ్వముఖాన్ని కల శ్రీవాసుదేవుడే అన్ని లోకాలను సృష్టించినవాడని, అతడే ఉన్నతమైన తత్త్వం - అని మధుబ్రాహ్మణం తెల్పుతున్నది. అశ్వినీదేవతలకు హితుడు, మధువు, త్వాష్ట్రుడు- అనే వీరి స్థితిని తెలిపేవాడు, ఆథర్వణుడైన దధీచిముని ఈ తత్త్వాన్ని తెలిసినవాడు అని, నీవే మంగళకరమైన తిరుమేనిని కలవాడవు అని మధుబ్రాహ్మణం తెల్పుతున్నది.



**23.** **దధ్యఙ్ ఆథర్వణోఽసౌ వుపదిశతి మధుబ్రాహ్మణం త్వాష్ట్రకక్ష్యం**
**యత్తన్నారాయణాఖ్యం కవచమితి సమాఘుష్యతే సాత్త్వికాగ్ర్యైః।**
**వృత్రస్యేదం వధాయాలమితి హయముఖ బ్రహ్మవిద్యేతి తత్త్వం**
**వాగీశైతే జానంత్యనఘ ! తవ కృపాబాహ్యతాం యే ప్రయాతాః॥**

**24.** **తత్త్వం నారాయణాఖ్యోపనిషది కథితం పంచరాత్రోక్తరీత్యా**
**తన్నామాఖ్యాన ఆహాశ్వముఖ ! విశదమాద్యం చ ధర్మం మునీంద్రః॥**
**గీతాయాం సంగృహీతం విశదయితుమనాః కృష్ణవాహానసైక్యం**
**బ్రూతే వేదోదితత్వం స్థిరయతి చ తదత్రోక్త ఏకాంతిధర్మే॥**

ఓ హయగ్రీవస్వామీ! అథర్వణుడైన దధీచిముని ఏ మధుబ్రాహ్మణాన్ని పురస్క రించుకొని నీతత్త్వాన్ని ఆవిష్కరించాడో, అదే సాత్త్వికాగ్రేరుల ద్వారా నారాయణకవచమనే పేరుతో ఘోషింపబడుతున్నది. దీనిని జపించి ఇంద్రుడు వృత్రాసురుని వధించాడు. వృత్రాసురుని వధకు ఇది సమర్థమైనది. ఇదే బ్రహ్మవిద్య. స్వామీ! నీ కరుణకు లక్ష్యం కాని వేదబాహ్యులు దీనిని తెలియలేరు.

తైత్తిరీయంలోని మహానారాణోపనిషత్తులో తెలుపబడిన పరతత్త్వమైన శ్రీమన్నారాయణునే పాంచరాత్రం మొదలైన ఆగమాలుకూడా వివరిస్తున్నాయి. దీనినే మునులలో గొప్పవాడైన వేదవ్యాసుడు మహాభారతంలో నారాయణీయమనే భాగంలో మోక్షధర్మంలో వ్యక్తం చేశాడు. శ్రీగీతలో గల తత్త్వాలను సంగ్రహంగా తెలుపాలని భావించి, అతడే భారతంలో శ్రీకృష్ణుడే శ్రీహయగ్రీవుడనే వేదాంతతత్త్వాన్ని పరమైకాంతి ధర్మాలను వివరించేటపుడు ఆశ్వమేథిక పర్వంలోని శ్రీవైష్ణవ ధర్మశాస్త్రంలో స్థిరీకరించాడు.

**25.** **ఆదౌ నారాయణం తం వదతి మధుజితం దేవకీపుత్ర మంతే**
**వేదాంతో, మోక్షధర్మే వరహయశిరసం ప్రాహ కృష్ణః స్వమేవ।**
**ఇత్యాలోచ్యైవ యోగీ కలిజిదభిజగౌ తత్ క్రమాత్ స్తౌతి మధ్యే**
**వాహాస్య! త్వాం శఠారిర్మునిరపి మనుతేఽశ్వం పురః కృష్ణ మంతే॥**

ఓ హయగ్రీవస్వామీ! నారాయణోపనిషత్తు మొదట నారాయణుని పల్కి, అతనినే చివరలో **"బ్రహ్మణ్యో మధుసూదనోమ్"** (వేదాలను రక్షించేవాడు, ప్రణవంతో ధ్యానింపబడే వాడు అయిన ఈ నారాయణుడే దేవకీపుత్రుడు, అతడే మధువును సంహరించిన హయగ్రీవుడు) అని తెలిపింది. మోక్షధర్మంలోకూడా శ్రీకృష్ణభగవానుడు ఈ తత్త్వాన్నే వ్యక్తం చేశాడు. ఇది అంతా బాగా తెలిసిన యోగివర్యులైన పరకాలసూరి (తిరుమంగై ఆళ్వార్లు) **"వశైయిల్ నాన్మఱై కొడుత్త అమ్మలరయఱ్కు అరుళి మున్ పరిముకమాయ్**

**ఇశైకొళ్ వేదనూల్ ఎన్ఱు ఇవైయన్దవనే! ఎనక్కు అరుళ్ పురియాయ్"** (పెరియ తిరుమొళి-5-3-2) అని, అదేప్రబంధంలో **"మున్ ఇవ్వులకేళుమ్ ఇరుళ్ మణ్ణి యుణ్ణ మునివరోడు తానవర్కళ్ తివైప్ప వన్దు పన్నుకలై నాల్వేద ప్పొరుళై యెల్లామ్ పరిముకమాయ్ అరుళియ ఎన్ వరమన్ కాణ్మిన్"** (7-8-2) అని అంటు శ్రీహయగ్రీవ స్వామిని గూర్చి పలికారు. ఇదే రీతిలో పరాంకుశసూరి (నమ్మాళ్వార్లు) కూడా తమ ప్రబంధం తిరువాయ్మొళిలో **"ఓవా త్తుయర్ పిఱవి ఉవ్విడ మత్తెవ్వైయుమ్ మూవా త్తనిముదలా మూవులకుమ్ కావలోన్, మావాకి ఆమైయాయ్ మావాకి మానిడమామ్ దేవాదిదేవపెరుమాన్ ఎన్ తీర్త్తనే"** (2-8-5) ఇందులో మిగిలిన అవతారాలలో ముందుగా హయగ్రీవుని ప్రస్తావించడం గమనార్హం.

**26.** **జన్మాదీనాం నిదానం కతిచిదకథయన్ దేవమేకం తథాఽన్యే**
**దేవీ మేకాం విదుః తన్మిథున మవికలాం బ్రహ్మ వేదాంతవేద్యమ్।**
**ఇత్యేవం స్థాపయిత్వా చిదచిదవియుతం శ్రీమదేకం తదిత్యపి**
**ఆచఖ్యౌ మోక్షధర్మే హయముఖ ! జనివృత్తాపదేశాన్ మునీంద్రః॥**

హయగ్రీవస్వామీ! లోకాల సృష్ట్యాదులకు మూలకారణం ఒక దేవుడని కొన్ని వేదవాక్యాలు తెల్పుతున్నాయి. ఇంకా కొన్ని వేదవాక్యాలు, ఎవరో ఒక దేవియే కారణమని అంటున్నాయి. కాని, ఒక మిథునమే కారణమనేది వేదవాక్యాలచేత తెలియబడే తాత్పర్యం. ఆ మిథునం లక్ష్మీనారాయణులే. చేతనం, అచేతనం - అనే ఈ రెంటితో అపృథక్ సిద్ధసంబంధాన్ని (విడదీయలేని సంబంధాన్ని) కల శ్రీమన్నారాయణుడే జగత్కారణభూతుడు - అని మోక్షధర్మంలో భగవానుని అవతారం, లీలలు మొదలైనవానిని వివరిస్తూ వ్యాసమునీంద్రుడు తెలియజేశాడు.

**27.** **శ్రావణ్యాం తేఽవతారే హయముఖ ! నిగమోద్ధారణార్థత్వబుద్ధేః**
**ఋగ్వేదోపక్రమః తచ్ఛ్రవణభ ఇతి నిశ్చిన్వతే బహ్వృచాగ్ర్యాః ।**
**ప్రారంభః పౌర్ణమాస్యాం యజుష ఇతి పరే యాజుషాః సంగిరంతే**
**తద్వేదోపక్రమాంతే భువి విధివశగా స్త్వాం సమారాధయంతి॥**

ఓ హయగ్రీవస్వామీ! శ్రావణమాసంలోని శ్రవణానక్షత్రంలో వేదాలను రక్షించడం కోసం నీవు అవతరించావు. అందువల్లనే ఋగ్వేదులు ఆ మాసంలోని శ్రవణా నక్షత్రంలో ఋగ్వేదాధ్యయనాన్ని ఆరంభిస్తారు. అదే శ్రావణమాసంలోని పౌర్ణమినాడు యజుర్వేదం నీచే ఉపదేశించబడింది- అనే కారణంవల్ల యజుర్వేదులు శ్రావణ పౌర్ణమినాడు తమ వేదాధ్యయనాన్ని ఆరంభిస్తారు. ఈ విధంగా అందఱు హయగ్రీవుడవైన నీ సంబంధాన్ని పురస్కరించుకొనే వేదాధ్యయనాన్ని చేస్తారు.



**28.** **విష్ణో పత్నీ పరా వాగితి బహుమనుతే భారతీ యాం యదీశః**
**పత్యుః ప్రాక్ పంచరాత్రం శ్రుతిమపి సముపాదిక్షదిత్యాదరేణ।**
**తత్వాగాశ్లిష్టమూర్తిం హయశిరస ఉపారాధయంతీ నిశమ్య**
**శ్రీభాష్యం లక్ష్మణాయ స్వపతివిదితయత్యాకృతిం బిభ్రతేఽదాత్॥**

హయగ్రీవస్వామీ! విష్ణుపత్నియే **"పరా వాక్"** అనే పేరును కల్గినది- అని, ఏ సరస్వతి గొప్ప గౌరవంతో పూజిస్తున్నదో, పరా వాక్ అనబడే లక్ష్మీదేవికి వల్లభుడైన శ్రీహయగ్రీవుడేకదా నా భర్తకు వేదాలను, పాంచరాత్రాగమాలను ఉపదేశించాడు- అని చాలా ఆదరణతో లక్ష్మీదేవిని పూజిస్తున్నది. అట్టి పరా వాక్చేత ఆలింగనం చేసికోబడిన లక్ష్మీహయగ్రీవమూర్తిని సరస్వతి ప్రతి దినం ఆరాధిస్తూ ఉన్నదై, ఆ హయగ్రీవుడు ఎత్తిన హంస పరమహంస దత్తాత్రేయావతారాలతో దర్శనాన్ని అనుగ్రహించినట్లుగా శిఖ, యజ్ఞోపవీతం, త్రిదండం - అనే వీటితో దర్శనాన్ని ఇచ్చే భగవద్రామానుజులను చూచి, "వీరు సాక్షాత్తు శ్రీమన్నారాయణని అవతారమే, వీరు అనుగ్రహించిన బ్రహ్మసూత్రభాష్యమే లోకంలో శ్రీభాష్యం - అని వ్యవహరింపబడగలదు" అని పల్కినది.

**29.** **వాగీశానస్య మంత్రం శ్రుతిశిఖరగురుః తార్క్ష్యలబ్ధం జపిత్వా**
**తత్కాలప్రాప్తలాలామృతమపిబదహీంద్రాఖ్యపుర్యాం యతీందోః ।**
**మాతుః భ్రాతుః తనతూజోత్తమగుణ కురుకాధీశవంశ్యార్చితాం త**
**న్మూర్తిం సంప్రాప్య కాంచ్యాం స్వయమపి చిర మారాధయత్ భక్తిభూమ్నా ॥**

శ్రీవేదాంత దేశికులు తిరువహీంద్రపురంలోని ఔషధపర్వతం పై శ్రీహయగ్రీవుని కోవెలలో గరుడునివద్దనుండి శ్రీహయగ్రీవ మంత్రాన్ని పొంది, ఆ హయగ్రీవ భగవానుని ధ్యానించారు. అప్పుడు శ్రీ హయగ్రీవస్వామి సాక్షాత్కరించి, శ్రీ దేశికులకు తన లాలాజలామృతాన్ని అనుగ్రహించాడు. శ్రీరామానుజుల మేనమామ కుమారుడైన కురుకేశులచేత ఆరాధింపబడిన ఆ శ్రీహయగ్రీవుని అర్చామూర్తినే తాము పొంది, ఆ హయగ్రీవ భగవానుని పట్ల గల భక్తితో కాంచీపురంలోనే దేశికులు చాలా కాలం నివాసించారు.

**30.** **కాలే వేదాంతసూరిః స్వపద ముపగతం బ్రహ్మతంత్రస్వతంత్రం**
**శిష్యాఖ్యం మూర్తిమేనాం సమనయదథ తత్ శాస్త్రపారంపరీతః।**
**సేయం వాగీశమూర్తిః గురువరపరకాలాదిభిః సేవ్యమానా**
**రమ్యాస్థానం త్రికాలం విలసతి విహితార్చాఽద్య కర్ణాటదేశే॥**

ఆ వేదాంత దేశికులు తమ శిష్యులలో ప్రధానులై, తమ శ్రీచరణాలను ఆరాధించే శ్రీబ్రహ్మతంత్రస్వతంత్రపరకాలస్వామికి ఆ మూర్తిని ఇచ్చారు. తరువాత ఆ మూర్తి శిష్యాచార్య

పరంపరగా కర్ణాటక రాష్ట్రంలోని పరకాలమఠంలో ఆయా పరకాల యతీంద్రుల ఆరాధనలో ఈనాటివరకు ఆరాధింపబడుతున్నది.

**31.** **ధర్మం పూర్వాశ్రమోక్తం సుకరమపి కృత్వాఽంతిమోక్తస్య తస్యా-**
**నుష్ఠానేఽశక్తిభీతం హయముఖ! కృపణం లంభయిత్వాఽ శ్రమం తమ్।**
**శోఫోద్రేకాదినాఽర్చావిశయ ఉపగతే కోటిపూజాం తులస్యా**
**స్వోపాఖ్యావ్యాకృతిం చాకలయసి కియతీ మయ్యనర్ఘా దయా తే॥**

ఓ హయగ్రీవస్వామీ! నా పూర్వాశ్రమంలో సులభమైన రీతిలో అనుష్ఠించడానికి తగిన ధర్మాలను అన్నిటిని నేను సరిగా అనుష్ఠిచకుండానే, మోక్షాశ్రమమనబడే సన్న్యాసాశ్రమాన్ని పొందించావు. మధ్యలో శ్వేతాశ్వముఖునివలె నాశరీరంలో తెల్లని వర్ణాన్ని (కల్గిన) ఒక విధమైన వ్యాధిని కల్గించావు. ప్రతి దినం లక్ష్మీహయగ్రీవుడవైన నీకు లక్ష్మీతులసి అర్చనను చేయాలి – అనే కోరికతో ఒకకోటి తులసి అర్చనను చేయాలని ప్రయత్నించినప్పుడు, ఆ వ్యాధి పూర్తిగా తొలగడంలో పాటు మహాభారతాంతర్గతమైన హయశిర ఉపాఖ్యానమ్– అనే నీకు చెందిన భాగానికి వ్యాఖ్యానం రచించే భాగ్యాన్ని కూడా కల్గించావు. దాసుడనైన నాపట్ల నీకు ఎంత అనుగ్రహం స్వామీ!

**32.** **ఇత్థం వాగీశపాదూయుగళసతతసంసేవనార్చాదిదీక్షః**
**తత్రైతాం నవ్యరంగేశ్వయతిరనఘా మర్పయత్ రత్నమాలామ్।**
**ఏనాం నిత్యం పఠంతో భువి మనుజవరా భక్తిభూమ్నేప్సితార్థాన్**
**సర్వాన్ విందంతి వాహాననవరకరుణాపాంగధారాభిషేకాత్॥**

ఈ విధంగా లక్ష్మీహయగ్రీవుని దివ్యపాదుకలను ప్రతి దినం క్రమానూసారంగా పూజించడం, తులసీ దళాలతో అర్చించడం, ఆ స్వామిని సేవించడం మొదలైనవానిని చేస్తూ కాలాన్ని గడపేవారు, అభినవ రంగనాథ పరకాల యతీంద్రమహాదేశికులనే నామాన్ని కల మహనీయులు, ఈ రత్నమాలా అనే స్తుతిని ఆ హయగ్రీవుని శ్రీ చరణాలలో సమర్పించారు. దానిని ప్రతిదినం అనుసంధించే (పఠించే) వారు మునిశ్రేష్ఠులు కాగలరు. వారి భక్తికి తగినట్లుగా వారు కోరే అన్ని ఫలాలను, శ్రీ లక్ష్మీహయగ్రీవస్వామి దివ్య కటాక్షధారలో అభిషేకం చేయబడినవారై (అనుగ్రహింపబడినవారై), తప్పక పొందగలరు.

**లక్ష్మీహయగ్రీవ రత్నమాలాస్తోత్రము సంపూర్ణము**



# శ్రీ హయగ్రీవాష్టకమ్

**1.** **హయాననం హయగ్రీవం హారనూపురశోభితమ్ ।**
**పీతాంబరధరం దేవం హయగ్రీవ ముపాస్మహే ॥**

గుఱ్ఱపు ముఖాన్ని కలవాడు; అశ్వగ్రీవుడు, హారాలతో, నూపురాలతో శోభిల్లేవాడు, పీతాంబరాన్ని ధరించినవాడు, గొప్పగా ప్రకాశించేవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**2.** **కుందేందుశంఖధవళం పద్మపత్రనిభేక్షణమ్ ।**
**శంఖచక్రధరం దేవం హయగ్రీవ ముపాస్మహే ॥**

కుందపుష్పం (మొల్లపూవు) వలె, చంద్రునివలె, శంఖంవలె తెల్లనివాడు, తామరపూల రేకులవంటి కన్నులను కలవాడు, శంఖచక్రాలను ధరించినవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**3.** **ముక్తాదామసమాయుక్తం నేమికోటిసమప్రభమ్ ।**
**రత్నకుండలకేయూరం హయగ్రీవ ముపాస్మహే ॥**

ముత్యాల హారాలతో కూడుకొన్నవాడు, కోటి సుదర్శనులతో సమానమైన కాంతిని కలవాడు, రత్నాలు పొదిగిన కుండలాలను, కేయూరాలను ధరించినవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**4.** **శేషాసన సమాసీనం లక్ష్మీనీళాసమన్వితమ్ ।**
**శ్రీవత్సకౌస్తుభధరం హయగ్రీవ ముపాస్మహే ॥**

శేషాసనంలో వేంచేసి ఉన్నవాడు, లక్ష్మీదేవి, నీళాదేవులతో కూడుకొని ఉండేవాడు, శ్రీవత్సాన్ని, కౌస్తుభాన్ని ధరించినవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**5.** **యోగాసనసమాసీనం వేదశాస్త్రసమన్వితమ్ ।**
**సర్వవేదాంతతత్త్వజ్ఞం హయగ్రీవ ముపాస్మహే ॥**

యోగాసనంలో వేంచేసి ఉండేవాడు, వేదాలతో, శాస్త్రాలతో కూడుకొని ఉండేవాడు, సర్వవేదాంతాలు తత్త్వాలను తెలిసినవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**6.** **శ్వేతవర్ణం చతుర్బాహుం వైజయంతీవిరాజితమ్ ।**
**సర్వాభరణసంయుక్తం హయగ్రీవ ముపాస్మహే ॥**

తెల్లని వర్ణాన్ని కలవాడు, నాల్గు బాహువులను కలవాడు, వైజయంతీ మాలికతో ప్రకాశించేవాడు, అన్ని ఆభరణాలను కలవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**7. మణిపీఠసమాసీనం మకుటోజ్జ్వలమండితమ్ ।**
**ముక్తాహారధరం దేవం హయగ్రీవ ముపాస్మహే ॥**

మణిపీఠంలో వేంచేసి ఉండేవాడు, కిరీటంతో గొప్పగా ప్రకాశించేవాడు, అలంకరింపబడినవాడు, ముత్యాల హారాలను ధరించేవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**8. బ్రహ్మాండకోటిగర్భస్థం మందహాససుశోభితమ్ ।**
**సర్వవిద్యాప్రదం దేవం హయగ్రీవ ముపాస్మహే ॥**

కోట్లాది బ్రహ్మాండాలను గర్భంలో కలవాడు, మందహాసంతో గొప్పగా శోభిల్లేవాడు, అన్ని విద్యలను అనుగ్రహించేవాడైన హయగ్రీవదేవుని ఉపాసిస్తున్నాను.

**9. హయగ్రీవాష్టకం పుణ్యం యే జనాః సముపాసతే ।**
**ఆయుర్వృద్ధిః బలం ధైర్యం విద్యాబుద్ధిసుఖప్రదమ్ ॥**

**10. ఆప్నుయు స్సకలాన్ కామాన్ సర్వత్ర విజయం శుభమ్ ।**
**సర్వపాపప్రశమనం హయగ్రీవప్రభావతః ॥**

పవిత్రమైనది, విద్యను, బుద్ధిని, సుఖాన్ని ఇచ్చేది అయిన ఈ హయగ్రీవాష్టకాన్ని ఎవరు పఠిస్తారో, వారు ఆయుర్వృద్ధిని, బలాన్ని, ధైర్యాన్ని, అంతటా విజయాన్ని, అన్ని కోరికలను, సమస్త పాపప్రశమాన్ని హయగ్రీవుని ప్రభావం వల్ల పొందుతున్నారు.





**పణ్డిత ఉ.వే.శ్రీ.తి.ప.రామానుజస్వామిభిః విరచితా**

# శ్రీహయాననవింశతిః

## ( స్తుతి ప్రశంస )

**వన్దేఽహం వాగధీశానం వేదాన్తస్తుతవైభవమ్ ।**
**విద్యాసమ్ప్రత్ప్రదం లక్ష్మీహయగ్రీవం దయానిధిమ్ ॥**

సకలవిద్యాధిదేవత శ్రీహయగ్రీవస్వామి. భగవానుడు జీవులను సృజించే సమయంలో మొట్టమొదట చతుర్ముఖబ్రహ్మను సృష్టించాడట. వెంటనే అతడికి బ్రహ్మాండములోని జీవులను సృజించే విధానం తెలియడంకోసం జ్ఞానరాశులైన వేదములను ఉపదేశించాడట. ఈ విషయం మనకి ఈ ఉపనిషద్వాక్యం ద్వారా తెలుస్తోంది.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ।**
**తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥**

(॥ శ్వేతా॥ 6.18)

దీనికి అర్థమిది... దేవదేవుడు సృష్ట్యాదియందు హిరణ్యగర్భుని సృజించి ఆయనకు వేదములను అనుగ్రహించినాడు. ప్రకాశమానుడు, జీవుల జ్ఞానమును వికసింపజేయువాడును అయిన ఆ పరమాత్మను మోక్షాసక్తుడనైన నేను శరణు పొందుచున్నాను – అని. ఒకప్పుడు చతుర్ముఖబ్రహ్మ వద్దనున్న జ్ఞానసంపదయైన వేదాలను హయగ్రీవుడనే రాక్షసుడు అపహరించుకొని పోవగా, బ్రహ్మ శ్రీమన్నారాయణుని వేడుకొన్నాడు. విరించి మొరను విన్న శ్రీహరి దయతో హయగ్రీవరూపంతో అవతరించి ఆ దైత్యుణ్ణి వెంటాడి వధించినాడు. వేదాలను తిరిగి విధాతకు అప్పగించి సృష్టిప్రక్రియ యథావిధిగా కొనసాగేలా కటాక్షించాడు. మఱొకమాఱు మధువు, కైటభుడు అను రాక్షసులు బ్రహ్మావద్దనుండి వేదాలను దొంగిలింపగా, వారిని సంహరించి జ్ఞానధనమును కాపాడినాడు, దైత్యారి. ఇట్లా జ్ఞానప్రదాత మఱియు జ్ఞానసంరక్షకుడు భగవానుడు. **"యస్య నిశ్శ్వసితం వేదాః"** అని వేదాలు మొదలుకొని సమస్తవాఙ్మయం పరమాత్మనుండియే నిశ్వాసరూపంతో వెలువడినట్లు చెబుతుంది. ఈ రీతిగా శ్రియఃపతి లోకానికి మొదటి జ్ఞానోపదేష్టయై ప్రథమాచార్యుడై నాడు. కనుకనే, **"కృష్ణం వందే జగద్గురుమ్"** అని, **"లక్ష్మీనాథసమారంభామ్"** అని గురుపరంపరలో ఆద్యునిగా ఆయనను కీర్తిస్తారు.

**"ఫలమత ఉపపత్తేః"** (సూ॥ 3.32.37) **"పురుషార్థోఽ తశ్శబ్దాదితి బాదరాయణః"** (సూ॥ 3.4.1) అని బ్రహ్మసూత్రకారుడు కూడా మోక్షపర్యంతము సకలాభీష్టములను

కటాక్షించువాడు భగవానుడే – అని తెలిపినాడు. అంతేగాక, దేవతలందరూ సర్వేశ్వరుని సంకల్పానుసారంగానే ఆయా పదవులలో నియమింపబడి, ఆయన అనుగ్రహంతో తమభక్తుల అభీష్టాలను నెరవేరుస్తూ ఉంటారు. **"స తయా శ్రద్ధయా యక్త స్తస్యారాధన మీహతే, లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్"** (భగవద్గీత. 7.22) ఆయా దేవతలను ఆరాధించే భక్తులు వారినుండి కోరిన ఫలితాలను పొందుతారు. తమ భక్తులకు ఆ ఫలితాలను ప్రసాదించే శక్తి ఆ దేవతలకు నా సంకల్పం వలననే కలుగుతుందని భగవానుడు స్వయంగా ప్రవచించాడు. ఈ విషయాన్నే ఆ నమ్మాళ్వారులు (శఠకోపముని) ఇలా అనుగ్రహించారు.

**అవరవర్ తమతమదు అఱివఱి వగైవగై**<br>
**అవరవర్ ఇఱైయవర్ ఎనవడి అడైవర్ గళ్ ।**<br>
**అవరవర్ ఇఱైయవర్ కుఱైవిలర్ ఇఱైయవర్**<br>
**అవరవర్ విదివళి అడైయ నిన్ఱనరే ॥**

(తిరువాయ్మొళి. 1.1.5)

వివిధవాంఛితాలను కోరే భక్తులు తమ జ్ఞానాన్నిబట్టి ఆయా దేవతలను ఆశ్రయిస్తారు. ఆ దేవతలు కూడా తమ భక్తులు అభీష్టాలను కొఱత లేకుండా తీరుస్తారు. వారు కర్మానుగుణంగా ఫలితాలను పొందడానికి కారణం– శ్రియఃపతి వారి అందరిలోను అంతర్యామిగా నుండుటయే. ఆశ్రితుల కర్మపరిపాకముననుసరించి వారి అభీష్టాలను నెరవేర్చే సామర్థ్యాన్ని ఆయా దేవతలకు కలుగజేస్తాడని భావం. ఇలాగే, విజ్ఞానప్రదాతలైన సరస్వతీ, దక్షిణామూర్తీత్యాదులు హయగ్రీవస్వామియొక్క సంకల్పంవలననే జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నారని కీర్తిస్తారు, వేదాంతదేశికులు... **"దాక్షిణ్యరమ్యా గిరిశస్య మూర్తిః దేవీ సరోజాసనధర్మపత్నీ, వ్యాసాదయోఽపి వ్యపదేశ్యవాచః స్ఫురంతి సర్వే తవ శక్తిలేశైః"** (హయ. స్తో. 6) పురాణాలలో విద్యాప్రదాతలుగా ప్రసిద్ధులైన దక్షిణామూర్తి, సరస్వతీదేవియు, సత్కవులుగా ప్రసిద్ధులైన వ్యాసవాల్మీకి ప్రభృతులును నీ అనుగ్రహమువలననే ఆ విధంగా ప్రకాశిస్తున్నారు. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రంలోని **"గోవిదాం పతిః"** అనే నామం ఈ అంశాన్నే తెలుపుతోంది.

శ్రీహయగ్రీవ దివ్యరూపంతో అవతరించి లోకానికి జ్ఞానాన్ని ప్రసాదించిన భగవానుని వైభవాన్ని పురాణాలు విస్తృతంగా కీర్తించాయి. **"మయర్వఱ మదినలమ్ అరుళినన్"** (తిరు. 1.1.1) అని ఆళ్వారులు తమ అజ్ఞానమును పూర్తిగా పారద్రోలి యథార్థజ్ఞానమును ప్రసాదించాడని భగవానుని కీర్తిస్తారు. శ్రీమద్వేదాంతదేశికులు



**"విశుద్ధవిజ్ఞాన ఘనస్వరూపం విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్"** (హయ. స్తో. 5) ఇత్యాదిగా జ్ఞానస్వరూపుడు, విజ్ఞానప్రదానమునందు దీక్ష వహించినవాడును అయిన శ్రీహయగ్రీవదేవుని ప్రపత్తి చేస్తారు. ఇంకను పలువురు ఆచార్యపురుషులు తమ స్తోత్రములద్వారా స్వామిని బహుముఖంగా స్తుతించినారు. ఆ క్రమం లోనిదే పరమపదవాసులు, **"పండిత" శ్రీ ఉ.వే. శ్రీమాన్ తి.ప. రామానుజస్వామి వారు** అనుగ్రహించిన **"హయాననవింశతిః"** అనే ఈ స్తోత్రం. **"ఉభయవేదాంతమహోదధి", "వైద్యవిద్యానిధి", "ఆయుర్వేద మహోపాధ్యాయ"** ఇత్యాది బిరుదమాలికాభూషణులైన శ్రీమాన్ రామానుజస్వామివారు శ్రీరామతీర్థ గ్రామాభిజనులు. ఉభయవేదాంతములలోను, ఆయుర్వేదంలోనేగాక సంప్రదాయ ధర్మశాస్త్రాది అనేకవిషయాలలో వైపశ్చితీనిర్భరులైన వీరు బహువిధాలైన గ్రంథాలను విరచించారు. బహుముఖ ప్రజ్ఞాశాలురైన శ్రీస్వామివారి లేఖిని నుండి వెలువడిన గ్రంథాలలో **"చిదచిదశరీరకబ్రహ్మసిద్ధిక్షేపః"** ఇత్యాదులు పండితైకవేద్యములైన వేదాంతశాస్త్ర వాదగ్రంథాలు. **"త్రిదోషచర్చా"** మున్నగునవి ఆయుర్వేదీయాలు. **"ద్వాదశాలంకారస్తోత్రమ్" "శ్రీమన్నాథశతకమ్"** మొదలైనవి రమణీయములైన స్తోత్రగ్రంథాలు. ముప్పైకి పైబడిన వీరి వాఙ్మయంలో సంస్కృతాంధ్రగ్రంథాలతో బాటు తమిళభాషలో దివ్యదేశపాశురమాలికలు కూడా సంప్రదాయజ్ఞులకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తాయి. ఈ మహనీయుల గ్రంథాలలో కొన్ని ఆయా సమయాలలో ముద్రితాలు కాగా, మఱికొన్ని ఈనాటికిని ముద్రణ కావలసి యున్నాయి. శ్రీహయవదననిర్హేతుక కరుణాసముల్లసితశేముషీవైభవసంపన్నులు, విద్వత్తల్లజులు అయిన ఈ స్వామివారు కటాక్షించిన స్తోత్రాలలో అన్యతమమే ఈ **"హయాననవింశతి"** స్తోత్రం.

హయం అంటే – గుఱ్ఱం. ఆననం అంటే – ముఖం. హయానన అంటే – గుఱ్ఱపు ముఖమువంటి ముఖముగల స్వామి – అని అర్థం. స్తోత్రంలో దీనికి పర్యాయంగా **హయవక్త్ర, హయాస్య, అశ్వానన, అశ్వముఖ, తురగానన, తురగవక్త్ర, తురంగవదన, వాజివక్త్ర, వాజిశిరాః** – అనే శబ్దాలు కూడా వాడబడినాయి. వింశతి అంటే – ఇరవై. హయగ్రీవస్వామియొక్క వైభవాన్ని కీర్తించే స్తోత్రం అన్నమాట. మంగళాశాసనశ్లోకాలు రెండింటితో కలసి మొత్తం ఈ స్తోత్రంలో ఇరవై రెండు శ్లోకాలున్నాయి. ఈ చిన్ని స్తోత్రానికి తెలుగులో ప్రతిపదార్థతాత్పర్యాలను వ్రాసి అందించగలగడం నా భాగ్యంగా భావిస్తూ భాగవతోత్తముల సన్నిధిలో సమర్పిస్తున్నాను.

సప్రశ్రయ ప్రణామాలతో

దాసుడు

**కందాళ లక్ష్మీనారాయణ**

# శ్రీహయాననవింశతిః

**ప్రతిపదార్థతాత్పర్యాలు : డా॥ కందాళ లక్ష్మీనారాయణ,**

*రీడర్, వేదసంస్కృతకళాశాల, నెల్లూరు 3.*

**1) స్వస్తి వస్తు దిశతాద్ధయవక్త్రం కిఞ్చిదబ్జసదృశాక్ష మనన్తమ్ ।**
**యత్కటాక్షపరిపాతవశేన జ్ఞానవాన్ భువి భవేత్ ఖలు జన్తుః ॥**

యత్ కటాక్ష పరిపాతవశేన = ఏ హయాననుని (హయగ్రీవస్వామియొక్క) కృపావీక్షణము తమపై పడుటచేత, భువి = లోకమున, జన్తుః = ప్రాణి, జ్ఞానవాన్ = జ్ఞానము కలిగినది, భవేత్ ఖలు = అగునో అట్టి, అబ్జ సదృశ అక్షమ్ = తామరవంటి కన్నులు కలది, అనన్తమ్ = అపరిమితమైనది, హయవక్త్రమ్ = అశ్వముఖము గలది, కిఞ్చిత్ = అనిర్వచనీయమైనదియునగు, వస్తు = నిత్యసత్య మగు బ్రహ్మతత్త్వము, వః= మీకు, స్వస్తి = శుభమును, దిశతాత్= అనుగ్రహించుగాక.

శ్రీహయగ్రీవస్వామియొక్క కృపాలేశంవలననే అస్వత్రాయంగా ఉన్న జీవకోటి అంతా జ్ఞానాన్ని పొంది చైతన్యవంతం అవుతుంది. అట్టి పరమకృపాళువు, తామరపూరేకులవంటి నేత్రములు గలవాడు, అపరిచ్ఛిన్న స్వరూపముగలవాడు, అశ్వముఖముతో అవతరించినవాడు, సత్యస్వరూపుడు అయిన పరమాత్మ శుభమును ప్రసాదించుగాక.

**2) రక్షోహృతవేదతయా స్రష్టారం కలుషితాన్తరం దేవః ।**
**రక్షోహననేన చ యో నిగమేనాతూతుషత్ స పాత్వస్మాన్ ॥**

యః = ఏ హయగ్రీవస్వామి, రక్షోహృతవేదతయా = రాక్షసుడు వేదములనపహరించుటచేత, కలుషిత + అన్తరమ్ = దుఃఖించిన మనస్సు గల, స్రష్టారమ్ = సృష్టికర్తయగు చతుర్ముఖుని, రక్షో హననేన = ఆ రాక్షసుని సంహరించుట చేతను, నిగమేన = వేదమునిచ్చుటచేతను, అతూతుషత్ = సంతోషపెట్టెనో, సః దేవః = ఆ హయగ్రీవ ప్రభువు, అస్మాన్ = మనలను, పాతు = రక్షించుగాక!

పూర్వము లోకకంటకుడైన హయగ్రీవుడను రాక్షసుడొకడు సృష్టికర్తయగు బ్రహ్మవద్దనుండి వేదరాశినంతటిని అపహరించుకొని పోయినాడు. అప్పుడు లోక సంరక్షకుడైన శ్రీమన్నారాయణుడు హయగ్రీవరూపముతో అవతరించి ఆ దుష్టుని పరిమార్చి వేదములను మఱల బ్రహ్మకు అందించి అతని దుఃఖమును పోగొట్టినాడు. అతడి



జగత్సృష్టినిర్వహణమునకు ఆటంకములను తొలగించినాడు. అట్టి జ్ఞానప్రదాతయగు హయగ్రీవస్వామి మనలనందరిని కాపాడుగాక!

**3) మధుకైటభహన్తృ రమాధరం విలసదబ్జసుదర్శనదోర్యుగమ్ ।**
**రమతాం హృదయే తురగాననం కిమపి సున్దర మవ్యయవస్తు మే ॥**

మధుకైటభహన్తృ = మధువు, కైటభుడు అను రాక్షసులనిద్దరిని సంహరించినది, రమాధరమ్ = లక్ష్మీదేవిని ధరించినది, విలసత్ అబ్జసుదర్శన దోర్యుగమ్ = ప్రకాశించుచున్న పాంచజన్యమను శంఖమును, సుదర్శనమను చక్రమును బాహువులతో ధరించినది, కిమపి = నిర్వచింపలేనంతటి వైభవము గలది, సున్దరమ్ = మనోహరమైనది, తురగాననమ్ = హయగ్రీవరూపమును ధరించునదియు అయిన, అవ్యయ వస్తు = నాశరహితమగు బ్రహ్మతత్త్వము, మే = నా యొక్క, హృదయే= మనస్సునందు, రమతామ్ = విహరించుగాక!

జగత్తుకు ఉపద్రవాన్ని కలిగించే క్రూరులైన మధుకైటభులనే రాక్షసులనిద్దరినీ మట్టుబెట్టి లోకానికి ఆహ్లాదాన్ని కలిగించిన దయామయుడు హయగ్రీవస్వామి. రమావల్లభుడు, శంఖచక్రధరుడు, ఇంతయని చెప్పలేనంత వైభవముగలవాడు ఆ స్వామి. దివ్యమైన అశ్వశిరస్సుతో, లోకోత్తరసౌందర్యంతో ప్రకాశించే నిర్వికారుడైన పరమాత్మ నా హృదయలో నిత్యము వేంచేసి యుండుగాక!

**4) కాచిన్మూర్తి ర్వాసుదేవస్య శుభ్రా లక్ష్మీవిద్యుచ్ఛారదామ్భోరుహాభా ।**
**వాగీశానా వాజివక్త్రా ఽతిలోకా చిత్తేఽస్మాకం నృత్యతా ద్వర్తమానా ॥**

కాచిత్ = వర్ణింప నలవికానిది, శుభ్రా = నిర్మలమైనది, లక్ష్మీవిద్యుత్ = లక్ష్మీ దేవియును మెఱుపుతో కూడినది, శారద అమ్భోరుహ ఆభా = శరత్కాలపు మేఘము వలె ప్రకాశించునది, వాగీశానా = వాక్కుకు అధిపతి, అతిలోకా = లోకములోని అన్నిటికంటె మిన్నయైనది, వాజివక్త్రా = అశ్వముఖము గలదియు అయిన, వాసుదేవస్య మూర్తిః = శ్రీమన్నారాయణుని దివ్యావతారము, అస్మాకమ్ = మనయొక్క, చిత్తే = హృదయమున, వర్తమానా = వేంచేసియున్నదై, నృత్యతాత్ = నాట్యము చేయుగాక.

హయవదనముతో అవతరించిన శ్రీమన్నారాయణుని వైభవము వర్ణింపలేనిది. వాక్కులకు అధిపతియైన హయగ్రీవస్వామి యొక్క నిర్మలమైన దివ్యమంగళ విగ్రహము లోకోత్తరమైనది. అట్టి దివ్యరూపము మన హృదయమను రంగస్థలముపై నిత్యము నృత్యము చేయుగాక!

**5) సితస్ఫటికభాసురే సరసిజే నిషణ్ణం విభుం**
**కరాగ్రధృతపుస్తకం కమలయా సమాలింగితమ్ ।**

**హిమాంశుసదనం ప్రతిస్వనితరోదసీహేషకం**
**హయానన మనుత్తమం సతత మన్త రీడీమహి ॥**

సితస్ఫటికభాసురే = తెల్లని స్ఫటికమువలె ప్రకాశించు, సరసిజే = పద్మమునందు, నిషణ్ణమ్ = ఆసీనుడైయున్నవాడు, విభుమ్ = అంతట వ్యాపించి యుండువాడు, కరాగ్ర ధృత పుస్తకమ్ = చేతియందు పుస్తకమును ధరించువాడు, కమలయా = లక్ష్మీదేవిచే, సమాలింగితమ్ = ఆలింగనము చేసికొనబడినవాడు, హిమాంశుసదనమ్ = చంద్రబింబమునందు వేంచేసి యుండువాడు, ప్రతిస్వనిత రోదసీ హేషకమ్ = అంతరిక్షము నిండా ప్రతిధ్వనించు కంఠధ్వని గలవాడు, అనుత్తమమ్ = తనకన్న గొప్పవారు లేనివాడును అయినట్టి, హయాననమ్ = హయగ్రీవస్వామిని, సతతమ్ = ఎల్లప్పుడు, అంతః = మనస్సులో, ఈడీమహి = స్తుతింతుము.

సర్వోత్తముడైన హయగ్రీవప్రభువు స్ఫటికమువంటి తెల్లని పద్మమునందు ఆసీనుడై హస్తమునందు పుస్తకముతో విరాజిల్లుచుండును. లక్ష్మీసమేతుడైన స్వామి చంద్రబింబమునందు వేంచేసియుండి ఆశ్రితులను అనుగ్రహించుచుండును. ఆయన కంఠనాదము ఆకాశమంతటను ప్రతిధ్వనించుచుండును. అట్టి దేవదేవుని మనమెప్పుడును ప్రస్తుతించెదము గాక!

**6) అస్తు మేఽద్య హృదయే కమలాధృత్ వస్తు కించిదరవిందనిభాక్షమ్ ।**
**ప్రస్తుతార్థద మనుత్తమ మేవం కస్తు చేన్మమ పురో విజయీ స్యాత్ ॥**

**ప్రతిపదార్థము :** అద్య = ఇప్పుడు, మే = నాయొక్క, హృదయే = మనస్సునందు, కమలా ధృత్ = లక్ష్మీదేవిని ధరించినది, కించిత్ = అనిర్వచనీయవైభవముగలది, అరవిందనిభ అక్షమ్ = పద్మములవంటి కన్నులుగలది, ప్రస్తుత అర్థదమ్ = స్తుతింపబడి కోరిన వరముల నిచ్చునది, అనుత్తమమ్ = సర్వాధికమైనదిఅయిన, వస్తు = హయగ్రీవరూపమైన బ్రహ్మము, అస్తు = వేంచేసియుండుగాక. ఏవం చేత్ = అట్లైనచో, మమ పురః = నా యెదుట, కః = ఎవడు, విజయీ స్యాత్ = జయించువాడు కాగలడు ?

లక్ష్మీవిశిష్టుడు, తామరరేకులవంటి నయనములతో ప్రకాశించువాడు, కోరిన వరములను ప్రసాదించువాడు, సర్వోత్తముడు అయిన హయగ్రీవస్వామి నా చిత్తము నందెప్పుడును విలసించి యుండుగాక! అట్లున్నచో నాకిక ఎదురు లేదు. నన్ను జయించ గల సమర్థులెవరుందురు! ఆ స్వామి కృపకు పాత్రులైనవారికి అపజయము లేదని భావము.



**7) హృద్యా లక్ష్మీ ర్వాజివక్త్రస్య రక్షేత్ హృద్యా భక్తి ర్వాజివక్త్రస్య మేఽస్తు ।**
**హృద్యా ప్రీతి ర్వాజివక్త్రస్య భూయాత్ హృద్యాస్తాం మే వాజివక్త్ర స్సపద్మః ॥**

వాజివక్త్రస్య = హయగ్రీవస్వామికి, హృద్యా = మనోహారిణియైన, లక్ష్మీః = లక్ష్మీదేవి, రక్షేత్ = రక్షించుగాక!, వాజివక్త్రస్య = హయగ్రీవస్వామికి, హృద్యా = ప్రీతిని కలిగించు, భక్తిః = భక్తి, మే = నాకు, అస్తు = కలుగుగాక! వాజివక్త్రస్య = హయగ్రీవ స్వామికి, హృద్యా = మనః పూర్ణమైన, ప్రీతిః = ప్రీతి, భూయాత్ = కలుగుగాక! సపద్మః= లక్ష్మీసమేతుడైన, వాజివక్త్రః = హయగ్రీవస్వామి, మే = నాయొక్క, హృది = మనస్సునందు, ఆస్తామ్ = నిలచియుండుగాక!

హయగ్రీవస్వామికి వల్లభురాలైన లక్ష్మీదేవి మనలను రక్షించుగాక! ఆ స్వామికి ప్రీతిని కలిగించు భక్తి నాకు కలుగుగాక! ఆ స్వామిహృదయమునిండా నాపై ప్రీతి కలుగు గాక! శ్రీదేవీసమేతుడైన హయగ్రీవస్వామి నాహృయమునందెల్లప్పుడును వేంచేసి యుండుగాక!

నాల్గవ పాదంలోని **"హృద్యాస్తామ్"** అనే ప్రయోగం **"హృది + ఆస్తామ్"** అనే రెండు రూపాల కలయిక.

**8) తురంగవదనాయ తే నిఖలవాక్ప్రపంచేశినే**
**నమోవచనమహిమప్రబలవిఘ్ననిర్వాపిణే ।**
**తనోతు శుభమీయివాంస మతిశీతనేత్రాబ్రుహో**
**భవా నిమ మకించనం దృఢతరం నిరీక్ష్య స్వయమ్ ॥**

తురఙ్గ వదనాయ = అశ్వముఖముతో అవతరించినవాడవు, నిఖిల వాక్ప్రపంచ ఈశినే = సమస్తవాఙ్మయమునకు అధినేతవు, నమో వచన మహిమ ప్రబల విఘ్న నిర్వాపిణే = నమస్కారమనినంతనే ఎంతటి గొప్ప విఘ్నములనైనను తొలగించువాడవు అయిన, తే = నీకు, నమః = నమస్కారము, అతిశీత నేత్ర అబ్రుహః= మిగుల చల్లనైన పద్మములవంటి కన్నులు గల, భవాన్ = నీవు, అకించనమ్ = ఏగతియు లేనివాడనైన, ఇమమ్ = ఈ నన్ను, స్వయమ్ = స్వయముగా, దృఢతరమ్ = బాగుగా, నిరీక్ష్య = పరికించి చూచి, శు భమ్ ఈయివాంసమ్ = శుభమును పొందువానినిగా, తనోతు = ఒనరించుము.

హయగ్రీవస్వామీ! జగత్తునందలి వాఙ్మయరాశికంతటికిని అధిపతివి నీవు.కేవలము "నీకు నమస్కార" మని నోటితో పలికినంత మాత్రముననే విఘ్నముల

నన్నిటిని పటాపంచలు చేసెదవు. అట్టి నీకు ప్రణామము. నీవు తప్ప ఇంకే గతియు లేని నన్ను నీచల్లని చూపులతో (నీదయకు అర్హుడేనని) బాగుగా పరిశీలించి చూచి నాకు శుభములను ప్రసాదింపుము.

**9) లక్ష్మీనట్యా మే హృదబ్జాఖ్యరంగే విద్యాఖ్యాయా నాటికాయాః పురస్తాత్ ।**
**సర్వాలంకారైశ్చమత్కారితాయాః సూచ్యాత్ స్థిత్వా సూత్రధారో హయాస్యః ॥**

మే = నాయొక్క, హృత్ అబ్జ ఆఖ్య రంగే = పద్మమువంటి హృదయమనే రంగస్థలమునందు, విద్యా ఆఖ్యాయాః = జ్ఞానమనే పేరు గల, నాటికాయాః = నాటికకు, పురస్తాత్ స్థిత్వా = ముందుండి, సూత్రధారః = సూత్రధారుడైన, హయాస్యః = హయగ్రీవ స్వామి, లక్ష్మీనట్యా = లక్ష్మియను నటితోకూడినవాడై, సర్వాలంకారైః = అన్ని అలంకారముల తోను, చమత్కారితాయాః = చమత్కారముగా నుండుటను, సూచ్యాత్ = సూచించుగాక!

ఇచట రూపక ప్రక్రియ ననుసరంచి తమకు చక్కని జ్ఞానమును ప్రసాదింపుమనుచున్నారు. (రూపకములనగా నాటకములు మొదలైన రంగస్థల ప్రక్రియలు.) తమ హృదయమే ఒక రంగస్థలము. దానిపై విద్య అనే నాటిక ప్రదర్శనకు సిద్ధముగా నున్నది. దానికి ప్రయోక్తయగు సూత్రధారుడు సాక్షాత్తు హయగ్రీవస్వామి. నటియైన లక్ష్మీదేవితో కలసి ప్రదర్శనకు ముందు ప్రస్తావనలో సర్వవిధములైన అలంకారములతో చమత్కారముగా నుండుటను సూచించుగాక!

**10) ప్రకటితనిజహేషారూపభక్తాభికాంక్షం**
**కరధృతదరచక్రం దుష్టసంహారదక్షమ్ ।**
**ఉరసి నివసదబ్జాऽऽశ్లిష్ట మమ్భోరుహాక్షమ్**
**భజత తురగవక్త్రం స్వాశ్రితారక్షదీక్షమ్ ॥**

ప్రకటిత నిజహేషా రూప భక్త అభికాంక్షమ్ = భక్తులు కోరునట్టి జ్ఞానరాశిని తన కంఠధ్వనితో కటాక్షించువాడు, కరధృత దరచక్రమ్ = శ్రీహస్తములతో శంఖమును చక్రమును ధరించువాడు, దుష్టసంహార దక్షమ్ = దుష్టులను సంహరించుటలో సమర్థుడైన వాడు, ఉరసి నివసత్ అబ్జా ఆశ్లిష్టమ్ = వక్షస్థలవాసినియైన శ్రీ దేవిచేత ఆలింగనము చేసికొనబడినవాడు, అమ్భోరుహ అక్షమ్ = తామర రేకులవంటి కన్నులు గలవాడు, స్వాశ్రిత ఆరక్ష దీక్షమ్ = తనను ఆశ్రయించిన భక్తులను రక్షించుట అనే దీక్షగలవాడు అయిన, తురగవక్త్రమ్ = హయగ్రీవ స్వామిని, భజత = సేవించండి.



జ్ఞాననిధులైన వేదములను హేషా (సకిలింపు) రవముతో వెలువరించి భక్తుల అభీష్టములను తీర్చినవాడు హయగ్రీవస్వామి. శ్రీహస్తములలో శంఖచక్రాది ఆయుధములతో విరాజిల్లేవాడు, లక్ష్మీసముపేతుడు, కమలలోచనుడు, తనను సేవించువారిని కాపాడుటయే తన వ్రతమని భావించేవాడు అయిన ఆ స్వామిని భక్తితో ఆశ్రయించండి.

**11) ప్రీతిం దధాతు మయి వాగధిపః ప్రకామం**
**పద్మాసఖః పరమకారుణికోऽబ్జనాభః ।**
**వేదాకృతిర్విమలచన్ద్రనిభో హయాస్యః**
**పాణ్డుప్రఫుల్లజలజాసనసంస్థ ఈడ్యః ॥**

వాక్ అధిపః = వాక్కులకు అధిపతియైనవాడు, పద్మా సఖః = లక్ష్మీదేవికి ప్రియసఖుడు, పరమకారుణికః = మిక్కిలి దయగలవాడు, అబ్జనాభః = పద్మము నాభియందు గలవాడు, వేద + ఆకృతిః = వేదస్వరూపుడు, విమల చంద్ర నిభః = నిర్మలమైన చంద్రబింబములవలె నుండువాడు, పాండు ప్రఫుల్లజలజ ఆసన సంస్థః = వికసించిన తెల్లని తామరపూవునందు ఆసీనుడై యుండువాడు, ఈడ్యః = స్తుతింపదగినవాడు అయిన, హయాస్యః = హయగ్రీవమూర్తి, మయి = నాయందు, ప్రకామమ్ = అత్యంతము, ప్రీతిమ్ = ఇష్టమును, దధాతు = కలిగియుండుగాక!

కమలాపతి, కమలనాభుడు, కమలమునందు వేంచేసియుండువాడును అయిన హయగ్రీవస్వామి వాఙ్మయప్రపంచానికి అధినాయకుడు. మిక్కిలి దయగల ఆ స్వామి వేదస్వరూపుడు. చంద్రునివంటి ఆ స్వామి నా విషయమున ప్రీతి కలిగియుండుగాక!

**12) అంతర్ధ్వాంతం మే నాశయేద్వాజివక్త్రః**
**ప్రోద్యత్కాంత్యాऽసౌ దీయతా మప్యమోఘా ।**
**శక్తిర్విఘ్నానాం ధ్వంసినీ వాక్ప్రపంచే**
**సర్వం భూయా త్తత్ప్రేమలిప్తాక్షిపాతాత్ ॥**

అసౌ = ఈ (నా హృదయమందున్న), వాజివక్త్రః = హయగ్రీవస్వామి, ప్రోద్యత్ కాంత్యా = వెల్లివిరియుచున్న తేజస్సుతో, మే = నాయొక్క, అంతః = లోపల నిండియున్న, ధ్వాంతమ్ = అజ్ఞానపు చీకటిని, నాశయేత్ = పోగొట్టుగాక! వాక్ప్రపంచే = వాఙ్మయలోకమునందు, అమోఘా = తిరుగు లేనిది, విఘ్నానామ్= ఆటంకములను, ధ్వంసినీ= పారద్రోలునది అయిన, శక్తిః = సామర్థ్యము, దీయతామ్ = ఈయబడుగాక! తత్ ప్రేమలిప్త అక్షి పాతాత్ = వాత్సల్యముతో నిండిన ఆ స్వామికటాక్షము నాపై పడుటవలన, సర్వమ్ = సమస్త శుభములును, భూయాత్ = కలుగుగాక!

నా హృదయమునందు వేంచేసియున్న హయగ్రీవస్వామి స్వాభావికమైన తన తేజస్సుతో నాలోని అజ్ఞానాంధకారమును తొలగించుగాక! నాకు ఏ అడ్డంకులు లేని ఫలవంతమైన వాక్పటిమను (భాషానైపుణ్యమును) ప్రసాదించుగాక! ఆస్వామి తన కృపా దృష్టిని నాపై ప్రసరింపజేసి నాకు సకలశుభములను చేకూర్చవలెనని వేడుకొను చున్నాను.

**13) శరదభ్రసమాన శరీరరుచిః శితిమేఘసమానశిరోజతతిః ।**
**చపలాసదృశేందిరయా సహితో రమతాం హృదయే మమ వాజిశిరాః ॥**

శరత్ అభ్ర సమాన శరీర రుచిః = శరత్కాలపు మేఘమువంటి నిర్మలమైన దేహకాంతిగలవాడు, శితి మేఘ సమాన శిరోజ తతిః = నల్లని మబ్బులవంటి దట్టమైన కేశపాశముగలవాడు, చపలా సదృశ ఇందిరయా సహితః = మెరుపుతీగెవంటి లక్ష్మీదేవితో కూడియున్నవాడును అయిన, వాజిశిరాః = హయగ్రీవ ప్రభువు, మమ= నాయొక్క హృదయే = మనస్సునందు, రమతామ్ = విహరించుగాక !

హయగ్రీవస్వామి మేఘము వంటివాడు. ఆయన దివ్యదేహము శరత్కాలము లోని తెల్లని మేఘమువలె నిర్మలముగా నుండును. ఆయన కేశపాశము అంతయు వర్షాకాలపు నల్లమబ్బువలెనే దట్టముగా నుండును. మబ్బుతో మెరుపుతీగవలె లక్ష్మీదేవి ఎప్పుడును ఎడబాయక ఆ స్వామితో కలసియుండును. అట్టి దివ్యమంగళ విగ్రహ సంపన్నుడైన లక్ష్మీహయవదనుడు సంతతము నా మానసమునందు విహరించుగాక!

**14) య ఉద్గీథరూప స్సితాభ్రాభవర్ష్మా**
**య ఓంకారరూపో రమాసంగతాఙ్కః ।**
**స మే జ్ఞానరూపం తమః ప్రోచ్ఛినత్తు**
**స మే సర్వ సమ్పద్వివృద్ధిం తనోతు ॥**

యః = ఏ హయగ్రీవమూర్తి, ఉద్గీథరూపః = సామవేదస్వరూపుడును, సిత అభ్ర ఆభ వర్ష్మా = తెల్లని మేఘమువలె శుద్ధమైన రూపముగలవాడో, యః = ఏ హయగ్రీవమూర్తి, ఓంకారరూపః = ప్రణవస్వరూపుడో, రమా సంగత అంకః = ఒడిలో లక్ష్మీదేవి గల, సః = అట్టి హయగ్రీవస్వామి, మే = నాయొక్క, అజ్ఞానరూపమ్ = అజ్ఞాన మనెడు, తమః = చీకటిని, ప్రోచ్ఛినత్తు = పోగొట్టుగాక!, సః = ఆస్వామి, మే = నాకు, సర్వ సమ్పత్ వివృద్ధిమ్ = సమస్త సంపదల సమృద్ధిని, తనోతు = కలుగజేయుగాక!

వేదస్వరూపుడు, శుద్ధసత్త్వమయమైన దివ్యమంగళవిగ్రహము గలవాడు అయిన హయగ్రీవస్వామి నాలోని అజ్ఞానాంధకారమును నశింపజేయుగాక! ఓంకార ప్రతి పాద్యుడు రమాసమేతుడు అయిన ఆస్వామి నాకు సకలసంపదలను అనుగ్రహించు గాక!



**15) ప్రభుహయానన మీడిమహే సదా విభురసౌ మమ బోధయతా ద్గిరమ్ ।**
**న భువి మాదృగనాథజనావనాత్ స్వభువ ఆత్మసమాదితరద్భవేత్ ॥**

ప్రభు హయాననమ్ = హయగ్రీవప్రభువును, సదా = ఎల్లప్పుడును, ఈడిమహే = స్తుతింతుము. అసౌ విభుః = ఈ స్వామి, మమ = నాయొక్క, గిరమ్ = వాక్కును, బోధయతాత్ = వికసింపజేయుగాక!, భువి = లోకమున, మాదృక్ అనాథ జన అవనాత్ = నావంటి అనాథులను బ్రోచువాడు, స్వభువః = తనకు తానే కారణమైనవాడు, ఆత్మ సమాత్ = తనకు తానే సమానమైనవాడును అగు హయగ్రీవస్వామి కంటె, ఇతరత్ = వేఱు దైవము, న భవేత్ = ఉండదు.

మనం సతతం హయగ్రీవస్వామి వైభవాన్నే కీర్తిద్దాం. ఆ స్వామియే మన వాక్కులను చైతన్యపఱచి సార్థకములనుగా చేస్తాడు. ఆయన పుట్టుకకు తానే తప్ప వేఱొక కారణమేదీ లేదు. ఆయనతో సమానమైనదేదీ లోకంలో లేదు. నాలాంటి అనాథులందరికీ రక్షకుడైన హయగ్రీవస్వామికన్న వేఱు దైవమేదీ లేదు.

**16) త్రయ్యాత్మకం ప్రణవరూప ముదారభావమ్**
**ఉద్గీథ వేదతతిమూల విగీయమానమ్ ।**
**విశ్వోత్తరాకృతి హయానన మిందిరాభృత్**
**శుభ్రం కిమప్యతిజగత్ పరధామ నౌమి ॥**

త్రయీ + ఆత్మకమ్ = ఋగ్వేద యజుర్వేద సామవేదస్వరూపమైనది, ప్రణవ రూపమ్ = ఓంకార స్వరూపమైనది, ఉదారభావమ్ = ప్రసన్నమైన మనస్సు కలిగినది, ఉద్గీథ వేదతతిమూల విగీయమానమ్ = ఉద్గీథములనే వేదమంత్రములచే స్తుతింపబడేది, విశ్వోత్తర ఆకృతి = లోకమునకెల్ల విశిష్టమైన రూపముగలది, ఇందిరా భృత్ = లక్ష్మీదేవిని ధరించినది, శుభ్రమ్ = శుద్ధసత్త్వ స్వరూపమైనది, అతిజగత్= లోకాతీతమైన, కిమపి = వర్ణించుటకు వీలులేనిదియు అయిన, పరధామ = హయగ్రీవరూపమైన పరంజ్యోతిని, నౌమి = స్తుతించుచున్నాను.

వేదాత్మకుడు, వేదసారమైన ఓంకారముచే ప్రతిపాదింపబడేవాడు– హయగ్రీవ స్వామి. ఉద్గీథములచే కీర్తింపబడే ఆ స్వామి మనస్సు మిక్కిలి ప్రసన్నమైనది. విలక్షణమైన రూపముతో లోకాతీతమై లక్ష్మీవిశిష్టమై హయగ్రీవునిగా విలసిల్లు ఆ పరజ్యోతిని స్తుతింతును.

**17) హయాస్య మీడీమహి ధామ హృద్యమ్ అజ్ఞాన తామిస్ర సహస్రరశ్మి ।**
**క్రీడా విభక్తీకృత కైటభాసు లక్ష్మీధరం శాశ్వత మద్య కిఞ్చిత్ ॥**

హృద్యమ్ = మనోహరమైనది, అజ్ఞాన తామిస్ర సహస్ర రశ్మి = అజ్ఞానమను చీకటికి ప్రచండభానునివంటిది, క్రీడావిభక్తీకృత కైటభ అసు = కైటభాసురుని ప్రాణములను విలాసముగా హరించినది, లక్ష్మీ ధరమ్ = లక్ష్మీదేవిని హృదయమునందు ధరించినది, శాశ్వతమ్ = నిత్యనిర్వికారమైనది, కించిత్ = వర్ణింప శక్యము కానిది, హయాస్యం ధామ = హయగ్రీవ రూపముతో నున్నది అయిన దివ్యతేజస్సును, అద్య = ఈ సమయమున, ఈడీమహి = స్తుతించెదము.

భక్తుల అజ్ఞానాంధకారమును పటాపంచలు గావించువాడు, కైటభాసురుని అవలీలగా సంహరించినవాడు, లక్ష్మీసమేతుడు హయగ్రీవస్వామి. మనోహరము, ఎల్లప్పుడు మార్పు లేక ఒకే తీరుగా నుండెడిది, వర్ణింపనలవి కానిది, అయిన ఆ స్వామి దివ్యతేజస్సును మనము స్తోత్రము గావించెదము.

**18)** **దళన్నలినపేశలం సనలినాక్షమాలం కరం**
**దధచ్ఛతమఖారిభేదన జయశ్రియం దక్షిణమ్ ।**
**భజజ్జగదపారనిర్భయద మీడ్యసవ్యాఖ్యకం**
**భజన్తి మునయ స్సదా య మితరానపేక్షం స్తుమః ॥**

దళత్ నళినపేశలమ్ = వికసించుచున్న తామరపూవువలె మృదువుగా నున్నదియు, సనళిన అక్షమాలమ్ = తామరపూసల జపమాలను ధరించినదియు, దధత్ శతమఖ అరి భేదన జయ శ్రియమ్ = అసురసంహారముచేత వచ్చిన జయశోభను ధరించినదియు, భజత్ జగత్ అపార నిర్భయదమ్ = తననాశ్రయించిన లోకులకు పూర్తి అభయమిచ్చు నదియు, ఇతర అనపేక్షమ్ = వేఱొకదాని అపేక్షలేక స్వతంత్రమైనదియు, ఈడ్య సవ్యాఖ్యకమ్ = స్తుతింపదగినదియు వ్యాఖ్యానించు నదియు అయిన, యమ్ = ఏ దక్షిణహస్తమును, మునయః = మహర్షులు, సదా= ఎల్లప్పుడు, భజంతి = సేవించు చున్నారో అట్టి, దక్షిణం కరమ్ = హయగ్రీవ స్వామి కుడిచేతిని, స్తుమః = స్తుతింతుము.

హయగ్రీవస్వామి యొక్క దక్షిణహస్తము, అనగా – కుడిచేయి అప్పుడే విప్పారిన ఎఱ్ఱని తామరపూవువలె సుకుమారముగా నుండును. తామరపూసల జపమాలను ధరించిన ఆ కరము రాక్షససంహారము చేయుటవలన కలిగిన జయశోభతో పరిఢవిల్లుచున్నది. ఆశ్రితులకు ఎల్లప్పుడు అభయమిచ్చి రక్షించునట్టి ఆస్వామి దక్షిణ కరము వ్యాఖ్యాముద్రతో ప్రకాశించుచుండును. మునులందరును భక్తితో సేవించు హయవదనప్రభుని దక్షిణ హస్తమును మనమిప్పుడు స్తోత్రము చేయుదము.



**19)** **సవ్యం కరం దక్షిణ మాశ్రితానాం సపుస్తకం వార్ధిసుతావలమ్బి ।**
**జ్ఞానప్రదం రమ్య మిభేన్ద్రతుణ్డద్యుతిం భజామోఽశ్వముఖస్య నిత్యమ్ ॥**

ఆశ్రితానామ్ = తనను ఆశ్రయించిన భక్తుల (అభీష్టములను తీర్చు) విషయమున, దక్షిణమ్ = సమర్థమైనది, సపుస్తకమ్ = పుస్తకముతో కూడినది, వార్ధి సుతా అవలంబి = లక్ష్మీదేవిని చేపట్టినది, జ్ఞానప్రదం = జ్ఞానమును అనుగ్రహించునది, రమ్యమ్ = మనోహరమైనది, ఇభ ఇంద్ర తుండ ద్యుతిమ్ = మదగజము యొక్క తొండమువలె ఒప్పుచున్నదియు అయిన, అశ్వముఖస్య = హయగ్రీవస్వామియొక్క, సవ్యం కరమ్ = ఎడమచేతిని, నిత్యమ్ = ఎల్లప్పుడును, భజామః = సేవింతుము.

హయగ్రీవస్వామి వామహస్తమున పుస్తకమును ధరించియుండును. ఒడిలో నున్న లక్ష్మీదేవికి ఆలంబనముగా నున్న ఆ చేయి ఎడమది అయినను తనను ఆశ్రయించిన భక్తుల కోరికలను తీర్చుటలో దక్షిణము, అనగా – అత్యంత సమర్థమైనది. జ్ఞానమును ఇచ్చునది, రమణీయమైనది, మదపుటేనుగు తొండమువలె దృఢముగను దీర్ఘముగను ప్రకాశించుచున్నది అయిన ఆ శ్రీహస్తమును సంతతము సేవించెదము.

**20)** **మథితదితిజసైన్యం పాఞ్చజన్యం దధానం**
**పవనసఖశిఖాభృచ్చక్ర మత్యుగ్రవక్రమ్ ।**
**భుజయుగ మవతాన్న స్సవ్యసవ్యేతరాఖ్యమ్**
**భజతి యదమరాణాం బృన్దమశ్వాననస్య ॥**

అశ్వాననస్య = హయగ్రీవస్వామియొక్క, మథిత దితిజ సైన్యమ్ = రాక్షసుల సైన్యమును మట్టుబెట్టినదియగు, పాంచజన్యమ్ = పాంచజన్యమనే శంఖమును, పవన సఖ శిఖాభృత్ = అగ్ని జ్వాలలు కలిగినది, అత్యుగ్ర వక్రమ్ = అంచులలో మిక్కిలి వంపులు కలిగినదియు అయిన, చక్రమ్ = సుదర్శనమను పేరుగల చక్రమును, దధానమ్ = ధరించునదియు, సవ్య సవ్యేతర ఆఖ్యమ్ = ఎడమ కుడి అని పిలువబడునదియు అయిన, యత్ భుజ యగమ్ = ఏ భుజముల జంటను, అమరాణాం బృందమ్ = దేవతల సమూహము, భజతి = సేవించుచున్నదో, తత్ = ఆ భుజద్వయము, నః = మనలను, అవతాత్ = రక్షించుగాక!

వెనుక రెండు శ్లోకములలో చతుర్భుజుడైన హయగ్రీవస్వామియొక్క ఒక భుజద్వయమును స్తుతించి,ఈ శ్లోకమునందు ఆ స్వామి కుడియెడమలలో నున్న మఱియొక బాహువుల జంటను సేవించుచున్నారు.

తన ధ్వనితోనే శత్రువులైన రాక్షసుల హృదయములను భయముతో బద్ధలైపోవునట్లు చేయు పాంచజన్య శంఖమును మఱియొక ఎడమచేతిలో ధరిస్తాడు, స్వామి. అగ్నివలె జ్వాలలను వెలిగ్రక్కుతూ వంపులు తిరిగియున్న అంచులు కలిగి శత్రుభయంకరమైన సుదర్శన చక్రాన్ని వేఱొక కుడిచేతిలో ధరిస్తాడు. దేవతలందరూ భక్తితో కొలిచే శంఖచక్రాయుధములను ధరించే ఆ భుజయుగళము కూడ మనలను నిత్యము కాపాడుగాక!

**21)** **ఏవం హయాననస్తోత్రం భక్త్యా కృత్వాஉర్పయ ద్విభోః ।**
**పాదయోస్తత్సతాం ప్రీత్యై భవేదేతత్పదే రతాః ॥**

ఏవమ్ = ఈ విధముగా, హయానన స్తోత్రమ్ = హయాననవింశతి అను పేరు గల స్తోత్రమును, భక్త్యా = భక్తితో, కృత్వా = రచించి, విభోః = హయగ్రీవస్వామి యొక్క, పాదయోః = పాదములవద్ద, ఆర్పయత్ = (తిరుమల పల్లేర్లముడి రామానుజ స్వామి) సమర్పించెను, తత్ = అట్టి ఈ స్తోత్రము, యే = ఎవరైతే, ఏతత్ పదే రతాః = హయవదనుని పాదపద్మములయందు ఆసక్తి కలిగియుందురో, సతామ్ = అట్టి సత్పురుషుల, ప్రీత్యై = ఆనందమునకు, భవేత్= (కారణము) అగుగాక!

తిరుమల పల్లేర్లముడి రామానుజస్వామివారు హయగ్రీవస్వామి శ్రీచరణ సన్నిధిలో భక్తితో సమర్పించిన హయాననవింశతి అను పేరు గల ఈ స్తోత్రము ఆ వాగధీశుని సేవలో నిరతులైన భాగవతోత్తములకు ఆనందమును కలిగించుగాక!

**22)** **శ్రీమతే హయవక్త్రాయ శ్రితరక్షణదీక్షిణే ।**
**శ్రియాஉஉలింగితపార్శ్వాయ మంగళం నిత్యమంగళమ్ ॥**

శ్రీమతే = జ్ఞాన, శక్తి, ఔదార్య, వాత్సల్యాది కళ్యాణగుణ సంపన్నుడు, శ్రిత రక్షణ దీక్షిణే = ఆశ్రితులను రక్షించుటయందు దీక్షవహించినవాడు, శ్రియా ఆలింగిత పార్శ్వాయ=లక్ష్మీదేవిచే ప్రక్కభాగమున ఆలింగనము చేసికొనబడినవాడును అయిన హయవక్త్రాయ = హయగ్రీవస్వామికి, మంగళమ్ = మంగళమగుగాక!, నిత్య మంగళమ్= ఎల్లప్పుడు మంగళము కలుగుగాక!

**తాత్పర్యము :** కళ్యాణగుణ సంపన్నుడు, ఆశ్రితులను రక్షించుటయే దీక్షగా కలవాడు, తనను ఆలింగనము చేసికొన్న లక్ష్మీదేవితో ఎప్పుడును విలసిల్లు వాడును అయిన హయగ్రీవ స్వామికి మంగళమగుగాక! నిత్యము మంగళమగుగాక!!

**॥ హయాననవింశతి స్సమ్పూర్ణా ॥**



## శ్రీమదభినవదేశిక ఉత్తమూర్ వీరరాఘవాచార్యుల వారిచే ప్రణీతమైన

# శ్రీ లక్ష్మీహయగ్రీవ ధ్యానమ్

శ్రీ ఉత్తమూర్ వీరరాఘవాచార్యుల వారు గడచిన శతాబ్దిలో భారతదేశంలో సంస్కృత భాషలో, విశిష్టాద్వైత సిద్ధాంతంలో పేరుగడించిన ప్రసిద్ధ పండితులలో అగ్రగణ్యులు. వీరు శ్రీవేదాంతదేశికులవలె శతాధిక గ్రంథాలను రచించారు.

**1.** **విధివద్విధివందితౌ పయోధౌ శ్రుతి మన్వేషయితుం కృతావగాహౌ ।**
**మధుకైటభమర్ధినౌ మనోజ్ఞౌ మనవై తే చరణౌ హయాస్య! దేవ! ॥**

ఓ దేవా! హయగ్రీవా! విధిప్రకారం బ్రహ్మచే నమస్కరింపబడినవి, వేదాలను అన్వేషించడంకోసం సముద్రంలో మునిగినవి, మధుకైటభులనే అసురులను సంహరించినవి, అందమైనవి అయిన నీ శ్రీచరణాలను ధ్యానిస్తున్నాను.

**2.** **యదుదగ్రజవోత్థసింధుభంగవ్రజఘాతక్షతపౌరుషౌ వృభౌ తౌ ।**
**శయితం తు భవంత మాప్య నష్టౌ తవ జంఘే హయవక్త్ర! మే హృది స్తామ్ ॥**

నీ పిక్కల గొప్పదైన వేగంవల్ల పుట్టిన సముద్రకెరటాల సమూహంయొక్క తాకిడిచేత నశించిన పౌరుషాన్ని కల్గిన మధుకైటభులనే ఆ ఇద్దఱు అసురులు, సముద్రంలో శయనించిన నిన్ను చేరి నశించారు. ఓ హయగ్రీవా! అటువంటి నీ పిక్కలు నా హృదయంలో నిలిచి ఉండాలి.

**3.** **సితపద్మనివిష్టయద్ద్వయైకస్థితలక్ష్మీశుభలంబిపాదయుక్తః ।**
**చరణ స్తవ దక్షిణః శరణ్యం మమ వాగీశ! తవోరుయుగ్మ మేతత్ ॥**

వాగీశ్వరా! తెల్లని ఆసనపద్మంలో కూర్చుని ఉండే నీ రెండు ఊరువులలోని ఒక ఊరువుపై లక్ష్మీదేవి కూర్చుని ఉన్నది. ఆమెయొక్క శుభకరమైన, కిందకు వేలాడే పాదంతో నీదక్షిణ చరణం కలసి ఉన్నది (సంబంధం కల్గి ఉన్నది) అటువంటి నీ రెండు ఊరువులు నాకు శరణం.

**4.** **ప్రణమద్విధివాసభవ్యపద్మం శుభపీతాంబరశోభి దివ్యభూషమ్ ।**
**అఖిలాండసముద్భవార్థనాభిస్మరణే స్యాదుదరం హయాస్య తే మే ॥**

ఓ హయగ్రీవా! నిన్ను నమస్కరించే బ్రహ్మకు వాసస్థానమైన, అందమైన పద్మాన్ని కల్గినది, మంగళకరమైన పీతాంబరంతో శోభిల్లేది, దివ్యమైన మొలనూలువంటి

భూషణాలను కల్గినది, సకలబ్రహ్మాండం యొక్క ఉత్పత్తిని ప్రయోజనంగా కల్గిన నాభిని కల్గినది అయిన నీ ఉదరం నా స్మరణలో నిత్యంగా నిలచి ఉండాలి.

**5. ఉపదేశకరేణ దక్షిణేన స్ఫురితం పుస్తకధారిణా కరేణ ।**
**అరిశంఖనివర్తితారిపాణిద్వయ మశ్వాస్య! వపు స్తవ స్మరేయమ్ ॥**

ఓ హయగ్రీవా! ఉపదేశ ముద్రను కల కుడిచేతితో, పుస్తకాన్ని దాల్చిన ఎడమ చేతితో, శంఖచక్రాలను ధరించడం ద్వారా శత్రువులను నివర్తింపజేసే బాహుద్వయంతో కూడిన నీ రూపాన్ని నేను స్మరిస్తాను.

**6. నిఖిలాశ్రితజీవధీవికాస వ్రజవద్భావితదీప్తికౌస్తుభాఢ్యమ్ ।**
**కలితం వనమాలయా చ వక్ష స్తవ సంశ్లిష్య ధియా హయాస్య మోదే ॥**

హయగ్రీవా! ఆశ్రితులైన జీవులందటియొక్క జ్ఞానవికాసంయొక్క సమూహమా! అని భావింపబడే కాంతిని కల కౌస్తుభంతో గొప్పది, వనమాలతో కూడినది అయిన నీ వక్షస్సును బుద్ధితో ఆలింగనం చేసికొని (బుద్ధితో భావించి) ఆనందిస్తాను.

**7. నికటస్థితపాంచజన్యవాంఛ్యస్ఫురదాకారశుభధ్వనిం సుదీర్ఘామ్ ।**
**పరఖండనతర్కబాణపూర్ణేషుధితుల్యాం హయకంధరాం స్మరామి ॥**

సమీపంలో ఉండే పాంచజన్యం కోరదగిన (పాంచజన్యానికి మించి), ప్రకాశించే (తెల్లని) ఆకారాన్ని మంగళకరమైన ధ్వనిని కల్గినది, మిక్కిలి పొడవైనది, పరవాదులను ఖండించడానికి తగిన తర్కాలనే బాణాలతో నిండిన అంబులపొదివంటిది అయిన హయగ్రీవుని కంఠాన్ని స్మరిస్తున్నాను.

**8. అమృతాయితహల్హలుక్తిధూతాఖిలహాలాహలరూపహైతుకోక్తి ।**
**వదనం సదనం కరోత్వజస్రం హృదయం మే సదయం ప్రభో! హయాస్య! ॥**

ప్రభూ! ఓ హయగ్రీవా! అమృతంవంటి హలహలశబ్దంతో ఎగురగొట్టిన (జయించిన) హాలాహలంవంటి హేతువాదాలను కల్గినదైన నీ వదనం నా హృదయాన్ని దయతో ఎల్లప్పుడు నివాసంగా చేసికోవాలి.

**9. తురగాస్య! కటాక్షధారయా త్వం**
**కలుషవ్రాతమపాస్య మే విధేహి ।**
**శఠజిద్యతిరాజవేదచూడా -**
**గురుసూక్త్యాధృతసర్వతత్త్వబోధమ్ ॥**



ఓ హయగ్రీవా! నీవు నీ కటాక్షధారతో నా దోషాలను అన్నిటిని తొలగించి, శఠకోపులు, శ్రీరామానుజులు, శ్రీవేదాంతదేశికులు - అనే వీరి సూక్తులు ఆదరించిన తత్త్వంలో జ్ఞానం కలిగేటట్లు అనుగ్రహించు.

**10. శ్రయదార్తిరవశ్రుతీచ్ఛయేవ**
**స్థిత మున్నామితకర్ణ మశ్వవక్త్ర! ।**
**స్ఫుటసాంద్రసటాజటాభిరామం**
**రమయేన్మే హృదయం శిర స్త్వదీయమ్ ॥**

ఓ హయగ్రీవా! భక్తుల ఆర్తధ్వనులను వినాలనే ఉద్దేశ్యంతో కాబోలు నీ చెవులను స్పష్టంగా కొంచెం పైకి నిక్కబొడుచుకున్నట్లు ఉన్నాయి. ప్రకాశించే దట్టమైన జూలుతో అందమైన నీ శిరస్సు నా హృదయాన్ని రంజింపజేయాలి.

**11. ఇతి తే హయవక్త్ర! దివ్యరూపే**
**పదజంఘోరుకటిక్రమేణ పాణీన్ ।**
**హృదయం గళమాస్య మక్షి శీర్షం**
**కలయేత్ యః సకలాః కలా స్తదాప్తాః ॥**

ఓ హయగ్రీవా! ఈ విధంగా నీ దివ్యరూపంలోని పాదాలు, పిక్కలు, ఊరువులు, నడుము, హస్తాలు, హృదయం, కంఠం, ముఖం, కన్నులు, శిరస్సు - అనే ఈ అంగాలను భావించిన వాడు అన్ని కళలను పొందుతాడు.

**12. సితపద్మనిషణ్ణ మంబుజాక్షం**
**స్ఫటికాద్రిప్రతిమం రమాసమేతమ్ ।**
**హయకంఠ మకుంఠవాగ్ధీవాక్**
**ద్వయసిద్ధ్యై ఉషసి స్మరామి నిత్యమ్ ॥**

తెల్లతామరపూవులో కూర్చుని ఉన్నవాడు, పద్మనేత్రుడు, స్ఫటికపర్వతం వంటివాడు, లక్ష్మీసహితుడైన హయగ్రీవుని ఏ అవరోధం లేని బుద్ధిని, వాక్కును పొందడం కోసం ప్రతిదినం ప్రాతఃకాలంలో స్మరిస్తున్నాను.

**13. అభిగంతు మపి ప్రపత్తు మేవం**
**గదితుం మంగళమాతనోః స్తుతీ స్త్వమ్ ।**
**త్వదుపాశ్రిత మన్ముఖేనపూర్వం**
**హయవక్త్రాకృతిచింతనం త్విదానీమ్ ॥**

ఓ హయగ్రీవా! నిన్ను అభిగమనం చేయడానికి, ప్రపత్తి చేయడానికి, మంగళా శాసనం పలుకడానికి నీవే, నిన్ను ఆశ్రయించిన నాద్వారా పూర్వం ఈ స్తుతులను రచింపజేశావు. ఇపుడు ఈ ఆకృతిచింతనరూపమైన స్తుతిని రచింపజేశావు.

**14. ఇతి సంధ్యసమీక్షితావదాతస్ఫుటపూర్ణాశ్వవపుహయాస్యభక్తః ।**
**నవదేశికవీరరాఘవార్యో వ్యతనోత్ ప్రాతు రుషస్సు చింతనార్థమ్ ॥**

ఈవిధంగా సంధ్యాకాలంలో తెల్లని ప్రకాశించే అశ్వరూపుని దర్శించినవాడు, హయగ్రీవ భక్తుడైన అభినవదేశికులనే బిరుదును కల ఉత్తమూర్ వీరరాఘవాచార్యులు ఈ స్తుతిని ప్రాతఃకాలంలో చింతన చేయడంకోసం రచించాడు.

**15. విద్యావిశ్రాణనోదంతో హయగ్రీవః పరః పుమాన్ ।**
**అనుగ్రహం వితనుతా మాశ్రితేష్వనవగ్రహమ్ ॥**

విద్యను అనుగ్రహించే వృత్తాంతాలను కలవాడైన పరమపురుషుడు హయగ్రీవుడు భక్తులకు ఏ అడ్డులేని అనుగ్రహాన్ని భక్తులకు విస్తరింపజేయాలి.

**16. సేవే లక్ష్మీహయముఖ! కురు త్వం దయా త్వత్పదాబ్జే**
**జానున్యూరౌ ఘనకటితటే దివ్యపీతాంబరాఢ్యే ।**
**కుక్షౌ వక్షస్యపి చ విపులే వైజయంత్యాదిభూషే**
**హస్తే పుస్తాన్వయిని లలితాక్షే సచక్రే సశంఖే ॥**

ఓ లక్ష్మీహయగ్రీవా! నాపై దయచూపు. నీ పాదారవిందాలను, మోకాళ్ళను, ఊరువులను, దివ్యమైన పీతాంబరంతో గొప్పదైన, పటిష్ఠమైన నడుమును, ఉదరాన్ని, విశాలమైన, వైజయంతి – మొదలైన వానితో అలంకరింపబడిన వక్షస్సును, పుస్తకాన్ని అక్షమాలను, చక్రాన్ని, శంఖాన్ని ధరించిన హస్తాలను సేవిస్తాను.

**17. దీర్ఘగ్రీవా ముఖపుటమహానాసికా గండపాళీ**
**స్మేరాంభోజప్రతిమనయనభ్రూలసద్వక్త్రబింబే ।**
**శీర్షే చోచ్చే శ్రవసి పరితో విస్తృతాయాం సటాయాం**
**స్మృత్వా చింతాముఖమనుభవేత్ శ్రీసఖం త్వాం సమగ్రమ్ ॥**

పొడవైన కంఠాన్ని, ముఖపుటాలను, గొప్ప నాసికను, చెక్కిళ్ళను, చిఱునవ్వుతో కూడిన పద్మాలవంటి నేత్రాలను, కనుబొమలను కల్గి ప్రకాశించే ముఖంతో, శిరస్సుతో ఉన్నతమైన చెవులతో, చుట్టూ విస్తరించిన సటలతో నా మనస్సు నిన్ను పూర్ణంగా స్మరించి నా మనస్సు పరిపూర్ణంగా ఆనందాన్ని అనుభవించాలి.



## శ్రీమదభినవదేశిక ఉత్తమూర్ వీరరాఘవాచార్యుల వారిచే ప్రణీతమైన

# లక్ష్మీహయగ్రీవప్రపత్తి

**1. విశుద్ధవిజ్ఞానఘనస్వరూపం విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్ ।**
**దయానిధిం దేహభృతాం శరణ్యం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

నిర్మలమైన విజ్ఞానమే స్వరూపముగా కల్గినవాడు, అట్టి విజ్ఞానమును అనుగ్రహించుటయే దీక్షగా కల్గినవాడు, దయకు నిధి, ప్రాణులకు గొప్ప శరణము అగు శ్రీహయగ్రీవదేవుని శరణు వేడుచున్నాను.

**2. బ్రహ్మాణ మాదౌ వ్యదధాదముష్మై వేదాంశ్చ యః స్మ ప్రహిణోతి నిత్యాన్ ।**
**స్వగోచరజ్ఞానవిధాయినం తం దేవం హయగ్రీవమహం ప్రపద్యే ॥**

బ్రహ్మను సృష్ట్యాదిలో సృజించి, అతనికి నిత్యాలైన వేదాలను అనుగ్రహించిన వాడు, తనకు సంబంధించిన జ్ఞానాన్ని కల్గించేవాడైన, దేవుడైన హయగ్రీవుని ప్రపత్తి చేస్తున్నాను.

**3. ఉద్గీథతారస్వరపూర్వ మంతః ప్రవిశ్య పాతాళతలా దహార్షీత్ ।**
**ఆమ్నాయ మాకంఠహయో య ఏతం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

ప్రణవపూర్వకమైన ఉద్గీథాన్ని సముద్రంలోపల ప్రవేశించి ఉచ్చరిస్తూ పాతాళ లోకంనుండి వేదాలను కొనివచ్చిన దేవుడైన హయగ్రీవుని శరణు పొందుతున్నాను.

**4. ప్రదాయ పుత్రాయ పునః శ్రుతీ ర్యో జఘాన దైత్యౌ నియతాబ్ధివాసమ్ ।**
**హవ్యైశ్చ కవ్యైశ్చ తమర్చ్యమానం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

తన పుత్రుడైన బ్రహ్మకు తిరిగి వేదాలను ఇచ్చి, దైత్యులను వధించినవాడు, సదా సముద్రంలో నివసించేవాడు, హవ్యకవ్యాలతో (యజ్ఞంలో) ఆరాధింపబడే దేవుడైన హయగ్రీవుని శరణువేడుతున్నాను. (హయగ్రీవుడు హవ్యకవ్యభోక్త – అనే విషయం హయశిరోపాఖ్యాన ప్రసిద్ధం)

**5. యన్నాభినాళీక దళస్థనీరబిందూత్థితౌ తౌ మధుకైటభాఖ్యౌ ।**
**వేదాపహారోయ తమోరజ స్తం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

ఏ భగవానుని నాభీపద్మంయొక్క దళం (రేకు)లోని నీటిబిందువునుండి వేదాలను అపహరించడంకోసం, రజస్తమోరూపులైన మధుకైటభులనే ఇద్దఱు పుట్టారో, అటువంటి దేవుడైన హయగ్రీవుని నేను శరణాగతి చేస్తున్నాను.

**6.** **కామ్యార్చ్యతాం ప్రాప్య వరం సురేషు గతేషు యజ్ఞాగ్రహరోఽర్థితో యః ।**
**అదర్శయత్ కాయ హయం వపు స్తం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

(బ్రహ్మ చేసిన యజ్ఞంలో చివర) దేవతలందఱు ఆయా కోరికలను కోరేవారు తమను అర్చించే వరాన్ని పొంది వెడలిపోగా, యజ్ఞఫలాన్ని స్వీకరించేవాడై హయగ్రీవ రూపంలో ఆవిర్భవించిన భగవానుడు తన రూపాన్ని బ్రహ్మకు దర్శింపజేశాడు. అటువంటి దేవుడైన హయగ్రీవుని నేను శరణాగతి చేస్తున్నాను.

**7.** **యో జాయమానం పురుషం ప్రపశ్యన్ మోక్షార్థచింతాపర మాతనోతి ।**
**విద్యాధిదేవం మధుసూదనం తం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

**"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్స తు విజ్ఞేయ స్స వై మోక్షార్థచింతకః"** అనే రీతిలో జన్మించే సమయంలో మధుసూధనుడు తన కటాక్షానికి పాత్రమైనవానిని మోక్షాన్నిగూర్చిన చింతను కల్గినవానినిగా చేస్తాడు. అటువంటి విద్యాధిదేవత, దేవుడైన ఆ మధుసూదనుని శరణు వేడుతున్నాను.

**8.** **ఆదిత్యబింబేఽశ్వవపుర్దధత్ సన్నాయాతయామాన్ నిగమాన్ అదిక్షత్ ।**
**యో యాజ్ఞవల్క్యాయ దయానిధిం తం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

సూర్యమండలంలో అశ్వరూపుడై వేంచేసి ఉండి యాజ్ఞవల్క్యమహర్షికి అదృశ్యమైన యజుర్వేదాన్ని ఉపదేశించినవాడు, అటువంటి దయానిధి, దేవుడైన హయగ్రీవుని శరణు వేడుతున్నాను.

**9.** **విజ్ఞానదానప్రథితా జగత్యాం వ్యాసాదయో వాగపి దక్షిణా సా ।**
**యదీక్షణాంశాహితవైభవా స్తం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

లోకంలో విజ్ఞానాన్ని అనుగ్రహించడంలో సమర్థులుగా పేరు పొందిన వ్యాసాదులు, సరస్వతీదేవి కూడా ఏ హయగ్రీవ భగవానుని కటాక్ష లవలేశం వల్ల ఆ వైభవాన్ని పొందినవారు. అటువంటి దేవుడైన హయగ్రీవుని నేను శరణు పొందుతున్నాను.

**"దాక్షిణరమ్యా"** ఇత్యాది హయగ్రీవస్తోత్ర శ్లోకభావం ఇక్కడ భావ్యం.

**10.** **మత్స్యాదిరూపాణి యథా తథైవ నానావిధాచార్యవపూంషి గృహ్ణన్ ।**
**వేదాంతవిద్యాః ప్రచినోతి యస్తం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**



హయగ్రీవస్వామియే మత్స్యాది అవతార రూపాలను, ఆవిధంగానే పలువురి ఆచార్యుల రూపాలను పొందినవాడై వేదాంతవిద్యలను అనుగ్రహిస్తున్నాడు. అటువంటి దేవుడైన హయగ్రీవుని నేను శరణు పొందుతున్నాను.

**11.** **శ్రేష్ఠః కృతజ్ఞః సులభోఽన్వితానాం శాంతః సుబుద్ధిః ప్రథితో హి వాజీ ।**
**తదాననావిష్కృతసద్గుణౌఘం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

లోకంలో అశ్వం శ్రేష్ఠమైనది, కృతజ్ఞతను కల్గినది, తనను ఆదరించేవారి విషయంలో సౌలభ్యాన్ని కల్గినది, శాంతస్వభావాన్ని కల్గినది, మంచి బుద్ధిని కల్గినదిగా పేరు పడినది. ఆ అశ్వముఖాన్ని కల్గి ఉండటంద్వారా ఆ సద్గుణాల సమూహాన్ని వ్యక్తం చేసేవాడైన, దేవుడైన హయగ్రీవుని నేను శరణు వేడుతున్నాను.

**12.** **హస్తై ర్దధానం దరచక్రకోశవ్యాఖ్యానముద్రాః సితపద్మపీఠమ్ ।**
**విద్యాఖ్యలక్ష్మ్యంచితవామభాగం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥**

నాల్గు భుజాలలో శంఖం, చక్రం, పుస్తకం, వ్యాఖ్యానముద్రలను ధరించినవాడు, తెల్లని పద్మాన్ని ఆసనపీఠంగా కలవాడు, **"విద్యా"** అనే పేరును కల లక్ష్మితో శోభిల్లే వామభాగాన్ని కలవాడైన దేవుడు హయగ్రీవుని శరణు పొందుతున్నాను.

## శ్రీమదభినవదేశిక ఉత్తమూర్ వీరరాఘవాచార్యుల వారిచే ప్రణీతమైన

# శ్రీలక్ష్మీహయగ్రీవమంగళమ్

1) **అశేషవేదరూపాయ యథార్థజ్ఞానదాయినే ।**
**విద్యాలక్ష్మీసమేతాయ వాజివక్త్రాయ మంగళమ్ ॥**

సమస్త వేదాలను రూపంగా కలవాడు, యథార్థమైన జ్ఞానాన్ని అనుగ్రహించే వాడు, విద్యా అనే పేరును కల లక్ష్మితో కూడి ఉండేవాడైన హయగ్రీవునకు మంగళం.

2) **పాలనే జ్ఞానదానే చ శ్రవణాదనిరుద్ధతః ।**
**ఆవిర్భూతాయ వేధోఽర్థ మశ్వగ్రీవాయ మంగళమ్ ॥**

రక్షణాన్ని జ్ఞాన ప్రదానాన్ని చేయడంలో ఆసక్తుడైన అనిరుద్ధుడనే వ్యూహమూర్తి నుండి బ్రహ్మకోసం ఆవిర్భవించినవాడైన హయగ్రీవునకు మంగళమ్.

3) **స్వానాభిపద్మజాయాదౌ స్వోపదిష్టాః శ్రుతీ స్సమాః ।**
**స్థిరం పునరదాత్ యోఽస్మై తురంగాస్యాయ మంగళమ్ ॥**

తననాభినుండి పుట్టిన బ్రహ్మకు సృష్ట్యారంభంలో తనచే ఉపదేశింపబడిన శ్రుతులను మళ్ళీ తిరిగి ఆ బ్రహ్మకు స్థిరంగా నిలచిఉండేటట్లు ఉపదేశించిన హయగ్రీవునకు మంగళం.

4) **మధ్వాభాన్మధు మబ్బిందోః కైటభం కఠినాదపి ।**
**కృత్వారీన్ శిక్షితాజాయ గంధర్వాస్యాయ మంగళమ్ ॥**

ఎఱ్ఱని వర్ణంలోని నీటిబిందువునుండి మధువు అనే అసురుని, కఠినమైన(నల్లని) నీటిబిందువునుండి కైటభాడనే అసురుని సృష్టించి, (గర్వించిన) బ్రహ్మను శిక్షించిన హయగ్రీవునకు మంగళం.

5) **పాదవ్యవస్థా యత్రార్థవశేనైవ మృగాత్మనే ।**
**యజుషే యజ్ఞరూపాయ హయగ్రీవాయ మంగళమ్ ॥**



వాక్యాత్మకమైన ఏ యజుర్వేదంలో పాదవ్యవస్థ అనేది అర్థవశంచేతనే నిర్ణయింప బడుతున్నదో, అటువంటి, మృగ (లేడి, లేక, అజ) రూపాన్ని కల్గిన, యజ్ఞాత్మకమైన యజుర్వేదాన్ని స్వరూపంగా కల్గిన హయగ్రీవునకు మంగళం.

(యజుర్వేదం యజ్ఞప్రధానమైనది. అటువంటి యజుర్వేదాత్మకుడు హయ గ్రీవుడు. యజ్ఞంలో ఆరాధింపబడే అగ్ని ఒకానొక సందర్భంలో లేడిరూపాన్ని ధరించిన వృత్తాంతం ప్రసిద్ధం. అపుడు మృగశబ్దానికి లేడి – అని అర్థం. లేక, యజ్ఞంలోని అజా (మేక) ప్రాధాన్యాన్నిబట్టి శ్లోకంలోని మృగశబ్దాన్ని మృగసామాన్యవాచకంగా గ్రహించి అర్థాన్ని చెప్పవచ్చు.)

6) **యదుద్గీథస్వరత్రస్తౌ దైత్యౌ వేదాపహారిణౌ ।**
**ప్రణవోద్గీథరూపాయ పుణ్యహేషాయ మంగళమ్ ॥**

హయగ్రీవుడు చేసిన ఉద్గీథాత్మకమైన, పవిత్రమైన హేషా (సకిలింపు) ధ్వనితో వేదాలను అపహరించిన మధుకైటభులు భయపడ్డారు. అటువంటి హేషాధ్వనిని చేసిన వాడు, ప్రణవోద్గీథస్వరూపుడైన హయగ్రీవునకు మంగళం.

హయగ్రీవుడు సముద్రంలో చేసిన ఉద్గీథాత్మకమైన స్వరాన్ని విని మధుకైటభులు భయపడిన వృత్తాంతం మహాభారతం శాంతిపర్వంలోని హయశిర ఉపాఖ్యానంలో ప్రసిద్ధం.

7) **వామపుస్తకహస్తస్వ భుజాశ్లిష్టరమాత్మనే ।**
**వ్యాఖ్యాముద్రాన్యహస్తాయ వాజివక్త్రాయ మంగళమ్ ॥**

చేతిలో పుస్తకాన్ని ధరించిన తన ఎడమబాహువుతో ఒడిలో కూర్చుని ఉండే లక్ష్మిని ఆలింగనం చేసికొన్నవాడు, వేఱొక చేతిలో వ్యాఖ్యాముద్రను దాల్చినవాడైన హయగ్రీవునకు మంగళం.

8) **శరద్ఘనస్థచంద్రాభ పుండరీకస్థమూర్తయే ।**
**శంఖచక్రధరాయాస్తు సైంధవాస్యాయ మంగళమ్ ॥**

శరత్కాలమేఘంపై ఉంటే చంద్రునివలె తెల్లని పుండరీకంపై వేంచేసి ఉండే రూపాన్ని కలవాడు, శంఖచక్రాలను ధరించినవాడైన హయగ్రీవునకు మంగళం.

వేదాంత దేశికుల హయగ్రీవస్తోత్రంలోని **"శరద్ఘనే చంద్రమివ స్ఫురంతమ్"** (25) అనే సూక్తి స్మరణీయం.

**9) జ్ఞానామృతఘటీయంత్రసాక్షిచిన్ముద్రపాణయే ।**
**ముముక్షాహేతువీక్షాయ మధుహంత్రేఽస్తు మంగళమ్ ॥**

జ్ఞానమనే అమృతాన్ని పైకి తీసికొని వచ్చే ఏతాము అనే యంత్రంవంటి వ్యాఖ్యాన ముద్రను చేతిలో ధరించినవాడు, మోక్షేచ్ఛను కల్గించే కటాక్షాలను కలవాడైన మధుసూదనునకు మంగళం.

**"జ్ఞానామృతోదంచనలాలసానామ్ లీలాఘటీయంత్ర మివాశ్రితానామ్"** అనే వేదాంత దేశికుల హయగ్రీవస్తోత్రసూక్తి (23), **"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్సతు విజ్ఞేయః, స వై మోక్షార్థచింతకః"** అనే పౌరాణిక సూక్తి స్మరణీయం.

**10) యస్యాక్షరసమ్నామ్నాయో హ్యకారాదిర్హలంత్యవాక్ ।**
**మధ్యే హయవరశ్లిష్టో హయస్యాఖ్యాయ మంగళమ్ ॥**

అకారం మొదలు, హకారం వరకు గల అక్షరసమామ్నాయం అంతా ఎవనికి చెందినదో, అటువంటివాడు, మధ్యలో గొప్ప హయరూపంతో కూడినవాడు, హయగ్రీవుడనే పేరు గలవానికి మంగళమ్.

దేశికుల హయాగ్రీవస్తోత్రంలోని **"యన్మోల మీదృక్.... తామక్షరా మక్షర మాతృకాం తే"** ఇత్యాది శ్లోకార్థం భావనీయం.

**11) అశ్విదధ్యఙ్ యాజ్ఞవల్క్య కశ్యపాదిశ్రితాంఘ్రయే ।**
**వైష్ణవక్రతునేష్టాయ వాజివక్త్రాయ మంగళమ్ ॥**

అశ్వినీదేవతలు, దధ్యంగ మహర్షి, యాజ్ఞవల్క్యుడు, కశ్యపుడు మొదలైనవారిచే సేవింపబడే పాదాలను కలవాడు, వైష్ణవక్రతువుచే (హయగ్రీవేష్టిచే) ఆరాధింపబడే వాడైన హయగ్రీవునకు మంగళం.

అశ్విని దేవతలు, దధ్యఙ్మహర్షి మొదలైనవారి వృత్తాంతాలు మధువు బ్రాహ్మణం, బృహదారణ్యకాదులలో ప్రస్తుతం. యాజ్ఞవల్క్య మహర్షికి సూర్యమండలాంత ర్వర్తి అయిన హయరూపుడైన శుక్లయజుర్వేదాన్ని ఉపదేశించిన వృత్తాంతం వేదపురాణ ప్రసిద్ధం.



**12) రజోమూర్తేర్వధూం వాణీం కుర్వతే సత్త్వహేతవే ।**
**తమోమూర్తిం చ సర్వజ్ఞం తురగాస్యాయ మంగళమ్ ॥**

రజోగుణస్వరూపుడైన చతుర్ముఖుని పత్ని సరస్వతిని, తమోగుణమూర్తి, సర్వజ్ఞుడైన, శివుని (దక్షిణామూర్తిని) సృష్టించినవాడు, సత్త్వగుణాన్ని కల్గించేవాడైన హయగ్రీవునకు మంగళం.

**"దాక్షిణ్యరమ్యా గిరిశస్య మూర్తిః, దేవీ సరోజాసనధర్మపత్నీ"** ఇత్యాది హయగ్రీవస్తోత్ర సూక్తి (6) భావం భావనీయం.

**13) రామదేశితమార్గేణ పాంచాలేనార్చితాంఘ్రయే ।**
**వ్యాసాదిజప్యమంత్రాయ వాజికంఠాయ మంగళమ్ ॥**

బలరాముని ఉపదేశంప్రకారం పాంచాలరాజుచే ఆరాధింపబడినవాడు, వ్యాసాది మహర్షులచే జపింపబడే మంత్రాన్ని కలుడైన హయగ్రీవునకు మంగళం.

**"వ్యాసాదయోఽపి...... స్ఫురంతి సర్వే తవ శక్తిలేశైః"** అనే హయగ్రీవ స్తోత్ర సూక్తి స్మరణీయం.

**14) సర్వసూక్ష్మార్థవిజ్ఞానం సాధువ్యాహారధోరణీ ।**
**యన్మంత్రజపత స్తస్మై హయగ్రీవాయ మంగళమ్ ॥**

ఏ హయగ్రీవుని మంత్రజపంవల్ల అన్ని సూక్ష్మమైనతత్త్వాల విశేషమైన జ్ఞానం, చక్కగా మాట్లాడే శక్తి కల్గుతుందో, ఆ హయగ్రీవునకు మంగళం.

విష్ణుతిలకసంహితలోని **"సిద్ధే హంసమనౌ వాణీ వాచి నృత్యతి సర్వదా, అనేన మంత్రరాజేన నాసాధ్యం విద్యతే భువి"** అనే హయగ్రీవమంత్రసిద్ధి తెలుపబడడం గమనార్హం.

**15) దశావతారాః యస్యాస్సుః పాశ్చాత్యాః వేధసాం గురోః ।**
**హవ్యకవ్యభుజే తస్మై హయగ్రీవాయ మంగళమ్ ॥**

బ్రహ్మకు ఆచార్యుడైన హయగ్రీవావతారం తరువాతనే భగవానుని అవతారాలలో ముఖ్యంగా గణింపబడే దశావతారాలు సంభవించాయి. హవ్యకవ్యభుజుడైన ఆ హయగ్రీవునకు మంగళం.

**"యో బ్రహ్మాణం.... యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** అనే శ్రుతి హయగ్రీవావ తారసూచకం కనుక, హయగ్రీవుడు బ్రహ్మకు ఆచార్యుడు హయగ్రీవావతారమే మొదటిది హయగ్రీవుని హవ్యకవ్య భోక్తృత్వం హయశిర ఉపాఖ్యాన సిద్ధం.

**16) శ్రవణోదగ్రకర్ణాయ శ్రవణర్క్షోద్భవాయ చ ।**
**శ్రవణగ్రాహ్యవాగ్దాత్రే శ్రీహయాస్యాయ మంగళమ్ ॥**

వినే సమయంలో రిక్కించిన చెవులను కలవాడు (ఇది అశ్వంయొక్క సహజ గుణం), శ్రవణానక్షత్రంలో అవతరించినవాడు, విన సొంపైన వాక్కులను అనుగ్రహించే వాడైన హయగ్రీవునకు మంగళం.

**17) యత్కటాక్షకలాలేశకలనాత్ సకలాః కలాః ।**
**స్వయ మావిర్భవంత్యస్మై శీర్షణ్యశ్వాయ మంగళమ్ ॥**

ఏ హయగ్రీవుని కటాక్షం లేశంవల్ల అన్ని కళలు స్వయంగా ఆవిర్భవిస్తాయో, అటువంటి హయగ్రీవునకు మంగళం.

**18) ధర్మావిరుద్ధయో రర్థకామయో రమృతస్య చ ।**
**హేతుం వాచం ప్రదానాయ హయగ్రీవాయ మంగళమ్ ॥**

ధర్మవిరుద్ధం కాని అర్థానికి, కామానికి అదే విధంగా, మోక్షానికి కారణమైన ఉపదేశాన్ని ఇచ్చిన హయగ్రీవునకు మంగళం.

**19) సర్వవిద్యాప్రతిష్ఠానబ్రహ్మవిద్యాప్రదాయినే ।**
**వాగేశ్వరేశ్వరాయాస్తు వాజివక్త్రాయ మంగళమ్ ॥**

అన్నివిద్యలకు చరమావధి అయిన బ్రహ్మవిద్యను అనుగ్రహించేవాడు, అన్ని విద్యలకు అధిపతి అయిన హయగ్రీవునకు మంగళం.

**20) జ్ఞానాయ జ్ఞానరూపాయ జ్ఞానినే జ్ఞానదాయినే ।**
**సర్వోత్తమాయ శ్రీశాయ హయగ్రీవాయ మంగళమ్ ॥**

జ్ఞానస్వరూపూడు, జ్ఞానాన్ని గుణంగా కలవాడు, గొప్పజ్ఞాని, జ్ఞానాన్ని అనుగ్రహించేవాడు సర్వోత్తముడు, శ్రియపతి అయిన హయగ్రీవునకు మంగళం.

**21) య ఇదం శ్రీహయగ్రీవమంగళం నియతం పఠేత్ ।**
**విద్యావాన్ ధనవంశాయుర్వృద్ధిసౌఖ్యాని సోఽశ్నుతే ॥**

ఎవరు ఈ హయగ్రీవ మంగళాన్ని తప్పకుండా పఠిస్తాడో అతడు, విద్యను, వాక్కుకు, ధనాన్ని, మంచివంశంలో జన్మను, ఆయుర్వృద్ధిన్ని, సౌఖ్యాన్ని పొందుతాడు.



### ఆత్రేయ శ్రీనివాసాచార్య (సేవాస్వామి) ప్రణీతమైన

# లక్ష్మీహయవదనమంగళం

శ్రీనివాసాచార్య స్వామివారు సేవాస్వామిగా సుప్రసిద్ధులు. వీరు గొప్ప సంస్కృత పండితులు. దేశికుల పలుస్తోత్రాలకు ద్రావిడంలో వ్యాఖ్యలను రచించారు. సహజంగా హయగ్రీవోపాసకులైన వీరు హయగ్రీవుని గూర్చి పలు స్తోత్రాలను రచించారు.

**1. మణిమండపికాస్థానీమండనాయ మహీయసే ।**
**మంగళాభరణాయాస్తు తురగాస్యాయ మంగళమ్ ॥**

మణిమండపానికి గొప్ప అలంకారంవంటివాడు, చాలా గొప్పవాడు, మంగళకరమైన ఆభరణాలను కలవాడైన హయగ్రీవునకు మంగళం.

**2. ఇందిరాలింగనానందనిధయే నిధయే సతామ్ ।**
**సుందరాయ సుపూర్ణాయ వాజివక్త్రాయ మంగళమ్ ॥**

లక్ష్మీదేవి ఆలింగనంవల్ల కల్గిన ఆనందాన్ని నిధిగా కలవాడు, సత్పురుషులకు గొప్ప నిధి, సుందరుడు, అన్నివిధాల పూర్ణుడైన హయగ్రీవునకు మంగళం.

**3. విరించిముఖదేవాదివేదవ్యాఖ్యానకారిణే ।**
**వాఖ్యాంకితకలాయాస్తు వాగధీశాయ మంగళమ్ ॥**

బ్రహ్మ మొదలైన దేవతలకు వేదాలను వ్యాఖ్యానాన్ని చేసేవాడు, (దానిని సూచించే) వ్యాఖ్యాన ముద్రను చేతిలో కలవాడైన వాగధీశునకు మంగళం.

**4. వాచి వేదశ్రియం స్వాంతే కృపాశ్రియ మపాంగయోః ।**
**అనుగ్రహశ్రియం ధర్త్రే హయశీర్షాయ మంగళమ్ ॥**

వాక్కులో వేదమనే సంపదను, మనస్సులో కృప అనే సంపదను, కటాక్షాలలో అనుగ్రహమనే సంపదను ధరించే హయగ్రీవునకు మంగళం.

**5. ప్రపన్నాభయదాయాస్తు దివ్యదృష్టిప్రదాయినే ।**
**దేశికారాధ్యదైవాయ హయగ్రీవాయ మంగళమ్ ॥**

తనను శరణాగతి చేసిన వారికి అభయాన్ని ఇచ్చేవాడు, దివ్యదృష్టిని కల్గించేవాడు, వేదాంతదేశికులకు ఆరాధ్యదైవం అయిన హయగ్రీవునకు మంగళమ్.

**6. జ్ఞానానందసుఖారోగ్యభుక్తిముక్త్యాదిదాయినే ।**
**స్వాశ్రితాయ శరణ్యాయ వాగ్వరేణ్యాయ మంగళమ్ ॥**

జ్ఞానం, ఆనందం, సుఖం, ఆరోగ్యం, భుక్తి, ముక్తి, మొదలైనవానిని ఇచ్చేవాడు, తనను ఆశ్రయించినవారికి గొప్ప రక్షకుడైన హయగ్రీవునకు మంగళం.

**7. గోదాశఠారిభగవద్రామానుజముఖై స్సదా ।**
**దేశికేన చ యుక్తాయ నిత్యం భవతు మంగళమ్ ॥**

గోదాదేవి, శఠకోపముని, భగవద్రామానుజులు మొదలైనవారిని, వేదాంత దేశికులతో కూడి ఉండే హయగ్రీవునకు నిత్యం మంగళం.

**8. ఆత్రేయశ్రీ శ్రీనివాస రాఘవేణానుసంహితమ్ ।**
**శ్రేయో దదాతు పఠతాం శ్రీహయాననమంగళమ్ ॥**

ఆత్రేయగోత్రానికి చెందిన శ్రీనివాసరాఘవునిచే అనుసంధింపబడిన ఈ హయగ్రీవమంగళస్తుతి చదివినవారికి శ్రేయస్సును కల్గించుగాక!





# శ్రీ హయవదనస్తోత్రమ్

## (శ్రీ జగ్గు వకుళభూషణకవికృతమ్)

జగ్గు వకుళభూషణ కవి కర్ణాటదేశీయులు. మేల్కోట ప్రాంతంలోని ఛత్రఘోష గ్రామంలో 1902లో జన్మించారు. సాహిత్యాది పలుశాస్త్రాలలో పండితులు. వీరు పలు రచనలను చేశారు. వాటిలో ఈ స్తుతి ఒకటి. వీరి కృతులను రాష్ట్రియ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి వారు ప్రచురించారు.

**1. జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥**



**2. హయానన ముపాస్మహే స్ఫటికనిర్మలాంగం స్ఫుటే**
**సితాంబురుహవిష్టరే సముపవిష్ట మబ్జాలయమ్ ।**
**ప్రసన్నకమలాలయాకలితమంజులాంకం త్రయీ–**
**శిరశ్చికురభూషణం కృతనతాఘసంశోషణమ్ ॥**

స్ఫటికంవలె నిర్మలమైన దేహాన్ని కలవాడు, వికసించిన తెల్లని తామరలో వేంచేసి ఉన్నవాడు, చంద్రమండల మధ్యస్థుడు, భక్తులపట్ల ప్రసన్నురాలై ఉండే లక్ష్మీదేవితో కూడుకొని ఉండటంచేత మనోహరమైన ఒడిని కలవాడు, వేదాంతాలను కేశభూషణంగా కలవాడు (వేదాంత ప్రతిపాద్యుడు), తనను ఆశ్రయించినవారి పాపాలను ఎండగట్టేవాడైన హయగ్రీవుని ఉపాసిస్తున్నాను.

**3. తవాక్షియుగళం స్ఫురత్పృథులతారకం సాదరం**
**నిపాతయ కృపాంబుధే! మయి చ పాపకూపస్థితే ।**
**యదుద్ధరతి బాలిశం నవ మివాచరన్ మానవం**
**బృహస్పతిసమం జగత్ ప్రథితకీర్తి మీడ్యం ప్రభో! ॥**

కృపకు సముద్రంవంటి వాడా! (అంతులేని కృపను కలవాడా!), ప్రభూ!, పాపకూపంలో పడి ఉండే నాపై ప్రకాశించే, పెద్ద కనీనికలను కల నీ నేత్రయుగ్మాన్ని (నీ కటాక్షాలను) ఆదరంతో ప్రసరింపజేయాలి. ఆ కటాక్షాలు బాలిశుడైన మానవుని కూడా లోకంలో ప్రసిద్ధమైన కీర్తిని కలవానినిగా, అందఱిచే పొగడబడేవానినిగా, బృహస్పతితో సమానునిగా చేయగలవు.

**4. హయాస్య ! తవ చంద్రికాధవళకాయకాంతిచ్ఛటా**
**మదీయహృదయావృతప్రస్తృతతామసం సాంప్రతమ్ ।**
**సుదూర ముపసార్య తద్విమలబోధపీయూషతో**
**నివారయతు మే చిరాదుపనతాం భవాబ్ధిప్లుతిమ్ ॥**

ఓ హయగ్రీవస్వామీ! చంద్రికవలె తెల్లని నీ దేహకాంతుల సమూహం నా హృదయంలో ఆవరించి, అంతటితో ఆగక ఇంకా ప్రసరించే అజ్ఞానరూపమైన చీకటిని చాలా దూరం తరిమికొట్టాలి. ఆ విమలమైన దివ్యదేహకాంతివల్ల కలిగిన జ్ఞానమనే అమృతంతో నన్ను ఉజ్జీవింపజేసి, సంసార సముద్రంలో పడటానికి సిద్ధంగా ఉండే నన్ను నివారించాలి.

**5. కదాపి హయకంధర! త్వదమలాంఘ్రిపంకేరుహ-**
**ద్వయస్మరణ మప్యహో ! న కృతవాన్ విమూఢాత్మకః ।**
**త్వదంకతలసంస్థితాం కువలనీలలోలేక్షణాం**
**విలోక్య కమలాం తథాఽప్యహ మిహాస్మి నిస్సాధ్వసః ॥**

హయగ్రీవా! నేను మూఢుడనై నీ పవిత్రమైన పాదపద్మద్వయస్మరణను కూడా అయ్యో! చేయలేదే! అయినా, నీ ఒడిలో వేంచేసి ఉన్నది, నల్లకలువవంటి, చలించే అందమైన కన్నులను కల్గినది (కరుణను వర్షించే కన్నులను కల్గినది) అయిన లక్ష్మీదేవిని దర్శించిన తరువాత నేను ఎంతమాత్రం నా రక్షణపట్ల భయం లేనివాడనై ఉన్నాను. (లక్ష్మీపురుషకారంవల్ల నాకు రక్షణ తప్పక లభిస్తుందనే ధైర్యంతో నిర్భయంగా ఉన్నాను.)

**6. విధూమ్రశుచికేసర ప్రకటఫాలపుండ్రం కరైః**
**చతుర్భిరపి పుస్తకం ధవళశంఖచక్రే తథా ।**
**దధాన ముపదేశదప్రయతముద్రికాం వాక్పతిం**
**స్మరామి హయకంధరం కమలయాసమం భాసురమ్ ॥**

తెల్లని, పవిత్రమైన జూలును కల్గినవాడు, విశాలమైన ఫాలభాగంలో ఊర్ధ్వ పుండ్రాన్ని ధరించినవాడు, నాల్గు చేతులలో పుస్తకాన్ని, తెల్లని శంఖాన్ని, చక్రాన్ని, ఉపదేశాన్ని ఇచ్చే పవిత్రమైన ముద్రను (ఉపదేశ ముద్రను) ధరించి ఉండేవాడు, లక్ష్మీదేవితో కూడి ఉండే వాడై ప్రకాశించేవాడు, వాక్పతి అయిన హయగ్రీవుని స్మరిస్తున్నాను.

**7. కిరీటమణిమాలికారుచిరత్నకేయూరక-**
**క్వణత్ కనకకంకణ ప్రముఖభూషణాలంకృతః ।**
**సుధాంశురుచిరాంబరః శ్రితజనార్తిహర్తా ప్రభుః**
**మమాపి దురిదం ద్రుతం హరతు వాజిరమ్యాసనః ॥**



కిరీటం, మణిహారాలు, అందమైన రత్నాలు పొదిగిన అంగదాలు, మధురంగా ధ్వనించే బంగారు కంకణాలు మొదలైన దివ్యాభరణాలతో అలంకరింపబడినవాడు, చంద్రుని వలె మనోహరమైన, ప్రకాశించే వస్త్రాన్ని ధరించినవాడు, ఆశ్రితుల ఆర్తిని హరించేవాడు, అందరిని పాలించేవాడైన హయగ్రీవుడు నా పాపాన్ని కూడా వేగంగా హరించాలి.

**8. హయానన! భవత్పదద్వయపయోజపీయూషజం**
**సముద్ధర విధాయ మాం యదిహ తే శుభంయూన్ గుణాన్ ।**
**చతుర్ముఖశతక్రతుప్రముఖదేవబృందస్తుతాన్**
**భవేయ మహమాదరా ద్విదితుమేష శక్తః ప్రభో! ॥**

హయగ్రీవా! నీ చరణద్వయమనే పద్మాల అమృతంనుండి పుట్టినవానినిగా (నీ చరణపద్మాలను ఆశ్రయించడంద్వారా సత్తను పొందినవానినిగా) చేసి నన్ను ఉద్ధరించు. ప్రభూ! శుభాన్ని కల్గించేవి, బ్రహ్మేంద్రాది దేవతల సమూహంచే స్తుతింపబడినవి అయిన నీ గుణాలను నేను ఆధారంగా తెలిసికొనగల్గినవాడనైతే, ఈ దాసుడు (నేను) తరించడంలో శక్తిని కలవాడను కాగలను.

**9. కటాక్షలవపాత్రతాం తవ గతా శ్చ యే చేతనాః**
**చతుర్ముఖసతీబృహస్పతిగణాధిపా స్తేఽభవన్ ।**
**సమస్తజనతాక్షితౌ సకలభవ్యవిద్యాప్తయే**
**సమర్చతి కృతాంజలిః నుతిశతేన తాన్ వాక్పతే! ॥**

వాక్కులకు అధిపతివి అయిన ఓ వాక్పతీ! ఏ జీవులు నీ కటాక్షలేశానికి పాత్రం అవుతున్నారో, వారు సరస్వతిగా, బృహస్పతిగా, గణాధిపతులుగా అయ్యారు. అటువంటి సరస్వత్యాదులను లోకంలోని జనులు సమస్తమైన, మంగళప్రదమైన విద్యలను పొందడం కోసం అంజలిని చేసేవారై వందలకొలది స్తుతులతో అర్చిస్తున్నారు.

**"దాక్షిణరమ్యా"** ఇత్యాది దేశికుల హయగ్రీవ స్తోత్రసూక్తి భావ్యం.

**10 పయోనిధిసుతాస్మరన్ముఖనిశాపతేః కౌముదీ**
**వివర్ధితవళక్షతారుచిరదివ్యదేహో హరే! ।**
**మదీయమపి మానసం దురితతామసైః వ్యాపృతం**
**హయానన! దయాంబుధే! ధవళయాశు కారుణ్యతః ॥**

అశ్వరూపా! క్షీరాబ్ధికన్య అయిన లక్ష్మీదేవియొక్క ప్రకాశించే ముఖచంద్రుని నుండి పుట్టిన వెన్నెల వెలుగుతో సహజంగానే తెల్లగా ఉండే నీ దివ్యదేహంయొక్క తెల్లదనం

మరింత వృద్ధిచెందింది. హయగ్రీవా! దయకు సముద్రంవంటివాడా! పాపాలనే చీకట్లతో ఆవరింపబడి నల్లగా ఉండే నా మనస్సును నీవు నీ తెల్లని కరుణతో (దివ్య దేహకాంతులతో పాటుగా) వేగంగా తెల్లబడేటట్లు – జ్ఞానాన్ని పొందేటట్లు చేయాలి.

**11. తత స్తవ పదాంబుజద్వయమపి ప్రమోదాత్ స్థిరం**
**నిధాతు మపి మే క్షమం హృదయపుండరీకం భవేత్ ।**
**అహం చ హయకంధర! త్వదతిమార్దవాంఘ్రిద్వయం**
**నితాంతదృఢమానసః ప్రముదితో భవేయం స్మరన్ ॥**

హయగ్రీవా! నీ పాదారవిందద్వయిని నా హృదయపుండరీకం ఆనందంతో స్థిరంగా నిలుపుకొనగల్గినది అయితే, నేను దృఢమైన మనస్సును కలవాడనై నీ అతి సుకుమారమైన పాదద్వయిని నిరంతరం స్మరిస్తూ గొప్ప ఆనందాన్ని పొందినవాడను కాగలను.

**12. శ్రుతిర్హి తవ సద్గుణాన్ గదితు ముత్సుకా సాదరం**
**న్యవర్తత గుణోదధే రనవసాద్య పారం చిరాత్ ।**
**యథోచితమతిర్బత ! ప్రథితవైభవం నిర్భయో**
**భవంత మిహ నిస్త్రపః క్రమధుతః స్తువన్ సంశ్రయే ॥**

హయగ్రీవస్వామీ! నీ కల్యాణగుణాలనుగూర్చి పలుకదలచిన వేదం, చాలా కాలాని కూడా ఆ గుణసముద్రం యొక్క తీరాన్ని పొందలేక **"యతో వాచో నివర్తంతే"** అని నివర్తించింది. కాని, నేను ఏమాత్రం భయం లేనివాడనై, జంకు గొంకు లేనివాడనై, క్రమవివక్షను వదలిపెట్టిన వాడనై, (అల్పమైన) నా బుద్ధికి తగినట్లుగా ప్రసిద్ధి పొందిన వైభవాన్ని కల నిన్ను స్తుతిస్తూ ఆశ్రయిస్తున్నానే! ఆహా!

నా అయోగ్యతను గమనించకుండా, వేదానికి కూడా కీర్తించడానికి సాధ్యం కాని కల్యాణగుణ స్తుతిని చేస్తూ నిన్ను ఆశ్రయించడం సాహసం కదా! – అనే ఆశ్చర్యం, విషాదం **"బత"** అనే పదం ద్వారా ద్యోతకమవుతున్నాయి.

**13. అహం త్వమమతామతిః చిరతరానువృత్తా మమ**
**శ్రుతిస్మృతిపురాణవాక్శ్రవణతోఽపి నో నిస్సరేత్ ।**
**అతశ్చ భవసాగరే పతితవానహం దుఃఖితః**
**వినాశయ హయానన! ప్రతిభటాం తు తాం వీక్షణాత్ ॥**

హయగ్రీవస్వామీ! చిరకాలంగా అహంకార మమకారాలు నన్ను వదలకుండా అనువర్తిస్తున్నాయి. శ్రుతిస్మృతిపురాణసూక్తులను ఆలకించినా వాటి అనువృత్తి నానుండి



తొలగిపోవడం లేదు. అందువల్లనేను సంసార సముద్రంలో పడినవాడనై, దుఃఖాన్ని పొందిన వాడనయ్యాను. నాకు మోక్షవిరోధి అయిన ఆ అహంకార మమకారాలను వృత్తిని నీవు నీ కటాక్షంతో నశింపజేయాలి.

**14. శ్రుతీరితపథే కథంచిదపి గచ్ఛతో మే భవేత్**
**ప్రమాదవశతః క్వచిత్ స్ఖలిన మాత్మపాతప్రదమ్ ।**
**కథం దురితాకరః ప్రకృతిపాశబద్ధాత్మకః**
**సతాం గతి మవాప్నుయాం భవదనుగ్రహం తం వినా ॥**

హయగ్రీవా! నేను శ్రుతివిహితమైన మార్గంలో అతి కష్టంతో సంచరించినా, ప్రమాదవశంచేత ఎక్కడో ఒకచోట ఎప్పుడో ఒక సమయంలో ఆత్మనాశాన్ని కల్గించే తొట్రుపాటు నాకు కలుగవచ్చు. (అందువల్ల నా ప్రయత్నమేమీ నన్ను రక్షించలేదు) పాపాలకు నిలయం, ప్రకృతి బంధాలచే బంధింపబడిన ఆత్మను కలవాడనైన నేను మహాత్ములు అనుసరించిన సద్గతిని (ప్రవృత్తిని) నీ అద్వితీయమైన, నిర్హేతుకమైన కరుణ లేనిదే ఏవిధంగా పొందగలను! (నీ కరుణవల్లనే నీ పాదాలలో ప్రపత్తిని చేయగలను)

**15. హయానన! తవానఘా శ్రుతిమయీ తు హేషాజుషా**
**మశేష మఘసంఘ మప్యపనుదత్యనర్ఘాః కలాః ।**
**ఉదంచయతి కీర్తి మప్యఖిలలోకమాన్యత్వమ–**
**ప్యతః శ్రుతిపథే మమాప్యటతు సా ప్రమోదావహా ॥**

హయగ్రీవస్వామీ! నీ హేషాధ్వని శ్రుతిరూపమైనది, పవిత్రమైనది. దానిని ఎవరు సేవిస్తారో (వింటారో) వారి సమస్త పాపసమూహాన్ని ఆ హేషారవం నశింపచేస్తుంది. అనర్ఘాలైన కళలను అనుగ్రహిస్తుంది. కీర్తిని కూడా కల్గిస్తుంది. సమస్త లోకంలోను మాన్యత సిద్ధిస్తుంది. మహానందాన్ని కల్గించే ఆ హేషారవం నా చెవులలో కూడా విహరించాలి.

**16. కరద్వయసముద్ధృతప్రథితశంఖచక్రో భవాన్**
**విశాలవిశదస్ఫుటస్ఫటికకాంతి ర్హరే! ।**
**విభాతి శరదంబుదో దలితతూలశుభ్రద్యుతిః**
**నిజాంచలసముద్గతద్యుతిమదిందుభాస్వానివ ॥**

హరీ! రెండు చేతులలో ప్రసిద్ధమైన శంఖచక్రాలను ధరించినవాడవు, విశాలమైన, మిక్కిలిగా ప్రకాశించే, భిన్నస్ఫటికంయొక్క కాంతివంటి కాంతిని కలవాడవు, శరత్కాల చంద్రునివంటివాడవు, విడదీసిన దూదిపింజవలె తెల్లని కాంతిని కలవాడవైన నీవు నీ సమీపంలో ఉదయించిన కాంతులతో విరాజిల్లే సూర్యచంద్రులను కలవాడవుగా

భాసిస్తున్నావు. (చక్రం సూర్యునిగా, శంఖం చంద్రునిగా భాసిస్తున్నది – అని అర్థం. ఈ వర్ణన దివ్యసూర్తి సూక్తి ప్రసిద్ధం)

**17.** **మమ హృది సతతం హయానన! త్వం నివస యథా హృదయం శుచిత్వ మీయాత్।**
**అకలుషమతిదాయినం భవంతం హృది కలయే యమహం యథా చ భక్త్యా ॥**

హయగ్రీవా! నా హృదయం పవిత్రతను పొందే రీతిలో నా హృదయంలో సదా నివసించు. పరిశుద్ధ జ్ఞానాన్ని కల్గించేవాడవైన నిన్ను భక్తితో నా హృదయంలో ధ్యానిస్తున్నాను.

**18.** **దేహి మే నాథ వాక్ఛుద్ధిం రసవద్వాగ్విజృంభణమ్ ।**
**ఆయు రారోగ్య మైశ్వర్యం నమస్తే హయకంధర! ॥**

హయగ్రీవస్వామీ! నాథా! నాకు వాక్ఛుద్ధిని, రసవంతాలైన వాక్కుల అభివృద్ధిని, ఆయుస్సును, ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని అనుగ్రహించు. నీకు నమస్కారం.

**19.** **జ్ఞానాభివృద్ధిసంప్రాప్త్యై హయాననునుతిస్రజమ్ ।**
**వ్యధాత్ త్తస్య పదద్వంద్వే జగ్గూ వకుళభూషణః ॥**

జగ్గువకుళభూషణ కవి జ్ఞానాభివృద్ధి ప్రాప్తి కోసం హయగ్రీవస్తుతి మాలికను ఆ స్వామి పాదద్వంద్వంలో సమర్పించాడు.





# శ్రీహయవదనప్రపత్తిః

## (తిరుమల రంగనాథశర్మణా ప్రణీతా)

శ్రీతిరుమల రంగనాథశర్మగారు మహబూబ్‌నగర్ ప్రాంతంవారు. వీరు తెలుగులో, సంస్కృతంలో పలు స్తోత్రాలను రచించారు. వీరు ముద్రించిన **"స్తోత్రసముచ్ఛయః"** అనే గ్రంథం నుండి ప్రస్తుత స్తోత్రం స్వీకరింపబడింది.

**1.** **స్ఫటికాచలసన్నిభదివ్యతనుం కటకధ్వనిభాషితసామగిరమ్ ।**
**ఇహ ఘోటకవక్త్ర మహం కలయే ఘటయేతి శుభం ఘటితాంజలినా ॥**

స్ఫటిక పర్వతంవంటి దివ్యమైన దేహాన్ని కలవాడు, కాలి అందెల సవ్వడితో తెలుపబడిన సామవేదవాక్కులను కలవాడు, హయశిరస్సును కలవాడైన భగవానుని అంజలిని చేస్తూ మంగళాన్ని కల్గించమని ప్రార్థిస్తున్నాను.

**2.** **తటినీజనితారణదివ్యపదం హఠయోగిభి రీక్షితసత్య మిదమ్ ।**
**ఇహ ఘోటికవక్త్రతయాఽభ్యుదితం ప్రతిభాతు మహః ప్రవిశత్ హృది నః ॥**

జన్మవాహిని నుండి తరింపజేసే దివ్యమైన పాదాలను కల్గిన హఠయోగుల చేత దర్శింపబడిన సత్యమైన, హయగ్రీవుని రూపంతో ఆవిర్భవించిన ఈ దివ్యమైన తేజస్సు నా హృదయంలో ప్రవేశించినదై ప్రకాశించింది.

**3.** **హయశీర్షకనామకదివ్యతరుః భవసాగరతారణభవ్యతరిః ।**
**సుకృతాద్ధి సతా మిహ సంజనితం సకలం త్విహ నః కరసంస్థఫలమ్ ॥**

హయగ్రీవుడనే గొప్ప కల్పవృక్షం సంసారసముద్రాన్ని దాటించే గొప్ప తెప్ప వంటిది. ఆ కల్పవృక్షం ఈ లోకంలో మహనీయుల సుకృతంవల్ల అవతరించింది. ఇక మనకు సమస్తం కరతలామలకం.

**4.** **ఇహ మానుషజన్మ సుదుర్లభతాం అవబుధ్య జనేరపి సార్థకతామ్ ।**
**భవసాగరతారణ భవ్యతరిం భజతాదాదరతో హయశీర్షవిభుమ్ ॥**

ఈ లోకంలో మానవజన్మ చాలా దుర్లభమని తెలిసి, ఆ జన్మయొక్క సార్థక్యాన్ని గ్రహించి, సంసార సముద్రాన్ని దాటడంలో తెప్పవంటివాడైన హయగ్రీవస్వామిని భక్తితో భజించండి.

**5.** **భవదుద్ధరణాయ కృపాజలధిః హయశీర్ష ఏష మతిం హి దధౌ ।**
**అత ఏవ గురో రిహ సత్కృపయా హయశీర్ష ఏవ ఇహావిరభూత్ ॥**

కృపాసముద్రుడైన హయగ్రీవుడు మిమ్ములను ఉద్ధరించడంకోసం నిశ్చయించుకొన్నాడు కదా! అందువల్లనే ఆ హయగ్రీవ స్వామి ఆచార్యసత్కృపకారణంగా ఇక్కడ ఈ లోకంలో ఆవిర్భవించాడు.

## శ్రీమాన్ తె.కం. రంగరామానుజాచార్య స్వామి ప్రణీతమైన

# లక్ష్మీహయానన సుప్రభాతమ్

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ పెద్దజీయరు స్వామివారికి కుడిభుజంగా, కులపతిగా ప్రసిద్ధులైన శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి కుమారులు రంగరామానుజాచార్య స్వామి వారు. వీరి ఈ స్తుతిని తమ ఆరాధ్య దైవమైన హయగ్రీవస్వామి విషయంలో రచించారు.

1. **కౌసల్యా సుప్రజారామ! । పూర్వా సన్ధ్యా ప్రవర్తతే ॥**
**ఉత్తిష్ఠ నరశార్దూల! । కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥**

కౌసల్యానందనుడవైన రామా! తూర్పున తెల్లవారుచున్నది. ఓ పురుష శ్రేష్ఠుడా! దైవ కార్యనిర్వహణార్థమై నిదుర లెమ్ము (రామాయణములోనిదైన ఈ శ్లోకమును కవులు – ప్రతి సుప్రభాతమునకు మొదటగా కూర్చడం పరిపాటి. భగవానునకు మొట్టమొదట (రామావతారములో విశ్వామిత్రునిచే) పాడబడిన సుప్రభాతము ఇదే కాదా !)

2. **ఉత్తిష్ఠోత్తిష్ఠ వాగీశ! ఉత్తిష్ఠ తురగానన ।**
**ఉత్తిష్ఠ రమయా స్వామిన్! మద్బుద్ధిం విశదాం కురు ॥**

ఓ స్వామీ! వాక్కులను శాసించువాడా! అశ్వముఖము కలవాడా! లక్ష్మీదేవితో కలిసి లేచి, నా బుద్ధిని వికసింపజేయుము.

3. **మాత ర్హయాననకృపాపయసాం ప్రదాత్రి!**
**సూరీంద్రసంస్తుతపదే! కరుణాంబురాశే! ।**
**వాచాం విదూరమహిమాస్పద చారుశీలే!**
**వాగీశభవ్యదయితే! తవ సుప్రభాతమ్ ॥**

ఓ తల్లీ! హయగ్రీవుని యొక్క కృపామృతమును ప్రసాదించుదానా ! పండిత శ్రేష్ఠులచే స్తుతింపబడిన పాదములు కలదానా! కరుణకు సముద్రము వంటిదానా! మాటలకు అందనటువంటి మహిమాన్వితమైన స్వభావము కలదానా! వాగీశుని ప్రియురాలా! ఓ లక్ష్మీ నీకు సుప్రభాతము.

4. **తవ సుప్రభాత మధునా దయానిధే!**
**వరకింకిణీధ్వనిత వేదసుస్వరే! ।**
**అమరాంగనామధురగాన బోధితే!**
**దరహాసభాసి! తురగాననప్రియే! ॥**



హయగ్రీవునకు ప్రియురాలా! సకల దయలకు స్థానమైనదానా! శ్రేష్ఠమైన మువ్వల సవ్వడిచే ధ్వనింపచేయబడిన చక్కని వేదఘోష కలదానా! దేవతా స్త్రీల యొక్క మధురమైన పాటల చేత మేల్కొల్పబడినదానా! చిరునవ్వుతో ప్రకాశించుదానా! నీకు సుప్రభాతము.

5. **కప్యాసశబ్దవివృతిం యతిరాడ్విధాయ**
**శ్రీ భాష్యకారబిరుదం భవదీయమూర్తిమ్ ।**
**వాణ్యా అవాప్య భవదర్చనలాలసోఽ సౌ**
**లక్ష్మీ హయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

భగవద్రామానుజులు **'కప్యాసశృతి'** ని వివరించి, **'శ్రీ భాష్యకారులు'** అను బిరుదును, నీ (హయగ్రీవుని) విగ్రహమును శారదాదేవి నుండి పొంది, నీ సేవాసక్తులై నిలచియున్నారు. అట్టి స్వామీ! నీకు మేలుకొలుపు. (ఛాందోగ్యోపనిషత్తులోని **"యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ"** అను వాక్యమునకు – లోతైన నీటిలో పుట్టి, బలమైన కాడపై నిలచి, అప్పుడే ఉదయించు సూర్యకిరణముల స్పర్శచే వికసించిన పద్మమునందలి రేకులవలె విశాలమైన నేత్రములు కలవాడు పరమాత్మ– అని భగవద్రామానుజులు వివరించిరి)

6. **వేదేషు రాక్షసహృతేషు విమూఢబుద్ధిః**
**ప్రత్యర్పితేషు దయయా భవతా హి ధాతా ।**
**ప్రాజ్ఞో నివేదయతి దేవ! కృతజ్ఞతాం స్వాం**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

ఓ లక్ష్మీ హయాననా! రాక్షసులచేత వేదములు అపహరింపబడినపుడు జ్ఞానహీనుడైన బ్రహ్మ దయామూర్తివైన నీ చేత ఆవేదములు తిరిగి పొంది ప్రాజ్ఞుడై తన కృతజ్ఞతను నీకు నివేదించుచున్నాడు. అట్టి స్వామీ! నీకు మేలుకొలుపు.

7. **ఆరాధితా సతతమేవ బుధైశ్చ వాణీ**
**పాండిత్య సత్కవనభాషణశక్తియుక్తీః ।**
**తేషాం ప్రకల్పయితు మాశ్రయతే భవంతం**
**లక్ష్మీ హయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

ఎల్లప్పుడు పండితులచే ఆరాధించబడే సరస్వతి – వారికి పాండిత్యమునకు, మంచి కవిత్వమునకు, భాషణమునకు తగిన శక్తియుక్తులను కలుగజేయుటకై నిన్ను ప్రార్థించుచున్నది. అట్టి స్వామీ! నీకు మేలుకొలుపు.

**8. వాస్తోష్పతి ర్దితిసుతై రపహన్యమానాం**
**త్రాతుం ధియా మహితయా సురరాజ్యలక్ష్మీమ్ ।**
**త్వాం సేవతే సమధిగంతు మహీనబుద్ధిం**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

రాక్షసులచేత దేవతలయొక్క సంపదలు అపహరింపబడినపుడు బృహస్పతి ఆ సంపదలను రక్షించుటకు మహిమాన్విత ప్రతిభతో ప్రజ్ఞామూర్తివైన నిన్ను సేవించుచున్నాడు. అట్టి స్వామీ! నీకు మేలుకొలుపు.

**9. ఇంద్రాగ్నికాలనికషాత్మజ పాశివాయు-**
**యక్షాధిరాజగిరిశా స్తవ దాసభూతాః ।**
**శక్త్యా తవైవ హి దిశః ప్రభవంతి పాతుం**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

ఇంద్రుడు, అగ్ని, యముడు, నైఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, శివుడు ఇట్టి నీ దాస భూతులైన అష్టదిక్పాలకులు నీ శక్తితోటే ఆ దిశలను పరిపాలించుటకు సమర్థులగుచున్నారు. అట్టి స్వామీ! నీకు మేలుకొలుపు.

**10. ప్రాచీం దిశం భజతి భాస్కర ఏష రక్తః**
**గాఢం తమో విగత మావికసంతి సద్యః ।**
**పూజాసుమాని మధుమంతి తవార్చనాయ**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

తూర్పు దిక్కున భాస్కరుడు ఉదయించినాడు. గాఢాంధకారము తొలగినది. తేనెలూరు పూజా సుమములు నీ పూజకై చక్కగా ప్రపుల్లములగుచున్నవి. ఓ హయానన స్వామీ! నిదురలెమ్ము.

**11. పద్మోదరే మృదుల శీతలడోలికాయాం**
**నిద్రాసుఖం సమనుభూయ నితాంతతృప్తమ్ ।**
**ఏతన్మరాళమిథునం విధునోతి పక్షౌ**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

మృదువైన, చల్లని పద్మ గర్భమును ఊయలలో హాయిగా నిద్రా సుఖము ననుభవించిన ఈ హంసల జంట తమ రెక్కలను రెపరెప లాడించుచున్నవి. ఓ లక్ష్మీ హయానన స్వామీ! నీకు మేలుకొలుపు.



**12. తేజో జహాతి విధు రుత్పలతారకాభిః**
**సూర్యోఽంబరం సమధిగచ్ఛతి బాల ఏషః ।**
**ఆవాతి మందపవనః క్రముకీవనాంతాత్**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్.**

చంద్రుడు ఉత్పలములలో, తారలలో తన కాంతిని విడచి కనుమరుగైనాడు. లేత సూర్యుడు గగనతలమున తోచినాడు. పోకచెట్ల వనమునుండి చల్లని గాలి వీచుచున్నది. ఓ హయానన స్వామీ! నీకు మేలుకొలుపు.

**13. ఆదాయ దర్పణమిమం కపిలాం చ ధేనుం**
**మత్తం గజం వృషభరాజ మపాం చ కుంభమ్ ।**
**త్వాం సేవితుం ధృతధియః మునయశ్చ దేవాః**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్.**

యోగి గణములు, దేవతాగణములు – అద్దమును, నల్లని గోవును, మదగజమును, వృషభరాజమును, పూర్ణ కుంభమును తీసుకొని వచ్చి నిన్ను సేవించుటకు ఆరాటపడుచున్నారు. ఓ హయానన స్వామీ! నీకు మేలుకొలుపు.

**14. ఆపూరయంతి మురలీ ర్మృదుగోపబాలాః**
**గాయంతి పుష్పమధుపానవిమత్త భృంగాః ।**
**అర్ఘ్యేణ భాస్కరమమీ ప్రణమంతి విప్రాః**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

గోపబాలురు తమ వేణువులను మధురంగా పూరించుచున్నారు. పుష్పముల యందలి తేనెను త్రాగి, మత్తెక్కిన తుమ్మెదలు సుస్వరముతో పాడుచున్నవి. బ్రాహ్మణులు అర్ఘ్యముతో సూర్యభగవానునికి నమస్కరించుచున్నారు (అర్ఘ్యప్రదానము చేయుచున్నారు). ఓ లక్ష్మీహయానన స్వామీ! నీకు మేలుకొలుపు.

**15. వేదాపహార్యసురభంజక! మత్స్యరూప!**
**మంథాద్రిభారవహా! కూర్మ! మహో వరాహ!**
**శ్రీ మన్నృసింహ! బలిభంజక! వామనాఖ్య!**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్.**

వేదములను అపహరించిన రాక్షసులను సంహరించుటకై మత్స్యావతారమును ఎత్తినవాడా! క్షీర సాగర మథన సమయంలో కూర్మావతారమెత్తి, మంథర పర్వతమును

వహించినవాడా! (భూమిని ఉద్ధరించుటకై) వరాహావతారమును ఎత్తినవాడా! (ప్రహ్లాద రక్షణార్థమై) నృసింహావతారమును ఎత్తినవాడా! వామనావతారమును ఎత్తి బలిచక్రవర్తిని నిగ్రహించినవాడా! ఓ స్వామీ! నిదురలెమ్ము.

**16. భూభారభూతకునృపాంతక! భార్గవాఖ్య!**
**స్వామిన్! దశాననవిలుంఠన! సౌమ్యరూప! ।**
**శేషాంశభూత! బలరామ! వినీలవాసః!**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

భూభారకారకులైన దుష్టరాజులను అంతమొనరించిన పరశురామా! రావణాంతక! సౌమ్యరూపా! ఆదిశేషుని అంశచే జన్మించి, నల్లని వస్త్రములను ధరించిన ఓ బలరామా! లక్ష్మీ హయవదన స్వామీ! నీకు సుప్రభాతము.

**17. గీతోపదేశవిమలీకృత పార్థచేతః !**
**ధర్మాపదేశ మృదుతాఖిలధూర్తబుద్ధే! ।**
**కల్పక్షయే ఖలవినాశక! కల్కిరూప!**
**లక్ష్మీ హయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

ఓ లక్ష్మీహయవదన స్వామీ! గీతను ఉపదేశించి అర్జునుని యొక్క మనస్సును తేట పరచితివి. ధర్మమును మరుగుపరచి దుష్ట బుద్ధులను నశింపజేసినవాడా! కల్పాంతమందు దుష్టనాశనమొనరించే కల్క్యవతారా! నీకు మేలుకొలుపు.

**18. వాగీశ! వాక్ప్రద! తమోహర! జాడ్యనాశ!**
**సారస్వతప్రద! జపప్రియ! వేదవేద్య! ।**
**అజ్ఞాననాశక! విధీంద్రసమర్చితాంఘ్రే!**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

వాగధిష్ఠాన దేవతా! జ్ఞానప్రదాతా! (అజ్ఞానమనే) చీకట్లను పోగొట్టువాడా! బుద్ధి మాంద్యమును నశింపజేయువాడా! లౌకిక వైదిక శాస్త్రములను ప్రసాదించినవాడా! జపప్రియ! వేదములచే తెలియబడువాడా! అజ్ఞానమును నశింపజేయువాడా! బ్రహ్మేంద్రాదులచేత పూజింపబడిన పాదములు కలవాడా! లక్ష్మీ హయవదన స్వామీ! నీకు మేలుకొలుపు.

**19. గోవింద! కేశవ! నిరీశ! శరణ్య! విష్ణో!**
**లోకత్రయేశ! పర! పారగ! శాంత! దాంత! ।**



**శ్రేయఃప్రదాచ్యుత! విధిస్తుత! నిత్యతృప్త!**
**లక్ష్మీ హయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

దేవతల యొక్క స్తుతిరూపమైన వాక్కులకు పాత్రమైనవాడా! కేశి అనే రాక్షసుని సంహరించినవాడా! వేరు నియామకుడెవడూ లేనివాడా! రక్షకుడా! అంతటా వ్యాపించినవాడా! ముల్లోకములను నియమించువాడా! ఉత్కృష్టుడా! సంసార సాగరాన్ని దాటించువాడా! బహిరింద్రియములను, అంతరింద్రియమును నిగ్రహించువాడా! సమస్త సంపదలనిచ్చువాడా! ఆశ్రయించినవారిని విడువనివాడా! బ్రహ్మచే స్తుతింపబడువాడా! నిత్యతృప్తుడా! స్వామీ! నిదురలెమ్ము.

**20. పూర్ణేందుసౌమ్య! శివ! శాంతిద! హంస! యోగిన్!**
**వేదాంతపారగ! పురాణ! శరణ్య! జీవ! ।**
**జాడ్యాపహారి! నిరుపద్రవ! సర్వసాక్షిన్!**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

నిండుచంద్రునివలె సౌమ్యుడవు, మంగళకరుడవు, శాంతిప్రదుడవు, పరమహంసవు, యోగీశ్వరుడవు, ఉపనిషత్తులకు కూడా అందని వైభవము కలవాడవు. ఆది దేవుడవు, రక్షకుడవు, భాగవతులను ఆత్మవినాశము నొందకుండునట్లు ప్రాకృత దుఃఖములనుండి తప్పించి, నీ సేవా భాగ్యము కలిగించి జీవింపజేయువాడవు, బుద్ధిమాంద్యమును పోగొట్టువాడవు, ఉపద్రవములను తొలగించువాడవు, జగత్తునంతటికీ సాక్షీభూతుడవు. స్వామీ! అట్టి నీకు నా మేలుకొలుపు.

**21. ధర్మో యదా ఖలజనాల్లభతే స్మ నాశం**
**సంవర్ధతేఽధికమధర్మ అనాహతాత్మా ।**
**సంకల్ప్య మామిహ సృజామి న సంశయోఽస్తీ**
**త్యుక్తం త్వయా ఖలు విభో! తవ సుప్రభాతమ్ ॥**

ధర్మమునకు దుష్టులచే ముప్పు వాటిల్లినప్పుడు, అధర్మము యథేచ్ఛగా విజృంభించినపుడు, నేను నా సంకల్పముతో వచ్చి అవతరింతును. ఇందు సందేహము లేదు– అని తెలిపిన స్వామీ! నీకు సుప్రభాతము.

**22. త్రాణాయ సాధు వితతేర్మమ దర్శనేన**
**దుష్కర్మచారనిరతాన్ వినిహంతు మాశు ।**
**సంస్థాపనార్థమపి ధర్మతతే ర్భవామీ**
**త్యుక్తం త్వయా ఖలు విభో! తవ సుప్రభాతమ్ ॥**

నా దర్శనముతో సాధువులను రక్షించుట కొరకు, అసాధువులను సంహరించుట కొరకు, ధర్మమును (నా పర్యంతము) సంస్థాపించుట కొరకు అవతరింతును- అని చెప్పిన స్వామీ! నీకు మేలుకొలుపు.

**23.** **సంశుద్ధధీ ర్ఘనవిభాపరిపూర్ణదేహ!**
**విజ్ఞానదానవిధయే దృఢబద్ధదీక్ష! ।**
**కారుణ్యపూర్ణ! జయ! దేహభృతాం శరణ్య!**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

పరిశుద్ధమైన జ్ఞానమే రూపు దాల్చినవాడా! జ్ఞానము నొసగుటలో దీక్ష బూనినవాడా! కరుణార్ద్రహృదయుడా! జయశీలీ! శరీరధారులందరికీ రక్షకుడా ఓ లక్ష్మీ హయవదన స్వామీ! నీకు మేలుకొలుపు.

**24.** **శీతా స్త్వదీయకరుణాప్రభవాః కటాక్షాః**
**వాణీం దిశంతు పురుషశ్రవణేంద్రియాణామ్ ।**
**ఆప్యాయనీ మమృతకల్పరుచిం సదా మే**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

ప్రాణికోటి చెవులకు ఇంపుగా, అమృతము వలె భోగ్యముగా నుందు వాక్కును నీ చల్లని కరుణాకటాక్షములు నా కొసంగుగాక! విభో! లక్ష్మీ హయవదన స్వామీ! నీకు మేలుకొలుపు.

**25.** **వేదా స్త్వదీయమహిమాన మపౌరుషేయాః**
**నాద్యాపి నూన మధిగంతు మమీ సమర్థాః ।**
**త్వామల్పయా స్తుతిపరో న బిభేమి వాచా**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**

అపౌరుషేయములైన వేదములు కూడా నీకు మహిమను నేటికినీ తెలుసుకొన జాలకున్నవి. అటువంటి నిన్ను నా అల్పవాక్కులతో స్తుతించుటకు నేనేమియు భయపడుటలేదు. (అందుకు నీ అనుగ్రహమే కారణం) స్వామీ! నీకు మేలుకొలుపు.

**26.** **లక్ష్మ్యా వసన్ మమ హృదంతరపుండరీకే**
**ఆభాసనీతిబహులై రవికంపనీయమ్ ।**
**శంకాకలంకరహితం వద తే స్వరూపం**
**లక్ష్మీహయానన! విభో! తవ సుప్రభాతమ్ ॥**



నా హృదయ పద్మములో లక్ష్మీ సహితుడవై నిశ్చలముగా వసించుచు, స్వచ్ఛమైన, దోషరహితమైన నీ స్వరూపమును నాకు ప్రసాదించుము. స్వామీ! నీకు మేలుకొలుపు.

**27.** **ఏకేన శంఖ మపరేణ కరేణ చక్రం**
**వ్యాఖ్యానచిహ్న మితరేణ పరేణ పుస్తమ్ ।**
**ధృత్వా శ్రియా సహ వసన్ సితపుండరీకే**
**మాం రక్ష జ్ఞానద! విభో! తవ సుప్రభాతమ్ ॥**

ఒక చేతినందు శంఖము, మఱొక చేతిలో చక్రము, ఇంకొక చేతియందు ఉపదేశముద్రను, మఱొక చేతియందు పుస్తకమును ధరించి, లక్ష్మీదేవితో కూడి తెల్లనైన పద్మమునందు వేంచేసి నన్ను రక్షింపుము. (భక్తిగా పరిణమించు) జ్ఞానము నొసగు ఓ స్వామీ! నీకు మేలుకొలుపు.

**28.** **ఇత్థం హయానన విభో రిహ సుప్రభాతమ్**
**లక్ష్మ్యా యుతస్య సితపద్మనివిష్టమూర్తేః ।**
**యే మానవాః పఠితు మాదరపూర్ణచిత్తాః**
**తే ప్రాప్నువంతి కవితాం చ వచోవిలాసమ్ ॥**

ఈ రీతిగా లక్ష్మీతో కూడి తెల్లని పద్మమునందు వేంచేసియున్న శ్రీ హయగ్రీవుని యొక్క ఈ సుప్రభాతమును ఏ మానవులు ఆదరముతో చదువుదురో వారు కవితాశక్తిని, వాక్చాతుర్యమును పొందగలరు.

**లక్ష్మీహయవదనార్పణమస్తు.**

## అనుబంధం

( సుమారు నూరు సంవత్సరాల క్రితం మైసూరులో పరకాలమఠం ద్వారా ముద్రింప బడిన ఈ వ్యాఖ్యానం ఇపుడు దుర్లభం. అందువల్ల మళ్ళీ సహృదయ పాఠకానందం కోసం ముద్రింపబడుతున్నది. దీని కర్త ఎవరో తెలుపబడలేదు.)

# శ్రీహయగ్రీవస్తోత్రమ్ - సంస్కృత వ్యాఖ్యానమ్.

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥

స్వతఃసిద్ధం శుద్ధస్ఫటికమణిభూభృత్ప్రతిభటం
సుధాసధ్రీచీభిః ద్యుతిభిరపతాపత్రిభువనమ్ ।
అనంతైః త్రయ్యంతైరనువిహితహేషాహలహలం
హతాశేషావద్యం హయవదన మీడీమహి వహః ॥ **1**

### వ్యాఖ్యానమ్

ఇందిరామందిరోరస్క మిందాదిసురవందితమ్-
వందారుబృందమందారం వందే గోవిందబాలకమ్ ॥౧॥

కందర్పసంవరాకారం బృందావనవిభూషణమ్ ।
ఆనందకందజం నందనందనం వందిషీమహి ॥

ప్రణిపత్య గురూత్తంసం శ్రీమద్వేదాంతదేశికమ్ ।
హయగ్రీవస్తవవ్యాఖ్యాం కుర్వేఽహం తత్ప్రసాదతః ॥

ఇహ ఖలు శ్రీమాన్ వేదాంతదేశికః, సమ్యగుపాసనవిశేషవశీకృత హృదయ పుండరీకమధ్యమండనాయిత తాండవప్రచండతురంగముఖ మార్తాండమండలః, సకల పండితనికురుంబముక్తాతపత్రితకీర్తిమండలః, సర్వతంత్రస్వతంత్రః, కవితార్కికకేసరీ, పరమకారుణికః,భగవత్కల్యాణగుణగణానుసంధానేన అనాదిసంసార సఞ్చితదౌష్కర్మ్య పాశబందీకృత ప్రాణిబృన్దం సంతితారయిషుః, శ్రీహయగ్రీవ మభిష్టోతుం ప్రతిజానీతే (స్వత) ఇతి. స్వతస్సిద్ధమ్ - స్వప్రకాశమ్, నను సిద్ధశబ్దస్య భావార్థవిహిత కృత్ప్రత్యయాంతత్వే స్వత ఇతి పంచమ్యర్థభూతహేత్వర్థవిహిత తసిల్ప్రత్యయస్యానన్వయః స్యాత్ - సిద్ధశబ్దస్య ప్రకాశమాత్రార్థకత్వేన, స్వశబ్దస్యాపి 'ప్రకాశార్థకత్వేన తసిః పంచమ్యర్థహేత్వర్థకత్వేన చ ప్రకాశాధీనప్రకాశార్థలాభాత్, ప్రకృతే ప్రకాశస్య నిత్యత్వేన స్వాత్మానం ప్రతి స్వస్య హేతుత్వాసంభవేన చ తదసంభవాత్, కర్త్రర్థవిహిత కృతకృత్ప్రత్యయాంతత్వే పూర్వోక్తరీత్యా



స్వాధీనప్రకాశవత్త్వమర్థ స్స్యాత్. తథా చ స్వస్యేవ స్వప్రకాశస్యాపి నిత్యత్వేన పూర్వోక్త దూషణగ్రాసాదితి చేత్, మైవమ్. ఉభయథాఽపి దోషాభావాత్. తథాహి. ఆద్యపక్షే -ప్రకాశస్య స్వాధీనత్వే తాత్పర్యాభావాత్. అన్యానధీనత్వే తాత్పర్యాత్, ద్వితీయపక్షే- స్వాధీనప్రకాశవత్త్వే తాత్పర్యాభావాత్, అన్యానధీనప్రకాశవత్త్వే తాత్పర్యాత్, ఉభయథాపి మణిప్రకాశమణ్యాదివ్యావృత్తిసిద్ధేః. స్వతః - స్వస్మాత్, సిద్ధం - సిద్ధిః - జ్ఞానం, ప్రకాశ స్వరూపం; సిద్ధం జ్ఞాతం ప్రకాశితం వా; స్వాధీనప్రకాశాభిన్నం అన్యాధీన ప్రకాశరహితం వేత్యర్థః. సార్వవిభక్తికతసిల్ప్రత్యయాంతత్వే తు ప్రథమార్థవర్ణనసంభవేన స్వయంప్రకాశార్థలాభాన్న కోఽపి దోషగంధః. యద్వా - స్వతః - స్వస్మాత్, సిద్ధమ్ - ఉత్పన్నం, కారణాంతరాపాదితోత్పత్తిశూన్యమిత్యర్థః. నిత్యమితి యావత్. అథవా, నిత్యత్వం నాన్యాధీనమిత్యాహ - (స్వత) ఇతి. అనేన నిత్యముక్త దివ్యావృత్తిః, తేషాం స్వరూపస్వభావస్థితిప్రవృత్తీనాం భగవదాయత్తత్వాత్. నను నిత్యముక్తస్వరూప స్వభావాదీనామపి నిత్యత్వాత్కథం భగదాయత్తత్వమితి చేన్న, నిత్యానామపి తద్వ్యతిరేకప్రసంజితవ్యతిరేకప్రతియోగిత్వరూప భగవదాయత్తత్వసమ్భవాత్. తథా చ శ్రుతిః- "కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో న స్యాత్" ఇతి - పరమాణుగతపారిమాండల్యస్య నిత్యత్వేఽప్యాశ్రయాధీనావస్థాయా న్యాయవిద్భిరంగీకారాచ్చ. నను సిద్ధశబ్దస్య నిత్యపర్యాయత్వం కథమితి చేదుచ్యతే - "సిద్ధే శబ్దార్థసంబంధే" ఇత్యత్ర మహాభాష్యే సిద్ధశబ్దస్య నిత్యపర్యాయత్వేన వ్యాఖ్యానాత్. తథా హి. సిద్ధశబ్దస్య కః పదార్థః? నిత్యపర్యాయవాచీ సిద్ధశబ్దః కథం పునః జ్ఞాయతే? మత్కూటస్థేష్వవిచాలిషు భావేషు వర్తతే తద్వచ్చ సిద్ధం. సిద్ధా పృథివీ, సిద్ధ మాకాశ మిత్యలం బహునా. (శుద్ధస్ఫటికమణిభూభృత్ప్రతిభట) మితి. శుద్ధస్య - నిర్మలస్య, స్ఫటికమణిభూభృతః - స్ఫటికమయపర్వతస్య, ప్రతిభటం - తతోఽప్యతిశయిత కాంతిమత్త్వేన తం తిరస్కుర్వంతమిత్యర్థః. సుధాసధ్రీచీభిః - అమృతసహచరీభిః, ద్యుతిభిః - కాంతిభిః, (అపతాపత్రిభువనమ్) అపగతః తాపః - ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికాది సమస్తదుఃఖాత్మక స్తాపో యస్మిన్ తత్; త్రయాణాం భువనానాం సమాహార స్త్రిభువనం, పాత్రాదిత్వాన్న జీప్. అపతాపం త్రిభువనం యస్య తథోక్తః; హయగ్రీవకాంతయ శ్చంద్రమండలమధ్యవృత్తిసుధాసహితాస్సత్య స్త్రిలోకీసంతాపహారిణ్యో భవంతి. మండలస్థ స్సుధాంశోః "పుంసాం కర్మానలార్తానాం పాపినాం క్లేశశాంతయే, స్వదేతేందు స్సముద్రేణ హ్లాదయన్గోగణేనవే" త్యాదివచనాత్. అనంతైః- నిరవధికైః, త్రయ్యంతైః - వేదాంతైః, (అనువిహితహేషాహలహలమ్), అనువిహితః - అనుసృతః, హేషా - హేషాఖ్యో హలహలః, అశ్వధ్వనివిశేషో యస్య తథోక్తమ్. యథోక్తం భాగవతే ద్వితీయ స్కంధే బ్రహ్మనారదసంవాదే - "వాచో బభూవు రుశతీ శ్వసతోఽస్య న స్త" ఇతి. "తస్య హ వా తస్య మహతో భూతస్య నిశ్వసిత

మేతదృగ్వేద" ఇతి శ్రుతిః. (హతాశేషావద్యం) హతాని – పరిహృతాని, అశేషావద్యాని – సమస్తదోషాః, యేన తత్తథోక్తమ్. ఆశ్రితానామితి శేషః. యద్వా – ఆశ్రితాపరాధోపేక్షకత్వమత్ర వివక్షితమ్. "న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయే" త్యుక్తేః. హతాని– అత్యంతాసంశ్లిష్టాని,అశేషావద్యాని – సమస్తహేయాని, యస్మిన్ తథోక్తమ్. నిఖిలహేయప్రత్యనీకత్వాత్తత్ర దోషా న సంభవంతీతి భావః. తథా చ శ్రుతిః – "అపహతపాప్మా విరజో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్ప" ఇతి. హయవదనం – హయస్య వదనమివ వదనం యస్య తథోక్తమ్, శాకపార్థివాదిత్వాన్మధ్యమపదలోపీ సమాసః. (మహ) ఇతి. పరం బ్రహ్మ జ్యోతిషా మపి జ్యోతిరయం పురుష స్స్వయంజ్యోతిః. "తేజ స్తేజస్వినామహ" మిత్యాద్యుక్తేః. ఈడీమహి – స్తువీమహి. (ఈడ– స్తుతౌ లడాత్మనేపదమ్) నిత్యత్వ– తేజిష్ఠత్వ –సకలదోషాపహారిత్వ– వేదప్రవక్తృత్వ– నిర్దోషత్వాదిగుణకం శ్రీహయగ్రీవం స్తుమ ఇత్యర్థః. స్వభావోక్తిరలంకారః. "స్వభావోక్తి రలంకారో యథావద్వస్తువర్ణన" మితిలక్షణాత్. అత్ర స్వాతంత్ర్యాభిమాన నివృత్తయే కర్తు రనుపాదానమ్.

**ప్రాచీ సంధ్యా కాచిదంతర్నిశాయాః ప్రజ్ఞాదృష్టే రంజనశ్రీ రపూర్వా ।**
**వక్త్రీ వేదాన్ భాతు మే వాజివక్త్రా వాగీశాఖ్యా వాసుదేవస్య మూర్తిః 2**

భగవంతం స్తోతుం తదావిర్భావప్రార్థనయా తమభిముఖీకరోతి. ప్రాచీతి. వాసుదేవస్య – "సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః, తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యత" ఇత్యాద్యుక్తస్య పరమాత్మనః, వాజివక్త్రా –హయవదనా, వాగీశాఖ్యా – వాగీశేతి ఆఖ్యా యస్యా తథోక్తా; వేదాన్ –ఋగ్యజుస్సామాథర్వణరూపాన్, వక్త్రీ – వ్యంజయంతీ, "ఋచ స్సామాని జజ్ఞిరే ఛందాంగ్ సి జజ్ఞిరే తస్మాత్" ఇతి, "ప్రవక్తా ఛందసాం వక్తా పంచరాత్రస్య య స్స్వయ" మిత్యాదివచనాత్. అత్ర "న లోకాయ నిష్ఠాఖలర్థతృణా" మితి షష్ఠీనిషేధః. అంతర్నిశాయాః – అజ్ఞాననిశీథిన్యాః, కాచిత్– విలక్షణా సంధ్యా, ప్రాచీ సంధ్యా – విభాతసంధ్యా, అజ్ఞానాంధకార నివర్తినీతి యావత్. (ప్రజ్ఞాదృష్టేః) ప్రజ్ఞా – తత్త్వహితపురుషార్థవిషయిణీ ధీః, సైవ, దృష్టిః – ఈక్షణం, తస్యాః, అపూర్వా – ప్రసిద్ధా విలక్షణా, అంజనశ్రీః – అంజనసంపన్మూర్తిః, తనుః మే, భాతు – స్ఫురతు, భా –దీప్తౌ లోట్. తాదృశమూర్తిసాక్షాత్కారే స్వస్యాప్యజ్ఞాననివృత్తిపూర్వక జ్ఞానవృద్ధిర్భూయాదిత్యాశయః. రూపకాలంకారః. "ఆరోప్యవిషయస్య స్యాదతిరోహితరూపిణః, ఉపరంజిత మారోప్యమాణం తదూప్రకం మత" మితి లక్షణాత్.

**జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥ 3**



పూర్వస్మిన్ శ్లోకే హయముఖసన్నిధానం ప్రార్థితమ్. ఇదానీం సన్నిహితం భగవంత ముపాస్మహ ఇత్యాహ (జ్ఞానానందేతి). జ్ఞానానందమయమ్ – జ్ఞానానందప్రచురమ్. "తత్ ప్రకృతవచనే మయ"డితి ప్రాచుర్యార్థే మయట్. యద్వా – జ్ఞానానందమయం – జ్ఞానానందస్వరూపం, "స్వార్థే మయట్, ప్రాణమయ ఇత్యాదివత్. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష అకాశ ఆనందో న స్యా" దిత్యుక్తేః. (నిర్మలస్ఫటికాకృతిమ్) నిర్మలః– జాజ్వల్యమానః, స్ఫటికః – స్ఫటికమణిః, తస్యాకృతిరివాకృతి ర్యస్య తం; సర్వవిద్యానాం – సకలకలానామ్, ఆధారం – నిలయం, "ఛందోమయో మఖమయోఽఖిలదేవతాత్మే" త్యుక్తేః. హయగ్రీవం దేవ ముపాస్మహే – ధ్యాయామః, "ఆస– ఉపవేశనే".

**విశుద్ధవిజ్ఞాన ఘనస్వరూపం విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్ ।**
**దయానిధిం దేహభృతాం శరణ్యం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥ 4**

గురులఘూపాయభూతయో ర్భక్తిప్రపత్త్యో ర్మధ్యే ప్రచరామీత్యాహ (విశుద్ధ) మితి. అహం – దాసభూతః, దయాయాః నిధిం – అక్షయస్థానం, తమ్, అత ఏవ దేహభృతాం – ప్రాణినాం, శరణ్యం – రక్షకం, (విశుద్ధవిజ్ఞానఘనస్వరూపం) విశుద్ధేన – నిర్మలేన, విజ్ఞానేన, ఘనం – నిబిడం, అన్తర్బహిర్జ్ఞానమయమిత్యర్థః. యద్వా, విజ్ఞానరూపో ఘనః –పిండః, తద్రూపమిత్యర్థః. "విజ్ఞానఘన ఏవే"తి శ్రుతేః, స్వరూపం యస్య, తమ్. (విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్) విజ్ఞానస్య – జ్ఞానయోగస్య, విశ్రాణనే – వితరణే, బద్ధా –ధృతా, దీక్షా – సంకల్పః, యస్య తమ్. "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్, దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి త" ఇత్యాదివచనాత్. హయగ్రీవం, ప్రపద్యే – శరణం యామి, "పద్ల్ –గతౌ" లడాత్మనేపదమ్. జ్ఞానస్వరూపస్య జ్ఞానప్రదస్య దయాళోః సర్వభూతశరణ్యస్య శరణాగతా అస్మత్సంరక్షణం కియదితి భావః.

**సమాహార స్సామ్నాం ప్రతిపద మృచాం ధామ యజుషాం**
**లయః ప్రత్యూహానాం లహరివితతి ర్బోధజలధేః ।**
**కథాదృప్యత్కౌతస్కుతకలహ కోలాహలభవం**
**హరత్వంతర్ధ్వాంతం హయవదనహేషాహలహలః ॥ 5**

భగవతి హయాస్యే భక్తిప్రపత్తిరూపోపాయద్వయం విధాయ,సంప్రతి చికీర్షితస్తోత్రపరిసమాప్తిప్రతిబంధకాజ్ఞానాంధకారనివృత్తిం సర్వవిఘ్నోపశమాద్ధయముఖహేషారవసకాశాత్ స్వస్య ప్రార్థయతే (సమాహార) ఇతి. సామ్నాం – సామశాఖానాం, సమాహారః – సంఘాతః, తత్స్వరూపమితి యావత్. "ప్రణవోద్గీథవచస" ఇత్యుక్తేః. ఋక్శాఖానాం, ప్రతిపదం– తదర్థబోధకపర్యాయపదం, యజుషాం – తైత్తిరీయశాఖానాం,

ధామ – వాసస్థానం, ప్రత్యూహానాం – విద్యాప్రతిబంధకవిఘ్నానాం, లయః – ధ్వంసః, బోధజలధేః – జ్ఞానసాగరస్య, లహరివితతిః – తరంగపరంపరా, (హయవదన హేషాహలహలః) హయవదనస్య – హయగ్రీవస్య, హేషాఖ్యో హలహలః – అశ్వధ్వనిః, (కథాదృప్యత్కౌతస్కుతకలహకోలాహలభవమ్) కథాసు – వాదకథాసు, దృప్యంతః కౌతస్కుతాః – కుతః కుత ఇతి వాదినః, స "కస్మాదిత్వాత్సః", తేషాం, కలహకోలాహలేన – అయథార్థవాదకలహేన, భవః – జన్యః, అంతర్ధ్వాన్తమ్, హరతు – నివర్తయతు, "హృఞ్– హరణే". హేషాహలహలస్య సమాహారాద్యభేదోక్త్యా భేదరూపకాలంకారః.

**అపౌరుషేయై రపి వాక్ప్రపంచై రద్యాపి తే భూతి మదృష్టపారామ్ ।**
**స్తువన్నహం ముగ్ధ ఇతి త్వయైవ కారుణ్యతో నాథ ! కటాక్షణీయః ॥ 6**

సాక్షాత్కృతే భగవతి వివిధవిచిత్రానంతాశ్చర్యసనకసనందనాదిధ్యానాగోచర దివ్యస్వభావం దృష్ట్వాఽస్య భగవద్గుణానువర్ణనే ప్రయత్నః పరిహాసాస్పద ఇత్యభిప్రేత్యాహ (అపౌరుషేయై రితి). హే నాథ – హే హయగ్రీవ, అద్యాపి – ఇదానీ మపి, అపౌరుషేయైః – నిత్యైః, "అనాదినిధనా హ్యేషా వాగుత్సృష్టా స్వయంభువే" త్యాద్యుక్తేః. వాక్ప్రపంచైరపి – వేదజాలైరపి, (అదృష్టపారామ్) అదృష్టం – ప్రతిపాదనావిషయీభూతం, పారమ్–అవధిః, యస్యా స్సా తథోక్తా. "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహే" తి శ్రుతేః. "నాంతోఽస్తి మ దివ్యానాం విభూతీనాం పరంతపే" త్యాది స్మృతేశ్చ. భూతిం – గుణాద్యైశ్వర్యం, స్తువన్ – వర్ణయన్, అహం, ముగ్ధః – బాలః, కృత్యసాధ్యే యతమాన ఇతి యావత్; ఇతి – హేతోః, త్వయా, కారుణ్యత ఏవ – కృపావశాదేవ, న హ్యస్మదాదిషు కటాక్షనిమిత్తం కించిదస్తీతి భావః. కటాక్షణీయః – బాలేష్వకించిత్కుర్వత్స్వపి పరమకారుణికస్య పితుః కరుణాకటాక్షః స్వాభావిక ఇతి భావః.

**దాక్షిణ్యరమ్యా గిరిశస్య మూర్తి ర్దేవీ సరోజాసనధర్మపత్నీ ।**
**వ్యాసాదయోఽపి వ్యపదేశ్యవాచ స్స్ఫురంతి సర్వే తవ శక్తిలేశైః ॥ 7**

లోకే యే విద్యాదికాః తే సర్వేఽపి భవదీయశక్త్యంశైః స్పృశంతీత్యాహ (దాక్షిణ్యే) తి. హే నాథ – హే హయగ్రీవ, గిరిశస్య – రుద్రస్య, (దాక్షిణ్యరమ్యా) దాక్షిణ్యేన – సుఖప్రియవచనాదినా, రమ్యా –మనోహరా, యద్వా, దాక్షిణ్యేన – విద్యాప్రదానసామర్థ్యేన, రమ్యా – మనోజ్ఞా, మూర్తిః, సరోజాసనస్య – చతుర్ముఖస్య, ధర్మపత్నీ – సహధర్మచరీ, దేవీ – సరస్వతీ, వ్యపదేశ్యవాచః – ప్రసిద్ధగ్రంథకర్తారో వ్యాసాదయః, వ్యాసవాల్మీకిశుక పరాశరాదయోఽపి, సర్వే – పూర్వసముదితవ్యతిరిక్తాః, తవ శక్తిలేశైః – విద్యాశక్త్యంశైః, స్ఫురంతి – భాంతి. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం, నేమా విద్యుతో భాంతి



కుతోఽయమగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతీ" తి శ్రుతేః. "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవ" మితి స్మృతేశ్చ.

**మందో భవిష్యన్నియతం విరించో వాచాం నిధే ! వంచితభాగధేయః ।**
**దైత్యాపనీతాం దయయైవ భూయోఽప్యధ్యాపయిష్యో నిగమాన్నచేత్త్వమ్ ॥ 8**

బ్రహ్మాదీనామపి ప్రమాదకాలే త్వమేవ గతి రిత్యాహ (మంద) ఇతి. హే వాచాం నిధే – వాగీశ, త్వం – భవాన్, (దైత్యాపనీతాన్) దైత్యేన – అసురేణ, అపనీతాన్ – అపహృతాన్, నిగమాన్ – వేదాన్, భూయోఽపి – పునరపి, దయయా – కారుణ్యేనైవ, నాధ్యాపయిష్యో యది, విరించః – బ్రహ్మా, వంచితభాగధేయః – ప్రతారితభాగ్యస్సన్, మందః – జడః, కార్యాకార్యవివేకశూన్యః; అభవిష్యత్. హేతుహేతుమతో ర్లృజ్. నియతం – ధ్రువమ్. "ఆపన్నానాం పరా గతి" రిత్యుక్తరీత్యా బ్రహ్మాదీనామప్యాపత్కాలే త్వమేవ గతి రితి భావః. అత్ర మధుకైటభాభ్యాం చతుర్ముఖం ప్రతార్య వేదా అపహృతాః, తతః ప్రబుద్ధేన బ్రహ్మణా భగవాన్ ప్రసాదితః మత్స్యరూపేణావతీర్య, తౌ హత్వా వేదాన్ సంగృహ్య ధాత్రే వ్యతరదితి పౌరాణికీ కథాఽనుసంధేయా.

**వితర్కడోలాం వ్యవధూయ సత్త్వే బృహస్పతిం వర్తయసే యత స్త్వమ్ ।**
**తేనైవ దేవ ! త్రిదశేశ్వరాణా మస్పృష్టడోలాయిత మాధిరాజ్యమ్ ॥ 9**

ఇన్ద్రాదీనామపి చాధికారస్య స్థిరీకరణం త్వదాయత్తమేవేత్యాహ (వితర్కే) తి. హే దేవ – హే హయగ్రీవ, యతః – యస్మాద్ధేతోః, త్వం, బృహస్పతిం – ధిషణం, (వితర్కడోలాం) వితర్కైః – దురూహైః, డోలాం – చిత్తచంచలతామ్, రజస్తమఃకార్యభూతామ్; తాం, వ్యవధూయ – నివార్య, సత్త్వే – సత్వమార్గే, వర్తయసే – ప్రతిష్ఠాపయసే, తేనైవ – త్రిదశేశ్వరాణామ్ – ఇంద్రాదీనామ్, ఆధిపత్యమ్ – స్వర్గాధిపత్యమ్, (అస్పృష్టడోలాయితమ్) అస్పృష్టమ్ – అనధిగతం, డోలాయితం యేన తత్తథోక్తమ్, స్థిరమితి యావత్. అభూదితి శేషః. బృహస్పతిః తత్ప్రదర్శితసన్మార్గనిష్ఠస్సన్ తేనైవ మార్గేణ ఇంద్రాదీన్ వర్తయతే అన్యథా అసురవంశైః సురవంశోఽపి అలబ్ధశ్రీరాజ్యకోశః క్షయం యాదిత్యాశయః; సంశయో హి హేయగుణః. "అజ్ఞశ్చా శ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి, నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః, యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్నసంశయమ్, ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ" ఇత్యాది భగవదుక్తేః.

**అగ్నౌ సమిద్ధార్చిషి సప్తతన్తో రాతస్థివాన్ మన్త్రమయం శరీరమ్ ।**
**అఖణ్డసారై ర్హవిషాం ప్రదానై రాప్యాయనం వ్యోమసదాం విధత్సే ॥ 10**

